# శ్రీశ్రీ శతజయంతి
# నలభై ఏళ్ళ విరసం


# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి : 33 సంచిక : 280

ఈ సంచిక వెల : రు 25

ఏప్రిల్ - జూన్ 2010

పేజీలు : 92











# శ్రీశ్రీ ప్రాంగణం

# కా॥ సుబ్బారావు పాణిగ్రాహి వేదిక

# -: స్వీకారం :-

పాకాల నుంచి
నల్లమల్లదాకా

ప్రచురణ :
అప్పారావు మిత్రులు

అవ్వ జెప్పిన తొవ్వ

రచయిత :
శాఖమూరి రవి

ప్రచురణ :
విరసం

వెల : 10

యుద్ధం
అనివార్యమైన చోట

రచయిత :
కె. బాబ్జీ

ప్రచురణ :
విరసం, చిత్తూరు

వెల : 45

నెగడు
కథలు

రచయిత :
నల్లూరి రుక్మిణి

ప్రచురణ :
విరసం, గుంటూరు

వెల : 90

కారడివిలో
కామ్రేడ్స్‌తో

రచయిత :
అరుంధతీరాయ్

అనువాదం :
పి. వరలక్ష్మి

ప్రచురణ :
మలుపు

వెల : 25

చలసాని ప్రసాద్
రచనలు

ప్రచురణ :
విరసం

వెల : 60

అస్పృశ్య వసంత

రచయిత :
జి. కళ్యాణరావు

కన్నడ అనువాదం :
నగరగెరె రమేష్

ప్రచురణ :
లంకేష్

వెల : 200

తీన్‌దాదా వసందం

రచయిత :
జి. కళ్యాణరావు

తమిళ అనువాదం :
ఎ.జి. యతిరాజులు

ప్రచురణ :
సౌత్ విజన్

వెల : 120

అన్‌టచబల్ స్ప్రింగ్

రచయిత :
జి. కళ్యాణరావు

ఇంగ్లీష్ అనువాదం :
అల్లాడి ఉమ
ఎం. శ్రీధర్

ప్రచురణ :
హార్పర్ కొల్లిన్స్

వెల : 295

కాప్టివ్ ఇమాజినేషన్

రచయిత : వరవరరావు

ఇంగ్లీష్ అనువాదం :
వసంత కన్నబిరాన్, కె. బాలగోపాల్
ఎం.టి. ఖాన్, కె. జితేంద్రబాబు
ఎన్. వేణుగోపాల్, జగన్‌మోహనాచారి

ప్రచురణ :
పెంగ్విన్

వెల : 250

కల్లోల కాలానికి కవితా దర్పణం
శ్రీశ్రీ మరో ప్రస్థానం
(టీకా టిప్పణీ)

రచయిత :
వరవరరావు

ప్రచురణ :
శ్రీశ్రీ సాహిత్య నిధి

వెల : 30

మహా ప్రస్థానం నుండి
మరో ప్రస్థానం దాకా

రచయిత :
వి. చెంచయ్య

ప్రచురణ :
విరసం, నెల్లూరు

వెల : 15

తెలుగు సాహిత్యంలో
భక్తి ఉద్యమం

రచయిత :
వి. చెంచయ్య

ప్రచురణ :
విరసం, నెల్లూరు

వెల : 10

ప్రజాయుద్ధంలో
నేలకొరిగిన
ఉత్తర తెలంగాణ
మహిళా అమరుల
జీవిత చరిత్ర

ప్రచురణ :
విరసం

వెల : 35

దండకారణ్యా
మహిళా
ఉద్యమ చరిత్ర
(1980-2009)

శబరి కూర్పు

ప్రచురణ :
విరసం

వెల : 50




సంపుటి : 33 ♦ సంచిక : 280 ♦ ఏప్రిల్ - జూన్, 2010




సంపాదకుడు
**చలసాని ప్రసాద్**

❖ ❖ ❖

వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామకృష్ణా రావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500040
(**కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్** ల ద్వారా
రచనలు పై చిరునామాకు పంపవచ్చు.
**ఇ-మెయిల్** ద్వారా
arunatara1977@gmail.com,
raamki70@gmail.com
లకు కూడా రచనలు పంపవచ్చు)

❖ ❖ ❖

రచనలు (**కొరియర్, రిజిస్టర్డ్ పోస్ట్** ల
ద్వారా) పంపాల్సిన చిరునామా
**టి. కృష్ణాబాయి**
9-19-3, సి.బి.ఎం. కాంపౌండ్
విశాఖపట్నం - 530 003

❖ ❖ ❖

**మేనేజర్**
**ఎస్. రవికుమార్**
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
సెల్ : 9866021257
చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల
రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర
తీయండి.

| | | |
|---|---|---|
| ఈ సంచిక వెల | : | రు. 25 |
| సంవత్సర చందా | : | రు. 100 |
| జీవితచందా | : | రు. 1000 |

❖ ❖ ❖

విరసం కార్యదర్శి చిరునామా
**పాణి**
50-348, L 19 B II,
అరోరా నగర్,
బి క్యాంప్, కర్నూల్ - 2

## సంపాదక లేఖ...

దేశంలోనూ, రాష్ట్రంలోనూ సామాన్య ప్రజలపై అప్రకటిత ఎమర్జెన్సీ ముప్పై అయిదేళ్లుగా కొనసాగుతూనే ఉంది. అరవై ఏళ్లు పూర్తి చేసుకున్న మన రాజ్యాంగం తానే ప్రకటించుకున్న విలువలకూ, స్ఫూర్తికీ భిన్నంగా, నిస్సహాయంగా ప్రజల ముందు నిలుచుంది. విశ్వాసాలు కలిగి ఉండే హక్కు, ప్రచారం చేసుకునే హక్కు వంటి ప్రాథమిక హక్కుల అమలు కోసం జీవన్మరణ పోరాటాలే చేయాల్సి వస్తోంది. ఎన్నికల ముందు కురిపించిన వరాల రంగు ఎప్పటిలానే ఏడాది తిరక్కుండానే వెలసిపోయింది. బోగస్ రేషన్‌కార్డుల ఏరివేత(?), ఫీజుల రీఎంబర్స్‌మెంట్ దాటివేతలుగా 'సంక్షేమం' రాజ్యమేలుతోంది. నిత్యావసరాల ధరలు, పెట్రోల్ ధరలు నిత్యం పెరిగిపోతూ, పౌష్టికాహారం సంగతి అటుంచి, కనీస ఆహారం కూడా తినలేని స్థితిలో ప్రజలు బతుకులీడుస్తున్నారు. మౌలిక అవసరాలు కూడా తీర్చలేని పాలకులు మద్యపుటేరులు పారించి, సామాన్య జనం కొంపలారుస్తున్నారు. మద్యం టెండర్లు కోట్లు పలకడం కాంట్రాక్టర్లకు పండుతున్న లాభాల పంటను కళ్లకు కడుతోంది. కనీస హక్కులకు ప్రజలకు హామీ లేదు గానీ, తమ సమస్యలకు పరిష్కారంగా చూస్తున్న విప్లవోద్యమాన్ని గురించి మాట్లాడితే నేరం అవుతుందని కేంద్ర హోం మంత్రి చిదంబరం పాతచట్టాలకు కొత్త భాష్యాలు చెబుతున్నాడు. తెలంగాణ ఉద్యమ ఆకాంక్ష ఉవ్వెత్తున ఎగిసి అంబరాన్నంటితే ముళ్లకంచెలు, లాఠీచార్జీలు, కాల్పులతో విద్యార్థులు, పోరాడే ప్రజలందరి పైన నిత్య నిర్బంధం కొనసాగుతోంది. తెలంగాణ ఆకాంక్షను పక్కదారి పట్టించే రాజకీయ కుట్రలో భాగంగా రియల్ ఎస్టేట్, మాఫియాల అండదండలతో, హిందూ మతోన్మాద శక్తుల ప్రోద్బలంతో హైదరాబాద్‌లో ఈ కాలంలోనే అల్లర్లు చోటు చేసుకున్నాయి. ఈ అల్లర్లలో ముగ్గురు చనిపోగా వందలాది మంది గాయపడ్డారు. ప్రార్థనా మందిరాలపై దాడులలో భాగంగా ముప్పై ఆరుకు పైగా మసీదులపై దాడులు జరిగాయి. మూడు మందిరాలు, ఒక గోశాలపై కూడా దాడి జరిగింది. జగన్ మహబూబాబాద్ 'ఓదార్పు' యాత్రను తెలంగాణ ఆత్మగౌరవం తూటాలకు ఎదురు నిలిచి అడ్డుకుంది. ఆ క్రమంలో మహబూబాబాద్ ఘటనపై జరప తలపెట్టిన సభకు అనుమతి ఇవ్వలేదు. నల్లగొండ, నెల్లూరులలో గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా తలపెట్టిన హాలు మీటింగ్‌లను కూడా అనుమతించలేదు. ఛత్తీస్‌ఘడ్ పులుల పేరిట కా. వరవరరావుకు చంపేస్తామని బెదిరింపులు మళ్లీ మళ్లీ వస్తూనే ఉన్నాయి. ప్రజాసంఘాల కార్యకర్తలకూ బెదిరింపుల పరంపర కొనసాగుతోంది. రాష్ట్రంలో వాక్, సభా, విశ్వాస స్వాతంత్ర్యాలపై బంద్ కొనసాగుతోంది. ఇరవై ఆరు సంవత్సరాల తరువాత భోపాల్ ఘటనపై వెలువడిన తీర్పు ప్రజల ప్రయోజనాలను గాలికొదిలి సామ్రాజ్యవాదులకు దాసోహమంటున్న దళారీ పాలకవర్గాల తీరును మరోసారి బయటపెట్టింది. ఈ కాలంలోనే శ్రీశ్రీ శతజయంతి, విరసం నలభై ఏళ్ల సందర్భాలను పురస్కరించుకొని విరసం 22వ మహాసభలను విశాఖ తీరాన జరుపుకొంది. కష్టజీవికి ఇరువైపులా నిలిచే వాడే కవి అన్న శ్రీశ్రీ కవితా స్ఫూర్తినీ, మొత్తంగా శ్రీశ్రీ సాహిత్యాన్నీ, ఉద్యమ జీవితాన్నీ అంచనాలు వేస్తూ విరసం తన కర్తవ్యానికి పునరంకితం అయింది. అ

## ఈ సంచికలో...



**కవర్‌పేజీ : శ్రీశ్రీ శతజయంతి, నలభై ఏళ్ల విరసం 22వ మహాసభల దృశ్యాలు**
ఫొటోలు : వర్మ, వేణు, కూర్మనాథ్, రాజశేఖర్

**సంపాదకీయం**

# విశ్వాస ప్రచారం రాజ్యాంగబద్ధమే!

- పాణి

భారత ప్రభుత్వం బుద్ధిజీవులను బెదిరిస్తోంది. మావోయిస్టులకు అనుకూలంగా మాట్లాడితే జైల్లో పెడతానంటోంది. రాజ్యాంగాన్ని, ప్రజాస్వామ్యాన్ని ప్రజలందరూ శిరసావహించాల్సిందే, కాదంటే ఉగ్రవాదులైనట్టే అని నిత్యం ప్రవచించే ప్రభుత్వం రాజ్యాంగ విలువలను బరితెగించి ధిక్కరిస్తోంది. 'ఈ దొంగల రాజ్యాంగం రచనే ఒక బూటకం' అన్న విప్లవకవి అవగాహనను ప్రభుత్వం తాజాగా రుజువు చేస్తోంది. మాట్లాడే హక్కు, విశ్వాసాలను ప్రచారం చేసుకొనే హక్కు ప్రజలందరికీ ఉన్నాయనే రాజ్యాంగ మౌలిక విలువ పట్ల తనకేమీ గౌరవం లేదని పాలకవర్గం స్పష్టం చేస్తోంది.

మాట్లాడడమంటే తనకు అనుకూలంగా మాట్లాడటమేనని, వ్యతిరేకంగా మాట్లాడడం కాదని చిదంబరంగారి ప్రభుత్వం హూంకరిస్తోంది. ఈ వైఖరి రాజకీయ స్వేచ్ఛను కాలరాయడమే. భారత ప్రభుత్వం మే నెలలో ఒక ఉత్తర్వు జారీచేసింది. దాని ప్రకారం భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) సిద్ధాంతాలను ప్రచారం చేసేవారు చట్టవ్యతిరేక కార్యకలాపాల (నిరోధ) చట్టం 1967 ప్రకారం శిక్షార్హులు. అట్లా చేసిన వారిని పదేళ్లపాటు జైల్లో పెట్టవచ్చు.

ఈ ఉత్తర్వు భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులకు పూర్తిగా వ్యతిరేకమైనది. ప్రజాస్వామ్యంలోని పూర్ణార్థం వెల్లివిరియడమనే గంభీరమైన విషయాన్ని అటుంచి, ఏ సమాజమైనా తనను తాను ప్రజాస్వామ్య బద్ధమని చెప్పుకోడానికి కనీస షరతు మాట్లాడే హక్కు ఉండడం. మాట్లాడడమంటే ఉబుసుపోక మాట్లాడడం కాదు. రాజకీయాలు మాట్లాడడమే. తనకిష్టమైన రాజకీయాలను సమర్థించడం, వ్యతిరేకమైన వాటిని విమర్శించడం అనే విశాలమైన అర్థంలో రాజకీయ స్వేచ్ఛ ఉంటుంది, ఉండాలి. బూర్జువా శక్తులు ఈ స్వేచ్ఛను పుష్కలంగా అనుభవిస్తున్నాయి. సోనియాగాంధీ, అద్వానీ, బుద్ధదేవ్, మమతా బెనర్జీ, చంద్రబాబు, జయలలిత అందరూ తమకు ఇష్టంలేని రాజకీయాలను రోజూ విమర్శిస్తూనే ఉన్నారు. తమ రాజకీయాలను ప్రచారం చేసుకుంటూనే ఉన్నారు. రాజకీయ స్వేచ్ఛ బూర్జువా శక్తులకు ఇంత సంపూర్ణంగా అందుబాటులో ఉండి, ఇతరులకు లేకపోవడం వల్లనే బూటకపు రాజ్యాంగం అనవలసి వచ్చింది.

అయితే బూర్జువా ప్రజాస్వామ్యం మానవులను వ్యక్తులుగా గుర్తించింది. వ్యక్తి స్వేచ్ఛ అనే విలువ ముందుకు వచ్చింది. వ్యక్తులను పౌరులుగా గుర్తించింది. ఒక భౌగోళిక ప్రాంతంలోని వ్యక్తిని పౌరుడిగా, పౌరురాలిగా గుర్తించడమంటేనే రాజకీయ జీవిగా గుర్తించడం. మనిషి కావడం వల్లనే మనిషికి సంక్రమించే సహజ హక్కులను బూర్జువా వ్యవస్థ పౌరుల ప్రాథమిక హక్కులుగా ప్రవచించింది. వాటిని రాజ్యాంగబద్ధం చేసింది. పౌరులు, రాజకీయ జీవులుగా స్వేచ్ఛాయుతంగా వ్యవహరించడం ప్రజాస్వామ్యానికి గీటురాయి. భారత రాజ్యాంగం పౌరులకు పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజకీయాలను మాట్లాడటానికే గాక ఆ చట్రానికి వెలుపల ఉన్న రాజకీయ, సామాజిక సిద్ధాంతాల గురించి, ఆచరణల గురించి మాట్లాడడానికి కూడా అనుమతి ఇచ్చింది.

ఈ రాజ్యాంగ విలువను పాలకవర్గం ఘోరంగా అపహాస్యం చేస్తుంటుంది. ఈ ఒక్కటే కాదు, రాజ్యాంగంలోని విలువలన్నిటినీ చిదిమి వేసి, భ్రష్టు పట్టించకుండా పాలకవర్గానికి పూటగడవదు. అందుకే ఒక చారిత్రక క్రమంలో ముందుకు వచ్చిన బూర్జువా విలువలైనా అమలు కావాలని విప్లవ శక్తులు, నిజమైన ప్రజాస్వామిక శక్తులు మాట్లాడవలసి వస్తోంది.

భారత రాజ్యాంగం - తనపై నమ్మకం లేనివారికీ, తనను ధ్వంసం చేసేవారికీ కూడా మాట్లాడే హక్కు కల్పించింది. దీని ప్రకారం ఈ రాజ్యాంగ యంత్రాన్ని సాయుధంగా రద్దు చేసి కొత్త రాజకీయ, సామాజిక వ్యవస్థలను నిర్మిస్తామని ప్రచారం చేసుకోవడానికి, మద్దతు కూడగట్టుకోడానికి మావోయిస్టు పార్టీతో సహా ప్రజలందరికీ హక్కు ఉంది. ఈ పని ప్రజలు ఎంత సమర్థవంతంగా చేసుకోగలిగితే అంతగా రాజ్యాంగం తమకిచ్చిన రాజకీయ స్వేచ్ఛను సద్వినియోగం చేసుకున్నట్టు లెక్క. అయిదేళ్లకు, రెండేళ్లకు ఓట్లేసి ఏదో ఒక బూర్జువా పార్టీకి అధికారం అప్పగించడమే రాజకీయ స్వేచ్ఛ కాదు, ఇదీ అలాంటిదే. దానికే గాదు, దీనికి విఘాతం కలగకూడదు. ఈ హక్కు కల్పిస్తూ తనకు వ్యతిరేకంగా చేపట్టే చర్యలను నిరోధించడానికి శిక్షాస్మృతిని నిర్దేశించుకున్నది. రెండిట్లో ఏ ప్రక్రియలోనైనా సరే చర్యలు జరిగితే వాటిని శిక్షాస్మృతి ప్రకారం విచారించి శిక్షించవచ్చు. కానీ ప్రాథమిక హక్కుల అమలు, శిక్షాస్మృతి అమలు అధికారంలో ఉన్న రాజకీయ శక్తుల ప్రయోజనాలకు అనుగుణంగా ఉంటాయని 1950 నుండీ రోజూ రుజువవుతున్నది. దీన్ని చట్టాల తయారీలో, వాటి స్వభావంలో చూడవచ్చు.

మావోయిస్టు రాజకీయ, సిద్ధాంతాలను ప్రచారం చేసే మేధావులను చీకటి కొట్లో వేస్తానని భారత ప్రభుత్వం బైటికి తీసిన 1969 నాటి చట్టం అలాంటిదే. కొన్ని కార్యకలాపాల గురించి, సిద్ధాంతాల గురించి మాట్లాడడమే సెక్షన్ 13 ప్రకారం శిక్షార్హం అని 1969లో రాసుకున్న చట్టాన్ని ఇప్పుడు చిదంబరం ఎందుకు బైటికి తీయవలసి వచ్చింది?

విప్లవోద్యమాన్ని సమర్థించే, వ్యాఖ్యానించే వారి మీద కేసులు పెట్టడం ప్రభుత్వాలకు కొత్తకాదు. నలభై ఏళ్ల కింద ఆంధ్రప్రదేశ్‌లో మొదలైన ఈ అణచివేత ఇప్పుడు అన్ని రాష్ట్రాలకూ వ్యాపించింది. శ్రీకాకుళ పోరాటం ఏయే ప్రాంతాలకు విస్తరిస్తూ పోయిందో ఆ ప్రాంతాలన్నింటిలో బుద్ధిజీవులను, రచయితలను, కళాకారులను బెదిరించడానికి అనేక కొత్త చట్టాలు వచ్చాయి. పాత చట్టాలే కొత్త కోరలతో బైటికి వచ్చాయి. అయితే ఇప్పుడు భారత హోం మంత్రిత్వ శాఖ తాజా బెదిరింపు గ్రీన్‌హంట్ అనే యుద్ధ సందర్భంలో భాగమని గుర్తించాలి.

మావోయిస్టుల ఆధ్వర్యంలో ఆదివాసులు అతిపెద్ద ప్రత్యామ్నాయ సామాజిక ప్రయోగం చేస్తున్నారు. పాలకవర్గాల నమూనాలకు వ్యతిరేకమైన అభివృద్ధి నమూనాను రుజువు చేస్తున్నారు. దీన్ని కాలరాయడానికి ప్రభుత్వం ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రారంభించింది. దీన్ని విమర్శించే మేధావుల, రచయితల నోరు



సభల నివేదిక

# శ్రామిక వర్గ విముక్తి స్వప్నాన్ని ప్రతిఫలించిన విరసం మహాసభలు

తెలుగు సాహిత్య ప్రపంచంలోకి కార్మికవర్గ చైతన్యాన్ని తీసుకువచ్చిన శ్రీశ్రీ శతజయంతి ముగింపు సందర్భంగా, సాహిత్య సాంస్కృతిక రంగాల్లో వర్గపోరాట శక్తిగా ఆవిర్భవించిన విరసం నలభై ఏళ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా విశాఖలో ఏప్రిల్ 30, మే 1న విరసం 22వ మహాసభలు జరిగాయి. తెలుగు సాహిత్యంలోకి అభ్యుదయాన్ని, విప్లవాన్ని ఆహ్వానించి, ఆ రెండు ఉద్యమాలకూ నాయకత్వం వహించిన శ్రీశ్రీకి విశాఖతో ఉన్న అనుబంధాన్నీ, విరసం ఆవిర్భావంలో విశాఖకు ఉన్న చారిత్రక బంధాన్నీ పురస్కరించుకొని ఈ మహాసభలు విశాఖపట్నంలో జరిగాయి.

ఏప్రిల్ 30 ఉదయం 10 గంటలకు శ్రీశ్రీ ప్రాంగణం (అంబేద్కర్ భవనం)లో సభలు ప్రారంభమయ్యాయి. రాష్ట్ర నలమూలల నుంచి వచ్చిన వందలాది విప్లవ, విప్లవ సాహిత్యోద్యమ అభిమానుల మధ్య, ప్రజా సంఘాల కార్యకర్తల మధ్య అంతర్జాతీయ శ్రామివర్గ పతాకాన్ని (ఎర్ర జెండాను) కా. గోరు మాధవరావు ఆవిష్కరించారు. విరసం సంస్థాపక సభ్యులు, మాజీ అధ్యక్షులు కా. చలసాని ప్రసాద్ విరసం పతాక గీతం పాడుతూ విరసం జెండాను ఎగరేశారు. విప్లవోద్యమంలో, ఇతర ప్రజా ఉద్యమాల్లో ప్రాణత్యాగం చేసిన అమరుల స్మారక స్థూపాన్ని కా. గంటి రమణ ఆవిష్కరించడంతో సభలు ప్రారంభమయ్యాయి.

విప్లవ సాహిత్యోద్యమంలో, విప్లవోద్యమంలో అమరులైన వారికి జోహార్లు చెప్తూ కామ్రేడ్ వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం వేదిక మీద తొలి సమావేశం ప్రారంభమైంది. కా. చలసాని ప్రసాద్ ఈ మహాసభల ఉద్దేశ్యాన్ని వివరిస్తూ ప్రతినిధులకు స్వాగతం పలికారు.

నూరేళ్ల శ్రీశ్రీ, నలభై ఏళ్ల విరసం గురించిన ఆయన తొలి పలుకుల తర్వాత పుస్తకాల ఆవిష్కరణలు జరిగాయి. ఈ సమావేశంలో ప్రముఖ సామాజిక విశ్లేషకులు ప్రొ. హరగోపాల్ ప్రారంభోపన్యాసం చేశారు. శ్రీశ్రీ కవిత్వాన్ని, ఆయన సాహిత్య, రాజకీయ వ్యక్తిత్వాన్ని ఆయన కాలంలో భాగంగా చూడాలని, ఏయే సామాజిక శక్తుల సంఘర్షణ శ్రీశ్రీ వ్యక్తిత్వంగా చరిత్రలో రూపొందిందో విశ్లేషించాలని అన్నారు. శ్రీశ్రీ కవితల్ని, ఆయన ప్రభావాన్ని మారుతున్న సామాజిక చరిత్రలో భాగంగా ఎలా అర్థం చేసుకోవచ్చో సోదాహరణంగా వివరించారు.

ఆ తర్వాత సోదర ప్రజా సంఘాల నాయకులు సందేశాలు ఇచ్చారు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం విశాఖ అధ్యక్షులు టి. శ్రీరామ్మూర్తి, మహిళా చేతన నాయకురాలు పద్మ, ప్రగతిశీల మహిళా సంఘం నాయకురాలు లక్ష్మి, దండకపాణి మహంతి, స్త్రీశక్తి నాయకురాలు లలిత, కుల నిర్మూలన పోరాట సమితి నాయకులు సూర్యం, వెలుగు సాహితీ సంస్థ నుండి గణపతినాయుడు, కవి, రచయిత మానేపల్లి, ప్రైవేటీకరణ వ్యతిరేక వేదిక - పి.వి. రమణ తదితరులు సందేశాలిచ్చారు. కార్యదర్శి నివేదికను కార్యవర్గ సభ్యురాలు పి. వరలక్ష్మి చదివి వినిపించారు. అమరుల బంధుమిత్రుల సంఘం సభ్యులు, కళాకారులు ఈ సందర్భంగా పాటలు పాడారు.

మహాప్రస్థానం - శ్రీశ్రీ అనే అంశంపై చలసాని ప్రసాద్ ప్రసంగించారు. మహాప్రస్థాన గీతాల వెనుక జాతీయ, అంతర్జాతీయ రాజకీయార్థిక శక్తుల సంఘర్షణ ఉన్నదని అన్నారు. ఆ సంఘర్షణను అందరికంటే శక్తివంతంగా వినిపించినందువల్ల ఆయన ప్రపంచ స్థాయి కవి అయ్యాడని అన్నారు. మహాప్రస్థానం తర్వాత సిప్రాలి, మరోప్రస్థానం గురించి వి. చెంచయ్య విశ్లేషించారు. సిప్రాలి శ్రీశ్రీ రాజకీయ అవగాహనను, ప్రయోగ దృష్టిని తెలియజేస్తుందని అన్నారు. మరో ప్రస్థానంలో శ్రీశ్రీలోని అభ్యుదయాంశ నక్సల్బరీ శ్రీకాకుళ పోరాట చైతన్యంగా, సాయుధ పోరాట దృక్పథంగా విస్తరించిందని అన్నారు. శ్రీశ్రీలోని ప్రయోగ దృష్టి విప్లవ అవసరాన్ని తీరుస్తూ భాషలో, వ్యక్తీకరణలో గణనీయమైన మార్పు తెచ్చిందనీ అన్నారు.

సాయంకాలం విరసం యువకవులు కా.ఉదయ్, కా. క్రాంతిల ఆధ్వర్యంలో కవి సభ జరిగింది. శ్రీశ్రీ కవిత్వం, శ్రీశ్రీ మీద రాసిన కవిత్వంతో కవి సభ ఆకట్టుకుంది. పిల్లలు సూరజ్, చంద్ర, వెన్నెల, రాధామహీజలు శ్రీశ్రీ కవిత్వ పఠనం చేశారు.

మే 1న ఉదయం 10 గంటలకు శ్రీశ్రీ వచనం గురించి కామ్రేడ్ కళ్యాణరావు ప్రసంగించారు. కవిగా శ్రీశ్రీ వేసిన ప్రభావం ముందు

---

నొక్కడానికే ఈ చట్టాన్ని ప్రయోగించడం, ఒక పక్క మావోయిస్టులతో చర్చలకు సిద్ధమంటూనే సైన్యాన్ని ప్రయోగించడానికి కూడా ప్రభుత్వం సిద్ధమౌతోంది. 72 గంటలు హింస చేయకుంటే చాలని చెప్తున్న చిదంబరం కాల్పుల విరమణ పాటిస్తానని మాత్రం స్పష్టం చేయడు. సైనిక యుద్ధానికి సిద్ధపడుతూనే మేధావులను జైల్లో పెడతానని బెదిరిస్తున్నాడు.

హింసకు పాల్పడకుంటే చర్చలకు సిద్ధమంటున్న ప్రభుత్వం సిద్ధాంతాలను నమ్మడం, ప్రచారం చేయడమే నేరమని బెదిరిస్తున్నది. ఆలోచనలు, విశ్వాసాలు, సిద్ధాంత రాజకీయాలు నేరమని చెప్పడానికి రాజ్యాంగం అనుమతించదనే ఇంగితం కూడా ప్రభుత్వానికి లేదు. విశ్వాసాలు ఉండడమే నేరమని ఇంతవరకు చరిత్రలో ఎన్నడూ రుజువు కాలేదు. ఆ పేరుతో ఎంతగా అణచివేసినా సిద్ధాంతాలు, రాజకీయాలు తుడిచేయలేకపోయారు. చిదంబరంగారి బెదిరింపుల వల్ల బూర్జువా ప్రజాస్వామ్యం మేడి పండు అని మరోసారి రుజువు కావడం తప్ప ఒరిగిందేమీ లేదు. సమాజ మౌలిక పరివర్తనకు దారి చూపే మావోయిస్టుల సిద్ధాంతాల పట్ల విశ్వాసాన్ని ప్రకటించడం రాజ్యాంగ బద్ధం మాత్రమే కాదు, మనుషులుగా ఈ దేశ ప్రజలందరికీ ఉన్న సహజ హక్కు. ⓐ

# కార్యదర్శి నివేదిక

మిత్రులారా, కామ్రేడ్స్

విప్లవ రచయితల సంఘం నలభై ఏళ్ల మహాసభలకు వచ్చిన విప్లవాభిమానులకు, విప్లవ సాహిత్యాభిమానులకు విరసం సాదరంగా స్వాగతం పలుకుతోంది. విప్లవోద్యమానికి సాంస్కృతిక రంగంలో నలభై ఏళ్లుగా విరసం చేస్తున్న కృషి పట్ల గౌరవంతో, ప్రేమతో, విమర్శనాత్మక వైఖరితో, విభేదాలతో కూడా విరసంతో కలిసి నడుస్తూ ఈ సభలకు వచ్చిన ప్రతినిధులకు, రాలేకపోయిన అభిమానులకు, విమర్శకులకు విరసం ఈ నలభై ఏళ్ల సభల సందర్భంగా విప్లవాభివందనాలు చెప్తోంది. విరసానికి సభ్యులకన్నా అభిమానులే ఎక్కువ అన్న మా వ్యవస్థాపక కార్యదర్శి కామ్రేడ్ కెవిఆర్ మాట అప్పటికీ, ఇప్పటికీ యదార్థం. ఎందరెందరో మిత్రుల సహాయ సహకారాలతో మాత్రమే విరసం తన నిత్య కార్యకలాపాలను కొనసాగిస్తూ వస్తున్నది. ఆ సౌజన్య స్ఫూర్తితో ఈ నివేదికను ప్రవేశపెడుతున్నాను.

ముందుగా - గుంటూరులో 2008 జనవరిలో జరిగిన మహాసభల దగ్గరి నుంచి ఇవ్వాల్టి దాకా విప్లవోద్యమంలో, వివిధ ప్రజాస్వామిక ఉద్యమాల్లో రాజ్యహింసకు బలైన అమరులందరికీ విరసం జోహార్లు చెప్తోంది. తమిళ జాతి విముక్తి నాయకుడు వేలుపిళ్లై ప్రభాకరన్ లాంటి వారికి జోహార్లు చెప్తోంది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమ నేపథ్యంలోని అనేక ఆటుపోట్ల మధ్య, ఆశనిరాశల మధ్య ఆత్మహత్యలకు పాల్పడ్డ అనేక మంది తెలాంగణ యువతీ యువకులను విరసం ఈ సందర్భంగా బాధాతప్త హృదయంతో గుర్తు చేసుకుంటోంది. ప్రజా, విప్లవ పోరాటాల్లో అమరులైన జ్ఞాత, అజ్ఞాత వీరులందరినీ కన్నీటితో తలచుకుంటోంది.

గుంటూరు మహాసభల నుంచి ఇప్పటిదాకా సాగిన సంస్థాగత కార్యక్రమాల గురించిన నివేదిక ఇది. విరసం తాను చేసిన కృషిని, చేయలేకపోయిన పనినీ కూడా తను స్వీకరించిన సామాజిక సిద్ధాంత దృక్పథం నుంచి అంచనా వేసుకుంటుంది. ఏ సంస్థ అయినా, ఏ ఉద్యమమైనా కేవలం తన స్వీయాత్మక ఆకాంక్షలకు అనుగుణంగా మాత్రమే కొనసాగజాలదనీ, సమకాలీన పరిస్థితులతో, ప్రభావాలతో నిమిత్తం లేకుండా విడిగా ఉండదనీ మనందరికీ తెలిసిందే. ఆ పరిస్థితుల్లో అనుకూలాంశాలను గుర్తించి మరింత లక్ష్యశుద్ధితో ఎట్లా పని చేస్తుంది? అననుకూలాంశాలను గుర్తెరిగి వాటిని అధిగమిస్తూ తన ఆశయాన్ని ముందుకు తీసుకపోవడానికి స్వీయాత్మక శక్తులను ఎట్లా వెచ్చిస్తుందనే దాన్ని బట్టి మాత్రమే సంస్థల, ఉద్యమాల గమనం ఉంటుంది.

నలభై ఏళ్ల విరసం ఉద్యమ గమనమంతా ఇట్లా కొనసాగిందని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. విరసంలో ఉన్న వాళ్లకు, దగ్గరిగా గమనిస్తున్న వాళ్లకు అందరికీ ఈ ఉత్తుంగ తరంగాల హోరు గురించి, సెలయేటి గానం గురించి, లోలోపలి నుంచి ఎప్పటికప్పుడు ఊరుతూ, ఉబుకుతూ వచ్చే చెలమ గుణం గురించి తెలిసే ఉంటుంది. తెలుగు సాహిత్య, సాంస్కృతిక మేధోరంగాల్లో ఉన్న ప్రతివారూ ప్రతి సందర్భంలో విరసం గురించి ఏదో ఒక అభిప్రాయాన్ని, అవగాహనను, అంగీకార వ్యతిరేకతలను వ్యక్తం చేయడంలోనే విప్లవ సాహిత్యోద్యమం పాత్ర ఉన్నది. సమాజానికీ, సాహిత్యానికీ సంబంధం ఉంటుందనీ, సమాజాన్ని మార్చే ఉద్యమాల్లో సాహిత్యోద్యమం విడదీయరాని అంతర్భాగంగా ఉంటుందనీ చెప్పడానికి, వివరించడానికి ఈ నలభై ఏళ్ల విరసం గమనాని కన్నా మంచి ఉదాహరణ ఉండబోదు.

విరసం చేసిన ఈ ప్రయాణం వల్ల, గడించిన అనుభవాల వల్ల ఈ సందర్భంలో ఒక్క మాట మాత్రం చెప్పవలసి ఉంది. సమాజ చరిత్రలో భాగంగా, చరిత్రను నిర్మించే పోరాట శక్తులతోపాటు తానూ

---

ఆయన వచనం తగిన గుర్తింపు పొందలేదని అన్నారు. శ్రీశ్రీలోని ఆలోచనా పరుడు వచన రచనల్లోనే కనిపిస్తాడన్నారు. ఆ తర్వాత శ్రీశ్రీ అనువాద సాహిత్యం గురించి ప్రముఖ కవి కె. శివారెడ్డి ప్రసంగించారు. శ్రీశ్రీ అనువాదాల ద్వారా తెలుగువారికి పాశ్చాత్య సాహిత్య ధోరణులు పరిచయం చేశారని అన్నారు. బైట వచ్చిన అనేక సాహిత్య ధోరణులు, వాటి వెనక ఉన్న భావజాలాలు, ఉద్యమ నేపథ్యాలు శ్రీశ్రీ అనువాదాల ద్వారా మనకు పరిచయం అయ్యాయని వివరించారు. అనువాద శిల్పంలో శ్రీశ్రీ ప్రత్యేక ముద్ర కనిపిస్తుందన్నారు.

ఆ తర్వాత శ్రీశ్రీ సమకాలీనత గురించి కా. కాశీం విశ్లేషించారు. శ్రీశ్రీకి సమకాలీనత ఉన్నందువల్లనే మూడు తరాల పాఠకులు చదువుతున్నారని, సాహిత్యకారులు విశ్లేషిస్తున్నారని అన్నారు. తెలుగులో వచ్చిన అన్ని సాహిత్య ధోరణులు శ్రీశ్రీ గురించి అభిప్రాయాలు చెప్పవలసి రావడంలోనే ఆయన సమకాలీనత ఉన్నదని అన్నారు. చివరగా శ్రీశ్రీ ఉద్యమ జీవితం గురించి కామ్రేడ్ వి.వి. మాట్లాడారు. శ్రీశ్రీ సాహిత్యోద్యమంలోనేకాక పౌరహక్కుల కార్యకర్తగా కూడా పని చేశారని అన్నారు. 1955 మధ్యంతర ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ తరపున ప్రచారం చేయడం దగ్గరి నుండి శ్రీకాకుళ పోరాటంలో బూటకపు ఎన్‌కౌంటర్లకు వ్యతిరేకంగా, భూమయ్య - కిష్టాగౌడ్ ఉరిశిక్షలకు వ్యతిరేకంగా పౌరహక్కుల పరిరక్షణ కోసం రాష్ట్రవ్యాప్తంగా శ్రీశ్రీ పర్యటించారని అన్నారు.

చివరిగా 'శ్రీశ్రీ కవితా ప్రస్థానం' ఊరేగింపు జరిగింది. శ్రీశ్రీ కవితా చరణలే నినాదాలుగా విశాఖపట్నం వీథులలో ఉద్వేగ భరితమైన ర్యాలీ జరిగింది. శ్రీశ్రీ భిక్షువర్షీయసి కవిత రాసిన కటకంవారి చెరువు (గ్రేటర్ విశాఖ కార్పొరేషన్ ఆఫీసు దగ్గర) దగ్గర ఆ కవితను చదివారు. అట్లాగే మరో ప్రపంచం గేయం రాసిన టర్నర్ చౌల్ట్రీ దగ్గర ఆగి అక్కడ ఆ గేయం చదివారు. గురజాడ విగ్రహం దగ్గర నివాళి ప్రకటించి ఊరగింపు తిరిగి అంబేద్కర్ భవన్ చేరుకుంది.

బహిరంగ సభకు కా. కృష్ణాబాయి అధ్యక్షత వహించారు. కా. రుక్మిణి, కా. ఉజ్వల్, కా. చలసాని ప్రసాద్ ప్రసంగించారు. కళాకారుల పాటలతో, శ్రీశ్రీ కవితాలాపనతో శ్రీశ్రీ శతజయంతి సభలు ముగిశాయి. అ

చరిత్రలో భాగమైనందువల్ల విరసం నలభై ఏళ్ల పరిణత స్వరాన్ని సమకూర్చుకుంది. విప్లవ విజయం దాకా సాగించవలసిన సిద్ధాంత, రాజకీయ సాంస్కృతిక కర్తవ్యాలకు తనను తాను సిద్ధం చేసుకోవడానికి అవసరమైన భూమికను తయారు చేసుకుంది. దానికి అవసరమైన దార్శనికతను రూపొందించుకోగలిగింది. సుస్థిరంగా, చిరకాలం తాను పోషించవలసిన పాత్రకు అనుగుణమైన శక్తి విరసంకు ఉందని ఈ నలభై ఏళ్ల నిర్బంధాలు, నిషేధాలు, లోపలా బైటా సాగిన లోతైన సిద్ధాంత రాజకీయ సంవాదాలు నిరూపించాయి. అదే లేకుంటే కాలగతిలో కలిసిపోయిన అనేక ఉద్యమ సంస్థల కోవలోకి, సాహిత్య సంస్థల కోవలోకి విరసం చేరిపోయేది. దీనికి ఈ దేశ ప్రజల త్యాగపూరితమైన విప్లవాచరణే కారణం. పడుతూ లేస్తూ మునుముందుకు సాగుతున్న విప్లవ పోరాటాల వెనువెంట విరసం కలిసి నడవడమే కారణం. విరసం ఎన్ని సమస్యలను, సంక్షోభాలను, నిర్బంధాలను, విమర్శలను ఎదుర్కొన్నా విరసం ప్రాసంగికత అంతా విప్లవంలో భాగంగా కొనసాగడంలో ఉంది. ఒక దశ నుంచి మరో దశకు విప్లవోద్యమం పురోగమించడంలో, విస్తరించడంలో ఉంది. నానాటికీ విప్లవ ఆవశ్యకత పెరగడంలో ఉంది.

గుంటూరు మహాసభల్లో భూమి - సంస్కృతి - నాగరికత అనే అంశం పై చర్చ చేశాం. మానవ సమాజ పురోగమనంలోని ఈ కీలకమైన విషయాలను పాలకవర్గం మరింత సంక్షోభంలోకి తీసుకెళ్లడం చూస్తున్నాం. ఈ రెండున్నర సంవత్సరాల్లో రకరకాల రూపంలో భూమి దోపిడీవర్గాల హస్తగతం కావడం గురించి దినపత్రికల స్థాయిలో కూడా బాగా ప్రచారంలోకి వచ్చింది. వేల, లక్షల ఎకరాల గ్రామీణ, పట్టణ భూములు అక్రమ మార్గాల్లో ప్రజల నుంచి పరాస్తమయ్యాయి. అంతకు మించి ఆదివాసీ ప్రాంతాల్లో భూమి మీద, అందులోని సంపద పైన దేశ, విదేశాల పెట్టుబడిదారుల డేగ చూపు పడింది. పాలక అభివృద్ధి దాని విస్తృత, వికృత రూపాల్లో ప్రజలను భూమికి దూరం చేసింది. నిర్వాసితులను చేసింది. కనీసం 1992 నుంచి విప్లవ, ప్రజానుకూల శక్తులు చెప్తూ వచ్చిన ఈ విషయం నానాటికి బృహద్రూపం తీసుకుంటున్నది. ఈ రెండేళ్లలో తెలుగు సమాజంలోని పరిణామాలన్నిటిలో ఇది ఒక కీలకమైన అంశం. ఆధునిక భారత దేశ చరిత్రలో ఎప్పటికన్నా ఎక్కువగా భూమి సరుకు కావడాన్ని, భూమి పెట్టుబడికి స్థావరంగా మారిపోవడాన్ని మనం ఇటీవల - మరీ ముఖ్యంగా ఈ రెండేళ్లలో మరింత బాగా చూశాం. దాని నుంచి సహజంగానే సంస్కృతీ సమస్యలు అనేకం సమాజంలో తలెత్తాయి. సంస్కృతీ విధ్వంసం పెరిగిపోయింది. బూర్జువా రాజకీయాలు, వాటి అధికార వ్యవస్థలు అత్యంత జుగుప్సాకరంగా, అమానవీయంగా తయారయ్యాయి. మన చుట్టూ ఉన్న స్థితిని కనీసంగా అర్థం చేసుకోడానికి ఈ ముఖ్యమైన సూచికలు సరిపోతాయి.

ఇవి మన సామాజిక వ్యవస్థలోని వైరుధ్యాల వల్ల తలెత్తినవే అయినా ప్రపంచ పెట్టుబడిదారీ విధానం, దాని ఉన్నత రూపమైన సామ్రాజ్యవాదం అనే స్థూల చట్రంలో భాగం. ఇవాళ వీటికి వ్యతిరేకంగా ఏ రంగంలో సాగే ఏ ప్రయత్నమైనా ఈ స్థితికి అతీతం కాదు. ఈ స్థితి ఏకకాలంలో అనేక వేగాలతో, పలు రూపాలతో నిరంతర పరివర్తన పొందుతున్నది. అంటే ఇవ్వాళ మనముందున్న సామాజిక స్థితి చాలా తీవ్రమైన, సంక్లిష్టమైన గతిలో ఉంది. కొత్త సమస్యలు విసురుతున్నది. వాటిని అర్థం చేసుకోవడంలోని బలాబలాలను బట్టి వాటితో మన వ్యవహారం ఉంటుంది. మన ఆలోచనలు, నిర్ధారణలు, నిర్ణయాలు, పనులు, ఫలితాలు దానికి అనుగుణంగానే ఉంటాయి.

అది ఈ రెండేళ్ల కాలానికీ వర్తిస్తుంది. ఈ రెండేళ్ల విరసానికీ వర్తిస్తుంది.

గుంటూరు మహాసభల్లో భూమి - సంస్కృతి - నాగరికతల గురించి మాట్లాడే నాటికి విరసం చాలా తీవ్రంగా ఛత్తీస్‌ఘడ్‌లోని సల్వాజుడుం వ్యతిరేక ప్రచారంలో ఉంది. నిజానికి సల్వాజుడుం ప్రారంభమైనప్పటినుంచి దానికి వ్యతిరేకంగా మొదటిగా విరసమే ప్రచారం మొదలుపెట్టింది. 2006లో నిషేధానంతరం జరిగిన హైదరాబాద్ సభల్లో సల్వాజుడుం ఒక ప్రధాన విషయంగా ఫోకస్ అయింది. అందువల్లనే గుంటూరు సభల్లో సల్వాజుడుం మీద, దండకారణ్యంలో మహిళలపై రాజ్యహింస మీద కామ్రేడ్స్ దమయంతి, శబరి రచనలను విరసం అచ్చువేసి ఆవిష్కరించింది. అప్పటికే సల్వాజుడుం మీద కొందరు నివేదికలు ప్రచురించినా ఈ రెండు పుస్తకాలు ఛత్తీస్‌ఘడ్, దండకారణ్యాల మీద సాధికార రచనలుగా గుర్తింపు పొందాయి. తెలుగు ప్రజల్లో సల్వాజుడుం గురించిన వాస్తవ దృశ్యాన్ని అందించిన పుస్తకాలివి.

ఆదివాసీ ప్రాంతాల్లో ఆదివాసీల తెగల మధ్య ఉన్న వైరుధ్యాలను పాలకవర్గం ఒక చోట సల్వాజుడుం రూపంలో ఆయుధంగా మలచుకుంటే ఇంకో చోట మత సంఘర్షణలుగా మార్చివేసింది. దాని ఫలితమే ఒరిస్సాలో కొంధమాల్ మారణకాండ. విరసం దాన్ని ఆదివాసీ తెగల్లో, క్రైస్తవ మైనారిటీ మతావలంబకుల మధ్య రాజ్యం, హిందూ ఫాసిజం సృష్టించిన వైరుధ్యంగా ప్రచారం చేసింది. కొంధమాల్‌లోని వాస్తవ స్థితిగతులను అర్థం చేసుకోడానికి విరసం బృందం ఒరిస్సాలో పర్యటించి నిజనిర్ధారణ చేసింది. సరిగ్గా అదే సమయంలో మన రాష్ట్రంలో భైంసా, వటోలీ మారణకాండలు జరిగాయి. విరసం సభ్యులు ఈ ప్రాంతాల్లో కూడా పర్యటించి నిజనిర్ధారణ చేశారు. కేవలం బాధితులను పరామర్శించడం, నిజానిజాల సేకరణ అనే పనితో సరిపెట్టుకోకుండా విప్లవోద్యమం సాగుతున్న ఆదివాసీ ప్రాంతాల్లో ప్రజలను చీల్చి, సామాజిక అభివృద్ధి క్రమంలో వారి మధ్య ఉన్న అంతరాలను రెచ్చగొట్టి పరస్పర వైరి శిబిరాలుగా రాజ్యం, హిందుత్వ మార్చి వేస్తున్నాయని విరసం లోతైన విశ్లేషణ అందించింది. ఈ ఘటనల సందర్భంగా విరసం సభ్యులు క్రియాశీలంగా పని చేయడమే గాక మార్క్సిస్టు - లెనినిస్టు అవగాహనతో చాలా లోతైన విశ్లేషణా రచనలు చేశారు. బైటి ప్రాంతాల ఆలోచనాపరుల రచనలను తెలుగులోకి అనువదించారు. అప్పట్లో విరసం ప్రచురించి ఆవిష్కరణ సభలు నిర్వహించిన 'వామనపాదం' అనే పుస్తకం దీనిక ఒక మంచి ఉదాహరణ.

అంతకు ముందే ప్రత్యేక ఆర్థిక మండలాల మీద విరసం ప్రారంభించిన క్షేత్ర పరిశీలన, విశ్లేషణను ఈ రెండేళ్లలో కూడా కొనసాగించింది. ముఖ్యంగా మహబూబ్‌నగర్, నెల్లూరు లాంటి ప్రాంతాల్లో ప్రత్యేక ఆర్థిక మండలాలు మొదలయ్యాక ప్రజా జీవితంలో ఓ సంవత్సర కాలంలో, రెండేళ్ల కాలంలో వస్తున్న మార్పులేమిటనే విభిన్న కోణంలో విరసం సభ్యులు అధ్యయనం చేశారు. అయితే అంతకుముందు 'ప్రత్యేక మృత్యు మండలాలు' అనే పుస్తక రూపంలో వచ్చినట్లు ఈ అధ్యయనం ఒక చోటికి రాలేదు. ఈ వెలితి తీరుస్తూ విరసం సభ్యులు సాహిత్య రూపాల్లో ఓడిపోలే పల్లె, నేను పోలేపల్లి పీనుగని మాట్లాడుతున్నా అనే పుస్తకాలు తీసుకొని వచ్చారు. పోలేపల్లి

పీనుగని మాట్లాడుతున్నా అనే పుస్తకాన్నయితే అసెంబ్లీ ఎన్నికల ముందు బాధిత గ్రామంలోనే ఆవిష్కరించి ఓట్ల కోసం వచ్చే పార్టీలన్నిటినీ సెజ్‌ల మీద నిలదీయాలని పిలుపునిచ్చింది. ఇవేగాక కవిత్వం, పాటలు, కథలు కూడా ప్రత్యేక ఆర్థిక మండలాల నేపథ్యంలోని విధ్వంసం గురించి విరసం సభ్యులు రాశారు. సభలు సమావేశాలు, ఇతర సంస్థలతో కలిసి ఈ సమస్య మీద కార్యక్రమాలు శక్తి మేరకు జరిగాయి. ముఖ్యంగా ఎప్పటికప్పుడు సెజ్‌ల దుష్పరిణామాలపై ఈ రెండేళ్లలో విరసం విశ్లేషణ అందించింది.

అట్లాగే తెలంగాణలో చేనేత కార్మికుల ఆత్మహత్యలు, సింగరేణిలో ఓపెన్‌కాస్ట్ సమస్యలపై విరసం సభ్యులు క్షేత్ర పర్యటనలు చేశారు. నివేదికలు, వ్యాసాలు మాత్రమేగాక పాటలు, కవిత్వం రాశారు. ఈ రెండు అంశాలపై సెజ్‌ల వలె కొనసాగింపు పనులు జరగలేదు.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, గ్రీన్‌హంట్ వ్యతిరేక ఆందోళనల్లో విరసం పాత్ర గురించి ప్రత్యేకంగా చెప్పాలి. 1970ల నుంచీ ప్రత్యేక తెలంగాణ ఆకాంక్ష పట్ల దృఢమైన వైఖరితో ఉన్నవి మార్క్సిస్టు - లెనినిస్టు ఉద్యమం, విప్లవ సాహిత్యోద్యమం మాత్రమే. బూర్జువా రాజకీయ సమీకరణాల వల్ల ఒకసారి ఉవ్వెత్తున ఎగసినట్టున్నా, మరోసారి చల్లారిపోయినట్టున్నా విప్లవోద్యమమే ప్రత్యేక తెలంగాణ ఆకాంక్షను ఆరిపోకుండా కాపాడుతూ వచ్చింది. 1994లో తెలంగాణ ప్రత్యేక గెరిల్లా జోన్‌గానే గాక 1997లో తెలంగాణ ప్రజల అస్తిత్వ ఆకాంక్షగా, స్వయం పాలనాకాంక్షగా కూడా విరసం, విప్లవోద్యమం గుర్తించాయి. అప్పటి నుంచీ తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో సాహిత్య, సాంస్కృతిక శక్తిగా పాలుపంచుకుంటున్న విరసం గత సంవత్సరం చివర్లో మొదలైన మరో వెల్లువలో కూడా భాగస్వామి అయింది.

1969 నుంచి ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షగా ప్రతిసారీ ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర డిమాండ్ ఎజెండా మీదికి వస్తున్నది. ఈ డిమాండ్‌ను సాధించుకోవడానికి తెలంగాణ ప్రజలు అద్భుత పోరాటాలు నిర్వహించారు. 2009లో ఎన్నడూ లేని విధంగా తెలంగాణలోని ప్రజలు పోరాటంలో పాలుపంచుకున్నారు. అయితే బూర్జువ శక్తుల ప్రాబల్యం నిర్ణాయక శక్తిగా మారిన మాట వాస్తవం. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో విప్లవశక్తుల భాగస్వామ్యం పట్ల బూర్జువాశక్తులు, తెలంగాణ ప్రాంతీయవాద శక్తులు అభద్రతకు, భయసంకోచాలకు తమతమ స్థాయిల్లో లోనయ్యాయి. అయినా విరసం సంస్థగా, సభ్యులు విడివిడిగా, రకరకాల రూపాల్లో ఈ ప్రజా వెల్లువను నిలబెట్టడానికి శక్తి మేరకు కృషి చేశారు. ఆందోళనల్లో పాలుపంచుకోవడమేగాక మంచి విశ్లేషణ అందించారు. ముఖ్యంగా ప్రత్యేక తెలంగాణ విషయంలో పాలకవర్గ శక్తుల వైఖరులను ఎండగట్టారు. తెలంగాణ విరసం సభ్యులు పాటలు, కవిత్వం, విశ్లేషణా వ్యాసాలు రాశారు. పుస్తకాలు అచ్చేశారు. మొత్తం మీద సంస్థగా ఇంకా ఎక్కువగా విరసం పాలుపంచుకొని ఉండవలసిందేగాని రచయితల సంస్థగా విరసం తనదైన స్వరాన్ని వినిపించగలిగింది.

విప్లవోద్యమం మీద కేంద్రంలోని యుపిఎ ప్రభుత్వం గ్రీన్‌హంట్ పేర యుద్ధం ప్రకటించినది మొదలు విరసం దాన్ని వ్యతిరేకిస్తూ తెలుగు సమాజంలో ప్రచారం ప్రారంభించింది. నక్సల్బరీ శ్రీకాకుళ ఆదివాసీ సాయుధపోరాట ప్రేరణతో ఆవిర్భవించిన విరసం విప్లవోద్యమానికి సాంస్కృతిక రంగంలో తన పాత్రను నిర్దేశించుకున్నప్పటికీ ప్రజా పోరాటాలన్నిటి మీద ప్రభుత్వ దమనకాండను నిరసించడంలో తన సాంస్కృతిక పాత్రను నలభై ఏళ్లుగా కొనసాగిస్తున్నది. విరసం పాత్ర మీద అనేక మంది మిత్రుల, శ్రేయోభిలాషుల, భిన్నాభిప్రాయాలు, విమర్శలు దీని మీదనే. పైకి ఎన్నెన్ని నాజూకైన మాటలు వాడినా అంతిమ సారంలో విప్లవోద్యమం మీది రాజ్యహింసను వ్యతిరేకించే దగ్గరే విరసం సాహిత్య శక్తి మీద, సాంస్కృతిక పాత్ర మీద అనేక భిన్నాభిప్రాయాలు వినిపిస్తూ వచ్చాయి. ఈ నలభై ఏళ్ల సందర్భంలో కూడా నిర్మొహమాటంగా చెప్పుకోవలసిన అంశమిది. రాజ్యనిర్బంధం మీద కవిత్వాల వరకు ఫరవాలేదుగాని, దాన్ని వ్యతిరేకించడమే ఒక కార్యక్రమం కావడం మీద విరసం ఎన్నో విమర్శలను మోయవలసి వచ్చింది, మోస్తున్నది. విరసంకు సాహిత్యం కంటే రాజకీయాలు ఎక్కువ అనే విమర్శ గాల్లోనుంచి రాలేదు. ఈ వాస్తవాచరణ నుంచి వచ్చిందే. విప్లవోద్యమంపై నిర్బంధాన్ని వ్యతిరేకించే క్రమంలో విప్లవ రాజకీయ ప్రచారం అనివార్యంగానే ముందుకు వస్తుంది. మిత్రుల నిందా ప్రశంసలకు తలొగ్గకుండా విప్లవోద్యమం మీది రాజ్యహింసను వ్యతిరేకించే రాజకీయ కర్తవ్యాన్ని విరసం అవిచ్ఛిన్నంగా కొనసాగించడంలో భాగంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక ఆందోళనల్లో పాలుపంచుకున్నది, రచన చేస్తున్నది. పుస్తక ప్రచురణ చేస్తున్నది. గ్రీన్‌హంట్ పేరుతో అమాయక ఆదివాసీలపై సాగుతున్న వేట అనే పుస్తకాన్ని అచ్చేసింది. ఆదివాసీ ప్రత్యామ్నాయ అభివృద్ధి ప్రయోగంలో సగభాగం పాలుపంచుకుంటున్న దండకారణ్య ఆదివాసీ మహిళల ఉద్యమ చరిత్రను కూడా విరసం ఈ సభలకు అచ్చేసింది. సోదర సంఘాలతో కలిసి గ్రీన్‌హంట్ యుద్ధ బీభత్సాన్ని విరసం సభ్యులు క్షేత్రపరిశీలన గావించారు. అరుణతార ఈ సంచిక కూడా గ్రీన్‌హంట్ వ్యతిరేక సంచికగా విడుదలవుతోంది. ఆనాటి శ్రీకాకుళ పోరాటం మీది నిర్బంధాన్ని ఏ చైతన్యంతో విరసం ఎండగట్టి విప్లవ ప్రచారం చేసిందో అంతకన్నా ఎక్కువగా ఇప్పుడు అలాంటి సందర్భమే మళ్లీ వచ్చింది. ఈ యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజలను, మేధోజీవులను ఐక్యం చేయడం, అంతకన్నా ఈ యుద్ధ స్వభావాన్ని పలు కోణాల్లో విశ్లేషించడం విరసం విధిగా చేయవలసిన పనులు. ఆదివాసీలపై భారత ప్రభుత్వం యుద్ధం మొదలుపెట్టినప్పటి నుంచి విరసం ఈ కర్తవ్యాన్ని కొనసాగిస్తున్నది. ఈ సభలు మరింత ప్రణాళికాబద్ధంగా కార్యక్రమాలు రూపొందించుకోవలసిన సందర్భం. పేరు మారినా, తీరు మారినా ఈ యుద్ధం రాబోయే కాలంలో మరింత తీవ్రమవుతుందని మనకు తెలుసు. సాహిత్య సాంస్కృతిక రంగాల్లో దీనికి వ్యతిరేకంగా ఐక్య ఉద్యమాలకు కూడా విరసం సిద్ధం కావలసిన తరుణమిది. రాబోయే రెండేళ్లలో ఈ అంశం మీద మరింత కేంద్రీకరించి పని చేయవలసి ఉంది.

ప్రత్యేకంగా ఇలాంటివేకాక ఎప్పటికప్పుడు ప్రజా జీవితంలోని తక్షణ సమస్యలపై విరసం సంస్థగా, సభ్యులు విడిగా పలు కార్యక్రమాల్లో భాగమవుతూ వచ్చారు.

❖ ❖ ❖

నిషేధానంతరం సంస్థ బాగోగుల గురించి, ముఖ్యంగా సంస్థలో సభ్యుల భాగస్వామ్యం గురించి, సంస్థ ఉన్న స్థితి గురించి - ఉండవలసిన స్థితి గురించి ఆంతరంగిక సంభాషణ కోసం 'మనలో మనం మాట్లాడుకుందాం' అని ప్రారంభించిన ప్రక్రియ గుంటూరు సభల్లో ఓ కొలిక్కి వచ్చింది. ఇంత సుదీర్ఘకాలం కార్యవర్గం, ఒక

ఉపసంఘం దాని కోసం ప్రత్యేక సమావేశాలు జరిపాయి. ఆ ప్రక్రియ వివరాలు ఇప్పుడు అవసరం లేదు గాని ఈ రెండేళ్ల కాలంలో ఆ ప్రక్రియ స్ఫూర్తి సంస్థలో, సభ్యుల్లో భాగమైనట్టేమీ కనిపించలేదు. ఇది నిర్మాణం వైపు నుంచి లోతయిన సమీక్ష జరగవలసిన అంశం. నిర్మాణం అనే భావన పట్ల సభ్యులందరికీ గౌరవం, నమ్మకం ఉన్నప్పటికీ సంస్థ నిర్మాణం పట్ల, నిర్మాణ కలాపాల పట్ల సభ్యుల బాధ్యత, భాగస్వామ్యం ఉండవలసినంత లేదనే చెప్పాలి. ఈ సమస్యను అధిగమించడానికి అంత సుదీర్ఘంగా నడిపిన ప్రక్రియలోనే కొందరు సభ్యులు భాగస్వామ్యం కాకపోవడం దగ్గరి నుంచి తమ సౌకర్యానుగుణంగా మాత్రమే సంస్థతో, సంస్థలో వ్యవహరించడం దాకా ఈ సమస్య కొనసాగుతూనే ఉంది. దీనివల్ల నిర్మాణంగా సంస్థ ప్రతి దశలో ఎదుర్కొన్నట్టే ఇప్పుడు కూడా ఇబ్బందులు ఎదుర్కొంటుంది.

దీనివల్ల సంస్థాగతంగా జరగవలసిన పనులు ఆ ఆసక్తి, అవకాశం, వెసులుబాటు ఉన్న కొందరి సభ్యుల వ్యవహారాలుగా మారిపోతున్నది. ఈ రెండేళ్లలో విరసం నిర్వహించిన కార్యక్రమాల్లో ఈ లోపం కనిపించింది. సంస్థాగతంగా తీసుకున్న నిర్ణయాల అమలులో ఈ సమస్య ఉన్నప్పుడు అది మొత్తంగా నిర్మాణ స్ఫూర్తికే అవరోధంగా తయారవుతుంది.

ఇది ఒక క్రమంలో సాహిత్య సిద్ధాంత విషయాల్లోని భిన్నాభిప్రాయాల సమస్యగా, వాటిని చర్చించుకోవలసిన పద్ధతికి సంబంధించిన సమస్యలుగా ముందుకు వచ్చాయి. ఈ రెండేళ్లలో రెండు మూడు అంశాల మీదైనా విరసం సభ్యులు దిన పత్రికల వ్యూహానుగుణంగా చర్చలు చేశారు. రాసిన, రాయని సభ్యులు కూడా దినపత్రికల స్పందనారీతిని ప్రతిబింబించారు. అభిప్రాయాల గురించి, వాటి మీద పట్టింపు గురించి కాదు నేనిక్కడ రాస్తున్నది. అంతకంటే లోతైన సమస్య గురించి.

విరసం నలభై ఏళ్ల పరిణత స్వరం గురించి ఇదివరకే చెప్పుకున్నాం. దాని పక్కనే దానికి భిన్నమైన నీడ పరుచుకొనే ఉంది. భావోద్వేగాలు, ఇష్టాయిష్టాలు విరసం అంతరంగిక సంభాషణలో అప్పుడప్పుడైనా తొంగిచూస్తూనే ఉన్నాయి. ఇవన్నీ నిర్మాణ చర్చగా రూపాంతరం చెందడం కూడా గమనించవచ్చు. కానీ అది నిర్మాణాన్ని బలహీనపరిచే ధోరణేగాని నిర్మాణయుతమని సమర్థించుకోడానికి కుదరదు.

❖ ❖ ❖

ఈ రెండేళ్లలో తెలుగు సాహిత్యంలో విశిష్ట వ్యక్తుల శత జయంతులు వచ్చాయి. కొకు, శ్రీశ్రీ ఆధునిక తెలుగు సాహిత్యంలో పోషించిన పాత్రవల్ల సహజంగానే వాళ్లు విప్లవసాహిత్యోద్యమానికి పథ నిర్దేశకులయ్యారు. నాయకులయ్యారు. సాధారణార్థంలో శతజయంతి వేడుకగా, తంతుగా మారిపోయినా చారిత్రక వ్యక్తుల పాత్రను సమకాలీనంగా విశ్లేషించుకోవడం వల్ల భవిష్యత్తుకు చాలా మేలు చేస్తుంది. ఈ అర్థంలో విరసం కొకు, శ్రీశ్రీల శతజయంతి సందర్భాలను గుర్తించింది. అందువల్ల తెనాలి సాహిత్య పాఠశాల కొకు సాహిత్యం కేంద్రంగా జరిగింది. కొకు వ్యాస ప్రపంచాన్ని ప్రచురించిన విరసం ఈ సందర్భంలో ఆయన రచనా ప్రపంచాన్ని తెలుగు పాఠకులకు అందించాలని తలపెట్టింది. నిర్ణయించుకున్నంత వేగంగా ఈ పని సాగకపోయినా కొకు సాహిత్య సంపుటాలు అచ్చవుతున్నాయి. కొకు సాహిత్యాన్ని పునర్ముద్రించడమే గాక కొకు మీద వర్తమాన చైతన్యంతో విశ్లేషణ ఇవ్వడానికి ఒక పుస్తకం తేవాలనుకున్నా అదీ సకాలంలో అచ్చుకాలేదు. కొకు - సమకాలీనత పుస్తకం ఈ సభల్లో ఆవిష్కరించుకోబోతున్నాం.

అట్లాగే శ్రీశ్రీ మీద కూడా సరికొత్తగా మాట్లాడాల్సిన అంశాలున్నాయి. నిజానికి తెలుగు సాహిత్యంలో సుస్థిర స్థానమున్న కొకు, శ్రీశ్రీలలో శ్రీశ్రీ వివాదాస్పదం, చర్చనీయాంశం అయినంతగా కొకు కాలేదు. వారి సాహిత్య వ్యక్తిత్వాల్లోనే గాక వారి పాత్రల్లోని తేడా కూడా దీనికి కారణం. శ్రీశ్రీకి ఉన్న విస్తృత ప్రజా జీవితం, ఉద్యమ జీవితం వల్ల కూడా ఎక్కువ చర్చనీయాంశమవుతాడు. గత ఏడాదిగా శ్రీశ్రీ వీరభక్తుల ప్రవచనాలు, రకరకాల అస్తిత్వ ధోరణులనుంచి, కొత్త ఆలోచనారీతుల నుంచి శ్రీశ్రీ మీద విశ్లేషణలు సాగుతున్నాయి. వీటన్నిటికీ విరసం స్పందించవలసి ఉంది. కానీ విశేషంగా అలాంటి ప్రయత్నం ఏమీ జరగలేదు. ముఖ్యంగా శ్రీశ్రీ నుంచి విప్లవాంశను తొలగించడానికి రివిజనిస్టులు చేస్తున్న ప్రయత్నాలకు విరసం గట్టి సమాధానం ఇవ్వవలసే ఉంది.

శ్రీకాకుళ పోరాటానికి నలభై ఏళ్ల సందర్భంగా తెలుగు సమాజ సాహిత్యరంగాలపై విప్లవోద్యమ ప్రభావం మీద ఒక అంచనా వేయాలని, దాన్ని ఒక పుస్తకంగా తేవాలనే నిర్ణయం ఇప్పటికీ పూర్తికాలేదు. గ్రీన్‌హంట్ నేపథ్యంలో ఇంకా ఎక్కువ అవసరం ఉన్నందువల్ల ఆ పని వెంటనే పూర్తి చేయాల్సి ఉంది.

1985 నుంచి విరసం వర్క్‌షాపుల నిర్వహణ ద్వారా ఎప్పటికప్పుడు వివిధ ప్రక్రియల్లో కొత్త రచయితలను తయారు చేయగలిగింది. మధ్యలో కొంచెం దూరం పెరిగినా గత మూడేళ్ల నుంచి క్రమం తప్పకుండా ప్రతి మూడు నెలలకొక కథల వర్క్‌షాప్ నిర్వహించడం వల్ల విప్లవ కథ విస్తృతి పెరిగింది. కొత్త ఆలోచనలు, కొత్త ఇతివృత్తాలు, కథన పద్ధతులు అందిపుచ్చుకొని కొత్త రచయితలు తయారయ్యారు. ప్రతి ఏడాది వర్క్‌షాపుల్లో వచ్చిన కథల నుంచి ఎంపిక చేసినవాటితో ఒక సంకలనం తేవాలనే నిర్ణయం మేరకు ఒక సంపుటి వచ్చింది. అది తప్ప మళ్లీ రాలేదు. ఈ నడుమ కథల వర్క్‌షాపుల మధ్య కూడా బాగా దూరం పెరిగింది. మొత్తం మీద దృష్టి సన్నగిల్లింది. సాహిత్య సంస్థగా సృజనాత్మక సాహిత్యం నిరంతరం ఉత్పత్తి చేయడానికి అవసరమైన సంస్థాగత ప్రయత్నాలు చేయకపోతే ఎన్ని చెప్పుకున్నా ప్రయోజనం ఉండదు. కవిత్వం వర్క్‌షాపులు గత రెండేళ్లలో రెండు జరిగాయి తప్ప ముందుకు సాగలేదు. సభ్యులు, బైటి మిత్రులు కూడా చాలా ప్రయోజనకరంగా సాగుతున్నాయన్న వర్క్‌షాపులు అర్ధాంతరంగా ఆగిపోవడమో, క్రమం తప్పడమో జరిగింది. అట్లాగే విరసం కేవలం రచయితల సంస్థ కాదు కాబట్టి తాత్విక, సిద్ధాంత విషయాల్లో నిరంతరం పునఃశ్శక్తి పొందడం, ఆయా రంగాల్లో కొత్తవారిని సిద్ధం చేయడం అవసరం. మార్క్సిస్టు సిద్ధాంతరంగాన్ని బలోపేతం చేయడం విరసం కర్తవ్యాల్లో ప్రధానమైనది. మొదటి నుంచీ దీనికి వేసవి పాఠశాలలు చాలా దోహదం చేస్తున్నాయి. గత ఏడాది అనంతపురంలో జరిగిన వేసవి పాఠశాల చాలా ఫలవంతంగా జరిగింది. మార్క్సిస్టు సిద్ధాంత రంగంలోని అనేక సమస్యలు చర్చనీయాంశమయ్యాయి. ఇలాంటి కృషి క్రమం తప్పకుండా కొనసాగించాలనే ఉద్దేశ్యంతో కథల వర్క్‌షాపుల వలె ఏడాదికి రెండు నిర్వహించాలని, అందువల్ల వేసవి పాఠశాల అనే పేరు బదులు తాత్విక పాఠశాల అనే పేరు ఉచితంగా

# శ్రీశ్రీ కవిత్వ పరిణామం! మారిన సామాజిక శాస్త్ర పార్శ్వం నుండి

- ప్రొ. జి. హరగోపాల్

సాహిత్య ప్రయోజనం అంతిమంగా సామాజిక మార్పేనని సమాజం పట్ల బాధ్యతగల వారందరూ అంగీకరిస్తున్నారు. వ్యక్తి కేంద్రిత కోణం నుండి ఆలోచించేవారు దీనికి భిన్నమైన ఆలోచన వ్యక్తపరుస్తున్నారు. వ్యష్టి సమష్టి అనే వైరుధ్యాన్ని పెట్టుబడిదారీ విధానం ముందుకు తీసుకువచ్చింది. పెట్టుబడిదారీ సమాజానికి సైద్ధాంతిక పునాదిని, సవరతను కల్పించిన ఉదారవాద సిద్ధాంతమంతా వ్యక్తి కేంద్రంగానే సాగింది. ఆర్థిక శాస్త్రంలో ఉదారవాదానికి ఆద్యుడైన ఆడం స్మిత్. మనిషి తన స్వప్రయోజనం కొరకే పనిచేస్తాడని, స్వప్రయోజనమే మనిషి చేత శ్రమను చేయిస్తుందని, స్వప్రయోజనపరులైన వ్యక్తుల నిరంతర పోటీలో తమ సృజనాత్మక శక్తిని సంపూర్ణంగా వ్యక్తీకరించుకుంటారని ప్రతిపాదించాడు. స్వప్రయోజనపరుడైన మనిషి తన "సంతృప్తి" (utility)ని ఎక్కువకు ఎక్కువ (maximisation) సాధించుకునే ప్రక్రియే జీవితమని, అదే జీవిత పరమావధి అని బెంథామ్ (Bentham) సూత్రీకరించారు. రాజనీతి శాస్త్రంలో జె.ఎస్. మిల్ (J.S. Mill) మనిషి ప్రవర్తనకి అతని స్వఆలోచన (self-will) ప్రధానమైన motive force అని, ప్రతి మనిషిలో అంతర్గత మనిషి లేదా మనసు ఉంటుందని, దీనికి బయటి పరిస్థితుల నుండి ఒకరకమైన స్వతంత్రత (autonomy) ఉంటుందని, అదే మనిషి వ్యక్తిత్వాన్ని మలచుతుందనే వాదనను ప్రవేశపెట్టాడు. తాత్విక రంగంలో ఇమ్మాన్యుల్ కాంట్ (Immaneul Kant) మనిషి తన నైతిక విలువలను, నైతిక ప్రవర్తనను ఎంచుకుంటాడని అందుకే నేరమూ - శిక్ష చర్చలో ఏ నేరానికైనా ఆ నేరానికి పాల్పడిన వ్యక్తి, వ్యక్తిగతంగా సంపూర్ణ బాధ్యత వహించవలసి ఉంటుందని ప్రతిపాదించాడు. అయితే ప్రతి మనిషిలో ఒక స్వతంత్రమైన, స్వేచ్ఛాయుతమైన ఒంటరి మనిషి ఉంటాడా అనేది ప్రశ్న. అలా ఒక ఒంటరి మనిషి లేకపోతే ఒక మనిషి మరొక మనిషి ఒకే సామాజిక చట్రంలో నివసిస్తున్నా వ్యక్తిగత తేడాలు ఎందుకు ఉంటాయ్ అనే ప్రశ్నకు కూడా సమాధానం వెతక వలసి ఉంది.

సామాజిక మార్పు గురించి తపన పడే వాళ్లు మానవ ప్రవర్తన వాళ్ల భౌతిక పరిస్థితుల మీద ఆధారపడి, అది సామాజిక సంబంధాలలో రూపొందుతుందని, ఏ మనిషైనా ఎంత ప్రతిభావంతుడైనా తన భౌతిక పరిస్థితులకు అతీతంగా ఉండడం సాధ్యం కాదని, ప్రతి వ్యక్తి ప్రవర్తనకు, సంతృప్తికి, నైతికతకు కారణాలు తాను పెరుగుతున్న,

---

ఉంటుందని దానికి అనుగుణంగా ప్రణాళిక సిద్ధం చేసినా అమలు కాలేదు.

విరసం నలభై ఏళ్ల సందర్భంలో విరసం చరిత్రను అధ్యయనం చేయడానికి ఒక ప్రణాళిక సిద్ధమైంది. సామాజిక చరిత్రను ఎలా అధ్యయనం చేయాలి? అందులో భాగంగా సాహిత్య చరిత్రను, నిర్దిష్టంగా విరసం చరిత్రను నిర్మించే పరికరాల గురించి, పద్ధతుల గురించి ఒక వర్క్‌షాప్‌కు ప్రణాళిక సిద్ధం చేసినా అదీ అమలు కాలేదు. అయితే ఆ సందర్భంగా చాలా ఆలోచనాత్మకమైన చర్చ జరిగింది. అనుకున్న సమాయనికి మరేదో పోటీ సమస్య రావడం వల్ల ఇలాంటి కార్యక్రమాలు అనుకొనీ ఆగిపోయాయి.

సంస్థ అధికార పత్రిక అరుణతార ఈ రెండేళ్లలో కూడా క్రమబద్ధంగా నడవలేదు. అయితే సుమారుగా అన్నీ ప్రత్యేక సంచికల్లాగే వచ్చాయి. సెజ్, మహిళా ఉద్యమం, కులసమస్య, పతంజలి, ఈలం తమిళ పోరాటం, కామ్రేడ్ అనురాధ గాంధి, బాలగోపాల్, గ్రీన్‌హంట్, ఇలా పలు అంశాలపై ప్రత్యేక సంచికలు వచ్చాయి. మూడు నాలుగు నెలలకొక సంచిక వచ్చినా సగటున నూరు పేజీలకు పైగా అచ్చయ్యాయి.

ఈ నివేదిక ముగింపులో అక్రమ కేసుల గురించి. చర్చల కాలంలో ప్రతినిధులుగా వ్యవహరించిన వివి, కళ్యాణరావుల మీద కొన్ని అక్రమ కేసులను ప్రభుత్వం ఉపసంహరించుకున్నది. ఈ రెండేళ్లలో విరసం సభ్యుల మీదికి కొత్తగా అక్రమ కేసులేవీ రాలేదు. అయితే తెలంగాణ రాష్ట్ర ఉద్యమం సందర్భంగా హైదరాబాద్ యూనిట్ సభ్యుడు కా. ఉదయ్ విద్యార్థిగా అనేక రకాలుగా యూనివర్సిటీ ఆంక్షలను ఎదుర్కొంటున్నాడు. విద్యార్థి ఉద్యమంలో విప్లవ అవగాహనగల కార్యకర్తగా పని చేయడం వల్లే అధికార యంత్రాంగం ఈ వైఖరి ప్రదర్శిస్తోంది.

చాలా ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అంశం ఒకటున్నది. హైదరాబాద్ యూనిట్ సభ్యుడు కా. రాంకి (డి.వి. రామకృష్ణారావు) తన చిన్న కూతురు సహజను స్కూల్లో చేర్పించేటప్పుడు అప్లికేషన్ ఫారంలో ఉన్న మతం అనే కాలంను భర్తీ చేయకపోవడం వల్ల స్కూలు యాజమాన్యం అడ్మిషన్ తిరస్కరించింది. దీని మీద రాంకి, క్లారెన్స్ (ఎస్. క్లారెన్స్ కృపాళిని)లు కోర్టుకు వెళ్లారు. పాఠశాలల్లో పిల్లలను చేర్చేటప్పుడు మతం చెప్పనవసరం లేదని, ఇది రాజ్యాంగబద్ధ విలువ అనీ హైకోర్టు మధ్యంతర ఉత్తర్వులు ఇచ్చింది. కోర్టు అభిప్రాయపడినట్లు ఇది చాలా చిన్న విషయంగా కనిపించే పెద్ద సాంస్కృతిక సమస్య. ప్రజా సాంస్కృతిక రంగంలో ఇలాంటివి చాలా ఉత్తేజాన్ని నింపే అంశాలు.

విరసం ఈ నలభై ఏళ్ల సభలు నక్సల్బరీ శ్రీకాకుళ చైతన్యాల పునరుత్తేజ సందర్భం. రాబోయే రెండేళ్లలో గ్రీన్‌హంట్ వ్యతిరేకంగా సాహిత్య సాంస్కృతిక రంగాల్లో కృషిని విరసం తన ప్రధాన ఎజెండాగా స్వీకరిస్తోంది. ఈ రెండేళ్లలో స్వీకరించి నెరవేర్చని కర్తవ్యాలను నెరవేరుస్తుంది. భారత సమాజంలో సాగుతున్న విశిష్ట ప్రయోగం విప్లవోద్యమం. దాని స్ఫూర్తిని సాహిత్య రంగంలో నిరంతరం ప్రజ్వరిల్ల చేయడమే రాబోయే కాలాల్లో కూడా విరసం ఆశయం. తెలుగు సాంస్కృతిక రంగానికి విప్లవ ఆత్మగా విరసం తన కర్తవ్యాలకు ఈ సభలో పునరంకితమవుతోంది. ⓐ

తాను జీవిస్తున్న సమాజం మీదే ఆధారపడి ఉంటుందని అర్థం చేసుకోవాలి. అందుకే వ్యక్తిలోని అంతర్ముఖుడైన మనిషి మనసు అంతరాలలో బయటి సామాజిక జీవన ప్రభావాలు లేకుండా ఉండడం ఎలా సాధ్యమనే బలమైన వాదన ఉంది. సామాజిక శాస్త్రాలలో ఈ రెండు భిన్న భావనల మధ్య, రెండు ప్రాపంచిక దృక్పథాల మధ్య ఎడతెగని వాద సంవాదాలు సాగుతూనే ఉన్నాయి. అయితే ఒకే సామాజిక సందర్భంలో మనుషులు భిన్నంగా ఎందుకు ఉన్నారనేది ఒక ప్రశ్న అయితే, ఒకే సందర్భంలో కొంత మంది వ్యక్తులు చాలా అరుదైన వ్యక్తులుగా ఎదిగి సామాజిక అనుభవ సారాన్ని అత్యంత గాఢంగా ఎలా వ్యక్తీకరించగలుగుతున్నారన్న ప్రశ్నకు కూడా అంత సంతృప్తికరమైన సమాధానం ఇంతవరకు దొరకలేదు.

పీటర్ మెడవార్ (Peter Medawar) అనే శాస్త్రవేత్త అన్వేషణా పద్ధతుల గురించి ముఖ్యంగా శాస్త్రీయ పద్ధతి (scientific method) మీద ఒక లోతైన విశ్లేషణ చేస్తూ భౌతిక శాస్త్రాలలో శాస్త్రవేత్తలందరూ శాస్త్రీయ పద్ధతిని అవలంబించినా, కొందరు శాస్త్రవేత్తలే నూతన ఆవిష్కరణలు చేయగలుగుతారని అన్నాడు. శాస్త్రీయ పద్ధతితో బాటు శాస్త్రవేత్త సృజనాత్మక శక్తి తోడ్పడినప్పుడే నూతన ఆవిష్కరణలు సాధ్యమవుతున్నాయి. ఈ సృజనాత్మకత ఎక్కడ నుండి లేదా ఏ దారి నుండి వస్తున్నదన్న ప్రశ్నకు ఇంతవరకు సమాధానం దొరకడం లేదని అంటూ ఏ రంగంలోనైనా మానవ మేధస్సు అతి తీవ్రంగా, అతి వాడిగా పని చేసే ప్రక్రియలో ఒక సార్వజనీనత ఉంటుందని, ఐన్‌స్టీన్, షేక్స్పియర్, కార్ల్ మార్క్స్‌ల మేధస్సుల మధ్య ఒక సారూప్యత ఉందని, మార్క్స్ భౌతిక శాస్త్రాల్లో పరిశోధన చేస్తే, ఐన్‌స్టీన్ అయ్యేవాడని, షేక్స్పియర్ సామాజిక శాస్త్ర విశ్లేషణలో ఉంటే కార్ల్ మార్క్స్‌లా విశ్లేషించగలిగే వాడని ప్రతిపాదించాడు. క్లిష్టమైన సమస్య ఏంటంటే ఈ మేధస్సులు ఎలా పని చేస్తాయి? వీటి క్రమమేమిటి అనే ప్రక్రియ గురించి ఆ పని చేసిన వాళ్లే చెప్పలేకపోతున్నారు.

అయితే అతి పదునైన వ్యక్తిగత మానవ మేధస్సుకి ఆ మేధస్సు పనిచేస్తున్న సామాజిక సందర్భానికి, లేదా భౌతిక పరిస్థితులకుండే అవినాభావ సంబంధం ఇంకా స్పష్టంగా అర్థం కావడం లేదు. మావో 'భావాలు ఎక్కడి నుండి వస్తాయి' అన్న విశ్లేషణలో దీనికి కొంత సమాధానం ఉన్నా, కాలం ఒక ప్రత్యేకమైన వ్యక్తిని లేదా కొందరు వ్యక్తులనే ఎందుకు ఎన్నుకుంటుందన్న ప్రశ్న చాలా సంక్లిష్టమైన ప్రశ్నే. ప్రతి కాలంలో ఇలా కొందరు విశిష్టమైన వ్యక్తులుండబట్టే ఉదారవాద సిద్ధాంతం తన వ్యక్తి ఆశ్రిత ఆలోచనను ఇంత కాలంగా నెట్టుకు రాగలుగుతున్నది.

ఈ సమస్యకి సమాధానంగా ఐన్‌స్టీన్ ఒక విశ్లేషణలో కొంత ప్రయత్నం చేసి ఒక ప్రతిపాదన చేసాడు. అందులో ప్రతి మనిషిలో ఒక ఏకాంత మనిషి (solitary being) ఉంటాడని, ఆ మనిషిలో ఆలోచనలు, ఆవేశాలు, ఉద్రేకాలు అంతర్గతంగా ఘర్షించుకుంటూ ఉంటాయని, అలాగే ఆ మనిషి జీవిస్తున్న సమాజ ప్రభావాలు, సామాజిక సహజీవన సంబంధాల ప్రభావం వలన ప్రతి మనిషిలో ఒక సామాజిక మనిషి (social being) ఉంటాడని, ఈ ఒంటరితనం ఈ సామాజికత ఒక్కొక్క వ్యక్తిలో భిన్న పాళ్లలో ఉంటాయని ఈ రెండు ప్రభావాల భిన్న పాళ్ల కలయికే ఒక్కొక్క వ్యక్తి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతుందని సూత్రీకరించాడు. ఒంటరి మనిషి, సామాజిక మనిషి ఒకదానికొకటి వ్యతిరేక ప్రభావాలు కాకుండా ఈ రెండింటి సమ్మిళితం నుండి వ్యక్తి ప్రత్యేకత, ఆ వ్యక్తి సార్వజనీనత రూపొందుతాయని, భావించవచ్చు.

ఈ తాత్విక చర్చతో వ్యాసం ప్రారంభించడానికి ప్రధాన కారణం, శ్రీశ్రీ వ్యక్తిత్వాన్ని, ఆయన ప్రతిభా పాటవాన్ని ఈ చట్రం నుండి అర్థం చేసుకోవడం కొంత సాధ్యమేమో, లేదా శ్రీశ్రీ వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకునే క్రమంలో ఈ సైద్ధాంతిక చట్రం మరింత స్పష్టంగా అవగాహన అవుతుందేమోనన్న ఒక ఆశ ఈ వ్యాసంలో ఉంది.

'మహాప్రస్థానం' గీతాల మీద భావవాద ప్రభావం ఉందని శ్రీశ్రీ స్వయాన అంగీకరించాడు. భావవాదం నుండి భౌతిక వాదనకు ఆయన మేధస్సు చేసిన ప్రయాణాన్ని, ప్రయాసల్ని చూస్తే శ్రీశ్రీ కవిత్వ రచన ఒక అద్భుత సామాజిక ప్రయోగంగా కనిపిస్తుంది. సామాజిక చలన సూత్రాలు శాస్త్రీయ స్థాయి చేరే దాకా, సామాజిక మార్పు ప్రయత్నాలను, పోరాటాలను, అరుదైన వ్యక్తుల జీవితాలను ప్రయోగాలుగానే చూడవలసి ఉంటుంది. అందుకే బాలగోపాల్ మరణం తర్వాత నేను రాసిన వ్యాసంలో 'అర్థాంతరంగా ఆగిన అద్భుత మానవీయ ప్రయోగం' అని అన్నాను. (బాలగోపాల్ అభిప్రాయంలో భావాలన్నీ సామాజికమే, వ్యక్తులు పేర్లు వాటికి పెట్టుకొనడం కేవలం ఆ భావాలకు నైతిక బాధ్యత వహించడం కొరకేనని. దీని గురించి కూడా ఆలోచించవలసి ఉంది.) ఆ ప్రమాణం శ్రీశ్రీకి అలాగే తెలుగు సాహిత్యంలో ఎనలేని ప్రతిభ వ్యక్తపరిచిన తెలుగు మేధస్సుకు అన్వయిస్తుంది. ఆ విధంగా తెలుగు సమాజం, దాని అనుభవం ఒక అరుదైనది గానే చెప్పవచ్చు. శ్రీశ్రీ కూడా ఆ అభిప్రాయాన్ని బలంగానే చెప్పాడు. మహాప్రస్థాన గీతాలను చదువుతుంటే ఒక 'ఒంటరి' శ్రీశ్రీ పడిన వేదన, ఒక సామాజిక శ్రీశ్రీ పొందిన ఆవేశం, ఆనందం రెండూ కొట్టొచ్చినట్లుగా కనిపిస్తాయి. ఈ రెండు ప్రక్రియల సమ్మేళనం నుండి ఒక అద్భుత కవిత్వం తెలుగు సమాజానికి, తెలుగు సాహిత్యానికి అందింది. ఈ కవిత్వంలో ఒక క్షణం నిరాశ, నిట్టూర్పు మరుక్షణంలో ఒక ప్రగాఢ విశ్వాసం, భవిష్యత్తుపట్ల అచంచలమైన నమ్మకం. ఈ రెండులోతైన అనుభవాలు ఈ కవిత్వాన్ని చదివే ప్రతి వారికి కలుగుతాయనిపిస్తుంది.

మహాప్రస్థాన కవిత్వ పరిణామం, పరిణతి చూస్తే చాలా విషయాలు బోధపడతాయి. 1933లో 'జయభేరి'తో మొదలై 1940లో 'జగన్నాథుని రథచక్రాలు'తో పూర్తవుతుంది. నిజానికి ఇది 'ఒంటరి' మనిషితో ప్రారంభమై సామాజిక సమిష్టి మార్పు కొరకు ఆరాటపడే, లేదా ఆవేశపడే సామాజిక వ్యక్తితో పూర్తి కావడం యాదృచ్ఛికమేమీ కాదు. 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను. నేను సైతం విశ్వవృష్టికి అశ్రువొక్కటి ధారపోసాను' అని ప్రారంభమై నేనొక్కణ్ణే ధాత్రినిండా నిండిపోయా... అంటాడు. (ఒక ప్రసంగంలో సి. నారాయణరెడ్డి గారు శ్రీశ్రీ 'నేను'ను విశ్లేషిస్తూ ఈ నేను శ్రీనాథుడి ఫ్యూడల్ అహంకార పూరిత నేను కాదు.. ఈ 'నేను' కృష్ణశాస్త్రి ఆవేదనా భరిత 'నేను' కాదు, ఇది ఒక సామాజిక 'అహం' అని వ్యాఖ్యానించాడు.) ఈ 'నేను'లో సమాజ చైతన్యం ఉంది, లేదా సామాజిక చైతన్యంలో ఈ 'నేను' ఒక విడదీయరాని అంతర్భాగంగా ఉంది. ఈ కవిత రాసిన రెండు నెల్లకే 'ఒక రాత్రి'లో 'బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టునన్ను' అంటూ 'ఆకాశపుటెడారిలో కాళ్లు తెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి' అన్నాడు. 'ఆకాశదీపం'లో 'గదిలో ఎవరూ లేరు, గది నిండా నిశ్శబ్దం... చూపు లేని చూపులతో తేరి చూస్తున్నది

గది... మూలనక్కి మూలుగుతున్నది. ప్రమిదలో చమురు త్రాగుతూ పలు దిక్కులు చూస్తున్నది...' అంటూ 'చీకటి బోనులో సింహములా నిలుచున్నది...' అని కొనసాగించి 'అలసిపోయింది పాపం. దీపం, ఆకాశతార ఆహ్వాన గానం చేసింది. దీపం ఆరిపోయింది. తారగా మారిపోయింది' అంటూ ముగించాడు. ఈ కవిత్వంలో ఆరంభం ఒక చోట జరిగి ముగింపు చాలా ఉన్నతంగా ఎదుగుతుంది. బహుశా సామాజిక మార్పు కూడా అలాగే ఉంటుందేమో!

'అవతారం' గీతికలో 'పుడమితల్లికి పురిటి నొప్పులు కొత్త సృష్టిని స్ఫురింపించాయి' అని రాసిన ఒక నెలలోనే 'బాటసారి' కవితలో 'కూటికోసం, కూలికోసం, పట్టణంలో బ్రతుకుదామని తల్లి మాటలు చెవిని పెట్టక బయలుదేరిన బాటసారికి మూడు రోజులు ఒక్క తీరుగ నడుస్తున్నా దిక్కు తెలియక నడి సముద్రపు నావరీతిగా సంచరిస్తూ, సంచలిస్తూ, దిగులు పడుతూ దీనుడౌతూ... దారితప్పిన బాటసారికి ఎంత కష్టం!' 'అతని బ్రతుకున కదే ఆఖరు! బాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకుంటోంది' అని రాసాడు.

'జయభేరి' రాసిన సరిగ్గా ఒక సంవత్సరం తర్వాత 'ఐ' రాసారు. నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను అనే స్థాయి నుండి 'భూతాన్ని యజ్ఞోపవీతాన్ని, వైప్లవ్యగీతాన్ని నేను' అంటాడు. నేనొక దుర్గం, నాదొక స్వర్గం, అనర్గళం, అనితర సాధ్యం, నా మార్గం' అనే దశకు చేరుకుంది. ఇదే క్రమంలో ఎచటికి పోతావీ రాత్రి అంటూ... అవతలి గట్టుకు అన్నాడు. 'కళారవి' అనే కవితలో ఆగ్రహం ఉంది, ఒక సంసిద్ధత ఉంది. ఈ కవిత రాసిన ఆరు నెల్ల తర్వాత 'పరాజితులు' రాసాడు. ఈ కవిత చాలా నిరాశాపూరితంగా ఉంది. 'అలసిన కన్నులు కాంచేదేమిటి? తొణికిన స్వప్నం, తొలగిన స్వర్గం, విసిగిన ప్రాణుల పిలిచే దెవ్వరు' దుర్గతి, దుర్గతి, దుర్మతి, దుర్మృతి' అని రాసాడు. ఇదే ధోరణిలో నెత్తురు క్రక్కుకుంటూ నేలకు నే రాలిపోతే నిర్దాక్షిణ్యంగా వీరే... అన్నాడు. ఈ ఆశానిరాశలు, ఆ విశ్వాస అవిశ్వాసాలు, ఈ ఆటుపోటుల మధ్య శ్రీశ్రీ మీద స్విన్‌బర్న్ కవి ప్రభావం చాలా లోతుగా పడింది. మొట్టమొదటిసారిగా 'ఎర్రకాంతుల జ్ఞానోదయమూ, రెక్క విప్పిన రెవల్యూషన్' అనే నూతన ఆలోచన శ్రీశ్రీ కవిత్వంలోకి వచ్చింది. ఇలా విశ్లేషించడానికి ఒక కారణం శ్రీశ్రీ తను మహాప్రస్థాన గీతాలు రాసేప్పటికి మార్క్సిజం గురించి తెలియదని అన్నారు కాబట్టి! ఈ ఆలోచన ఆవేశం 'అద్వైతం'లో చాలా బలంగా కనిపిస్తుంది. 'అనురాగపుటంచులు చూస్తాం, ఆనందపు లోతులు తీస్తాం', 'మరణానికి ప్రాణం పోస్తాం, స్వర్గానికి నిచ్చెన వేస్తాం', 'ప్రపంచమును పరిహసిస్తాం, భవిష్యమును పరిపాలిస్తాం' అన్నాడంటే ఒక నిరాశ స్థాయి నుండి ఎంత బలమైన ఆకాంక్ష వ్యక్తీకరణ జరిగిందా అని ఆశ్చర్యం వేస్తుంది. ఈ కవితకు కూడా స్విన్‌బర్న్ కవితే స్ఫూర్తి అని శ్రీశ్రీ రాసాడు.

శ్రీశ్రీ సాహిత్యంలో గ్రామీణ వర్గ దృక్పథం స్పష్టంగా కనిపిస్తుంది. 'వాడు' అని 1937లో రాసిన కవితలో వర్గ దృక్పథ ఛాయలు స్పష్టంగానే కనిపిస్తాయి. ముఖ్యంగా 'అందరం కలిసి చేసిన ఈ అందమైన వస్తు సముదాయం అంతా ఎక్కడో ఒక్కడే వచ్చి ఎత్తుకు పోతూ ఉంటే చూచి అన్యాయం అని మేమంటే అనుభవించాలి మీ కర్మం' అని అంటూ ఎద్దుల్లా పని చేసే మమ్మల్ని మొద్దుల్నీ, మొరటుల్నీ చేసి ముద్దకి కూడా దూరం చేసారు అని రాస్తూ, ఇంకా ముందుకు పోయి 'చెయ్యలేం చస్తున్నాం మేము, జీవనానికి ఆసరా చూపించమంటే నోరు మూసి, జోడు తీసి కొట్టి దౌర్జన్యానికి దౌర్జన్యం మం'దంటాడు. ఈ కవితలో వ్యవస్థీకృత హింస ప్రస్తావన ఉంది. దీనిని సాంస్కృతిక భావజాలం ఆయుధంలా ఎలా కాపాడుతున్నదో కూడా ఉంది. అంటే 'నేను సైతం' దగ్గర 1933లో ప్రారంభమై, స్విన్‌బర్న్ కవితా ప్రభావంతో వర్గ దృక్పథమేర్పడి వ్యవస్థీకృత హింస దాకా శ్రీశ్రీ చైతన్యం ముందుకు పోయింది. ఈ చైతన్య స్పష్టత ఏర్పడే క్రమంలోనే 'నరజాతికి పరివర్తన, నవజీవన శుభ సమయం, అభ్యుదయం' అని రాసాడు. 'వ్యత్యాసం'లో కూడా ఇదే బలమైన ధోరణి అగుపిస్తుంది. అయితే ఈ కవితలో మరొక అడుగు ముందుకు వేసి 'మాకు గోడలు లేవు, గోడలను పగలగొట్టడమే మా పని' అంటూ 'అలజడి మా జీవితం, ఆందోళన మా ఊపిరి, తిరుగుబాటు మా వేదాంతం' అనడంలో ఈ కవితా చరణం ప్రజా ఉద్యమాల నినాదంగా పరిణతి చెందింది. ఈ కవిత సామాజిక శక్తుల పోలరైజేషన్ గురించి కూడా ప్రస్తావిస్తుంది. 'అభిప్రాయాల కోసం బాధలు లక్ష్యపెట్టని వాళ్లు మాలోకి వస్తారు, అభిప్రాయాలు మార్చుకొని సుఖాలు కామించే వాళ్లు మీలోకి పోతారు' అనే స్పష్టత వచ్చింది. అదే దెబ్బతో మిథ్యావాది మీద ఆగ్రహపడ్డాడు. శంకరుడి మాయ సిద్ధాంతాల్ని హేళన చేస్తూ మొదటి చరణంలో ముద్దుల వేదాంతీ అంటూ ప్రారంభించి, బాబూ ఏమంటావు, స్వామీ ఏమంటావు అంటూ, ఏయ్ ఏ మంటావ్ దాకా ఆగ్రహ స్థాయి చేరుకుంది.

మహాప్రస్థానంలో 'ప్రతిజ్ఞ' కవితకు ఒక ప్రత్యేక స్థానముంది. మొదట 1933లో రాసిన కవిత నుండి శ్రీశ్రీ మహాప్రస్థానం 1937లో రాసిన 'ప్రతిజ్ఞ'తో ఒక ఎత్తు ఎదిగింది, లేదా ఒక మలుపు తిరిగింది. మార్క్స్ దాదాపు రెండు దశాబ్దాలు పరిశోధించి చేసిన శ్రమ విలువకు ఈ కవిత ఒక సుందర వ్యక్తీకరణ. ఈ కవితలో శ్రమ సామాజిక జీవనంలో ఎలాంటి కీలకమైన పాత్ర నిర్వహిస్తుందో వివరించాడు. 'పొలాలనన్నీ, హలాలదున్నీ ఇలాతలంలో హేమంపిండగ - జగానికంతా సౌఖ్యం నిండగ, కర్షక వీరుల కాయం నిండా కాలువకట్టే ఘర్మజలానికి ఖరీదు లేదోయ్' అంటూ శ్రమ దోపిడీ గురించి వివరిస్తూ 'ప్రపంచ భాగ్యం వర్ధిల్లాలని, గనిలో, వనిలో, కార్ఖానాలో, ధనిక స్వామికి దాస్యం చేసే కార్మిక వీరుల విలపాగ్నులకు, విషాదాశ్రులకు ఖరీదు కట్టే షరాబులేడోయ్' అంటూ వర్గసమాజంలో 'నిరపరాధులై దురదృష్టంచే, కొనప్రాణంతో కనలే వాళ్లు, కష్టం చాలక కడుపు మంటచే తెగించి సమ్మెలు కట్టే వాళ్లూ, శ్రమ నిష్ఫలమై, జని నిష్ఠురమై నూతిని, గోతిని వెతికే వాళ్లు - అనేకులింకా, అభాగ్యులంతా, అనాథలంతా, అశాంతులంతా దీర్ఘశ్రుతితో, తీవ్ర ధ్వనితో విప్లవశంఖం వినిపిస్తారోయ్' అని సుస్పష్టంగా చెపుతూ ఇవే తన కవిత్వానికి బాటలు వేస్తుందని, ఈ వస్తువే తనలో కదిలే నవ్య కవిత్వానికి ఆయువు పట్టని, ఇక తన కవిత్వం కార్మిక లోకపు కళ్యాణానికి, శ్రామిక లోకపు సౌభాగ్యానికి, శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనే లేదని, కష్ట జీవులకు, కర్మవీరులకు నిత్యమంగళం నిర్దేశిస్తూ, వ్యథార్తజీవిత యథార్థ దృశ్యం పునాదిగా ఇక జనించబోయే భావి వేదముల, జీవనాదములో జగత్తునంతా చవులిస్తానోయ్ అంటూ ఈ లక్ష్యాలకే తన కవిత్వం అంకితమని ప్రతిజ్ఞ చేసాడు. సహస్ర వృత్తుల సమస్త చిహ్నాల్ నావినుతించే, నా విరుతించే, నా వినిపించే నవీన గీతికి, నా విరచించే నవీన రీతికి భావ్యం, భాగ్యం, ప్రాణం, ప్రణవం అని చాటుకున్నాడు.

'ప్రతిజ్ఞ' కవిత రాసిన వారం రోజులలోనే చేదుపాట రాయడం కొంత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇంత స్పష్టంగా తన కవిత్వపు వస్తువును, బాటను, రీతిని, లక్ష్యాన్ని నిర్ణయించుకున్న శ్రీశ్రీ 'లేదు సుఖం, లేదు సుఖం, బతుకు వృథా, చదువు వృథా, కవిత వృథా, మనమంతా బానిసలం, వెనుక దగా, ముందు దగా కుడి యెడమల దగా దగా' అంటూ 'మనదీ ఒక బతుకేనా సందులలో పందులవలె', 'బతుకు ఛాయ, చదువు మాయ, కవితా కరక్కాయ' అని కొనసాగిస్తూ 'లేదు సుఖం, లేదు రసం, చేదు విషం జీవఫలం' అంటూ వాపోవడాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి? ప్రతిజ్ఞ చేసిన వారం రోజులలో తన కవిత్వానికి ఒక దిశా నిర్దేశం చేసుకుని కాగితం మీద సిరా ఆరక ముందే 'కవిత వృథా, బతుకు వృథా' అని అనడమే కాక, మొత్తం కవితలో మిణుకు మిణుకు మనే ఆశ కూడా కనిపించక పోవడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. గతి తార్కికతలో ఇలాంటి అనుభవం ఒక భాగమా, కవి భావావేశాలు ఒక దశ నుండి ఇంకొక దశకు ఊయలలో ఊగుతుంటాయా అనే అంశాన్ని కూడా చర్చించవలసి ఉంది. సాహిత్య చర్చల్లో కవిత్వం, కవి తన ఆవేశాల నుండి, బాధల నుండి తీవ్రమైన ఉద్వేగాల నుండి బయటపడటానికి చేసే ప్రయత్నమేనన్న ఒక విశ్లేషణ కూడా ఉంది. కవి మనసు భగ్నమైన అనుభవాలకు భావ ఘర్షణకు గురైనప్పుడు కవిత్వం, ఇలాంటి మార్పుకు గురౌతుందేమో?

తన చుట్టూ ఉండే బాధ పట్ల బాధపడడం శ్రీశ్రీకి, శ్రీశ్రీ కవిత్వానికి ఉన్న ఒక సహజ గుణం. ప్రపంచ బాధంతా శ్రీశ్రీ బాధ అని చలం యోగ్యతా పత్రంలో అందుకనే అన్నారు. అయితే ఈ బాధకు వ్యతిరేకంగా తిరగబడే లక్షణం కూడా ఈ కవిత్వానికుంది. కేవలం బాధనే వ్యక్తపరచిన కవితలలో కొంపెల్ల జనార్దనరావు స్మృతిలో రాసిన అంకితం కవిత, అలాగే 'ఒకరాత్రి', 'ఆకాశదీపం', 'బాటసారి', 'భిక్షువర్షీయసి', 'పరాజితులు', 'ఉన్మాది', 'దేనికొరకు', 'పేదలు', 'నిజంగానే', 'నీడలు' ఈ కవితలన్నీ సూక్ష్మంగా చూడగలిగిన చలం - ప్రపంచ బాధంతా శ్రీశ్రీ బాధ అని ఫీల్ అయ్యే ఆ మాట అన్నారు. చాలా వరకు ఈ కవితలన్నింటిలో శ్రీశ్రీ మనోవేదన ఉంది. దీంట్లో శ్రీశ్రీ 'ఒంటరి'తనం పాలు కూడా తక్కువేమీ కాదు.

ఈ బాధామయ నిరాశాపూరిత కవిత తర్వాత ఒకటి రెండు నెలల లోపే మళ్లీ చాలా అద్భుతమైన, సజీవమైన 'కవితా! ఓ కవితా', 'దేశచరిత్రలు', 'జ్వాలాతోరణం' లాంటి కవితల సృష్టి జరిగింది. ఈ కవితలు శ్రీశ్రీ కవిత్వానికి, మహాప్రస్థానానికి ఆయన సృజనాత్మకతకు ఒక మాటలో తెలుగు కవితా సా[illegible]త్య సృష్టికి ఒక పరాకాష్ఠ. కవితా! ఓ కవితా గురించి అద్భుతమై[illegible] వ్యాఖ్యానాలు కూడా వచ్చాయి. ఈ కవితలో శ్రీశ్రీ లేదా కేవలం [illegible]యన చైతన్యమే ఉంది. బహు[illegible] ఈ కవిత శ్రీశ్రీని కూడా అబ్బురపరచి ఉంటుంది. ఒక్కొక్కసారి కవి సృష్టి కవికే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ వ్యాసానికి ముందు భాగంలో పేర్కొనిన పీటర్ మెడవార్ విశ్లేషణలో శాస్త్రవేత్తకు కొత్త ఆవిష్కరణ ఎలా జరిగిందో శాస్త్రవేత్తకే తెలియనట్లుగా, బహుశా కవితా! ఓ కవితా! సృష్టి కూడా ఎలా జరిగిందో శ్రీశ్రీకి కూడా తెలిసి ఉండదు. సమాజం తన సమష్టి చైతన్యాన్ని వ్యక్తీకరించుకునే క్రమంలో ఒక హ్యూమన్ ఏజెన్సీని ఎన్నుకోవడం వలన వ్యక్తి తాను సృష్టించినదానిని తానే సృష్టించానా అనే అనుమానం కలగవచ్చు. 'అది పలికెడిది భాగవతమట పలికించెడి వాడు రామభద్రుండట' అనేదానికి కూడా అన్వయిస్తుంది. అలాగే పలికెడిది మహాప్రస్థానమట పలికించెడిది ప్రజా చైతన్యమట అని కూడా విశ్లేషణ చేసుకోవచ్చు.

కవితా! ఓ కవితా! కి ప్రపంచ సాహిత్యంలోనే విశిష్ఠ స్థానమున్నదనడంలో అతిశయోక్తి లేదు. ఈ కవితలో మానవ జీవన విస్తృతి, చారిత్రక అనుభవం, మానవ సమష్టి చైతన్యాన్ని ఒడబోసి తీసిన సారంగా, రసంగా అర్థం చేసుకోవచ్చు. శ్రీశ్రీ ఈ అనుభవాన్ని విశ్వరూప సాక్షాత్కారంగా వర్ణించాడు.

వీటిలో కొన్ని చరణాలు! 'చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో, నిశ్చల సమాధిలో స్వర్గద్వారపు తోరణమై వ్రేలిన నా మస్తిష్కంలో, ఏయే ఘోషలు, భాషలు, దృశ్యాల్ తోచాయో, నేనేయే చిత్ర విచిత్ర శ్యమంత రోచిర్నివహం చూశానో!... ఇంకొక చరణం, 'అన్నీ నీ చైతన్యం నీ విశ్వరూప సాక్షాత్కారం', మరొక చోట 'శస్త్రకారుని మహేంద్ర జాలంలో, చావుబ్రతుకుల సంధ్యాకాలంలో కన్నులు మూసిన రోగార్తుని రక్తనాళ సంస్పందన'. 'కారడవులలో లయాతీతమై, విరుతించిన నానా జంతు ధ్వనులో నక్షత్రాంతర్నిబిడ నిఖిలగానం', 'భూకంపాలు, ప్రభుత్వ పతనాలు విప్లవం, యుద్ధం', 'అన్నీ నీ చైతన్యం! నీ విశ్వరూప సాక్షాత్కారం, కడుపు దహించుకుపోయే, పడుపుకత్తె రాక్షస రతిలో', 'ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం', 'సమ్మె కట్టిన కూలీల హాహాకారం! ఆర్తారావం!' 'ఒక లక్ష నక్షత్రాల మాటలు, ఒక కోటి జలపాతాల పాటలు శతకోటి సముద్ర తరంగాల మ్రోతలు', ఇలా వర్ణిస్తూ పోతే కవితలోని ప్రతి చరణాన్ని పేర్కొనవలసి ఉంటుంది. విశ్వ రహస్యాలు తెలిపిన ఒక శాస్త్రీయ మాంత్రికుడి అనుభవం ఇది. ఈ చైతన్య భరిత అనుభూతిని వ్యక్తీకరించడానికి కవిత్వం సాధన చేస్తున్న ఒక్క కవి కవిత్వం రూపాన్ని చీల్చుకుని బయటకు రావలసి వచ్చింది. అంటే సారం విశ్వజనీనమైనపుడు రూపం మారక తప్పదు. నవీన దారుల అన్వేషణ తప్పదు. తనను తన అనుభవాలను, అనుభూతులను విముక్తి చేసిన కవిత్వానికి శ్రీశ్రీ ఇచ్చిన నివాళి అంతా ఇంతా కాదు. అందుకే కవిత్వాన్ని 'అభయహస్త ముద్రతో నను దరిసిన, నన్ను పునీతుని కావించిన కవితా! లలిత లలిత కరుణా మహితా! అనుపమితా, అపరిమితా! ఓహ్ రసధుని! మణిఖని! జననీ!' అని అభివర్ణించాడు. కవిత్వం ఒక కవి చైతన్యాన్ని విముక్తి చేసిన అనుభవం నుండి ప్రస్థానం చేయడం అసాధారణమైన అనుభవమే!

ఈ సువిశాల అనుభవ దశలోనే బహుశా 'నవ కవిత' రాసి ఉంటాడు. నవీన కవనానికి వస్తువు, ఆ ప్రేరణ, లక్ష్యం ఏం కావాలనేది ఈ కవితలో ఉంది. కవితా! ఓ కవితా ఊపులోనే రాసినది కాబట్టే, కదిలేది కదిలించేది, మారేది, మార్పించేది, పాడేది పాడించేది, మునుముందుకు సాగించేదీ, పెను నిద్దుర వదిలించేదీ పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ, కావాలోయ్ నవకవనానికి అని దిశా నిర్దేశం చేసాడు.

1937లో కవితా! ఓ కవితా! ఎలా విశిష్టమైందో, 1938లో రాసిన కవిత్వంలో దేశచరిత్రలు అంతే ప్రశస్తమైంది. కవితా! ఓ కవితా! లో విశ్వ రహస్యాలు, సార్వజనీన మానవీయ అనుభవమున్నట్లే, దేశచరిత్రలు మానవ చరిత్ర అనుభవసారమున్నది. అయితే ఈ కవితలో మొదటి భాగంలో 'నరజాతి చరిత్ర సమస్తం రణరక్త ప్రవాహసిక్తం, నరజాతి చరిత్ర సమస్తం దరిద్రులను కాల్చుక తినడం, గతమంతా తడిసె రక్తమున కాకుంటే కన్నీళ్లతో, చల్లారిన సంసారాలూ, మరణించిన జనసందోహం, అసహాయుల హాహాకారం, చరిత్రలో మూలుగుతున్నవి'. ఈ కవితలో శ్రీశ్రీ అత్యద్భుత అనుభవాన్ని,

అనుభూతిని కళ్లకు కట్టినట్లుగా చెప్పగలిగాడు. వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు, మాయలతో మారుపేర్లతో చరిత్ర గతి నిరూపించినవి, అజ్ఞానపుటంధ యుగంలో ఆకలిలో, ఆవేశంలో - తెలియని ఏ తీవ్ర శక్తులో నడిపిస్తే నడిచి మనుష్యులు' అని అంటూ తర్వాత చరణాలలో 'ఇతరేతర శక్తులు లేస్తే పడిపోయేను పేకమేడలై' అంటూ 'పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను, బలవంతుల దౌర్జన్యాలూ, ధనవంతుల పన్నాగాలూ ఇంకానా ఇకపై చెల్లవు. ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ, ఒక జాతిని వేరొక జాతీ పీడించే సాంఘిక ధర్మం ఇంకానా ఇకపై సాగదు' అని ప్రకటించాడు. 'చీనాలో రిక్షావాలా, చెక్ దేశపు గని పని మనిషీ, ఐర్లాండున ఓడ కళాసీ, అణగారిన ఆర్తులందరూ, ఖండాంతర నానా జాతులు చారిత్రక యథార్థతత్వం చాటిస్తారొక గొంతుకతో'.. ఇక చరిత్ర రాజుల రాణీల ప్రేమ పురాణం కాకుండా 'అట్టడుగున పడి కాన్పించని కథలన్నీ కావాలిప్పుడు' అంటూ 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు',' చారిత్రక విభాత సంధ్యల మానవ కథ వికాసమెట్టిది' అని ప్రశ్నించాడు. (అయితే కాళోజీగారు ఒక సందర్భంలో తనకు ఆతిథ్యమిచ్చిన ఒక భూస్వామితో శ్రీశ్రీలాగే భూస్వాముల దౌర్జన్యం ఇంకెంత కాలం అంటే ఆ భూస్వామి అది సాగినంతకాలం అన్నాడట.) ఈ ఏడు దశాబ్దాల తర్వాత, మానవ చరిత్రలో ఇది చాలా తక్కువ కాలమే కావచ్చు కాని, పరిస్థితి గుణాత్మకంగా మారలేదన్నది వాస్తవం. ఈ పరిస్థితులు మారనంత కాలం లేదా బలవంతుల దౌర్జన్యాలు సాగినంత కాలం శ్రీశ్రీ 'దేశచరిత్రలు'లో అడిగిన ప్రశ్నలు, చేసిన వివరణ, కవిత్వ వస్తువు ఇప్పటికీ రెలవెంట్, ఎప్పటికీ రెలవెంటే!

మహాప్రస్థానంలోని ఇతర కవితలకు భిన్నంగా ఉన్న కవిత మానవుడా! ఈ కవితలో మానవ ప్రవృత్తి, క్లిష్టత, సంక్లిష్టత నిండుగా ఉన్నాయి. మానవ ప్రవృత్తిలో ఉండే అనేకానేక పార్శ్వాలు, కోణాలు, అంశాలున్నాయి. ఈ సంక్లిష్ట మానవ ప్రవృత్తిని పట్టుకోగలిగిన శక్తి ఈ కవితలో ఉంది. 'పరమాణువు సంకల్పంలో ప్రాభవం పొందిన వాదాలు ప్రారంభమై మనిషి సౌందర్యాన్ని ఆరాధించే వాడుగా, అనునిత్యం అన్వేషించే వాడుగా, మహా ప్రయాణీకుడిగా వర్ణిస్తూ, కొట్లాడుకునేవాడు, సంకుచిత స్వభావుడు, అయ్యో మానవుడు' అని జాలిపడ్డాడు. జాలిపడ్డ మరుక్షణమే 'ఓహో! మానవుడా, అన్యాయం భరించలేనివాడా, ఆదర్శజీవీ' అంటూ పొగిడాడు. అలాగే మానవ సమాజ వైవిధ్యాన్నీ, వైరుధ్యాన్ని చిత్రీకరిస్తూ 'ఏకరక్తబంధూ' అని సంబోధించాడు. మనిషి సాధించిన అపూర్వ శాస్త్రీయ విజయాలను ప్రస్తావిస్తూ మనిషిలోని రసైక జీవనాన్ని ప్రస్తావిస్తూ 'విజ్ఞాన ధునీ, భావధునీ' అని అన్నాడు. మనిషి ప్రవృత్తిలో కరుణ గురించి రాస్తూ 'చీమను కూడ చంపడానికి చేతులురాని వాడా' అని పొగిడాడు. ఇంత విశిష్టమైన మానవ ప్రవృత్తిని దిశా నిర్దేశం చేస్తూ 'రక్త కణ సమిష్టి కుటుంబీ' అంటూ 'తిరగబడేవాడా! ప్రశ్నించేవాడా! అన్యాయాలకు ఆహుతి కావడానికైనా జంకని వాడా' అని అంటూ 'బేబీ' అని సంబోధిస్తూ ముగించాడు. అంటే మానవ సమాజమంతా శైశవ దశలోనే ఉందన్న ధ్వని వినిపిస్తుంది. మార్క్స్ అన్నట్టు మానవ చరిత్ర ఇంకా ప్రారంభం కావలసి ఉన్నది. మనిషి ఇంకా ప్రీ-హిస్టరీ లోనే ఉన్నాడు అన్న వ్యాఖ్యకు మనిషిని బేబీ అనడం చాలా సమంజసంగా ఉందనిపిస్తుంది. ఈ మొత్తం కవితలో మనిషి బహు ముఖాలను చూపిస్తూ, మానవ ప్రవృత్తి మీద ఒక అచంచలమైన విశ్వాసాన్ని ప్రకటించాడు. మానవ ప్రవృత్తి మీద ఈ మధ్యకాలంలో జరిగిన చర్చ ఈ అంశాన్ని ముందుకు తీసుకపోలేదు. అంతిమంగా మానవ ప్రవృత్తి ఎలా ఉన్నా మనిషి మీద, మనిషి సమష్టి తత్వం మీద, మనిషి మంచితనం మీద విశ్వాసంతోనే ప్రత్యామ్నాయ సమాజ నిర్మాణం జరుగుతుంది. ఆ విశ్వాసం కోల్పోతే మనుషులు cynicism కు గురయ్యే ప్రమాదం ఎప్పుడూ పొంచి ఉన్నదనే అంశాన్ని గుర్తించాలి.

పైన పేర్కొన్న కవిత రాసిన కొంతకాలానికే 'సంధ్యా సమస్యలు' అనే కవిత రాసాడు. ఇవి మధ్య తరగతి జీవుల సమస్యలు, సందేహాలు! ఈ వర్గ స్వభావమే అలాంటిది. ఎందుకో ఈ వర్గం నిర్వహించతగ్గ, నిర్వహించవలసిన చారిత్రక పాత్రను, లేదా ఈ వర్గం యూరప్‌లో నిర్వహించిన పాత్రను మన దేశంలో నిర్వహించకపోగా, తమ సమస్యలతోటే తాము సతమతమౌతున్నారు. కొందరి సమస్యలు సామాజిక ఆర్థిక నిర్మాణానికి సంబంధించినవి కాగా, కొందరి సమస్యలు చాలా కృత్రిమమైనవి. భూస్వామ్య వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలోకి మారని మారలేని ఒక వ్యవస్థ స్వభావంలోనే ఈ మధ్యతరగతి ఇరుక్కు పోయిందేమో! అనిపిస్తుంది. కాని అంతకు ముందే ఒక అద్భుతమైన కవిత్వం రాసిన శ్రీశ్రీ ఈ మధ్యతరగతి మధ్య ఎందుకు చిక్కుకున్నాడో అనిపిస్తుంది. అక్కడ ఆగినా బావుండేది. అలా కాక మళ్లీ మొదటికి వచ్చి 'దేనికొరకు' అనే నిరాశాపూరిత 'ఒంటరి శ్రీశ్రీ' మళ్లీ అగుపిస్తాడు. ఈ కవితలో 'దేనికొరకు పదే పదే దేవులాడుతావ్ ఆకటితో అలసటతో ప్రాకులాడుతావ్, శ్రీనివాసరావు దేనికోసమోయ్ అవ్యక్తపు టూహలతో ఆలపించుతావ్?' అని రాసాడు. మహాప్రస్థాన గేయాల్లో హిమాలయపు ఎత్తులని, సముద్రపు లోతులని, సుదీర్ఘ గతాన్ని, సుదూర భవిష్యత్తును స్పృశించిన కవి, కవిత్వం, 'అవ్యక్తపు టూహలతో' మళ్లీ మొదటికి రావడమేమిటని, దీనికి కారణమేమయ్యుంటుందని అడగాలని పిస్తుంది. మొదట అన్నట్లుగా ఒంటరి శ్రీశ్రీ సమష్టి చైతన్యపూరిత శ్రీశ్రీ ఇద్దరూ వేరు వేరా అనేంత అనుమానం కలుగుతుంది. సముద్రాన్ని ప్రేమించే శ్రీశ్రీ, సముద్రం చూడకపోతే కవిత్వాన్ని రాయలేను అన్న శ్రీశ్రీ కవితా రీతులు కూడా సముద్రపుటలల వలె, ఆటుపోటులకు దగ్గరగా ఉన్నాయనిపిస్తుంది. ఈ ఒంటరితనం 'కేక'లో మరింత ప్రస్ఫుటంగా, గాఢంగా కనిపిస్తుంది. 'నిద్రకు వెలియై నే నొంటరినై, నా గదిలోపల చీకటిలో, చీకటి లోపల నా గదిలో' అంటూ 'గుండెల కప్పిన కుంపటిలో, కుంపటి కప్పిన గుండెలలో', 'దారుణ మారణ దానవ భాషలు, ఫేరవ భైరవ భీకర ఘోషలు' అని తన అంతర్గతంలోని ఆవేదనను వ్యక్తపరిచాడు. బహుశా ఈ ఒంటరితనం కొంపెల్ల జనార్దనరావు మరణం తర్వాత జరిగిన పరిణామం కావచ్చు! ప్రపంచ చరిత్రలను, మానవ అనుభవాన్ని అవపోసన చేసిన శ్రీశ్రీ ఇంత ఒంటరి వాడై పోవడానికి బహుశా 1930వ దశాబ్దపు సంక్షోభం ఒక బలమైన కారణమై ఉండాలి. ఈ దశాబ్దం హంగ్రీ డికేడ్ అయినందువల్లే, ఒక సంక్షుభిత ప్రపంచం నుండి మహాప్రస్థానాన్ని చేస్తున్న ఒక కవి కవిత్వంలో బహుశా ఆ సంక్షోభం ప్రతిఫలన చెంది ఉంటుంది అని కూడా భావించవచ్చు. బహుశా ఈ కాలంలో బలమైన ప్రజా ఉద్యమాలు మన దేశంలోనో ప్రపంచంలోనే ఉండి ఉంటే ఈ ఆశ నిరాశల మధ్య కవి అలమటించ వలసిన అవసరం లేదా ఆ విషాద అనుభవం ఉండేవి కావేమో!

కొంపెల్ల జనార్దనరావు మరణం శ్రీశ్రీని ఎంత కుంగతీసిందో 'అంకితం' కవిత్వంలో కనిపిస్తుంది. మనసును కదిలిస్తుంది. ఈ కవితల్లో ఒక చరణంలో 'మురికితనం కరుకుతనం నీ సుకుమారపు హృదయానకు గాయం చేస్తే, అనాదరణతో, అలక్ష్యంతో, ఒక్కణ్ణీ చేసి వేధించారని' శ్రీశ్రీ వాపోయాడు. ఆగ్రహం పట్టక ఆ మనుషుల మీద unparliamentary భాషనే వాడాడు. జనార్దనరావు మరణాన్ని ఉద్దేశించిన ఈ కవితలో 'ఎంత అన్యాయం చేశావోయ్, నేస్తం, ఎంత దారుణం చేశావయ్య నేస్తం' అంటూ 'చెన్నపట్టణపు సముద్రతీరంలో మనం అన్నీ పిచ్చికగూళ్లేనా కట్టింది?' అంటూ 'తనవులో, అణువణువులో సంవర్త భయంకర ఝంఝూ పవనం రేగిస్తూ, ఎక్కడకు విసిరిందయ్యా నిన్ను, ఎంత మోసగించిందయ్యా మమ్ము' అంటూ, తనను తాను ఊరడించుకుంటూ 'నీ ప్రాభవం మమ్మల్ని వదలలేదు. నిరుత్సాహాన్ని జయించడం నీ వల్లనే నేర్చుకుంటున్నాము' అంటూ 'నీ సాహసం ఒక ఉదాహరణ, నిన్న వదిలిన పోరాటం, నేడు అందుకొనక తప్పదు', కావున 'కదన శంఖం పూరిస్తున్నాను' అని తనను తాను నిలదొక్కుకునే ప్రయత్నం చేసినా, తర్వాత రాసిన రెండు మూడు కవితలలో ఆ ప్రభావం ఆ పని చేయలేకపోయింది. బహుశా ఒంటరిగా తాను తీసుకున్న లేదా తీసుకొందామనుకున్న దారికి తన చుట్టూ ఉండే సమూహపు సంసిద్ధత లేకపోవడం కూడా ఈ బలీయమైన బలహీనత ఒక కారణం కావచ్చు.

మహాప్రస్థాన గేయాలలో 1940లో రాసిన జగన్నాథుని రథచక్రాలు కవిత కూడా ఒక అద్భుతమైన కవితే. పేదవాళ్ల పట్ల పడిన వేదన, బాధకు ఈ కవిత ఒక బలవత్తరమైన వ్యక్తీకరణ. 'పతితులారా! భ్రష్టులారా, బాధాసర్పదష్టులారా! బ్రదుకు కాలి, పనికిమాలి' అంటూ 'కూడులేని, గూడులేని పక్షులారా! భిక్షులారా!' 'సఖుల వలన పరిచ్యుతులు, సంఘానికి బహిష్కృతులు' అంటూ 'ఏడవకండేడవకండి! మీ రక్తం కలగి కలగి, మీ నాడులు కనలి కనలి మీ ప్రేవులు కదలి కదలి, ఏడవకండేడవకండి' అంటూ పతితులారా! భ్రష్టులారా! బాధాసర్పదష్టులారా, ఏడవకండేడవకండి' అని ఊరడిస్తూ, 'వస్తున్నాయ్ వస్తున్నాయ్ జగన్నాథ రథచక్రాల్ అంటూనే మళ్లీ ఎటు చూస్తే, అటు చీకటి, అటు దుఃఖం పటునిరాశ... చెరసాలలు, ఉరికొయ్యలు, కాలువలో ఆత్మహత్య, దగాపడిన తమ్ములారా' అంటూ మళ్లీ 'మీ బాధలు నేనెరుగుదును, మీ బాధలు, మీ గాథలు అవగాహన నా కవుతాయ్!' అంటూ 'మీకోసం కలం పట్టి, ఆడావుడిగ వెళ్లిపోయే, జగన్నాథుని రథచక్రాల్, భూమార్గం పట్టిస్తాను! భూకంపం పుట్టిస్తాను!' అని ఆకాశం అదిరేట్లు అరిచాడు. పరిష్కారంగా 'ఇది సవనం, ఇది సమరం! ద్రోహులను తూలగొట్టి, దోషాలను తుడిచిపెట్టి, స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులై ఇళ్లు లేచి, జనావళికి శుభం పూచి, జగమంతా జయిస్తుంది' అన్న అపూర్వ విశ్వాసాన్ని ప్రకటిస్తూ 'రారండో! రండో! రండి! ఈ లోకం మీదేనండి! మీ రాజ్యం మీరేలండి! అంటూ ముగిస్తాడు. ఈనాడు అస్తిత్వ ఉద్యమాలు అడుగుతున్న ప్రశ్నలకు ఈ కవిత ఒక విధంగా సమాధానం. ఈ కవితలో అట్టడుగున ఉన్న ప్రజలు కాక శ్రీశ్రీ అంటున్న పతితులు, బాధాసర్పదష్టులు బహిష్కృతులు ఎవరు? ఆయన అక్కడే ఆగలేదు. 'ఈ లోకం మీదేనండి, మీ రాజ్యం మీరేలండి' అన్నాడు. ఈ రోజు ఈ ప్రపంచం మాది, ఈ రాజ్యాధికారం మాది, రాజ్యాధికారం రానిదే మిగిలిన సమస్యలు పరిష్కారం కావన్న ఉద్యమాలు, 1940లో 'మీ రాజ్యం మీరేలండి' అనడంలో ఆ అవగాహన ఉన్నదన్నది అంగీకరింపక పోవడం, పీడిత ప్రజా ఉద్యమాలు శ్రీశ్రీ కవిత్వాన్ని తమ సాహిత్యా వారసత్వంగా, తమ ఉద్యమ స్ఫూర్తిగా అంగీకరింపక పోవడం సామాజిక విషాదం. అలాగే ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో కూడా ఆ ఇద్దరు ప్రజాకవులు ప్రాంతాల సమస్య మీద వాళ్ల వాళ్ల బలమైన అభిప్రాయులున్నా, వాళ్ల కవిత్వాన్ని ప్రాంతానికి పరిమితం చేయడం సముచితం కాదు.

మహాప్రస్థాన ఉధృతి ప్రవాహం 1940 తర్వాత చాలా చాలా మలుపులు తిరిగింది. ఆ ప్రవాహం చిన్న చిన్న పాయలై ఎక్కడికెక్కడికో పొరడం ప్రారంభించింది. కవిత్వం పూర్తిగా అర్థం కాని నాలాంటి వాడిని చాలా గందరగోళానికి గురిచేసే కవిత్వం శ్రీశ్రీ చేతి నుండి వచ్చింది. ఆ ప్రవాహ వేగమేమయ్యింది? అనే ప్రశ్న వస్తుంది. స్వాతంత్ర్యోద్యమం కాని, రెండవ ప్రపంచ యుద్ధ ప్రభావం కాని ప్రత్యక్షంగా శ్రీశ్రీ మీద ఉన్నట్టు అనిపించదు. పరోక్షంగా బహుశా అదొక సంక్షుభిత కాలం కావచ్చు. స్వాతంత్ర్యోద్యమం మీద తాను స్పందించక పోవడానికి తన స్వప్నం ఆర్థిక స్వాతంత్ర్యం కావడమే అని శ్రీశ్రీ స్వయానే అన్నాడు. ప్రపంచ సాహిత్యంలో కూడా ఒక రకమైన స్తబ్దత వచ్చిందేమో అనిపిస్తుంది. శ్రీశ్రీ పైన తన చుట్టూ ఉండే ప్రకృతి, మనుషులు, ఘర్షణ, సంఘర్షణ ప్రభావం ఎంత బలంగా ఉన్నాయో అంతే బలంగా అంతర్జాతీయ సాహిత్య ప్రభావం కూడా ఉంది. విశాఖ సముద్రపుటలల ప్రభావం, వీచిన గాలుల ప్రభావం ఎంత ఉందో, ప్రపంచ గాలుల, దారుల ప్రభావం కూడా అంతే ఉంది. ఈ పాడు కాలం నుండి హిట్లర్ లాంటి వికృత, క్రూర శక్తుల పుట్టుక మీద శ్రీశ్రీ కవిత్వం ఎంత స్పందించాలో అంత స్పందించినట్లుగా అనిపించదు. క్రిస్టఫర్ కాడ్వెల్ 'ఎస్సేస్ ఇన్ డయింగ్ కల్చర్' (Essays in Dying Culture) లో ఈ పరిస్థితిని బాగానే వివరించాడు.

ఖడ్గసృష్టిలో 1947 ఆగస్ట్ 15న రాసిన కవితలో చరిత్రకి కృతజ్ఞత చెప్పుకున్నాడు. అయితే పరోక్షంగా గాంధీ గురించి ప్రస్తావిస్తూ 'ఎంచేతో అతని ముఖం మీద ఎప్పుడూ ఉండే పసిపాప నవ్వులేదు' అన్నాడు. స్వాతంత్ర్యం ప్రకటించిన సందర్భం సాధారణంగా ఒక ఆవేశాన్ని కలిగించాలి, అలాకాక 'మహాసంకల్పం' కవితలో 'స్వతంత్ర భారత వర్ష వాస్తవ్యు డా మానవుడు, అర్ధనగ్నంగా ఆకాశాన్నే కప్పుకుని, నిండని కడుపుతో, మండుతూన్న కళ్లతో ఇలా ఎంతకాలం నిలబడతా డా ఆ ప్రాణి' అని అంటూ 'అతని బాధ్యత వహిస్తామని అందరూ హామీ ఇవ్వండి' అన్నాడు. ఒక అపూర్వ సందర్భంలో కూడా మానవీయ కోణాన్ని, సామాజిక వాస్తవికతను గుర్తుంచుకోవడం అసాధారణమైన అంశమే. 'స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు, చాలా వాడైన కత్తి, విలువైన వజ్రం' అని వర్ణించాడు. స్పష్టంగానే 'ఇది మనకొక దీక్షా సమయం, ఇది మనకి పరీక్షా సమయం. ఆవేశం ప్రకటించిందికి అసలే ఇది తరుణం కాదు' అని కూడా అన్నాడు. దేశ స్వాతంత్ర్యం సందర్భంలో కూడా 'మనుష్యుడే నా సంగీతం, మానవుడే నా సందేశం' అని మహాప్రస్థాన స్ఫూర్తి మరొకసారి చాటుకున్నాడు. ఇది రాసిన ఒక సంవత్సరం తర్వాత 'ఓ మహాత్మా' అనే కవితను రాస్తూ మళ్లీ మౌలికమైన సందేహాలను, అనుమానాలను లేవదీశాడు. 'ఏది జీవిత మేది మృత్యువు, ఏది సత్యం ఏదసత్యం, ఏది కారణ మేదికార్యం, ఏదహింస ఏది హింస' అంటూ ప్రశ్నలను అడిగాడు.

ఖడ్గసృష్టిలో శ్రీశ్రీ రాసిన ఉగాది కవితలలో కాని లేదా ఇతర సందర్భాల్లో రాసిన కవితల్లో కాని, ఆ మాటకు సినిమా పాటల్లో కాని సామ్యవాద భావన నిరంతరంగా కొనసాగుతూనే ఉంది. సామాన్యుడి కష్టాలు, మధ్య ప్రజల ఇక్కట్లు, అట్టడుగు మనుషుల వేదన ఈ కవిత్వం నిండా ఉంది. అయితే మహాప్రస్థాన ఆవేశ స్థాయి, సమున్నతమైన కవిత్వ స్థాయి కనిపించదు. దానికి చాలా కారణాలుండ వచ్చు. మహాప్రస్థానంలో శ్రీశ్రీలో యువరక్తం, నూతనత్వం, ప్రయోగ ఉత్సాహం, జీవితపు ఘర్షణ చాలా ఉన్నత స్థాయిలో ఉన్నది. బహుశా అది నయాగరా జలపాతం లాగే కావచ్చు. ఒక ఎత్తునుండి అద్భుతమైన వేగంతో, తీవ్రతతో నేలమీద పడ్డ తర్వాత ప్రవాహ వేగమూ, ఉధృతీ తగ్గినట్లే, అద్భుత కవిత్వ మార్గం కూడా అలాగే ఉంటుందేమో అనిపిస్తుంది.

కవిత్వానికి సమాజానికుండే ప్రత్యక్ష సంబంధం సమాజం ముందుకు ఒక్కొక్క కాలంలో వస్తున్న సవాళ్లకు, ఉద్యమాలకు ఈ ప్రక్రియ ఎలా స్పందిస్తున్నదో కూడా పరిశీలిస్తే కవిత్వానికుండే తక్షణ లక్ష్యం, సార్వజనీన లక్ష్యాన్ని విడదీసి చూడవచ్చు. సామాజిక శాస్త్రాలు సమకాలీన ఉద్యమాలను విశ్లేషిస్తూ కార్య కారణ సంబంధాలను పరిశోధిస్తాయి. సామాజిక శాస్త్ర విశ్లేషణ ప్రయోజనం కూడా ఆయా శాస్త్రవేత్తల పరిశోధనా పద్ధతులు, విలువల చట్రం, చారిత్రక అవగాహనను బట్టి నిర్ణయింపబడుతుంది. కవిత్వానికి సామాజిక పరిశోధనా పద్ధతులు నియంత్రించే నియమాలు, ప్రమాణాలుండవు. నిజానికి సృజనాత్మక సాహిత్యానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు చాలా ఎక్కువ. శ్రీశ్రీ లాంటి కవులు తమ కాలంలో, లేదా అంత వరకు పాటించిన పద్ధతులను కూలదోసి సాహిత్య సృష్టి చేస్తారు. నిజానికి పరిశీలనా పద్ధతులే సైద్ధాంతిక సరిహద్దులని నియంత్రిస్తాయి. పరిశీలనా పద్ధతులలో కొత్త పద్ధతులు (మెథడ్స్) అవలంబించకుండా నూతన ఆవిష్కరణలు సాధ్యం కావు. అయితే, కవిత్వాన్ని వ్యాకరణం నిర్దేశింపకపోవచ్చు కాని సామాజిక సందర్భం, ఆవేశ పరిధి రెండూ నియంత్రిస్తాయి. అందుకే మహాప్రస్థానంలో అద్భుత కవిత్వాన్ని సృష్టించగలిగిన శ్రీశ్రీ 'ఖడ్గసృష్టి'లో ఆ పని చేయలేకపోయాడు. ఈ పరిమిత శ్రీశ్రీ కవిత్వ ప్రతిభ కంటే, ఆ కవిత్వం రాస్తున్న కాల పరిమితి అని భావించవలసి ఉంటుంది. ఆ కోణం నుండి శ్రీశ్రీ 1940-70 వరకు తడిమిన విభిన్న అంశాల నుండి రెండు అంశాలు : ఒకటి రష్యా గురించి, రెండు తెలుగు తల్లి గురించి శ్రీశ్రీ కవితలని పరిశీలించే ప్రయత్నం చేస్తాను.

తెలుగుతల్లి, లేదా తెలుగు వారంటే, విశ్వ మానవుడైన శ్రీశ్రీకి ఎనలేని అభిమానం. ఇది ఆయనలో ఒక బలమైన సెంటిమెంట్. అప్పటికి అంటే 1948కి ఆంధ్రప్రాంతం మద్రాస్ ప్రెసిడెన్సీలో, తెలంగాణ హైదరాబాద్ రాష్ట్రంలో భాగంగా ఉన్నప్పుడే తెలుగు వాళ్ల గురించి రాయడం ప్రారంభించాడు. ఈ సంవత్సరం (1948) రాసిన 'తెలుగు తల్లి' అనే కవితలో శ్రీశ్రీ సెంటిమెంట్ స్పష్టంగా అగుపిస్తుంది. 'అదెవో తెలుగుతల్లి, అందాల నిండు జాబిల్లి, ఆనందాల కల్పవల్లి అదె నీ తెలుగు తల్లి'. ఇవన్నీ ఒక రకంగా ఊహాజనితాలే. ఇది రాస్తూ 'పదవోయి తెలుగువాడా అదే నీ తెలుగు మేడ సంకెళ్ళ లేని నేల సంతోష చంద్రశాల'. ఈ తెలుగుతనాన్ని మరింత వర్ణిస్తూ 'స్వర్గాల కాంతి స్వప్నాలు, స్వప్నాల శాంతి స్వర్గాలు' అని కూడా అభివర్ణించాడు.

ఈ బాణీ 1949 వరకు మారుతూ 'విషాదాంధ్ర' అయ్యింది. 'ఎంత యీదినా ఏం ఫాయిదా, ఎక్కడా తీరం కనపడదు తల మాత్రం మీది కుంచి నిలువీత ఈదుతున్నాం. గమనం పిసరూ లేదు గమ్యం అసలే లేదు. ఈ గొంగళీ వయస్సు ఇరవై అయిదేళ్లు' అన్నాడు. అంటే భాషా రాష్ట్ర భావన 1920 ప్రాంతం నుండి మొదలవుతున్నదన్నది స్పష్టమే. అయితే ఈ భావన ఏ మాత్రం ముందుకు పోలేదన్నది శ్రీశ్రీ ఆవేదన. 'తీర్మానాలూ, ఉపవాసాలూ చేశాం, ఖద్దరు కేకలూ వేశాం, మోసుకొచ్చాం స్వరాజ్యమ్మూట, మూట విప్పితే ఏమీ లేదు' అని రాసాడు. ఈనాడు అత్యంత వివాదాస్పదమైన నీళ్ల గురించి రాస్తూ 'శిశువుకి దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరి నీళ్లు' అన్నాడు. 'మనకొక ఇల్లంటూ లేదు' అని ఇదే కవితలో బాధపడ్డాడు.

'ఇదీ దారి' 1952లో రాసిన మరొక కవితలో మళ్లీ నీళ్ల గురించే రాస్తూ 'ఉప్పునీటి కడలిలోకి ఊరక ప్రవహించి పోయే' అంటూ కవిత్వంలో ఒక నిరాశా నిస్పృహలతో రాస్తూ రాష్ట్రాన్ని సాధించాలనే ఆకాంక్షను బలంగా వ్యక్తపరిచాడు. 'అన్నలారా తమ్ములారా! అఖిలాంధ్ర జనమ్ములారా! నూతన మార్గం చూపే నేతలు లేనే లేరా, చేతికందనున్న ఫలం గోతి పాలు కావాలా! మదరాసుకు ముడివేసుక మన రాష్ట్రం పోవాలా!' అని 'మనదేదో మనకొస్తే మడి మాన్యాలొచ్చినట్టు, సత్వరమే మన రాష్ట్రం సాధించడమే శ్రేష్ఠం, చీల్చబడిన పరగణాలు చేర్చి ఒకటి చేయు వరకు విశాలాంధ్ర వచ్చు వరకు విరామమే లేదు మనకు' అని నొక్కి చెప్పాడు. అక్టోబర్ 1, 1953లో ఆంధ్ర రాష్ట్ర నిర్ణయం ప్రకటించిన తరుణంలో 'కదలవోయ్ ఆంధ్రకుమారా! నవయుగం నిర్మింప సాగవోయ్!' అని అంటూ 'వేగుచుక్క వెలిగెనోయ్! సుదూరాన విశాలాంధ్ర విజయవాణి పిలిచెనోయ్, కాంతిరేఖ చూడవోయ్' అని అన్నాడు. ఆంధ్ర రాష్ట్ర ప్రకటన వస్తూనే సామాజిక బాధ్యత గల కవిగా 'ఈ రాష్ట్రం ఇదుగో ఇప్పుడే చెబుతున్నా ఏదో కొందరి సదుపాయనికేర్పడలేదు. ఎవరో కొందరుద్యోగులకని ఏర్పడలేదు. సామాన్య మానవుడిదీ రాష్ట్రం. అతనికోసం ఈ రాష్ట్రం, పెత్తనం చెయ్యాలని ముందుకొచ్చే పెద్దలిది గ్రహించాల'ని హెచ్చరిక చేసాడు. ఈ హెచ్చరిక చేస్తూనే తన అమితానందాన్ని ప్రకటిస్తూ 'ఆంధ్ర జాతి కంతటికీ విజయం, ఆంధ్ర సంస్కృతికి అఖండ విజయం, ఆంధ్ర భాషకిది అపూర్వ విజయం' అంటూ నూతన రాష్ట్రానికి ఒక పెద్ద ప్రణాళికే తయారు చేశాడు. 'పారిశ్రామిక, వ్యవసాయక సహసమానాభివృద్ధితో, ప్రతి కుటుంబానికీ ఒక నివాస గృహం చూపిస్తాయ్, ప్రతి వ్యక్తి చేతికీ ఒక పని కల్పిస్తాయ్' అని అంటూ 'అఖిల భారతావనికే ఆదర్శం చూపించగల మహా నాయకుడు మనకు లభిస్తాడు' అని ఆశలు పెట్టుకున్నాడు. ఇంకా ముందుకు వెళ్లి 'రేపు మానవుడు మానవునిలోని మానవత్వం గుర్తించి మహనీయమైన సరికొత్త మర్యాదలు సృష్టించే మహత్తర కాలం'గా ఈ కొత్త ఆంధ్ర రాష్ట్ర ఆవిర్భావ సందర్భంలో తన సదాశయాన్ని, ఆ స్ఫూర్తిని ఆశించాడు. ఈ ఉత్సాహం, ఈ ఆనందం ఒక నెలరోజులు కూడా నిలవలేదు, డిసెంబర్ 13ననే 'బొమ్మలాంతరు' 'వివాదాంధ్ర' కవితలు రాసాడు. ఈ కవితలలో ఒక నిరాశ, ఒక నిట్టూర్పు కనిపిస్తాయి. బొమ్మలాంతరులో 'నిన్నటి వాగ్దానాన్ని నేటి ఉపన్యాసంలో కాల్చేసి, నేటి ఫోర్జరీని రేపటి సంతకంగా మార్చేసి, ఇక్కడే వుండు వొస్తానని ఎక్కడికో పోయాడు వినాయకుడు' అన్నాడు.

'వివాదాంధ్ర'లో 'పేదవాళ్ల తరఫున మాట్లాడ్డమే పెద్ద అపరాధమై పోయింది' అంటూ 'ఈ రాక్షస మాయ కలకాలం సాగవంటా' అని ఆగ్రహించాడు. ఈ తీరు మహాప్రస్థానంలో లాగే ఒక అతి అద్భుత కవిత రాసిన వారానికే ఒక విషాద కవిత రాసినట్టు, ఆంధ్ర రాష్ట్రం నిర్మాణం కొరకు తీయని కలలు కన్న శ్రీశ్రీ రాష్ట్ర నిర్మాణం జరిగాక ఒక నెలలోనే చాలా నిరాశ చెందడం ఒక గమనించదగ్గ అంశం.

నిజానికి 1956లో విశాలాంధ్ర ఏర్పడ్డప్పుడు పులకించి పోవలసిన శ్రీశ్రీ ఆ అంశాన్ని గురించి ఏ కవిత రాసినట్లుగా లేదు. బహుశా ఆ కాలంలో ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతింది. ఆరోగ్యం దెబ్బ తినడానికి ఆంధ్ర రాష్ట్ర అవతరణతో వస్తావన్న ఏ మార్పులూ రాకపోవడం ఒక ఎత్తైతే, కమ్యూనిస్టు పార్టీ ఎన్నికలలో దెబ్బతినడం మరొక కారణం. 1955-57 మధ్య ఆయన ఏ కవితను కూడా రాయలేదు. తర్వాత కాలంలో రాసిన కొన్ని కవితలు కూడా సుదీర్ఘంగా, సంభాషణా పరంగా ఉన్నాయి. 1967లో రాసిన కవితా ప్రయోజనం గురించి ముగింపులో ప్రస్తావిస్తాను.

శ్రీశ్రీ 1954 నుండి 1969 అంటే దాదాపు ఒక దశాబ్దన్నర కాలంలో సంవత్సరానికి ఒక కవిత చొప్పున కూడా రాయలేదు. 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమ సందర్భంగా 'జన్మ దినోత్సవం' అనే కవితలో 'విడిపోవడం అంటే చెడిపోవడం అని వీళ్లకెలా నచ్చ చెప్పడం' అంటూ 'చించడం సులభమే కాని అతికించడమే కష్టం' అన్నాడు. 'పాపం అమాయకుడు తెలుగు వాడు మద్రాసు నుండి పొమ్మంటే కర్నూలుకు వెళ్లాడు. కర్నూలు కాదనుకొని హైదరాబాదు కొచ్చాడు, ఇక్కణ్నుంచి పొమ్మనడం ఏ భాషలోనూ సాధ్యం కాదు' అని అంటూ తమిళులు చాలా ప్రగతి సాధించారు, తెలుగు వాళ్లు వెనకబడి పోయారని చాలా అమాయకంగా అన్నాడు. తెలంగాణ జెండా మీద తనకు ద్వేషం లేదు కాని, అది 'అఖిలాంధ్ర పతాకం అయితే మరీ ఆనందిస్తాను' అంటూ 'అంతమంది తెలుగు వాళ్లం ఐకమత్యంగా ఉంటే యావద్భారతంలోనూ రాణించగలం' 'ఏ కీడూ వాటిల్లకుండా దేశాన్ని కాపాడుకోగలం' అన్నాడు.

తెలుగు ప్రజల గురించి రాసినట్లే రష్యా గురించి కవిత్వం రాసినపుడు కూడా శ్రీశ్రీ అవే పరిమితులకు లోనయ్యాడేమో ననిపిస్తుంది. 'గర్జించు రష్యా' అనే కవితకి జూన్ 1941న సోవియట్ యుద్ధ విమానాలు రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ దాడులను తిప్పికొట్టినప్పటి సంఘటన స్ఫూర్తితో రాసినది. 'గర్జించు రష్యా గాండ్రించు రష్యా, దౌర్జన్య రాజ్యం ధ్వసించు రష్యా' అంటూ సోవియట్ సోషలిస్టు ప్రాపంచిక దృక్పథాన్ని వేనోళ్ల పొగిడాడు. 'వ్యక్తి స్వతసిద్ధ స్వాతంత్రదాతా పతిత నిర్గతిక ప్రపంచత్రాతా' 'భావికాల స్వర్ణ భవన నిర్మాతా' అంటూ 'పాప పంకం నుండి పద్మాలు పుట్టించి, కార్మిక స్వర్గాన్ని కలగన్న రష్యా', 'పరపీడనా పరుల ప్రాణాల భైరవి', 'అనంత ప్రపంచం అంతటా నీవై, నీ గొడుగు నీడల్ని సాగించు రష్యా' అంటూ 'ప్రపంచం నీకోసం పరిపక్వంగా వుంది, కోటి గొంతులు నిన్ను కోరి రమ్మన్నాయి, కోటి చేతులు నిన్ను కౌగలిస్తున్నాయి' అంటూ వర్ణించాడు. ఇది మహాప్రస్థానంలో చేర్చబడిన కవిత.

మళ్లీ 1967లో రష్యాకు వెళుతున్న సందర్భంలో 'మళ్లీ రష్యాకు వెళుతున్నాను' అనే కవితలో మహీతత స్వర్గంవైపు మహాయాత్ర సాగిస్తున్నాను', ఇంకా ముందుకు పోయి తాను తిరిగి వచ్చిన తర్వాత ఏమంటాడో ముందుగానే చెపుతున్నానని అతి విశ్వాసంతో 'చంద్రుడి ఎకరాల్లో చుక్కలు విత్తనాలు నాటే శుభ మహోత్సవాన్ని చూశాను, ఆ పండుగను నేను ఆవిష్కరించాను' అని అంటానని అన్నాడు. అలాగే లెనిన్ మీద పది కవితల దాకా అనువాదం చేసాడు. గర్జించు రష్యా రాసిన సందర్భం, కాలం, పరిణామం ఆ కాలానికి సరితూగేలా ఉంది, కాని 1967 వరకు రష్యా చాలా మారింది, దాని విధానాలు మారాయి. అప్పటికే మావో రష్యా గురించి, సామాజిక సామ్రాజ్యవాదాన్ని గురించి విశ్లేషించి ఉన్నాడు. ఈ మార్పులేవీ శ్రీశ్రీ సూక్ష్మంగా పరిశీలించినట్లు గానీ, పరిగణనలోకి తీసుకున్నట్లు గానీ అనిపించదు.

శ్రీశ్రీ కవిత్వం మూడవ జన్మ 1970లో తీసుకున్నది. 1960ల చివరి దశలో వసంత మేఘగర్జనగా పిలువబడిన నక్సల్బరీ ఉద్యమం శ్రీశ్రీ కవిత్వాన్ని భూమార్గం పట్టించింది. అయితే మహాప్రస్థాన స్ఫూర్తికి, స్థాయికి దూరమవుతున్న శ్రీశ్రీ, ముప్పై ఏళ్ల కవితా జీవితముంది. ఈ ముప్పై ఏళ్లు శ్రీశ్రీ కవిత్వానికి ఒక రకంగా అరణ్యావాసమే. ఖడ్గసృష్టి కవితలను కవితలు కాదనే సాహసం ఎవ్వరూ చేయరు. అయితే ఈ కవితలు భిన్న దారులు వెతుకుతూ వెతుకుతూ ఉన్నాయి. ఖడ్గసృష్టి నిండా పేదల పక్షపాతముంది, సామాన్యుడి పట్ల ఎనలేని అభిమానం ఉంది. పేదల జీవితాలు బాగుపడాలని, మరింత మంచి సమాజం కావాలని, రావాలనే ఆకాంక్ష ఉంది. అందుకే శ్రీశ్రీ నిలబడగలిగాడు. ఎన్ని సినిమా పాటలు రాసినా, జీవనశైలి మొత్తం మారినా శ్రీశ్రీలోని మానవీయ కవి సజీవంగానే ఉన్నాడు. బయటి సమాజంలో మార్పు కొరకు ఉన్నతమైన త్యాగాలతో కూడిన నక్సల్బరీ ఉద్యమం పుట్టడంతో మళ్లీ ఆయనలోని కవి, కవిత్వం విజృంభించింది. మళ్లీ ప్రజా ఉద్యమాలు నినాదాలుగా స్వీకరించగలిగిన కవితలని రాసారు. అందుకే అది 'మరో ప్రపంచమై' వెలిగింది.

'మరో ప్రపంచం' ప్రారంభ సంవత్సరంలోనే నాలుగు కవితలు కన్నాడు. 1970 ఆగస్టులో రాసిన 'ఝుంఝు'లో 1930వ దశాబ్దపు శ్రీశ్రీని లేదా మరింత ప్రజాపక్ష శ్రీశ్రీని చూడవచ్చు. ఈ కవితలో 'కొత్తవి హతమార్చడానికి పాత కత్తులు నూరుతున్నారు, ఊరుకొంటానా నేను కసిగా కసాయిగా ఉపద్రవం లాగ ఉవ్వెత్తుగా లేచి సంహారాన్ని స్యందనం చేసి ఉద్రేక తరంగాలే తురంగాలుగా ఆగ్రహం కొరడాని చేబూని సాయుధ విప్లవ బీభత్సుని సారథినై భారత కురుక్షేత్రంలో నవయుగ భగవద్గీతా ఝుంఝుని ప్రసరిస్తాను, మంటల చేత మాట్లాడించి రక్తం చేత రాగాలాపాన చేయిస్తాను' అని అన్న శ్రీశ్రీని చూస్తే అడవికి ఆయుధంతో వెళ్దాడా అన్నంత స్థాయిలో ఉంది ఈ కవిత. అలాగే 'నిన్నటి జట్కావాలా' కవితలో జట్కాబండి అసహాయ స్థితి గురించి ఒకవైపు రాస్తూనే 'జట్కావాడికి చనిపోయిన గుర్రం కళ్ల ముందాడుతోంది... అప్పుడు జట్కావాలా వేరే మార్గం లేక సికాకుళం యెల్లిపోవడానికి సిద్ధపడి, నువ్వెల్లమన్నా వొద్దన్నా నే నెల్లక మాననులే' అంటాడు. అదే సంవత్సరంలో రాసిన 'సాధారణ ఉగాది పచ్చడి' కవితలో పెట్టుబడిదారులు బెంగ పెట్టుకోనక్కర లేదు. సాధారణ పరిస్థితులు సామ్యవాదాన్ని తీసుకు రాలేవు. 'కాలం ఇంకా కళపెళా ఉడకాలి. సరియైన వంటవాళ్లు దొరకాలి' అని రాస్తూ 'సాధారణలే అసాధారణలవుతారు, సామాన్యులే అసామాన్య లవుతారు' అని రాసాడు. 1971లో మరింత సూటిగా 'నక్సలైట్లు బెధిస్తున్నారు గాంధీ'

అంటూ, 'నక్సలైట్ నరకాసురుణ్ణి దిరించి, ధనస్వామ్య దామోదరుణ్ణి రక్షిస్తుందని అమాయకంగా నమ్ముతారు' అని రాసాడు.

1971లో రాసిన 'తుది పయనం. తొలి విజయం'లో పోరాడుతున్న వారినుద్దేశించి రాస్తూ 'అభిమానుల గుండెల్లో ఆరిపోని హైలేటువి!' అన్నారు. ఇంకా ముందుకు పోయి 'శ్రీకాకుళం అడవుల్లో చీమలు పాముని చంపుతాయి, సింహాద్రి శిఖరం మీద చిలుకలు పిల్లిని చెండుతాయి' అంటూ 'మాంచాలను కొలుస్తారు, మల్లమ్మను తలుస్తారు, ఝాన్సీ లక్ష్మీబాయికి బాష్పధార విడుస్తారు, సరోజినీ దేవి ఫొటో పటం కట్టి పొగుడుతారు' కాని, 'పంచాది నిర్మలంటే భయం పట్టి వణుకుతారు' అని అంటూ, ఉద్యమంలో తమ నినాదంగా ఉపయోగిస్తున్న 'తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగ్ అన్నాడు, నల్లవాడు నువ్వు నేడు నక్సలైటువన్నాడు! ఎల్లవారు నిన్ను రేపు వేగుచుక్క అంటారు' అని వర్ణించాడు. అలాగే వెంపటాపు సత్యం మీద, చారు మజుందార్ మీద, సీతారామరాజు మీద, తరిమెల నాగిరెడ్డి మీద, భూమయ్య-కిష్టాగౌడ్‌ల మీద చాలా ఆత్మీయతతో, అభిమానంతో కవితలు రాసాడు. అలాగే విరసం రచయితల నిర్బంధానికి ఆగ్రహంతో ఊగిపోయి, అప్పటి ముఖ్యమంత్రి వెంగళరావును బహుశా ఏ కవి కూడా చేయని ధైర్యంతో చడామడా తిట్ల గుండ్లు కురిపించాడు. వెంగళ్రావును ఉద్దేశించి 'బాజా భజంత్రిగా, వెంగళప్పిగా, బానిసకొక బానిసా. ధగిడికే, బ్లడీ ఫూల్, గాడిదా, దొమ్మరీ' అనే తిట్లు తిట్టాడు.

మరోప్రపంచంలో వస్తువు ఒక సమకాలీన సాయుధ ఉద్యమం. మహాప్రస్థానంలోని శ్రీశ్రీ మరోప్రస్థానంలో అగ్రహోగ్రహుడుగా కనిపిస్తాడు. హింసను లేదా ప్రతి హింసను ప్రత్యక్షంగానే సమర్థించాడు. పశ్చిమ బెంగాల్‌లో ప్రారంభమైన నక్సల్బరీ ఉద్యమం 'వ్యక్తి నిర్మూలన'తో ప్రారంభం కావడం మీద చాలా వాడైన వేడైన చర్చే సాగింది. హింస దుర్మార్గమని, ప్రతి హింస మానవీయమనే అవగాహన ఎందుకో విప్లవ కవిత్వంలో కొంత తక్కువ పాళ్లల్లోనే ఉంది. కవితలు చదువుతుంటే హింస పాత్రను ఏ మోతాదులో చెప్పాలో ఆ మోతాదులో చెప్పినట్లు కనిపించదు. శ్రీశ్రీ కవిత్వంలో కూడా ఈ ధోరణి బాగానే ఉంది. ఇది కొన్ని కాళోజీ కవితల్లో కూడా మనం చూడవచ్చు. 'మరోప్రస్థానం' గేయంలో దోపిడీ పద్ధతులను దాని క్రూరత్వాన్ని చెపుతూ 'గొడ్డళ్లతో నరకాలిరా కొడవళ్లతో తరగాలిరా' అన్నారు. మరొక సందర్భంలో 'పాపాత్ముల ప్రాణాలకు పరమాణువు బాంబులాగ గురిచూసి విమోచనం కోసం పేల్చిన మన గుండు దెబ్బకి, క్రూర మృగం డొక్కలో గాయపడినపుడు మేం నీతోనే ఉంటాం, గర్వించే హృదయాలతో' అంటూ 'ఆయుధాలకి అ ఆ లు నేర్పించినవాడా' అనే ప్రయోగాలు చేశాడు. ఈ వర్ణనలన్నీ కవిత్వంలో ప్రయోగించడం వలన, దాని ప్రభావం ఉద్యమాల మీద ఎలా ఉంటుంది, ఉద్యమానికి బయట ఉన్న సమాజం మీద ఎలా ఉంటుందో పరిశీలించవలసిన, విశ్లేషించవలసిన అవసరం ఉంది.

ఈ మూడు కావ్యాలు శ్రీశ్రీ కవితా జీవన పరిణామాన్ని చూపిస్తాయి. శ్రీశ్రీ కేవలం ఒక కవే కాదు, శ్రీశ్రీ ఒక సామాజిక చైతన్య పరిణామం, ఆ పరిణామానికి స్ఫూర్తి కూడా. అందుకే ఈ కవిత్వాన్ని విశ్లేషించేప్పుడు సృజనాత్మకతకి, సమష్టికి మధ్య నుండే అవినాభావ సంబంధం చూడవచ్చు. ఈ కవిత్వంలో ఒక సామాజిక చరిత్ర ఉంది. ఈ (1930 నుండి 1980) అరశతాబ్ద కాలంలో తెలుగు సమాజం చాలా ఆటుపోటులకు గురైంది, అయితే శ్రీశ్రీ కవిత్వం కేవలం తన చుట్టూ ఉండే సమాజానికే పరిమితం కాదు, ఆయన ప్రపంచంలోని సాహిత్య తీరులను, ధోరణులను, దారులను చాలా సునిశితంగా పరిశీలించాడు, వాటిని తనలో జీర్ణించుకున్నాడు. తన కవిత్వం సమాజానికి ఉపయోగపడాలని, సామాన్యుడి జీవితం మారాలని, సామాజిక సంబంధాలు సమున్నతమైన విలువల పునాదిగా ఏర్పడాలన్న బలమైన ఆకాంక్ష శ్రీశ్రీ కవితా వస్తువును, రూపాన్నీ, సారాన్నీ నిర్దేశించాయి. ఆ బలమైన స్వప్నం వల్లే గతంలో కవిత్వానికుండే అన్ని పరిమితులను, చట్రాలను చీల్చుకుని కవిత్వం ముందుకు వచ్చింది. అందుకే ఈ శతాబ్దం నాది అని సగర్వంగా, సవినయంగా, సంపూర్ణ ఆత్మవిశ్వాసంతో అన్నాడు. ఇది ప్రజల వైపు నిలబడ్డ కవి సామాజిక లేద సామూహిక అహం (social ego).

శ్రీశ్రీ ముందు నుండి కవిత్వ ప్రయోజనమేమిటని మళ్లీ మళ్లీ ప్రశ్నించుకున్నాడు, జవాబులు వెతికాడు. ఆయన కవిత్వానికిచ్చిన విభిన్న నిర్వచనాలు : 'మనుష్యులకు పనికి వచ్చేదే కవిత్వం', అంటూ మరొక సందర్భంలో 'ప్రయోజనాలన్నింటికీ అతీతమైన పరమాత్మ స్వరూపం కవిత్వం' అన్నాడు. 'ఏక కాలంలో అన్ని కళలవలె కవిత్వం రెండు లెవెల్స్‌లో పని చేస్తుంది. అందుకే అసలైన కవిత్వం ఏకకాలంలో పండిత పామర జనరంజకం' అనే విశ్లేషణకూడా చేసాడు. ఇంకా మరొక సందర్భంలో, 'నవత్వం + మానవత్వం = కవిత్వం' అన్నాడు. కవిత్వానికి కూడా సైన్సుకి వలె కావాలి రిసర్చ్, ఎక్సపెరిమెంట్ కాని దాని పరమార్థం పలాయనం కాదు ప్రజాప్రయోజనం అని కూడా అన్నాడు. శ్రీశ్రీ కవిత్వంలో ఈ పార్శ్వాలన్నీ చూడవచ్చు. అయితే, శ్రీశ్రీ కవిత్వాన్ని అనుభవించిన చెలం 'తనకీ, ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్, బహిర్ యుద్ధారావమే కవిత్వం' అన్నాడు. చెలం కవిత్వాన్ని చూసిన కోణానికి, శ్రీశ్రీ చూపిన కోణానికి తేడా ఉంది. కాని శ్రీశ్రీ కవిత్వంలోని ఆటుపోటులకు చెలం వ్యాఖ్యానం చాలా బాగా సరిపోతుంది.

శ్రీశ్రీ 'మహాప్రస్థానాని'కి ఆయన రాసిన ఇతర కవిత్వానికి ఒకరకంగా గుణాత్మక తేడా ఉంది. మహాప్రస్థానానికి విశ్వ మానవుడు, సంక్షోభ ప్రపంచం ఒక రెఫరెన్స్ పాయింట్ అయితే ఈ కవిత్వంలో మానవ జీవితపు అట్టడుగు లోతులనూ దర్శించిన ఒక గొప్ప అనుభవముంది. బయట సంక్షోభిత సమాజం, అంతర్గతంగా సముద్రం లాంటి మనసుంది. అఖాతం లాంటి జీవన అనుభవం ద్వారా అతి సున్నిత సామాజిక చలన సూత్రాలను సూక్ష్మంగా, స్థూలంగా చూసాడు. మనిషిని మానవ సమాజ అనుభవాన్ని పునాదుల్లోకి వెళ్లి చూసే ప్రయత్నం వలన, మహాప్రస్థాన గేయాలకు ఒక శాశ్వతత్వం లేదా సార్వజనీనత ఉందనిపిస్తుంది. ఈ కవిత్వంలో శ్రీశ్రీ సాహసంగా, సందేహాత్మకంగా అడిగిన ప్రశ్నలను చూస్తే అది అర్థమవుతుంది. ఈ ప్రశ్నల్లో 'జీవితపు చిక్కుముడులు విడవెంతకు సడలించవ', 'ఈ సృష్టికి ఏమర్థం? మానవుని గమ్యమేది, ఒక సర్వాతీత శక్తి ఉన్నట్లా లేనట్లా' అంటూ 'తప్పదు జీవికి వేదన తప్పదు ప్రాణికి మృత్యువు' అన్నాడు. ఈ ప్రశ్నలు అనంతమైన ప్రశ్నలు. బాలగోపాల్‌ను కె. శ్రీనివాస్ చేసిన ఇంటర్వ్యూలో 'సాహిత్యం మానవ జీవిత అర్థంలోని ఖాళీలను పూర్తి చేసే దిశగా సాగాలన్నాడు' బాలగోపాల్. ఎన్ని విప్లవాలు వచ్చినా, ఎంత మెరుగైన సమాజాన్ని సాధించినా మనిషిని నిరంతరంగా

వేధించే సమస్య జీవితానికి అంతిమంగా అర్థమేమిటి? అన్న ప్రశ్న. ఒక అందమైన ప్రపంచమంటే ఏమిటి? ఆ అందమైన సమాజంలో మనిషి ఎంత అందంగా రూపొందగలడు? మానవ సంబంధాలు ఎంత ఉన్నతంగా ఎదగ గలవు అనే ప్రశ్న మార్క్స్‌ను వేధించినా ఆ దిశను చూసిన లేదా చూపించిన మార్క్స్, నిత్య అన్వేషి అయిన మానవాళే తన పోరాట క్రమంలో ఈ అర్థాన్ని కనుగొంటూ, సుసంపన్నం చేస్తుందని భావించాడు.

మహాప్రస్థానంలో క్షణికత్వానికి శాశ్వతత్వం కూర్చే అద్భుత కవిత్వాన్ని సృష్టించాడు శ్రీశ్రీ. ఏడు దశాబ్దాల తర్వాత కూడా ఈ గీతాలను చదువుతుంటే నిన్ననే రాసినట్లు ఫ్రెష్‌గా, రిఫ్రెషింగ్‌గా ఉన్నాయి. ఆ అనుభూతి ఖడ్గసృష్టిని చదివినప్పుడు కలగపోవడానికి చాలా కారణాలుంటాయి. అందులో ఒక ప్రధానమైన కారణం ఖడ్గసృష్టిలోని వస్తువుకు మహాప్రస్థానానికి ఉన్న పరిధి కాని లోతులు కాని లేవు. ఖడ్గసృష్టి సందర్భోచితంగా ఉంది. అలాంటి కవిత్వానికి లేదా సాహిత్యానికి ఆ మాటకు వస్తే సామాజిక విశ్లేషణకు దీర్ఘకాలిక ప్రయోజనం ఉండక పోవచ్చు! ఖడ్గసృష్టిలో శ్రీశ్రీ స్పృశించిన రెండు సమస్యలు తెలుగు ప్రజల సమైక్యత, రష్యా గురించి రాసిన కవితలను గురించి ప్రస్తావించాను. విశ్వ మానవుడిగా ఆలోచించిన శ్రీశ్రీ తెలుగు అభిమానాన్ని ఎలా అర్థం చేసుకోవాలనేది ఒక ప్రశ్న అయితే, తెలుగు ప్రజల మధ్య అంతరాలు సాంస్కృతికపర వైవిధ్యాలు చినికి చినికి గాలి వానే కాదు అదొక పెద్ద తుపానుగానే మారిన సందర్భంలో ఆ కవిత్వాన్ని ఎలా అంచనా వేయాలి అనేది ప్రశ్న.

1969 ఉద్యమానికి స్పందిస్తూ తెలంగాణ అంటే నాకేం ద్వేషం లేదు కాని తెలుగు ప్రజలు కలిసి ఉంటే బావుంటుందనే అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు. ఆయన సెంటిమెంట్‌ను అర్థం చేసుకోవచ్చు, కాని సందర్భం మారినప్పుడు ఆ కవిత్వాన్ని ఎలా చూడాలి ఈ కవిత్వ ప్రయోజనమేమిటి అనే ప్రశ్న వస్తుంది. అలాగే రష్యా 1953 వరకే సోషలిస్టు ప్రయోగాన్ని నీరుకార్చడం ప్రారంభించింది. మావో సోషల్ సామ్రాజ్యవాదాన్ని గురించి మాట్లాడుతూ 1958లో ప్రచురించిన 'A Critic of Soviet Economics' అనే రచనలో సోవియట్ ప్రయోగం లోని వైరుధ్యాల గురించి రాసారు. శ్రీశ్రీ ఈ డెవలెప్‌మెంట్‌ను దేన్నీ అంతగా పట్టించుకున్నట్టు కనిపించదు. అంటే సందర్భోచితంగా రాసిన కవిత్వం చరిత్రలో భాగం కావచ్చు గాని చారిత్రాత్మకం అవుతుందా అన్నది ప్రశ్న.

మరోప్రస్థానానికి వచ్చే వరకు సందర్భం మారింది. అయితే ఈ పరిణామంలో నక్సల్బరీ ఉద్యమం ముందుకు తీసుకువచ్చిన సమస్యలు, పోరాట రూపాలు, త్యాగాలు సమాజాన్ని మార్చాలనే బలమైన ఆకాంక్ష భవిష్యత్తుకు సంబంధించింది. అందుకే 'మరో ప్రస్థానం'లోని కొన్ని చరణాలు ఉద్యమాల నినాదాలుగా మారి ఒక మెటీరియల్ ఫోర్స్ అయ్యాయి. మరోప్రస్థానంలో విప్లవీకరింపబడిన శ్రీశ్రీ కవిత్వం ఉంది, ఒక తిరగబడుతున్న కవి ఆయన కవిత్వం, ఉద్యమంలో ఐక్యమై పోవడం సమష్టి చైతన్యంలో భాగమైపోవడం ఆ కవి జీవితానికి కవిత్వానికి ఒక చరిత్రాత్మక సాఫల్యత కలిగించారు. అయితే శ్రీశ్రీ వారసత్వ వెలుగులో రాబోయే కవిత్వం, సాహిత్యం నూతన సమాజాన్ని ఆ సమాజంలో రూపొందే నూతన మానవుణ్ని గురించి రాయవలసిన అవసరం ఉంది.

ప్రస్తుత సామాజిక ఘర్షణలో రూపొందుతున్న మనిషి ఉన్నతీకరణ ఎలా జరుగుతుంది, జరగాలి అనే కోణం నుంచి చూడాలి. మాక్సిం గోర్కీ 'అమ్మ' నవలలో ఒక సందర్భంలో అమ్మ విప్లవంలో పాల్గొంటున్న యువతీ యువకుల గురించి వ్యాఖ్యానిస్తూ ఈ ఉద్యమం ప్రభుత్వాన్ని కూలగొడుతుందన్న విశ్వాసం కలుగుతున్నది కాని వీరు నూతన మనిషిని సృష్టించగలరన్న నమ్మకం కలగడం లేదంటుంది. సమకాలీన ఉద్యమాల ముందున్న, ముందుంచవలసిన చారిత్రక సవాలు కూడా ఇదే. నూతన మానవుడు, ఉన్నత మానవ సంబంధాలు ఉద్యమ క్రమంలో జరగవలసిందే కాని విప్లవాలు పూర్తయిన తర్వాత ఈ సమస్యలను లేదా ఈ సవాళ్లను ఎదుర్కోవచ్చు అనే విశ్వాసం లేదా వాయిదా వేయడం ఎంత పొరపాటో రష్యాలో, ఇప్పుడు చైనాలో వస్తున్న పరిణామాలలో చూడవచ్చు. కవిత్వం తన ఆశయంలో ఉద్యమాలు తమ ఆచరణలో ఈ ఆకాంక్ష వెలుగులో, దీన్నే గీటురాయిగా భావించాలి. మరోప్రస్థానం అంటే అదే!

(విశాఖ విరసం మహాసభలో శ్రీశ్రీ మీద చేసిన ప్రారంభోపన్యాసానికి మార్పులు, చేర్పులు చేసిన వ్యాసమిది.

శ్రీశ్రీ కవిత్వం మీద ఉపన్యాసమిచ్చే సాహసం నాతో చేయించిన విరసానికి వినమ్రంగా కృతజ్ఞతలు.)

అ

ప్రసంగ పాఠం

# మహాప్రస్థానం - శ్రీశ్రీ

- చలసాని ప్రసాద్

నూరేళ్లనాడు సరిగ్గా ఇదే రోజున సూర్యోదయంతో పాటు భూమి మీద పడ్డాడు శ్రీశ్రీ. కన్నతల్లి అప్పన్నకొండ ఏణ్ణర్థం తిరక్కుండానే కన్ను మూసింది. విశాఖ ప్రాంతాల్లో చిన్న పిల్లల్ని 'బాబాయ్!' అని పిలుస్తారు. అందులోనూ తల్లిలేని బిడ్డ. అందరూ శ్రీశ్రీని 'బాబాయ్!' అని గారాబం చేసేవారు. పెద్దయ్యాక కూడా చాలామందికి ఆయన బాబాయే! ఎందరెందరో చనుబాలు తాగి పెరిగాడు శ్రీశ్రీ. అంతేకాదు, తాను గాంధీగారి కన్నా ముందే మేకపాలు తాగానని సగర్వంగా చెప్పుకునేవాడు.

అయితే తన పుట్టినరోజు జనవరి 2 అని అతనితోపాటు అందరూ అనుకునే వారు. అందుకని శ్రీశ్రీ 60వ పుట్టినరోజున సన్మానం చేద్దామని 1970లో ఇక్కడ అనుకున్నాం. వ్యవధి చాలక అది ఫిబ్రవరి 1కి వాయిదా పడింది. ఇది గత చరిత్ర. "ఇక ముందు తెలుగు సాహిత్య చరిత్ర రాసే వారెవరయినా సరే తెలుగు సాహిత్యం శ్రీశ్రీ సన్మానానికి ముందూ, ఆ తర్వాత అని యుగ విభజన చేయవలసి ఉంటుంద'ని తెలంగాణ నుంచి వచ్చే ఒక పత్రిక రాసింది. అన్నట్టు, అప్పుడు - అంటే 1970 - శ్రీశ్రీ సన్మానానికి విరాళాలు విరివిగా తెలంగాణ ప్రాంతం నించే వచ్చాయి. అప్పటికి కొన్ని నెలల క్రితమే (1969) ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతంగా జరిగి తాత్కాలికంగా ఆగిపోయింది. ఈ సన్మాన సభలో తెలుగు సాహిత్య లోకం పాల్గొంది. సాహిత్య స్వరూప స్వభావాల గురించీ, సాహిత్య సంఘాల గురించీ దీర్ఘశ్రుతిలో, తీవ్ర ధ్వనితో చర్చలు జరిగాయి. అటు తరువాత విరసం స్థాపనకి (జూలై 4, 1970) దారి సుగమం అయింది. కాని విశాఖ సభల గమ్యాన్ని వమ్ము చేయాలని అప్పటి పెత్తందారీ ప్రభుత్వం (కాసు బ్రహ్మానందరెడ్డిగారి కాంగ్రెస్ హయాం), 'నక్షత్ర సప్తకం (పంచకూళ్ల కషాయం) తెల్ల కమ్యూనిస్టులు (రంగు మార్చకుండా దిక్కు మార్చిన సంజకెంజాయ పార్టీ), అప్పటికే అడుగు జారిన అరసం (అప్పటికి 15 ఏళ్లుగా మహాసభ జరుపుకోని సాహిత్య సంస్థ), సినీ, మనీ మాయల మారులు (కాసుకి దాసోహం చేసే కళాకారులు) కలిసికట్టుగా కుట్ర చేశారు. శ్రీశ్రీని తమ వలలో చిక్కించుకోవాలని శతవిధాలా ప్రయత్నం చేసి విఫలమనోరథులయ్యారు. ఈ సర్కారీ జంతర్‌మంతర్ కుట్రని బహిర్గతం చేసి, శ్రీశ్రీ అధ్యక్షతన విరసం ఏర్పడింది. 'ద్రౌపది అగ్నిలో పుట్టడం భారతం రాసిన వ్యాసుల వారైనా చూశారో లేదో గాని విప్లవాగ్నులలో విరసం పుట్టడం నేను కళ్లారా చూశాన'ని శ్రీశ్రీ అన్నాడు. భారత రాష్ట్రపతి కన్నా విరసం అధ్యక్ష పదవే గొప్పదన్నాడు. అక్కడితో ఆగకుండా 'విరసం నా శాశ్వత చిరునామా' అని కూడా చివర్లో అన్నాడు. శ్రీశ్రీ మాటలు కొందరికి పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టు అయింది. చేదు విషం మింగుతూనే ఉన్నారు - కక్కలేక. కాని శ్రీశ్రీ ఆనాటి నుంచి 'రక్తంతో రాగాలాపన చేయాల'ని 'మంటలతో మాట్లాడిస్తూనే' ఉన్నాడు. చరిత్రలో ఏ పరిణామమయినా రెండుసార్లు జరుగుతుంది. మొదటిసారి విషాదంగా, రెండవసారి హాస్యంగా. అలాగే శ్రీశ్రీని వలలో వేసుకుని తమ పబ్బం గడుపుకోవాలని మళ్లీ ఇవాళ కొన్ని కార్పొరేట్ సంస్థలు ఇదే రోజున రాష్ట్ర రాజధానిలో ప్రయత్నించి అపహాస్యం పాలయ్యాయి.

న్యాయంగా శ్రీశ్రీ శతజయంతి ఉత్సవాలని జనవరి 2, 3 తేదీల్లో ఈ సాగర తీరాన జరపాలని విరసం 18 నెలల క్రితమే అనుకుంది. అయితే చిదంబరం గారి చిందరవందర పనుల వలన తెలంగాణ మళ్లీ రాజుకుంది. ఇతరప్రాంతాల నుంచి వచ్చే వారందరి సౌకర్యం కోసం ఈ సభలను మేము ఈ ఏప్రిల్ 30, మేడేలకి వాయిదా వేసుకోవలసి వచ్చింది. ఎండలు మెండుగా ఉన్నాగాని, సరిగ్గా శ్రీశ్రీ నూరో పుట్టిన రోజునే జరుపుకోవడంలో చిక్కటి పొయటిక్ జస్టిస్ ఉంది. అందుకు మనందరం సంతోషిస్తున్నాం.

చిన్ననాటి నుంచీ చెలిమి శ్రీశ్రీ బలిమి. కలుపుగోలుతనం శ్రీశ్రీ కలిమి. "వ్యక్తికి వింజామరలు విసరలేను. సమూహం నా సరదా" అన్నాడందుకే. శ్రీశ్రీ విశాఖపట్నంలో 20 ఏళ్లు, హైదరాబాద్, లక్నో, ఢిల్లీలలో కలిపి 3 ఏళ్లు, చెన్నపట్టణంలో 50 ఏళ్లు ఉన్నాడు. అక్కడే తన 73వ ఏట సూర్యాస్తమయం వేళ (జూన్ 15, 1983) చనిపోయాడు. సూర్యుడు అస్తమిస్తే అతని కాంతి మాయమవుతుంది. కాని కవి అస్తమిస్తే అతని కాంతి తరగదు; పైగా పెరుగుతుంది. అందుకే జాషువా అన్నాడు:

*రాజు మరణించె నొక తార రాలిపోయె*
*సుకవియు మరణించె నొక తార గగనమెక్కె*
*రాజు జీవించె రాతి విగ్రహములందు*
*సుకవి జీవించె ప్రజల నాలుకలయందు*

అక్షరాలా సత్యం.

శ్రీశ్రీ అనగానే ఎవరికయినా సరే ముందుగా మహాప్రస్థానం గుర్తుకొస్తుంది. ఇది సహజం, కాదనను. కాని శ్రీశ్రీ మహాప్రస్థానంతో ఆగిపోలేదు. ఇంకా ఇంకా ముందుకి సాగిపోయాడు. పైగా కలంతో పాటు ఖడ్గం చేతబట్టి

*మంటల చేత మాట్లాడించి*
*రక్తం చేత రాగాలాపన చేయిస్తాను*

అని 1970లోనే బాహాటంగా రాశాడు. శ్రీశ్రీ సహజ కవచ కుండలాలతో పుట్టలేదు. శ్రీశ్రీకి ముందూ, శ్రీశ్రీకి తరువాత అంతా శూన్యం అనే మాట మనం ఒప్పుకోం. ఎందుకంటే 'నిన్నటి నుంచే నేడు పుట్టినట్టు' 'నిన్నటి కవుల నుంచీ నేటి కవులు పుడతారు'. పైగా 1930 దాకా తెలుగు కవిత్వం నన్ను నడిపిస్తే ఆ తరవాత తెలుగు కవిత్వాన్ని నేను నడిపించాను అని సగర్వంగా చెప్పుకున్నాడు. అంతటితో ఆగకుండా తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు ఈ శతాబ్దం నాది అన్నాడు శ్రీశ్రీ. ఎంత ఆత్మవిశ్వాసం! మరెంత సాహసం! ఇది సామాన్యం కాదు, అన్ని విధాలా అసామాన్యం.

సామాజిక వాస్తవికతని చాలా లోతుగా గ్రహించాడు శ్రీశ్రీ. అంతరాల దొంతరలని ఆకళింపు చేసుకున్నాడు. ప్రపంచ పరిణామాలని పసిగట్టాడు. తాను ఎటువైపుండాలో నిర్ణయించుకున్నాడు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య మరో ప్రపంచాన్ని

నిలువుటద్దంలో చూశాడు. వీటన్నింటినీ అక్షరబద్ధం చేయడానికే తాను కవిత్వం రాశాడు. వేమన, గురజాడ తన మార్గదర్శకులు. అయితే ఈ మార్పు శ్రీశ్రీలో 1930 తరువాత మాత్రమే పొటమరించింది. తనే స్వయంగా చెప్పుకున్నాడు - తనకి 1930 దాకా కవులంటే రాయప్రోలు, విశ్వనాథ, వేదుల, నాయని, కృష్ణశాస్త్రి అంతే. 'మనుచరిత్ర చదివితే చాలదూ? మహాభారతం ఎందుకు?' అనుకున్నాడు. గురజాడ కవిగా ఆయన దృష్టిలో లేనే లేడు. అటు తరువాత కవికొండల వెంకటరావు, బసవరాజు అప్పారావు, చింతా దీక్షితులు, నండూరి సుబ్బారావుల ద్వారా తాను గురజాడ దగ్గరకి చేరగలిగాడు.

కాలకంఠుని నాగసర్పము
కుబుసమూడ్చి పడగ బుస్సంది
రెండు నాల్కలు
గండుమీసాలట్లు దూసింది
... ... ...
కమ్మరయితే ఇనుము కరగ
సోమరయితే చలిని కాగ
ఎవరు వచ్చేరోయి?
ఎవరు మెచ్చేరోయి?
కారు నల్లని కాళరాత్రి

-కవికొండల వెంకటరావు

ధగధగ మెరిసే కాంతిని చల్లే
కళ్లు నెమలికెవరిచ్చారో?
పురి విప్పుతు అది నాట్యమాడగా
తాండవ కృష్ణుడు జ్ఞప్తికి రాడా?

- చింతా దీక్షితులు

నన్నెవరాపలేరీ వేళా
నాథాటి కోపలేరీవేళా
... ... ...
పండితులు దారెత్తి
పరుగెత్తి పోవాలి

- బసవరాజు అప్పారావు

ఎన్నెలంతా మేసి ఏరు నెమరేసింది
ఏటి కడుపున దాగి తోటి నిదరోయింది

- నండూరి

అంటూ పాటలు మారుమోగాయి. వీటన్నింటి ప్రభావం శ్రీశ్రీ మీద ఉంది. అంతేగాదు "అనామధేయ కవులకి అభివాదాలు సమర్పించాను. పాటకపు జనుల పాటలతో ప్రాణవాయువులు పీల్చుకున్నాను. జవిక మీద పాడిన జంగం కథలు విన్నాను." క్లాసికల్ ఛందస్సులని విడనాడి జనజీవనంలోని చేవని స్వాయత్తం చేసుకున్నాడు.

కవితా వస్తువుని సమూలంగా మార్చేసినవాడు శ్రీశ్రీ. అలానే జనజీవితంలోని కవితారూపాలని కూడా ఆవాహన చేసుకున్నాడు. కనకనే అతని మహాప్రస్థానం విప్లవానికి, కమ్యూనిజానికి చూపుడు వేలుగా సాగింది.

" 'మహాప్రస్థానం'లో అభ్యుదయ కవిత్వమూ, విప్లవ బీజాలూ ఉన్నాయి. విప్లవ సాహిత్యం లేదు. 'విప్లవ సాహిత్యం' అంటే ఏమిటి? సామాన్య ప్రజానీకాన్ని విప్లవాచరణ కుద్యుక్తుల్ని చేసే విధంగా సాగేది."

- లండన్ 'మహాప్రస్థానం' సంపుటం, 1980

" 'మహాప్రస్థానం' రోగనిదానమే చేస్తుంది గానీ రోగానికి వైద్యం చేయదు. 'మరోప్రస్థాన' మేమో రోగాన్ని పోగొట్టడానికి కొంచెం మార్గం కూడా చెబుతుంది."

- ఆర్.వి.ఎస్. సుందరానికిచ్చిన ఇంటర్వ్యూ, 3-5-1983

శ్రీశ్రీ సామాజిక చైతన్యాన్నీ, కవితా శక్తి సామర్థ్యాలనీ వేనోళ్ల కొనియాడిన రావిశాస్త్రి "భారతజాతికీ, ప్రపంచ సాహిత్యానికీ ఈతడు తెలుగువారిచ్చిన వెలుగు కానుక. తెలుగు భాష ఉన్నంత కాలం ఈయన ఉంటారు... రాజకీయపరంగా లెనిన్ మహాశయుడు, మావో మహాశయుడు మార్క్సిజానికి ఏ విధంగా సేవ చేశారో సాహిత్యపరంగా శ్రీశ్రీ అంత సేవ చేశారు" అని కూడా అన్నారు. కొసమెరుపు శ్రీశ్రీ కవిత్వ లాలసుడి ఆలాపనతో నేను సెలవు తీసుకుంటాను. "నింగీ, నేలా, నిప్పు, నీరూ ఉన్నంతకాలం, ఆకలీ, శోకాలూ చెలరేగుతున్నంత కాలం గుండెగొంతుకల్లోంచి దూసుకు వస్తూ, గుర్తుకొస్తూనే ఉంటాయి - శ్రీశ్రీ అనే చిరస్మరణీయ అక్షరాలు." అ

**సవరణ :**

అక్టోబర్ - డిసెంబర్ 2009 సంచికలో 'పౌరహక్కుల పోరాట యోధుడు' అనే శీర్షికన నేను రాసిన వ్యాసంలో అచ్చులో కొన్ని తప్పులు దొర్లాయి. నేను రాయని పదాలు, వాక్యాలు కొన్ని చేరాయి. రాసిన వాక్యంలో కొంత భాగం అచ్చుకాలేదు. దీన్ని పాఠకుల దృష్టికి తేవడం అవసరం అని భావిస్తున్నాను.

40వ పేజీ మొదటికాలమ్‌లో మూడవ పేరా 2వ లైన్ 'ఆజాద్ భారత కమ్యూనిస్టు పార్టీ' అనే వాక్యం నేను రాయలేదు. 41వ పేజీ మొదటికాలమ్ 29వ లైన్లో 'నేను కొన్ని వ్యాసాలు రాశాను' అనే మాట ముందు 'అయితే, బాలగోపాల్ ఆయా సందర్భాల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలను విభేదిస్తూ...' అని నేను రాసిన మాటలు అచ్చుకాలేదు. ఈ మాటలు కలుపుకొని ఆ వాక్యాలు చదువుకోవాలని పాఠకులకు మనవి.

- సారథి

జనవరి-మార్చ్ 2010 సంచికలో 'గ్రీన్‌హంట్ ఆపరేషన్ - మావోయిస్టు సామాజిక ప్రయోగంపై దాడి' అనే నా వ్యాసంలో ఒక పదం అచ్చు కాలేదు. 87వ పేజీలో 5వ పేరా 6వ లైన్లో 'ఆదివాసులకు సంబంధించినంత వరకు పరాయిది' అని ఉన్నది. అక్కడ 'పరాయిది కాదు' అని ఉండాలి.

- పాణి

ప్రసంగ పాఠం

ఈ క్షణానికి చెందని కవిత్వం ఏ క్షణానికి చెందదన్న స్ఫూర్తిని కలిగించే

# శ్రీశ్రీ మరో ప్రస్థానం

- వి. చెంచయ్య

1980 ప్రాంతాల్లో తెనాలిలో జరిగిన గుంటూరు జిల్లా విరసం సభల్లో ప్రారంభోపన్యాసం ఇస్తూ కె.వి.ఆర్. ఒక పిట్ట కథ చెప్పాడు. నిజానికది పిట్ట కథ కాదు. నిజంగా జరిగిన ఒక సన్నివేశం. కె.వి.ఆర్., చలసాని ప్రసాద్‌లు ఒకసారి లారీలో ప్రయాణం చెయ్యాల్సి వచ్చింది. కె.వి.ఆర్.కు లారీ ప్రయాణం అంటే భయం. డ్రైవర్ నిద్రమత్తులో ఉండి యాక్సిడెంట్ చేస్తాడేమోనని. అందుకని కె.వి.ఆర్. నిద్రపోకుండా మేలుకొనే డ్రైవర్‌ను గమనిస్తున్నాడు. పక్కనే చలసాని ప్రసాద్ అలాంటి భయాలేవీ లేకుండా హాయిగా నిద్రపోతున్నాడు. మధ్యలో మేలుకున్నప్పుడు కె.వి.ఆర్. వీపు తడుతున్నాడు నిద్రపోకూడదని హెచ్చరిస్తున్నట్టుగా. చలసాని ప్రసాద్ తాను నిద్రపోతూ, మేలుకొని ఉన్న కె.వి.ఆర్.ను నిద్రలేపుతున్నాడన్నమాట. ఈ సన్నివేశాన్ని కె.వి.ఆర్. తన ఉపన్యాసంలో అద్భుతంగా ఉపయోగించుకున్నాడు. కొంతమంది రచయితలు తాము నిద్రపోతూ, మేలుకొని ఉన్న రచయితల్ని నిద్రలేపుతుంటారని చెప్పదల్చుకున్న సందర్భం అది. సరిగ్గా ఇలాంటి సందర్భం శ్రీశ్రీ జీవితంలో, విరసం పుట్టుక నేపథ్యంలో మరో ప్రస్థానం మొదలుపెట్టిన సమయంలో ఒకటుంది.

1967లో ప్రారంభమైన నక్సల్బరీ పోరాటంతో, ఆ వెంటనే రాజుకున్న శ్రీకాకుళ పోరాటంలో సి.పి.ఐ. (ఎం) నయా రివిజనిజం నుండి బయటపడి విప్లవకారులు సి.పి.ఐ. (ఎం.ఎల్.) పార్టీగా ఏర్పడ్డారు. చారు మజుందార్ నాయకత్వంలో ఆయుధం మరోసారి అ ఆ లు నేర్చుకుంది. 1965లో నడక ప్రారంభించిన దిగంబర కవులు 1968 నాటికి ఆ ఉద్యమం వైపు చూడసాగారు. ఆ ఉద్యమంలో అడుగులేస్తూ నడుస్తున్నవారు తిరుగబడు కవులు. 1970 జనవరిలో వీరి కవితా సంకలనం వెలువడింది. తెలుగు కవిత్వంలో వస్తున్న ఈ మార్పును శ్రీశ్రీ గమనించడమే కాదు, ఆహ్వానించాడు కూడా. దిగంబర కవులు పెటీ బూర్జువా కవులన్న ఆరుద్రకూ, దిగంబర కవులు చెప్పినంతగా సమాజం నిజంగా చెడిపోయిందా అని ఆశ్చర్యపడ్డ రాచమల్లు రామచంద్రారెడ్డికీ ఘాటుగా సమాధానం చెప్పాడు శ్రీశ్రీ.

ఈనాడు రాస్తున్నది దిగంబర కవులూ, తిరుగబడు కవులూ, సంఘర్షణ కవులూ అనీ, చేతనైతే వాళ్లకు చేయూత నివ్వండి, లేకపోతే నోరు ముయ్యండి అని అనడానికి కూడా శ్రీశ్రీ సాహసించారు. కళ్లజోడు మార్చుమని కొందరు వెటకారంతో సలహా ఇచ్చారు. కళ్ల జోడున్నందువల్లనే సరిగ్గా చూడగలుగుతున్నానన్నాడు శ్రీశ్రీ.. రాజకీయ దృక్పథం సరిగా లేనివాడు సాహిత్యంలో రాణించలేని స్థితి వచ్చిందన్న విషయాన్ని స్పష్టం చేశాడు. 1970 ఫిబ్రవరిలో విశాఖలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో 'రచయితలారా మీరెటువైపు?' అన్న విశాఖ విద్యార్థుల కరపత్రంలో రచయితలందరూ విప్లవాన్ని ఆహ్వానించే వాళ్లూ, దాన్ని వ్యతిరేకించే వాళ్లూ అని రెండు వర్గాలయ్యారు. శ్రీశ్రీ విప్లవాన్ని ఆహ్వానించాడు. 1970 ఏప్రిల్ 2న విశాలాంధ్ర వారపత్రికలో వచ్చిన 'దిగంబర వెల్లువ' అనే వ్యాసంలో శ్రీశ్రీ కత్తిద్వారానే కమ్యూనిజం వస్తుందన్నాడు. అదే సంవత్సరం ఉగాది నాడు ఆకాశవాణిలో వినిపించిన కవితలో

"సచేతనంగా యువతరం సంస్పందిస్తోంది
ఆరోగ్యకరమైన ఆహారం అందిస్తోంది
తిరుగుబాటు గాలులు పీలుస్తూ పెరుగుతోంది
నిరాడంబరంగా దిగంబరంగా తిరుగుతోంది"

అని సమకాలీన కవిత్వంలో ప్రతిబింబించిన చైతన్యాన్ని సరిగ్గానే అర్థం చేసుకున్నాడు. అది 'సాధారణ' ఉగాది. సాధారణలే అసాధారణలవుతారని చమత్కరించాడు. ఈ కవిత 22.4.1970 'వాణి' పత్రికలోనూ, అదే తేదిన ఆంధ్రప్రభ వార పత్రికలోనూ అచ్చయింది. 1970లోనే అమెరికా కంబోడియాపై దాడి చేసినపుడు "అరేయ్! అమెరికన్ సామ్రాజ్యవాదీ! దూర్ హటో ఇండో చైనాసే!" అనే కవిత రాశాడు. ఈ కవితను మొదట విశాలాంధ్ర వారపత్రికకు పంపితే అది అచ్చు వెయ్యలేదు. అప్పటికి శ్రీశ్రీ అంటే ఏమిటో విశాలాంధ్రకు అర్థమైనట్టుంది. తమకున్న రివిజనిస్టు దృక్పథంతో శ్రీశ్రీ లేడని విశాలాంధ్ర సరిగ్గానే అర్థం చేసుకున్నది. శ్రీశ్రీ మహాప్రస్థానంతో ఆగలేదనీ, మరో ప్రస్థానం ప్రారంభించాడనీ తెలుసుకున్నది. శ్రీశ్రీలో వస్తున్న ఈ మార్పుని చూసి, మేలుకొని ఉన్న శ్రీశ్రీని నిద్రబుచ్చడానికి అప్పటికప్పుడు కొందరు అభ్యుదయ రచయితలు మేలుకున్నారు. కె.వి.ఆర్. చెప్పిన పిట్టకథ ఇక్కడ అన్వయిస్తుంది. ఆ కథలో చలసానిది శారీరక నిద్ర అయితే అభ్యుదయ రచయితలది మానసిక నిద్ర.

1970 జూలై 4,5 తేదీలలో హైదరాబాద్‌లో ఒక సాహిత్య సదస్సు ఏర్పాటు చేసి, సదస్సు అనంతరం శ్రీశ్రీని సన్మానించి, పదివేల రూపాయల పర్సు ఇవ్వాలని నిర్ణయించారు. ఈ కార్యక్రమంతో అభ్యుదయ రచయితలు సెవెన్ స్టార్స్ సిండికేట్ అనే సినిమా సంస్థ సహకారాన్నీ, ప్రభుత్వ అండదండల్నీ ఆసరా చేసుకున్నారు. ఆ సభకు అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్య అతిథి. ఈ వ్యవహారాన్నంతా గమనించిన శ్రీశ్రీ ఆ సదస్సునీ, సన్మానాన్నీ తిరస్కరించాడు. శ్రీకాకుళ పోరాటంలో విప్లవకారుల్ని చంపుతున్న ప్రభుత్వంతో చేతులు కలిపిన అభ్యుదయ రచయితల్లో అభ్యుదయం నామమాత్రం అయిపోయిందని శ్రీశ్రీ గుర్తించాడు. ఆ సదస్సును బహిష్కరించిన శ్రీశ్రీ అదే రోజు ఏర్పడిన విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షుడైనాడు. ఇవాళ అన్ని భాషా నిఘంటువులలోకి 'నక్సలైట్' అనే పదం వచ్చి చేరిందనీ, పదిమందిని, వందమందిని, లక్షమందిని ఆ పేరుతో చంపినా, నక్సలైట్ అనే పదాన్ని తుడిచిపెట్టలేరనే అన్నాడు. విప్లవ రాజకీయాలు మహాప్రస్థాన కవిని మరో ప్రస్థాన కవిగా ముందుకు నడిపించాయి.

1960 ప్రాంతాల్లో విడుదలైన 'మహాదేవి' అనే సినిమాకి పాటలు, మాటలు శ్రీశ్రీ రాశాడు. సినిమా పోస్టర్‌లో శ్రీశ్రీ పేరు పక్కన 'రామభక్త హనుమాన్ ఫేం' అని ఉంది. మరో ప్రపంచ కవి రామభక్త హనుమాన్

షేమా! అని ఆశ్చర్యపడిన ఉస్మానియా యూనివర్సిటీలో విద్యార్థిగా ఉన్న చేకూరి రామారావు స్వతంత్ర పత్రికకు ఒక కవిత పంపాడు. సినిమాల చిట్టడవుల్లో చిక్కుకున్న మహాకవిని మళ్లీ కలం ఝుళిపించి మరో ప్రస్థానం చేయించమన్నాడు ఆ కవితలో. వరంగల్ కాలేజీ విద్యార్థిగా ఉన్న వరవరరావు అదే పత్రికలో రాసిన వ్యాసంలో ఎల్లకాలం శ్రీశ్రీయే రాయాలా, మనం రాయకూడదా అని ప్రశ్నించాడు. 1970 నాటికి వీళ్లిద్దరి కోరికలూ తీరాయి. నరుడో భాస్కరుడా పాట ద్వారా విప్లవ కవిత్వానికి శివసాగర్ మార్గాన్ని నిర్దేశిస్తే, ఆ మార్గంలో ముందు వెళ్లారు చెరబండరాజు, గద్దర్, వంగపండు మొదలైన కవులు. ఆ పద్ధతిలోనే శ్రీశ్రీ కూడా రాయడానికి ప్రయత్నించాడు. మొత్తం మీద శ్రీశ్రీ మరో ప్రస్థానానికి సాహిత్య, రాజకీయ నేపథ్యం చాలానే ఉంది. ఆ నేపథ్యంలో శ్రీశ్రీ అలా విప్లవ సాహిత్యోద్యమంలో ఇమిడి పోవడమే ఆయన గొప్పదనం.

1975 దాకా శ్రీశ్రీ విరసానికే కాదు, పౌరహక్కుల సంఘానికి కూడా అధ్యక్షుడే. ఈ బాధ్యతల్లో భాగంగా శ్రీశ్రీ ప్రజల్లోకి వచ్చాడు. ప్రజలతో తిరిగాడు. ప్రజా ఉద్యమాలలో భాగస్వామి అయ్యాడు. మహాప్రస్థానంతో యువతను ఉర్రూతలూగించాడు. మరో ప్రస్థానంలో యువత శ్రీశ్రీని నడిపించింది. మహా ప్రస్థానం చదివి చాలామంది కమ్యూనిస్టులయ్యారంటారు. విప్లవోత్తేజంతో ఉన్న యువతను చూసి శ్రీశ్రీ కమ్యూనిస్టుగా మిగిలాడు, కమ్యూనిస్టుగా కొనసాగాడు. మహాప్రస్థానం నాటికి మరో ప్రపంచాన్ని కలగన్నాడు. మరో ప్రస్థానంలో ఆ కలను నిజం చేసుకోగల విశ్వాసాన్ని ప్రకటించాడు. అందులో విప్లవ అవసరాన్ని గుర్తిస్తే, ఇందులో విప్లవ మార్గాన్ని నిర్దేశించాడు. 1930లలో విప్లవాన్ని ఆహ్వానించాడు. 1970లలో విప్లవాన్ని రికార్డు చేశాడు. అది అనిర్దిష్ట కవిత్వం అయితే, ఇది నిర్దిష్ట కవిత్వం. అందులో పండిత భాషకు దగ్గరగా ఉన్న శిష్టవ్యావహారికాన్ని వాడితే, ఇందులో ప్రజల భాషను ప్రాంతీయ యాసలో కూడా వాడాడు.

విరసం ఏర్పడ్డాక కొద్దిరోజుల్లోనే ఝంఝ, నిన్నటి జట్కావాలా కవితలు రాసి శ్రీశ్రీ విప్లవ కవితా ప్రస్థానం కొనసాగించాడు. ఈ రెండు కవితల్నీ 1970 ఆగస్ట్, సెప్టెంబర్‌లలో రాశాడు. 'ఝంఝ'లో పాత, కొత్త విలువల మధ్యగల వైరుధ్యాన్నీ, ఘర్షణనీ చిత్రించాడు. చివరకు -

"మంటల చేత మాట్లాడించి
రక్తం చేత రాగాలాపన చేయిస్తాను"

అన్నాడు. ఈ మాటలతో విప్లవాన్ని స్పష్టంగా సూచించాడు. ఈ పద ప్రయోగాలు కూడా కొత్తవే. శ్రీశ్రీ ఎప్పుడూ ఎవరినీ అనుకరించ లేదు. తనను తాను కూడా అనుకరించుకోలేదు. మహాప్రస్థాన పద ప్రయోగాలకూ, మరో ప్రస్థాన పద ప్రయోగాలకూ స్పష్టమైన తేడా ఉంది. 'మరో ప్రస్థానం' కవితలో

"యిప్లవం యాడుందిరా
ఆడనే నీ కూడుందిరా నీ గూడుందిరా
గోడు గోడున యేడ్తావుంటే
యాడు నీవొంక రాడింకరా"

అని సామాన్య ప్రజల భాషను వారి యాసలోనే ఉపయోగించాడు. ప్రజల బాధల్ని చూసి సానుభూతి ప్రదర్శించడం, దయ, జాలి చూపించడం విప్లవం కాదనీ, తెగించి పోరాడడమే విప్లవమనీ మామూలు మాటల్లో చెప్పాడు.

"యిప్లవం యేమందిరా
మనిషికొకటే సావందిరా
కట్లు తెంచుక రమ్మందిరా
కత్తి దూసుక లెమ్మందిరా"

అని విప్లవ కార్యాచరణను స్ఫురింపజేశాడు. మనిషికొక్కసారే వచ్చే చావును అర్థవంతం చేసుకోమన్నాడు.

"మరోప్రస్థానం" సంకలనంలో అందర్నీ ఆకర్షించే, ఉత్తేజపరిచే కవితలు ఎన్నో ఉన్నాయి. కాని 'నిన్నటి జట్కావాలా' కవిత ఒక్కటీ ఒకెత్తు. విషయపరంగానీ, భాషాపరంగానీ, అప్రోచ్‌పరంగానీ అదొక విలక్షణమైన కవిత. అది శ్రీశ్రీలో మరో కొత్త శ్రీశ్రీని చూపిస్తుంది.

"తాను సాలీసాలని గడ్డి తిని
నాకు రోజా వణ్ణం యెట్టేదండి నా గుర్రం
రెండ్రోజుల్నించీ ఆ గడ్డి కూడా తిన్లేదు
నిన్న సచ్చిపోనాది
కవిగోరూ
యినండి నా గోడు"

ఒక జట్కావాలా తన కథను తానే కవికి చెప్పుకుంటున్నాడు. దానికి కడుపు నిండా గడ్డిపెట్టే స్థితికూడా అతనికి లేదు. కానీ తనకు మాత్రం అది తిండి పెడుతున్నది. ఆ గుర్రానికి తాను యజమాని. కానీ యజమానిలా ప్రవర్తించడం లేదతను. తనను పోషిస్తున్నన్న ఆ గుర్రాన్ని తాను పోషించలేక పోతున్నానన్న బాధ అతన్ని పీడిస్తోంది. దానికి రోగం వస్తే ఇంట్లో ఉన్న వస్తువులు అమ్మి, కొంత డబ్బు పోగు చేసుకుని డాక్టర్ దగ్గరకు వెళితే

"నాబంనేదు బతకదన్నాడు
అన్న పెకారం అది బతకనేదు
మా సత్తెమైన మనిసి'

డాక్టర్ సత్యం చెప్పడం కాదు ఇక్కడ ముఖ్యమైన విషయం. ఒక పెద్ద విషాదాన్ని మామూలుగా చెప్పడం ఒక వైరుధ్యం. ఇలాంటి వైరుధ్యాన్ని చిత్రించే పద్ధతి శ్రీశ్రీ 'రసన' అని పేరుపెట్టి ఒక సిద్ధాంతం చెయ్యడానికి ప్రయత్నించాడు. చార్లీ చాప్లిన్ సినిమాల్లో, గురజాడ కన్యాశుల్కం నాటకంలో ఈ ధోరణి ఉంటుంది.

మూడేళ్ల కొడుకు చనిపోయినప్పుడూ, తన భార్య ఎవరితోనో లేచిపోయినప్పుడూ కూడా ఆ జట్కావాలా ఇంతగా బాధపడలేదు. ఏడ్చాడు, ఎక్కడెక్కడో తిరిగాడు. చావాలనుకున్నాడు. వెంటనే

"నే సవ్వకూడదు
సచ్చి సాదించేదేటి
ఏది సేసినా బతికున్నప్పుడే సెయ్యాల"

అనుకున్నాడు. తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు. అయితే ఎవర్ని సాధించాలి? దేన్ని సాధించాలి? ఎలా సాధించాలి? ఎందుకు సాధించాలి? ఈ ప్రశ్నలన్నిటికీ జట్కావాలాకు సమాధానం దొరికింది.

"అప్పుడనిపించింది నాకు
సికాకులం యెల్లిపోవాలని"

అన్ని సమస్యలకూ శ్రీకాకుళ పోరాటం పరిష్కార మార్గమని ఆ ఒక్క జట్కావాలానే కాదు, శ్రామికవర్గానికి అనిపించాలని కవి ఉద్దేశం.

"యెల్లమంటావా వద్దంటావా
నువ్వెల్లమన్నా వద్దన్నా నేనెల్లక మాననులే"

అనే మాటలతో కవిత ముగుస్తుంది.

నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలతోనే భారతదేశంలో విప్లవ

పోరాటం మొదలైంది. ఇది ఎప్పుడైనా తాత్కాలికంగా వెనుకపట్టు పట్టొచ్చు గాని, ఆగిపోదు, ఓడిపోదు. గతంలో ఐదేళ్లపాటు సాగిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం ఆగిపోయింది. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వమే ఆ పోరాటాన్ని ఆపేసింది. నక్సల్బరీ శ్రీకాకుళాలు మొదలైం తర్వాత పోరాటాన్ని ఎప్పుడూ ఆపలేదు. తాత్కాలికంగా ఓటములుండొచ్చు. మళ్లీ రాజుకుంటూనే ఉంది. 1951లో తెలంగాణ పోరాటాన్ని పార్టీ నాయకత్వం ఆపేసింది కాబట్టి అది ఆనాటి అభ్యుదయ రచయితలకూ, ప్రజా నాట్యమండలి కళాకారులకూ ఆ తర్వాత స్ఫూర్తినివ్వలేక పోయింది. 1970 జూలై 10 న ఆదిభట్ల కైలాసం, వెంపటాపు సత్యాల ఎన్‌కౌంటర్లతో శ్రీకాకుళ పోరాటం తాత్కాలిక ఓటమికి గురయినా, అది విప్లవ రచయితలకూ, జన నాట్యమండలి కళాకారులకూ విప్లవ స్ఫూర్తినిచ్చింది. ఎందుకంటే ఇక్కడ విప్లవ పార్టీ నాయకత్వం త్యాగాలు చేసింది గాని, రాజీపడలేదు.

నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలకు దారిచూపినవాడు చారుమజుందార్. చారుమజుందార్‌పైన ఎందరు ఎన్ని విమర్శలు చేసినా, ఇది పచ్చి నిజం. చారుమజుందార్ పశ్చిమ బెంగాల్ సిలిగురిలో రైతాంగ ఉద్యమాన్ని నిర్మించారు. కానూ సన్యాల్‌తో కలిసి నక్సల్బరీ పోరాటానికి నాయకత్వం వహించారు. 1969 ఏప్రిల్ 22న లెనిన్ జయంతి రోజు సిపిఐ (ఎం.ఎల్.) పార్టీని ఏర్పాటు చేసి కలకత్తాలో మేడే నాడు ప్రకటించాడు. సిద్ధాంతకర్త, ఆచరణశీలి. కలకత్తాలో అరెస్టయి పోలీస్ లాకప్‌లో 1972 జూలై 28న చనిపోయాడు. సరిగ్గా చారు మజుందార్ చనిపోయిన సంవత్సరానికి ప్రథమ వర్ధంతి సందర్భంగా 1973 జూలై 26న 'చావులేని చారుశీలికి' అనే కవితను శ్రీశ్రీ రాశాడు.

*"విద్యుత్తులు ప్రవహించే నీ నరాల్తో*
*విప్లవం శాలువ అల్లినవాడా*
*తెల్ల భయానికెదురుగుండా*
*ఎర్ర బీభత్సం జల్లినవాడా*
*- - - - -*
*ఆలోచలన్నీ ఘాటెక్కించి*
*ఆచరణగా మార్పించిన వాడా*
*అన్యాయాల్ని బోనెక్కించి*
*ఆయుధానికి ఆ ఆలు నేర్పించినవాడా"*

ఇందులో ప్రతి మాటా సార్థకమైనదే. కవిత్వపు విలువలు లేదా కవితా శిల్పం విషయాన్ని పాఠకుల చెవికెక్కించడానికే అనుకుంటే ఈ కవిత అందుకు మంచి ఉదాహరణ. కవితా శిల్పం ఉన్నట్టు కనబడకుండా ఆలోచింపజెయ్యడమే నిజమైన కవితా శిల్పం. ఈ శిల్పాన్ని శ్రీశ్రీ మరోప్రస్థానం కవితలలో సాధించాడు. మహాప్రస్థానంలోని శబ్దశక్తి వ్యతిరేక భావాలు గల వాళ్లను కూడా ఆకట్టుకుంది. అటువంటి శబ్దశక్తిని ఇందులో కొంతవరకు కనబరిచినా, శ్రుతి మించకపోవడంతో దానికే ప్రాధాన్యం ఇచ్చేవాళ్లు మరో ప్రస్థానాన్ని తక్కువగా అంచనా వేస్తారు. శబ్దశక్తిపై ఉండే మోజుకు, అటువంటి పాండిత్యానికి మరోప్రస్థానంలో చాలావరకు స్వస్తి చెప్పడం పోరాట స్ఫూర్తితో నిర్దిష్టంగా ఉద్యమాన్ని రికార్డు చెయ్యడానికే. శబ్దశక్తి అనేది కవితా శిల్పంలో ఒక అంశం మాత్రమే. అది లేకుండా కూడా భావాలకు తగిన పదప్రయోగం చేసి మంచి కవిత్వం రాయొచ్చు.

1975 ఎమర్జెన్సీ నిశ్శబ్ద వాతావరణంలో గుట్టు చప్పుడు కాకుండా కాంగ్రెస్ ప్రభుత్వం ఉరితీసిన భూమయ్యా, కిష్టాగౌడ్‌ల విషాద సంఘటన శ్రీశ్రీని బాగా కలచివేసింది. వారి ఉరిశిక్షను రద్దు చెయ్యమని జరిగిన ఉద్యమానికి శ్రీశ్రీ నాయకత్వం వహించాడు. ఈ ఉద్యమం దేశవ్యాప్తంగా విస్తరించడమే గాక, అంతర్జాతీయ దృష్టినీ ఆకర్షించింది. అందువల్ల ప్రభుత్వం ఉరిశిక్ష అమలును రెండుసార్లు వాయిదా వేసుకోవలసి వచ్చింది. చివరకు ఎమర్జెన్సీలో అందరి నోళ్లు నొక్కి, స్వేచ్ఛకు సంకెళ్లు వేసి, 1975 డిసెంబర్ 1న ఉరితీశారు. డిసెంబర్ 3నే శ్రీశ్రీ 'భూమ్యాకాశాలు' అనే పేరుతో కవిత రాశాడు. అదిలాబాద్ జిల్లా గిన్నెబరి భూస్వామిని హత్య చేశారని వీరిపై ఆరోపణ. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కాలం నుండి వీరిద్దరూ కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. నక్సల్బరీ ఉత్తేజంతో ఎం.ఎల్. పార్టీలో సభ్యులయ్యారు. వాళ్లను ఉరితీసినప్పుడు శ్రీశ్రీ ఆగ్రహంతో, ఆవేదనతో రాసిన కవిత ఇది.

*"బతికే అర్హత లేని పందుల్నీ పందుల్నీ*
*చంపడమే వాళ్లు చేసిన నేరం*
*చీకటిని పిడికిళ్లతో పిండి*
*చెడుగును చీల్చి చెండాడారు*
*- - - - -*
*రోజెన్‌బర్గ్ దంపతుల్లాగా*
*వాళ్లు మేధావులు కారు*
*శాకోవాంజెట్టీ ల్లాగా*
*మెతకమనుషులు కారు*
*వాళ్లిద్దరూ ఒకడు భూమి*
*రెండోవాడు ఆకాశం"*

ఈ సమాజంలో హింస, ప్రతిహింసలు ఉంటూనే ఉన్నాయి. ఆనాడూ, ఈనాడూ అహింస అన్నది ఒక ఆదర్శమే గాని లక్ష్యసాధనకు మార్గం కాదు. ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజ్యాంగం బతికే అర్హత లేనివాళ్లను చంపడం కూడా నేరమే. దుర్మార్గుల్నీ నిరుపేదలో, ఉద్యమకారులో చంపడం అనేది ప్రభుత్వం శిక్షవేసి చంపడం లాంటిది కాదు. వారి హింసను ఎదుర్కొనే క్రమంలో అనివార్యంగా జరిగే ప్రతిహింస. ప్రతిహింస నిజానికి హింస కాదు. హింసను ఆపే ప్రయత్నం. భూమయ్య, కిష్టాగౌడ్‌లు చేసింది అదేనని శ్రీశ్రీ చెబుతున్నాడు. వాళ్లు ఎలాంటి వాళ్లో చెప్పడానికి ఎలాంటి వాళ్లు కాదో చెబుతున్నాడు. రోజెన్‌బర్గ్ దంపతుల్లాగా మేధావులు కారట. జూలియస్ రోజెన్‌బర్గ్ ఎలక్ట్రికల్ ఇంజనీరు. ఏథెల్ రోజెన్‌బర్గ్ ఆయన భార్య. వీళ్లిద్దరూ రష్యాకు అణు రహస్యాలను చేరవేశారని కుట్రకేసు పెట్టి చంపింది అమెరికా ప్రభుత్వం. ఇది జరిగింది 1953లో. శాకోనికోలా, బొరాలేమియా వాన్‌జెట్టి - వీళ్లిద్దరూ అమెరికాలో స్థిరపడ్డ ఇటాలియన్లు. వీళ్లిద్దరూ - ఒకరు చెప్పులు కుట్టుకునేవారు, ఇంకొకరు చేపలమ్ముకునేవారు. వీళ్లు కమ్యూనిస్టులనే కక్షతో అమెరికా ప్రభుత్వం ఉరితీసింది. ఇది జరిగింది 1927లో. భూమయ్యా, కిష్టాగౌడ్‌లు అటు మేధావులూ, ఇటు మెతక మనుషులూ కాకపోయినా, వీళ్లందరిపైనా పాలకవర్గాలు ఆరోపణలు చేసి ఉరి తియ్యడం సమానంగా కనిపిస్తోంది. వీళ్లలో ఉన్న సామాన్య లక్షణం కమ్యూనిస్టులు కావడం ఒక్కటే. అమెరికా సామ్రాజ్యవాదం ఇవాళ ఇంకా ముదిరిపోయి భయంకరంగా తయారవడం అందరికీ తెలిసిందే.

మరోప్రస్థాన కాలం నాటికి శ్రీశ్రీలో సామ్రాజ్యవాద వ్యతిరేకతా

భావం బాగా పెరిగింది. సామ్రాజ్యవాదం ఎంత భయంకరమైనదైనా, ప్రజాబలం ముందు అది దూదిపులి లాంటిదనీ, కాగితప్పులి లాంటిదనీ శ్రీశ్రీ అనేక సందర్భాల్లో మాట్లాడాడు. 1974 మే 18న అప్పటి ఆంధ్రప్రదేశ్ వెంగళరావు ప్రభుత్వం నక్సలైట్ నాయకులతోపాటు ఆరుగురు విప్లవ రచయితలతో కలిపి మొత్తం 45 మందిపై సికింద్రాబాద్ కుట్రకేసు పెట్టింది. దీనికి సాక్షులు 250 మంది. 45 మంది కుట్ర చేస్తూ ఉంటే 250 మంది సాక్షులట! కుట్ర కేసుల్లోని కుట్రను ఎండగడుతూ శ్రీశ్రీ 1974లోనే 'దూదిపులి మీద పుట్ర' అనే పాట రాశాడు. సభల్లో శ్రీశ్రీ దీన్ని స్వయంగా పాడేవాడు. డైరెక్టుగా వెంగళరావునుద్దేశించి రాసిన పాట ఇది. అందులో వెంగళరావును 'బానిసకొక బానిసకొక బానిసోయ్ బానిసా' అన్నాడు. నిరాయుధంగా దొరికిన విప్లవకారుల్ని, సానుభూతిపరుల్ని బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపించిన రక్త చరిత్ర వెంగళరావుది. కమ్యూనిజం అంటే భయంతో విప్లవకారుల్ని కక్షగట్టి చంపించాడు.

*"కమ్యూనిజంమంటే నీ*
*కమ్మయ్యో ఎంత భయం?*
*నిజం చెప్పనా, కమ్యూ*
*నిజానిదే తుది విజయం"*

కమ్యూనిజం పట్ల శ్రీశ్రీకున్న ఆత్మవిశ్వాసం గొప్పది. అదే ఆయన చేత మరో ప్రస్థాన కవితలు రాయించింది.

*"ఇది ప్రపంచ కుగ్రామం*
*ఇది గ్లోబల్ సంగ్రామం*
*ఎడతెగని సంక్షోభం*
*ముందున్నది సంక్షేమం"*

ఎన్ని సంక్షోభాలు వచ్చినా చివరకు సంక్షేమం రాకతప్పదు. అదే కమ్యూనిస్టు వ్యవస్థ.

'మరో ప్రస్థానం'లోని బాగా ప్రసిద్ధి పొందిన కవితల్లో 'తుది పయనం : తొలి విజయం' ఒకటి. విప్లవకారుడు నాగభూషణం పట్నాయక్‌కు ఉరిశిక్ష వేసినప్పుడు ఉరికొయ్యకు ఊగుతున్న విప్లవకారుణ్ణి ఊహించుకుని రాసిన గీతం.

*"ఊగరా, ఊగరా, ఊగరా!*
*ఉరికొయ్య అందుకొని ఊగరా!*
*ఉరికొయ్య అంటుకొని ఊగరా!*

\- - - -

*చావన్నది నీకు లేనే లేదురా!"*

అని ప్రారంభించిన ఈ గీతంలో కవితావేశం, విప్లవావేశం రెండూ పోటీపడి కదనుతొక్కిన వైనం కనిపిస్తుంది. ప్రారంభం నుండి చివరిదాకా ఊపిరి బిగబట్టి చదువుకోవలసిన గీతం ఇది.

*"తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగు అన్నాడు*
*నల్లవాడు నువ్వు నేడు నక్సలైటువన్నాడు*
*ఎల్లవారు నిన్ను రేపు వేగుజుక్క అంటారు*
*అల్లూరికి వారసుడా! శ్రీశ్రీ కవిత్వ లాలసుడా!*
*ఊగరా, ఊగరా, ఊగరా*
*నువ్వూగుతుంటే శత్రువులకి గాభరా"*

ఆనాడు భగత్‌సింగ్, ఈనాడు నక్సలైటు వీళ్లేసమాజానికి మార్గదర్శకులు. భారతదేశంలో ఇరవయ్యవ శతాబ్ది చరిత్రను తిరగరాసిన వాళ్లు. ఇరవయ్యొకటో శతాబ్దానికి వేగుచుక్కలు.

శ్రీశ్రీకి కమ్యూనిజం విజయంపై ఎంత ఆత్మవిశ్వాసం ఉందో, దాన్ని సాధించే యువశక్తిపైన కూడా అంత నమ్మకం ఉంది.

*"ఉప్పెనలా ఉవ్వెత్తుగ యువశక్తి లేచింది!*
*ప్రతిన పట్టి, తొడలుకొట్టి, తిరుగుబాటు చేసింది!*
*హింసకు ప్రతిహింసతో ఎదురుదెబ్బ తీసింది!*
*పాపాత్ముల ప్రాణాలకు పరమాణువు బాంబులాగ*
*ఒక మాటగ, ఒక బాటగ, ఒక పాటగ సాగింది!"*

నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాల స్ఫూర్తితో 1971లో ఇలా రాయడంలో ఆశ్చర్యం లేదు. కాని శ్రీశ్రీ చనిపోవడానికి సరిగ్గా సంవత్సరం ముందు 1982లో కూడా 'యువశక్తికి స్వాగతం' పలకగలిగాడు.

*"యువశక్తీ! నవయుగ శక్తీ! ఘనకీర్తీ! జీవనదీప్తీ!*
*ఉగ్రూతలూగే ఉత్సాహశక్తీ!*
*ఉప్పొంగిపోయే ఉద్రేకశక్తీ!*

\- - - -

*విడుదల పొందిన అణుశక్తీ!*
*విజయం చాటే శ్రమ శక్తీ!*
*నీకు స్వాగతం యువశక్తీ!"*

ఆగస్ట్ 15న, ఉగాది సందర్భంగా ఆకాశవాణి నిర్వహించే కవి సమ్మేళనాలలో పాల్గొని తన అభిప్రాయాలు స్పష్టంగా చెప్పడానికి శ్రీశ్రీ ఎప్పుడూ వెనకాడలేదు. 1973 ఆగస్ట్ 14న రవీంద్రభారతిలో ఆకాశవాణి నిర్వహించిన కవి సమ్మేళనంలో శ్రీశ్రీ రాసిన 'ఓ మహాత్మా! ఓ మహర్షీ' గేయాన్ని శ్రీశ్రీ హాజరుకాలేని కారణంగా ఆరుద్ర చదివాడు. గాంధీని సంబోధిస్తూ ఆయనతో సంభాషణ చేసిన పద్ధతిలో ఈ గేయం ఉంది. 1973 ఆగస్ట్ 15 నాటికి భారతదేశానికి సోకాల్డ్ స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్లయింది. అది రజతోత్సవ సంవత్సరం.

*"నేను పూర్వం నిజం సుమ్మీ, నిన్ను పూజించాను నమ్మి*
*పోయే నా విశ్వాసమంతా, మారే నా భావాల పంథా"*
*"యువతరం విసిగింది బాపూ, నవతరం విరిసింది బాబూ*
*వెతుకుతున్నది కొత్త రోజులు, దులుపుతున్నది పాత బూజులు"*
*"ఇరవదైదేడులకు పైగా, ముగిసి కాలం కరిగిపోగా*
*ఎక్కడా క్షమ కనిపించదు, హింస తన ఆయుధం దించదు"*
*"నీవు చూపిస్తున్న బాట, యథాస్థితికొక కంచుకోట*
*హింసతోనే సృష్టిపుస్తది, హింసతోనే మార్పు వస్తది"*

అని ఆకాశవాణి గుండెలు బద్దలయ్యేట్టుగా కుండబద్దలు కొట్టి చెప్పాడు. స్వాతంత్ర్యం వచ్చి ఇరవయ్యయిదేళ్లు గడిచిపోయినా, పాలకవర్గాల హింస ఆగలేదనీ, దానికి ప్రతిహింస తప్పదనీ, ఆ ప్రతిహింసతోనే సమాజంలో మార్పు వస్తుందనీ అహింసావాదులు కూడా 'నిజమా!' అని అనుకునే విధంగా ఈ గేయంలో శ్రీశ్రీ వివరించగలిగాడు. హింస అని శ్రీశ్రీ వాడిన ప్రతిచోటా అది పాలకవర్గాల హింసో, లేదా విప్లవకారుల, ప్రజల ప్రతిహింసో అయి ఉంటుంది. అవకాశం వచ్చిన ప్రతి సందర్భంలోనూ హింసాహింసల గురించి చర్చ చేస్తూ శ్రీశ్రీ కవితలు రాశాడు. 1969లో చాగంటి భాస్కరరావునూ, 1970లో వెంపటాపు సత్యాన్నీ కాంగ్రెస్ ప్రభుత్వం బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపింది. విప్లవకారులకు చావులేదన్న విషయాన్ని గుర్తు చేస్తూ 1971 ఫిబ్రవరిలో రాసిన కవిత 'ఎవరిది అహింస?'

*"తలకాయలు దొర్లా*
*లన్నాడు బిర్లా*

ఔను సత్యం తలకాయ దొర్లింది
భాస్కరుడి తలకాయ దొర్లింది - ఇదే హింస
బోర్లా
పడుకున్న సంపాదకా విను
నక్సలైట్లు ఛేదిస్తున్నారు గాంధీ
విగ్రహాల శిరస్సులను - అదే అహింస
సత్యానికి చావు లేదు
భాస్కరుడు బతికే ఉంటాడు"

'బిర్లా' పెట్టుబడిదారులకు సంకేతం. ఆనాడైనా, ఈనాడైనా భారత ప్రభుత్వం పెట్టుబడిదారుల, సామ్రాజ్యవాదుల తొత్తుగా ఉంటోందనే విషయం ఇవాళ ఎవరూ ఎవరికీ చెప్పనక్కరలేదు. విప్లవోద్యమం దేశవ్యాప్తంగా, విస్తరిస్తున్న ఈ సమయంలో హోంమంత్రి చిదంబరం, ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్, వారి వెనుక ఉన్న (అ) దృశ్య శక్తి సోనియాగాంధీ, వీరందరి వెనుక ఉన్న బహుళజాతి కంపెనీలూ, సామ్రాజ్యవాదులూ కుమ్మక్కై, మావోయిస్టులకూ, గిరిజనులకూ వ్యతిరేకంగా గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను ప్రారంభించారు. నరమేధానికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. 'తలకాయలు దొర్లాలన్నాడు బిర్లా' అన్న మాటకు అర్థం ఇదే. అయితే 'సత్యానికి చావు లేదు, భాస్కరుడు బతికే ఉంటాడు' అని శ్రీశ్రీ అన్న మాటలే ఆనాటికీ, ఈనాటికీ, ఏనాటికీ సరైన జవాబులు.

మరో ప్రస్థానంలో ఏడు ఉగాది కవితలున్నాయి. ఆకాశవాణి అడిగినా, ప్రతి ఉగాదికీ కవిత రాయాల్సి వచ్చినా, ప్రజలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలకు దూరంగా, విప్లవ భావాలకు భిన్నంగా రాయడు. ఒక్కసారి ఆగస్ట్ 15 సందర్భంగా, ఎమర్జెన్సీ కాలంలో 1976లో ఇందిరాగాంధీ 20 సూత్రాలకు అనుకూలంగా రేడియోకు ఒక పాట రాసిచ్చాడు. 20 సూత్రాల పథకం 'మహోజ్వల శుభాశయం' అంటూ పొగిడాడు. ఆ పాట సెప్టెంబర్ 'అభ్యుదయ' పత్రికలో అచ్చయింది. 'అభ్యుదయ' అరసం మద్రాసు శాఖ తరఫున వెలువడుతున్న పత్రిక. ఆ పాటలోని భావాలు వారికి సరిపోయాయి. కానీ విరసానికి మింగుడు పడలేదు. విరసం శ్రీశ్రీని సస్పెండ్ చేసింది. ఎమర్జెన్సీ కాలంలో 36 మంది విరసం సభ్యులు జైలులో ఉన్నారు. బయట విరసం కార్యకలాపాలు లేవు. ఎమర్జెన్సీ ఎత్తివేసింతర్వాత విరసం సభ్యులందరూ విడుదలయ్యారు. 1977లో విజయవాడలో జరిగిన విరసం సర్వసభ్య సమావేశంలో శ్రీశ్రీని విప్లవంలో ఉంచుకోవాలా, తీసెయ్యాలా అని మూడు గంటల సేపు చర్చ జరిగింతర్వాత, శ్రీశ్రీ బేషరతుగా క్షమాపణ కోరాక, అప్పటి వరకూ అధ్యక్షుడుగా ఉన్న శ్రీశ్రీని సాధారణ సభ్యుడుగా కొనసాగించాలని తీర్మానం జరిగింది. ఆ మూడు గంటలూ శ్రీశ్రీ హాలు బయట మెట్లమీద నిరీక్షించడం చిన్న విషయం కాదు. అదే ఆ మహాకవికి పెద్ద శిక్ష. 1976లో రాసిందే అయినా ఈ పాటను 'మరో ప్రస్థానం'లో చేర్చకపోవడానికి ఇదే కారణం. ఈ పాట శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం - 10, ఖడ్గసృష్టిలో ఉంది.

మరో ప్రస్థానంలోని ఏడు ఉగాది కవితలూ 1970, 73, 75, 76, 79, 82 సంవత్సరాలలో రాసినవి. 1975లో ఒకే ఉగాదికి రెండు సార్లు రాయాల్సి వచ్చింది. ఉగాది తెలుగు సంవత్సరాది కావడం ఉగాది కవితలు రాయడానికి శ్రీశ్రీకి ఒక ప్రేరణ కావచ్చు. తెలుగుజాతి అన్నా, తెలుగు భాష అన్నా, తెలుగు రాష్ట్రం అన్నా శ్రీశ్రీకి పిచ్చి అభిమానం ఉంది. జనవరి 1న ఆంగ్ల సంవత్సరానికి శ్రీశ్రీ ఎప్పుడూ కవిత రాయకపోవడం గమనించొచ్చు.

శ్రీశ్రీ రాసిన ఉగాది కవితలు చాలా సాదాసీదాగా రాసినట్టు కనిపిస్తాయి. ప్రారంభం అతి సామాన్యంగా ఉంటుంది. ఏమి రాయాలో తెలియక, ఎలా రాయాలో తోచక ప్రారంభించినట్టుంటుంది. ఆ రాసే క్రమంలోనే ఒక దశలో అసలు శ్రీశ్రీ బయటికొస్తాడు. 1975 ఉగాదికి రాసిన ఒక కవిత 'మట్టిపులి'లో

"అడవుల మీద ఆకాశం తొంగి చూస్తున్నప్పుడు
కొండల్లో ప్రతిధ్వనిస్తుంది నా గుండెల చప్పుడు
తెలుగుదేశంలో ఎక్కడ వున్నా నేను
నా తొలి యౌవనాన్ని పునర్జీవిస్తాను"

అంటాడు. 65 ఏళ్ల వయసులో కూడా 25 ఏళ్ల వయసులో ఉండాలని కోరుకుంటాడు. అదే సంవత్సరంలో రాసిన మరో ఉగాది కవిత 'రాక్షస ఉగాది'. ఆ ఉగాది నాడు సన్మానం చేస్తామని ముఖ్యమంత్రి నుండి శ్రీశ్రీకి ఒక లేఖ అందింది. ఆ సన్మానాన్ని తిరస్కరించాడు. పైగా -

"మీ దారిని మీరు పొండి, నా దారిని నాకు వదిలి
మీరట ప్రజలంటారు, నేనూ ప్రజలంటాను
మీ ప్రజకూ నా ప్రజకూ, పొంతన కుదరదులెండి
చస్తున్న వ్యవస్థ మీద, వస్తున్న చరిత్ర నాది
శవాదరణ మీ ధ్యేయం, శిశూదయం నా న్యాయం"

అని కవితలోనే సమాధానం ఇచ్చాడు.

ఉగాది కవితల్లో చెప్పుకోదగింది 'పంచరత్నాలు' కవిత. కవితా శీర్షికలో సాంప్రదాయిక వాసన ఉన్నా నిజంగా రత్నం లాంటి కవిత అది. తియ్యని నిజాల గురించి రాయాలని ఉన్నా, అవి కనబడకపోవడం వల్ల 'చేదు నిజాలే యిప్పుడు నా కవితా వస్తువు' అని ప్రకటించుకున్నాడు.

"ఉగాది పాటకు ఒకటే పల్లవి, బాధ బాధ బాధ - అది
జగాన మెసలే జనాల జీవిత, గాథ గాథ గాథ
అదుగో అదుగో రిక్షావాడు, కదిలే ఎముకల గూడు
ఆకలినే తింటున్నాడు, అలో లక్ష్మణా అంటున్నాడు"

దోపిడీ సమాజంలో కనిపించే వికృత రూపాన్ని ఈ కవితలో వర్ణిస్తాడు. ఉగాది వచ్చినా పాతదిపోయిందే గాని, కొత్తది రాలేదంటాడు. కాలే గుడిసెలు కాలుతుంటే లేచే మేడలు లేస్తున్నాయంటాడు. నిన్నటిలో జీవించడం మానేసి రేపటి గురించి ఆలోచించమంటాడు. కాగల కార్యాలను ఏ గంధర్వులో వచ్చి తీర్చరనీ, మన జీవితాల్ని మనమే తీర్చిదిద్దుకోవాలనీ అంటాడు.

'మరో ప్రస్థానం'లో గమనించాల్సిన మరో విషయం అనువాద కవిత్వం. ఇందులో 14 అనువాద కవితలున్నాయి. సెజార్ వల్లెజో, పాబ్లో నెరూడా, అగస్టినో నెటో, వాంగ్‌జాన్, ఒటోరినీ కాస్టిల్లో, చేగువేరా మొదలైన కవుల్ని అనువదించాడు. సెజార్ వల్లెజో పెరూకు చెందిన కవి. స్పానిష్ అంతర్యుద్ధంలో కమ్యూనిస్టుల తరఫున పోరాడుతూ చనిపోయాడు. పాబ్లో నెరూడా చిలీ కవి. స్పానిష్ అంతర్యుద్ధంలో ప్రజల పక్షాన నిలబడ్డాడు. అలెండీ ప్రభుత్వంలో ఫ్రాన్స్‌లో చిలీ రాయబారిగా పని చేశాడు. నోబెల్ బహుమతి పొందిన కవి. స్టాలిన్ మీద రాసిన గీతాన్నే శ్రీశ్రీ అనువదించాడు. అగస్టినో నెటో పోర్చుగీసు కవి. అంగోలాలో వలసవాదానికి వ్యతిరేకంగా పోరాడాడు. వాంగ్‌జాన్ చైనా కళాకారుడు. ప్రజావిముక్తి సైన్యంలో పని చేశాడు. ఒటోరినీ కాస్టిల్లో గౌటెమాలా కవి. పాలకవర్గ ఫాసిస్టులు ఇతన్ని మూడు రోజులు

ప్రసంగ పాఠం

# శ్రీశ్రీ సమకాలీనత

- సి. కాశీం

"రాజు మరణించె నొక తార రాలిపోయె
సుకవియు మరణించె నొక తార గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు"

కవి గొప్పతనం గురించి అతని ప్రాసంగిత గురించి గుర్రం జాషువా చెప్పిన ఈ పద్యం నభూతో నభవిష్యత్. ఆ కవి పాల్కుర్కి సోమన కావచ్చు, వేమన కావచ్చు, గురజాడ కావచ్చు, జాషువా కావచ్చు, శ్రీశ్రీ కావచ్చు. కాలం ఏదైనా అతడి పద్యం ప్రజల నాలుకల మీద ఆడుతుందా? లేదా? అనేది ముఖ్యం. అక్షరం ముక్కరాని వాళ్లు కూడా కవి రాసిన పద్యాన్ని పాడుతుంటే ఆ కవి కాలాతీత వ్యక్తి. ఏ ప్రజలైనా ఒక కవి కవిత్వాన్ని ఎందుకు పాడుకుంటారంటే, అతడి కవిత్వం ప్రజల భయంకర బాధల పాటల పల్లవి అయినప్పుడు, 'సమ్మె కట్టిన కూలీల భార్యల, బిడ్డలు/ఆకటి చీకటి చిచ్చుల' జీవితాన్ని చిత్రించినపుడు, 'ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యాన్ని' కవి పసిగట్టి, 'ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరిదని' ప్రశ్నించినప్పుడే ప్రజలు ఆ కవిత్వాన్ని గుండె నిండుగా పాడుకుంటారు. ఇట్లాంటి సామాజిక వైరుధ్యాలు ఉన్నంతకాలం ఆ కవి సమకాలీనత, ప్రాసంగికత ఉంటూనే ఉంటుంది. ఏ కవి అయినా రాజ్యాన్ని ప్రశ్నించాడా? లేక లొంగిపోయాడా అనేదే చరిత్రలో అతని స్థానాన్ని తేల్చుతుంది. ఈ అవగాహనతో శ్రీశ్రీని అంచనా వేస్తే ప్రజల రక్తంతో నిర్మాణమవుతున్న చరిత్రకైనా, మనకైనా మేలు జరుగుతుంది. కేవలం పాక్షిక దృష్టితో చారిత్రక నియమాలను పక్కనపెట్టి ఏ వ్యక్తిని అంచనా వేసినా అది ఎవరికీ ప్రయోజనం ఉండదు.

ఒక సందర్భంలో గురజాడ గురించి శ్రీశ్రీ రాస్తూ "ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్ర, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజిక, చారిత్రక పరిణామ గమనంలో కవి సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలి అయితే అతడు ఈ గమనాన్ని మరింత వేగవంతం చేస్తాడు."(సృజన-ఫిబ్రవరి 1970-పుట.74)అని చెప్పాడు. శ్రీశ్రీ జీవించిన కాలాన్ని, చరిత్రను అర్థం చేసుకుంటే తప్ప తెలుగు సమాజానికి ఆయన కంట్రిబ్యూషన్ అర్థం కాదు. ఇరవై సంవత్సరాల(1930) నిండు యవ్వనంలో టైఫాయిడ్ జ్వరానికి గురై చావు ద్వారాల వద్దకు వెళ్లి వచ్చాడు. ఈ సమయంలోనే ప్రపంచమంతా (సోషలిస్టు రష్యా మినహా) ఆర్థిక మాంద్యంలో కొట్టుమిట్టాడుతున్నది. ప్రపంచాన్నంతా ప్రభావితం చేసిన రష్యా విప్లవం ఇంకోవైపు చరిత్రను నడిపిస్తున్న కాలం. ప్రపంచ వ్యాపితంగా ఆకలితో మండుతున్న యువత. ఉరికొయ్యలను ముద్దాడిన భగత్‌సింగ్ త్యాగం. రెండు ప్రపంచయుద్ధాలు. తెలంగాణ సాయుధ పోరాటం. చైనా లాంగ్‌మార్చ్. ఇది శ్రీశ్రీ కళ్లముందరి కాలం. ఈ చరిత్ర గమనంలో శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, విశ్వనాథల ప్రభావం నుంచి బయటపడి దూరంగా వినువీథుల్లో విహరించే కవిత్వం కోసం బతికి ఆ కవిత్వాన్ని భూమార్గం పట్టించి భూకంపం పుట్టించాడు. తన రచనలో లోకం ప్రతిఫలించాలని తపించాడు. తన జాతి జనులు పాడుకొనే గీతం రాయాలని నిర్ణయించుకున్నాడు. కనుక మొదటిసారిగా ఎగరేసిన ఎర్రనిజెండాను కవిత్వంలోకి ఈడ్చుకొచ్చాడు.

అబ్బూరి రామకృష్ణారావు ప్రభావంతో ప్రపంచ సాహిత్యాల వైపు, సాహితీ ధోరణుల వైపు తన దృష్టిని మళ్లించి ప్రగతిశీలిగా మారాడు. కనుక సమాజంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా సాహిత్యంలో రావల్సిన మార్పును వేగవంతం చేసాడు. ఈ కాలంలో ఒక కవిగా శ్రీశ్రీ తన పాత్రను సరిగ్గానే నిర్వహించాడు. లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మెనిఫెస్టో వెలుగులో ముందుకెళ్లాలని 'ప్రతిజ్ఞ' చేసాడు. అందుకే భూమి కడుపులో కళ్లు పెట్టి ప్రపంచానికి భోజనం పెడుతున్న చెమట చుక్కలకు ఖరీదు కట్టే సమాజం కోసం తపించాడు. సహస్ర వృత్తుల, సమస్త చిహ్నాల గొంతులు వినిపించాడు. పుడమి తల్లి పురిటి నొప్పులలో కొత్త సృష్టిని కలగన్నాడు. చరిత్ర గమనమే సాహిత్యాన్ని నడిపిస్తుందని భావించి

"కదిలేది కదిలించేది
మారేది మార్పించేది

చిత్రహింసలు పెట్టి సజీవదహనం చేశారు. చేగువేరా లాటిన్ అమెరికా విప్లవోద్యమ నాయకుడు. ఈ కవులందరూ ప్రజా ఉద్యమాలలో పాల్గొన్నవాళ్లు. ప్రజల కోసం పోరాడిన వాళ్లు. ఇలాంటి కవులనే ఎంచుకొని వారికవితల్ని అనువదించాడు. వీటిలో ఎక్కువ భాగం 1971, 72 సంవత్సరాల్లో అనువదించినవి. తాను రాస్తున్న, రాయబోయే మరో ప్రస్థానం కవితలకు దిశామార్గాన్ని నిర్దేశించినవి.

ఈ ప్రపంచాన్ని అన్ని రుగ్మతలనుంచీ కాపాడగలిగేది ఒక్క కమ్యూనిస్టు చైతన్యం మాత్రమే అన్నది మరోప్రస్థానం ద్వారా శ్రీశ్రీ చెప్పదల్చుకున్న సత్యం.

"సైంటిస్టువి కావాలంటే
ఆర్టిస్టువి కావాలంటే
ముందుగా - కమ్యూనిస్టువి కావాలి"

"పచ్చ పచ్చగా బతకాలంటే
ఎర్రఎర్రగా ఎదగాలంటే
మంచి - కమ్యూనిస్టువి కావాలి"

కమ్యూనిస్టు కాని సైంటిస్టు, కమ్యూనిస్టు కాని ఆర్టిస్టు, కమ్యూనిస్టు కాని ఇంకెవరయినా సరే ప్రజలకుపయోగ పడరు. అంతిమంగా పాలకవర్గాలకే ఉపయోగపడతారు.

చరిత్ర నిర్మాతలైన ప్రజల జీవితాల్లో ఎంత కాఠిన్యం ఉంటుందో, అంత కాఠిన్యం, ఎంత పదును ఉంటుందో అంత పదును, ఎంత ప్రేమ ఉంటుందో అంత ప్రేమ 'మరోప్రస్థానం'లో ఉన్నాయి. మహాప్రస్థానం నాటికి మహాకవి అయితే, మరోప్రస్థానం నాటికి ప్రజాకవి కావాలన్న తపన కనిపిస్తుంది. ఈ క్షణానికి చెందని కవిత్వం ఏ క్షణానికీ చెందదన్న స్ఫూర్తి మరోప్రస్థానంలో స్ఫురిస్తుంది. అ

పాడేది పాడించేది
పెనునిద్దర వదిలించేది
మునుముందుకు సాగించేది
పరిపూర్ణపు బ్రతుకిచ్చేది" కవిత్వమని కవిత్వానికి కొత్త నిర్వచనం ఇచ్చాడు. ఇట్లా తెలుగు సాహిత్య గమనాన్ని వేగవంతం చేసిన ప్రగతిశీలి శ్రీశ్రీ. "ఎప్పటికప్పుడు కొత్త విషయాన్ని చెప్పడం, చెప్పేదాన్ని సూటిగా ఘాటుగా చెప్పడం; చెప్పే వస్తువూ-చెబుతున్న పద్ధతి ప్రజాశ్రేయస్సు దృష్ట్యా చెప్పడం- ఏ కవికైనా జీవ లక్షణం. ఈ లక్షణం శ్రీశ్రీలో సంపూర్ణంగా ప్రస్ఫుటమవుతుందని" (సృజన-1970 ఫిబ్రవరి-పుట.59) నూతలపాటి గంగాధరం చెప్పిన మాట నూరుపాళ్ల నిజం. ఆధునిక తెలుగు సాహిత్యంలోకి రాజకీయాలను, సామాజిక జీవితాన్ని సమదృష్టితో తీసుకొచ్చిన వాడు శ్రీశ్రీనే. ఈ విధంగా శ్రీశ్రీ కవిత్వం పరిపక్వత చెందడానికి కవితా ప్రతిభతో పాటు సాంఘిక సమస్యలపై నిర్దిష్ట అవగాహనతో పాటు సాంఘిక వ్యవస్థను గొప్పగా అర్థం చేసుకున్న ఉత్తమకవి శ్రీశ్రీ.

ఏ మనిషికైనా ఒక దృక్పథాన్ని ఇచ్చేది సమకాలీన సామాజిక ఆర్థిక, రాజకీయ, చారిత్రక పరిస్థితులే. కనుకనే సమకాలీన జీవితం, అతడి సామాజిక అస్తిత్వం అతడి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. ఆ చైతన్యం ఆధారంగానే మనిషి సమాజ పరిణామాల పట్ల స్పందిస్తాడు. మనుషులందరూ ఒకేలా స్పందించడం ఏ సమాజాలలో కూడా సాధ్యం కాదు. అందరూ అన్ని విషయాలపై కూడా స్పందించకపోవచ్చు. కాని స్పందించిన విషయాలు మాత్రం ప్రజానుకూలమైనవి కావాలి. ఆ నాటి సమాజంలో ప్రధాన వైరుధ్యం ఏది ఉంటే దాని మీదనే ఎక్కువ దృష్టి ఉంటుంది. సమాజంలో అన్ని వైరుధ్యాలు ఒకే స్థాయిలో ఎప్పుడూ ఉండవు. ఒకటి ప్రధాన వైరుధ్యమైతే మిగతా వైరుధ్యాలు అప్రధానమని కాదు. కాకపోతే ఒక్కొక్క సామాజిక సందర్భంలో ఒక్కొక్క వైరుధ్యం ముందుకొస్తుంది. ఈ వైరుధ్యాన్ని ప్రతిబింబించిన వాడే చరిత్రలో నిలబడుతాడు. ఈ పనిని శ్రీశ్రీ చేసాడు. సమాజం చేత తాను చైతన్యం పొంది సమకాలీన సమాజాన్ని ముందుకు నడపించే శక్తులలో శ్రీశ్రీ భాగమయ్యాడు. కనుకనే కాళ్లకింద నలిగిన గడ్డిపోచల బాధ, చీమల కాళ్లు విరిగిన చప్పుడు విన్నాడు, వినిపించాడు. ఇట్లాంటి చీమల కాళ్లు ఇంకా విరుగుతూనే ఉన్నాయి. ఈ విధంగా చరిత్రను అన్వయించి శ్రీశ్రీని అర్థం చేసుకోవాలి. ఆయన కలం పట్టిన కాలంలో ఉన్న సామాజిక, రాజకీయ, సాంస్కృతిక సందర్భంలో శ్రీశ్రీని అంచనా వేయాలి. ఆయనకు కాలం విధించిన పరిమితులు ఏమిటో గమనంలో ఉంచుకోవాలి. మన ఇష్టాఇష్టాలతో కాకుండా చరిత్ర కళ్లద్దాలను పెట్టుకొని శ్రీశ్రీని పరిశీలించాలి. ఈ వెలుగులో ఆలోచిస్తేనే శ్రీశ్రీ సమకాలీనత తెలుస్తుంది. ఏ మనిషైనా పరిమితులతో తర్వాతి కాలానికి కచ్చితంగా రిలవెంట్ అవుతాడు.

అర్ధ దశాబ్దం తెలుగు సమాజాన్ని, సాహిత్యాన్ని అద్భుతంగా ప్రభావితం చేసిన కవిపై ద్వేష భావంతో కామెంట్ చేయడం సరైంది కాదు. ఎంత గొప్పవారికైనా పునర్ మూల్యాంకనం చేయడం సమాజానికి అవసరం. కాని హేతుబద్ధంగా చర్చించాలి. చరిత్ర పునాదిగా అంచనా కట్టాలి. మరణించిన తర్వాత ఏ మనిషి కూడా మొత్తంగా సమకాలీనంగా ఉండకపోవచ్చు. "ఏ మనిషికయినా ఆ మనిషి జీవితకాలపు పరిస్థితుల వల్ల, నమ్మిన విశ్వాసాల వల్ల, కార్యాచరణ వల్ల, వెలువరించిన వ్యక్తీకరణ వల్ల, మరణాంతర జీవితం ఉంటుంది. అంటే ఒక వ్యక్తి ప్రాసంగికతను సామాజిక స్థితి, విలువలూ, విశ్వాసాలూ, వ్యక్తిగత ఆచరణ, వ్యక్తీకరణ అనే నాలుగు ప్రాతిపదికల మీద కొలవలసిందే తప్ప అది మన ఇష్టాఇష్టాలను బట్టి నిర్ణయం కాదని" (ఆదివారం వార్త, 25.4.10, పుట.12) ఎన్. వేణుగోపాల్ చేసిన విశ్లేషణ ఈ సందర్భంలో గతితార్కికంగా ఉంది. శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా ఆయనను కాలాతీతుడుగా తలకెత్తుకునే వర్గం ఒకటి. కులం గురించి రాయలేదు కాబట్టి ఆయన మహాకవి కాదు, ఆయన కవిత్వం చదవాల్సిన అవసరం లేదు, ఆయనకు సామాజిక స్పృహ లేదు అని తూలనాడే వర్గం మరొకటి. ఈ రెండు ధోరణులు సరైనవి కావు. ఈ రెండు వాదనలు నిజం కాదు. ఒక వర్గం భజన చేస్తుంది. మరో వర్గం నాలుగు హద్దులు గీసి ఇందులో శ్రీశ్రీ ఇమడలేదని నిందిస్తుంది. ఈ రెండు వర్గాలు సామాజిక వైరుధ్యాలను శ్రీశ్రీకి అన్వయించి చూడడానికి నిరాకరిస్తున్నాయి. అట్లని సర్వసంపూర్ణ మానవుడిగా శ్రీశ్రీని మోయవల్సిన పని కూడా లేదు.

శ్రీశ్రీకి కొన్ని పరిమితులు ఉన్నాయి. ముఖ్యంగా కులం గురించి రాయకపోవడం. కాలికింద పడి విరిగిన చీమ కాలు శబ్దాన్ని విన్న శ్రీశ్రీ అంటరాని ఆవేదనను అక్షరబద్ధం చేయకపోవటం ఆశ్చర్యంగా ఉంది. తనకు అడుగు జాడైన గురజాడ కూడా

"మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు" అని కులం గురించి రాశాడు. కాని శ్రీశ్రీ ఎక్కడా కులం ప్రస్తావన చేయలేదు. కనుక శ్రీశ్రీ చరిత్ర బోనులో నిలబడి సమాధానం చెప్పవల్సిందే. అయితే ఆనాటి కమ్యూనిస్టు పార్టీకే కులం పట్ల స్పష్టత లేకపోవటం వలననే శ్రీశ్రీకి ఈ పరిమితి ఏర్పడిందని సరిపెట్టుకోవచ్చు. కాని 70వ దశకంలో గద్దర్, చెరబండరాజు కులం గురించి గొప్ప పాటలు రాసిన తర్వాతనైనా శ్రీశ్రీ కులంపై రచన చేయవల్సి ఉండే. అయితే శ్రీశ్రీ బ్రాహ్మణ కులంలో పుట్టటం వలననే కులంపై రాయలేదనేది అపవాదు మాత్రమే. ఆయన ఆ కులం పద్ధతులకు భిన్నంగా జీవించాడు. మొత్తం సమాజం సమూలంగా మారాలని కోరుకున్నాడు. కనుక ఈ పరిమితి వలన శ్రీశ్రీని దళిత వ్యతిరేకిగా చిత్రించాలనుకోవడం ద్వేషపూరితమయినదే తప్ప తార్కికమైనది కాదు. గాంధీ గురించి, క్రీస్తు గురించి ఖండ కావ్యాలు రాసిన జాషువా అంబేద్కర్ గురించి రాయనంత మాత్రాన ఆయన సమకాలీనత ఈ నాటికీ చెరిగిపోలేదు. కుల వ్యవస్థకు మూలమైన దేవుడిని పూలే నమ్మినంత మాత్రాన సమాజానికి ఆయన చేసిన కాంట్రిబ్యూషన్‌ను తక్కువ చేయలేము. ఒక్కొక్క సందర్భంలో ఆయా వ్యక్తులకు కొన్ని పరిమితులు ఏ కారణాల వలననో ఏర్పడతాయి. ఆ పరిమితులను అధిగమించి సంపూర్ణ మానవుడిగా మారితే చాలా సంతోషం. మారనంత మాత్రాన వాళ్లు భవిష్యత్‌కు మార్గదర్శకులుగా మారకుండా ఉండలేరు. అరవై, డెబ్బై దశకాలలో కలం పట్టిన చాలామంది రచయితలు(ముఖ్యంగా ఈరోజు శ్రీశ్రీని తిడుతున్నవాళ్లు) 1985 తర్వాత కానీ కులం గురించి రాయలేకపోయారు. అది వారి తప్పు కాదు. చరిత్ర విధించిన పరిమితి. రాయలేదు కాబట్టి వాళ్లు ఇవ్వాల్టి తరానికి అసంబద్ధులు కాలేరు. కచ్చితంగా వారి కృషిని ఈ తరం గుర్తించవల్సిందే. ఇదే తార్కికపద్ధతి. ఈ పద్ధతే శ్రీశ్రీకి వర్తిస్తుంది.

ఇక శ్రీశ్రీకి ఉన్న రెండో పరిమితి తెలంగాణ రైతాంగ సాయుధ

పోరాటం గురించి రాయకపోవటం. ప్రపంచంలో ఏ చిన్న తిరుగుబాటు జరిగినా సూక్ష్మంగా అధ్యయనం చేసి స్పందించిన శ్రీశ్రీ ప్రపంచ చరిత్రలోనే మొదటి రైతాంగ సాయుధ పోరాటం గురించి రాయకపోవడం విచిత్రం. ఆరుద్ర 'త్వమేవాహం'కు ముందుమాట మినహాయిస్తే ఇంకెక్కడా ఈ పోరాటం గురించి రాసినట్లు లేదు. దానికి ప్రధాన కారణం నైజాం కొలువులో శ్రీశ్రీ ఉద్యోగం చేయటమే తప్ప మరొకటి కాదు. బతుకుదెరువు కోసం ఒక ప్రజాకవి తనకు తాను పరిమితి విధించుకున్నాడు. అంతమాత్రాన తెలంగాణ ముద్దుబిడ్డలు భూమయ్య, కిష్టాగౌడ్‌ల త్యాగాన్ని గురించి రాయకుండా ఉండలేకపోయాడు. వాళ్లిద్దరిని భూమ్యాకాశాలుగా ఎత్తిపట్టాడు. కులం, తెలంగాణ సాయుధ పోరాటం గురించి రాయకపోవడం మినహాయిస్తే ఇక శ్రీశ్రీపై అపవాదు వేయడానికి ఇంకే కారణం దొరక్కపోవచ్చు. ఈ రెండు పరిమితుల వలన శ్రీశ్రీ చాలా విమర్శలను ఎదుర్కోవలసి వచ్చింది. అయితే దళిత ఉద్యమం వచ్చిన 1985 నాటి వరకు శ్రీశ్రీ బతికి ఉంటే కచ్చితంగా కులం గురించి రాసి ఉండేవాడు.

ఇక రెండో ప్రపంచయుద్ధంలో రష్యాని నాజీజానికి వ్యతిరేకంగా గర్జించమని శ్రీశ్రీ కోరటం ఆనాటి అవసరం. కాని కొన్నాళ్లకు రష్యా సోషల్ సామ్రాజ్యవాదిగా మారిపోయింది. ఇవ్వాళ విచ్ఛిన్నమయింది. తనలోని జాతుల మీద దాడులు చేస్తున్నది. శ్రీశ్రీ గర్జించమని చెప్పినా రష్యా రిలవెన్సు ఇవ్వాళ లేదు. ఆనాడు విశాలాంధ్ర కొందరి ఆకాంక్ష. ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీ బలంగా విశాలాంధ్ర కోసం పోరాడింది. కనుక 'ఆకారం దాల్చుతున్న ఆంధ్ర రాష్ట్రం' అని శ్రీశ్రీ రాశాడు. విశాలాంధ్ర ఈ రోజు తెలంగాణ ప్రజల పాలిట దోపిడి రాష్ట్రంగా మారింది. శ్రీశ్రీ కోరుకున్న విశాలాంధ్ర ఆకాంక్షకు ఇప్పుడు ప్రాసంగికత లేదు. వీటితో పాటు ఆయన వ్యక్తిగత జీవితంలో ఒక పార్శ్వం ఎవరికి ఆదర్శం కాదు. అప్పటి చైతన్యంతో శ్రీశ్రీ వాడిన కొన్ని పదాలకు కూడా ఇప్పుడు కాలం చెల్లింది.

ఇట్లాంటి కొన్ని పరిమితులను మినహాయిస్తే శ్రీశ్రీ కావ్య వస్తువులన్నీ ఈ నాటికీ సజీవంగా ఉన్నాయి. అంటే ఆయన తడిమిన ఏ సమస్య నేటికీ పరిష్కరించబడలేదు. కనుక శ్రీశ్రీ ప్రాసంగికత మరుగునపడలేదు. పైగా మరింత పెరిగింది. శ్రీశ్రీ జీవించిన కాలంలోని సమస్యలు తీరినప్పుడే ఆయన ఎంపిక చేసుకున్న కావ్య వస్తువు ప్రాసంగికత పోతుంది. లేదంటే అతడి ప్రాసంగికత మరింత పెరుగుతుంది. రణరంగం కాని చోటు గ్లోబల్ విలేజ్‌లో ఎక్కడలేదు. గ్రామాలన్నీ రక్తంతో, లేదంటే కన్నీళ్లతో తడుస్తూనే ఉన్నాయి. 'తాగుబోతు వ్యక్తా వ్యక్తాలాపన, ప్రేలాపనలు రోజురోజుకు పెరుగుతున్నవి. కార్పోరేట్ వైద్యశాలలో శవంపై శస్త్రకారుని మహేంద్రజాలం వింత పోకడలు పోతుంది.

*'పాలికాపు నుదుటి చెమట*
*కూలివాని గుండె చెరువు*
*బిచ్చగాని కడుపు కరువు'* మాయ అని, మిథ్య అని చెప్పే బాబాలు వీధి వీధినా పెరుగుతున్నారు. రాసలీలల్లో తేలుతున్నారు. 'భూతకాలం చూరు పట్టుకొని' విలువలకి, చరిత్రకి, పోరాటాలకి వింత వ్యాఖ్యానాలు చేస్తూ పాతని బతికించడానికి కొత్త కత్తులు నూరే వారు పెరుగుతూనే ఉన్నారు. 'రెండు రెళ్ల నాలుగన్నందుకు' గొంతులు కోసే కోబ్రాలు, గ్రాచులు, టైగర్లు పుడుతూనే ఉన్నారు. రోజుకు ఎంతోమంది దురదృష్ట జీవులు సూర్యకాంతిలో ట్యాంక్‌బండ్‌లోనో, మూసీ మురికిలోనో, రైలు పట్టాలపైననో శవాలై తేలుతూనే ఉన్నారు. ఉద్యోగం లేక డిగ్రీలు చెత్తబుట్టలో పడేసి

'వానకాలం ముసిరిరాగా

నిలువు నిలువున' నీరుగా మారిపోతున్న బాటసారులు ఎందరో మిగిలే ఉన్నారు. 'గరిక పచ్చ మైదానాల్లో' ఆడుకునే బాల్యం కోసం వెతుకులాట మొదలయింది. కాంక్రీట్ గోడల మధ్య బంధించబడిన బాల్యానికి తామరపూవుల కోనేరు మ్యూజియంలో పురాతన వస్తువయింది. పంటచేలు, బొమ్మరిల్లులు సినిమాలలో తప్ప మరెక్కడా చూసే అవకాశం పసితనానికి దొరకటం లేదు. సాఫ్ట్‌వేర్ ఉద్యోగాల రందిలో అలసిపోయిన మనిషి

"ఏముకల నిద్రలో

ఇంపైన కలలు' కంటున్నాడు. ఇట్లా శ్రీశ్రీ చేపట్టిన ఏ సమస్య ఇవాల్టికీ తీరలేదు. అందుకే శ్రీశ్రీ సంబద్ధత ఇంకా చాలా పెరిగింది.

ఇక వ్యక్తిత్వంలో రెండో పార్శ్వం బుద్ధిజీవులందరు పాటించదగిన, ఆచరించదగిన కోణం శ్రీశ్రీలో ఉన్నది. కులం, వర్గం, లింగ వివక్షల గురించి రాసే చాలామంది కేవలం ఇంటికి మాత్రమే పరిమితమై ఉద్యమాలకు దూరంగా జీవిస్తున్న ఈ రోజులలో శ్రీశ్రీ లాంటి ఆచరణాత్మక జీవితానికి ఆవశ్యకత పెరిగింది. విరసం, పౌరహక్కుల ఉద్యమాలకు నాయకుడుగా శ్రీశ్రీ 'నక్సలైట్లే దేశభక్తులని' ప్లకార్డు మెడకు తగిలించుకొని రాజధాని రోడ్ల మీద తిరిగిన చరిత్రను చూస్తే శ్రీశ్రీని విమర్శించే వారికి దిమ్మతిరుగుతుంది. కేసులకు, జైళ్లకు భయపడి పారిపోయే చాలామంది మేధావులు ఈ విషయంలో శ్రీశ్రీని చూసి నేర్చుకోవాలి. తమకులం, వర్గం వారిని దగ్గరకు రానివ్వని మేధావులున్న కాలంలో మేధోశ్రమకు, శారీరక శ్రమకు మధ్యన ఉన్న విభజన రేఖను శ్రీశ్రీ చెరిపివేశారు. చరిత్రలో ఈ విషయమే ఆయనను ఉన్నత శిఖరాలలో నిలబెట్టింది. ఏ మనిషికైనా అతడి ఆచరణనే అంతిమ గీటురాయి.

శ్రీశ్రీని కేవలం 'మహాప్రస్థానం' చదివి విమర్శించే వాళ్లు కొందరు. ఏమి చదువకుండా విమర్శించే వాళ్లు మరికొందరు. అసలు కవిత్వం గురించి ఓనమాలు కూడా తెలియకుండా తిట్టే వాళ్లు ఇంకొందరు. అన్నీ తెలిసి దురుద్దేశ్యంతో తెగనాడేవారు కొందరు. ఎవరు ఎలా మాట్లాడిన శ్రీశ్రీ లాంటి ప్రజాకవి ప్రాసంగికతనుచెరుపలేరని నడుస్తున్న చరిత్ర నిరూపిస్తున్నది. ఇప్పటికైనా రాచమల్లు రామచంద్రారెడ్డి చెప్పినట్లు "శ్రీశ్రీ అర్థం కావాలంటే చారిత్రక దృష్టి, సామాజిక దృష్టి, సామాజిక దృక్పథం, మానవతా విలువల స్పృహ, చరిత్ర నిర్మాతల పట్ల అవగాహనను"(శ్రీశ్రీ సాహిత్యం సమకాలీనత-పుట.26) పెంచుకోవల్సిన అవసరం మాత్రం తెలుగు సమాజంలో కొందరికి ఉంది.

**జ్ఞాపికలు**


1. సృజన ఫిబ్రవరి 1970
2. ఏటుకూరి ప్రసాద్ (సం)-సాహిత్యాభ్యుదయం సెప్టెంబర్ 1985
3. జాషువా కవితాతత్వం- జనసాహితి,1997
4. సింగరాచార్యులు-ముత్యాలసరాలు,1998
5. శ్రీశ్రీ-మహాప్రస్థానం
6. తెలకపల్లి రవి-శ్రీశ్రీసాహిత్యం సమకాలీనత, జూన్2009
7. ప్రజాసాహితి శ్రీశ్రీ ప్రత్యేక సంచిక, 2010
8. ఆదివారం వార్త ఏప్రిల్ 25, 2010


అ

# శ్రీశ్రీ ఉద్యమ జీవితం

- వరవరరావు

శ్రీశ్రీకి ఉద్యమ ప్రాసంగికత ఎంతగా ఉన్నదో ఇటీవలి అనుభవం దృష్ట్యా నా ప్రసంగాన్ని ఆరంభించదలచుకున్నాను. ఛత్తీస్‌ఘడ్‌లో దంతెవాడ మీదుగా, నారాయణ్‌పూర్ మీదుగా, గడ్‌చిరోలీ మీదుగా మూడు వైపుల నుంచి మోహరించి గ్రీన్‌హంట్ ఆపరేషన్ నవంబర్ నెలలో ప్రారంభించడానికి ముందు కేంద్ర మంత్రి చిదంబరం హైదరాబాద్‌లోని సర్దార్ పటేల్ పోలీస్ అకాడమీలో పాసింగ్ పరేడ్‌లో ఐ.పి.ఎస్. పాసయిన వారికి సర్టిఫికెట్లు ఇవ్వడానికి వచ్చాడు. అది బయటా, మీడియాలోనూ మహారాష్ట్ర ఎన్నికల తరువాత గ్రీన్‌హంట్ జరగబోతున్నదని విస్తృతంగా ప్రచారమవుతున్న సందర్భం. ఆయనను కలిసిన మీడియా వాళ్లు అడిగారు. నవంబర్ 5న గ్రీన్‌హంట్ ప్రారంభిస్తారా? అని. "గ్రీన్‌హంటా అదేమిటి?' అని తిరిగి ప్రశ్నించాడు. ఛత్తీస్‌ఘడ్‌లోనూ, లాల్‌ఘడ్‌లోనూ దేశవ్యాప్తంగా ఉండే ఆదివాసీ ప్రాంతాలలో ఉండేటటువంటి బడా కంపెనీలు, బహుళజాతి సంస్థలను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నటువంటి ఆదివాసీ సంఘాలతోటి, మావోయిస్టులతోటి చర్చలు జరుపుతారా? అని రెండో ప్రశ్న వేశారు. "మావోయిస్టులా వాళ్లెవరు?' అని అన్నాడు. చర్చలా! అదేమిటీ? అన్నాడు. సహజంగానే హైదరాబాద్ వచ్చి ఈ మాట అన్నాడు గనుక వెంటనే మీడియా వాళ్లు దీనిపై ప్రతిస్పందన ఏమిటి? అని నన్ను అడిగారు. నాకు వెంటనే శ్రీశ్రీ ప్రసిద్ధ గీతం 'మిథ్యావాది' గుర్తుకొచ్చింది.

"ఓ ముద్దుల వేదాంతీ
ఇదంతా మాయాంటావా?
మిథ్యంటావా?" అన్నది అది.

ఒక వేదాంత కంపెనీ కోసం, ఒక హిందూ రాజ్యం, ఈ రాజ్యంలో ఒక వేదాంత కంపెనీ, అది బహుళజాతి కంపెనీ, అది లండన్ కేంద్రంగా ఉన్న కంపెనీ, అది 'వేదాంత' అని పేరు పెట్టుకుంది. హార్వర్డ్ యూనివర్సిటీలో చదువుకున్న ఒక ఆర్థికవేత్త, సామ్రాజ్యవాద ఏజెంట్ చిదంబరం. తమిళనాడులో చిదంబర రహస్యమంటే ఏమిటో మీకు తెలుసు. ఆయన మనకు హోంశాఖ మంత్రవుతాడు. ఈ వేదాంతను రక్షించడానికి హోంమంత్రయ్యి ఈ మిథ్యావాదం చెబుతూ రక్తపాతం సృష్టిస్తాడు. 70 ఏండ్ల కింద శ్రీశ్రీ రాసినది ఈ 'మిథ్యావాది' కవిత. ఇవాళ సమకాలీనంగా ప్రజల మీద ప్రభుత్వాలు చేస్తున్న దాడికి, యుద్ధానికి ఎంత చక్కటి సమాధానమో. మాయ రూపంలో ఎంతటి రక్తపాతం సృష్టించవచ్చో తెలియచెప్పేది. అప్పటి ఆ మాయ శంకరాచార్య అద్వైతానిది. ఇప్పటి ఈ మాయ మార్కెట్ మాయ. ఈ మార్కెట్ మాయ గురించి మొన్ననే ఒక సభలో అరుంధతీ రాయ్ చెప్పింది. "ఇది డబుల్ బ్యారెల్ గన్" అని. ఒక బ్యారెల్ ఎం.ఒ.యు. (మెమొరాండం ఆఫ్ అండర్‌స్టాండింగ్), మరో బ్యారెల్ గ్రీన్‌హంట్ అని అన్నదామె. కనుక ఇందులో ఏది రద్దు చేయాలె, ఏది ముందు ఆగిపోవాలె, ఏది తరువాత ఆగిపోవాలె అనేది ఒక మిథ్యావాదమే అవుతుంది.

ఇంత ప్రాసంగికత ఉండే శ్రీశ్రీకి ఒక యాభై ఏళ్ల ఉద్యమ జీవితం ఉంది. ఆ జీవితం కంటే ముందు కూడా చాలా సాహిత్యోద్యమ జీవితం ఉంది. ఆ జీవితం గురించి ఆయన చెప్పుకున్నాడు. "1910లో బరంపురంలో నానా జాతి సహపంక్తి భోజనం జరుగుతున్న సమయంలో నేను పుట్టాను" అని.

"బరంపురంలో మనం ఇంకా
నిన్న గాక మొన్న మాట్లాడుకున్నట్టే ఉంది
కాకినాడ నవ్య సాహిత్య పరిషత్తును
కళకళలాడించిన నీ నవ్వు
కనపడకుండా కరిగి పోయిందా ఇంతట్లోనే
విశాఖపట్నం వీథుల్లో మనం
'ఉదయిని' సంచికలు పట్టుకుని తిరగడం
జ్ఞాపకం ఉందా! చెన్నపట్టణపు సముద్రతీరంలో మనం
అన్నీ పిచ్చుక గూళ్లేనా కట్టింది!

సాహిత్యమే సమస్తమూ అనుకుని
ఆకలి నిద్రాలేక
ఎక్కడ ఉన్నామో ఎక్కడికి పోతామో తెలియని
ఆవేశంతో చుక్కలలో ఆదర్శాలు లెక్కిస్తూ
ఎక్కడికో పోతున్న మనల్ని రెక్కపట్టి నిలబెట్టింది లోకం
ఎన్నెన్ని దుస్సహ దృశ్యాలు చూపించి
ఎన్నెన్ని దుస్తర విఘ్నాలు కల్పించి
కలలకు పొగలనూ, కాటుకలనూ కప్పి
శపించిందో శరించిందో మనల్ని
తుదకు నిన్ను విషవాగులలోనికి లాగి
ఊపిరితిత్తులనే కొలిమి తిత్తులుగా చేసి
మా కళ్లల్లో గంధక జ్వాలలు
గుండెలలో గుగ్గిలపు ధూమం వేసి
మా దారిలో ప్రశ్నార్థ చిహ్నాల
బ్రహ్మచెముడు డొంకలు కప్పి
తలచుకున్నప్పుడల్లా
తనువులో అణువణువులో
సంవర్త భయంకర
ఝంఝూ పవనం రేగిస్తూ
ఎక్కడికి విసిరిందయ్యా నిన్ను!
ఎంత మోసగించిందయ్యా మమ్ము"

అని కొంపెల్ల జనార్దన రావుకు అంకితం చేస్తూ. సాహిత్యమే సమస్తమూ అనుకుని బయలుదేరిన వాళ్లే గాని లోకం నిలబెట్టింది. లోకం నిలబెట్టి ఒక భయంకరమైనటువంటి యుద్ధమేఘాన్ని చూపింది. దీని గురించి రాయమని అడిగింది. ఆయనే చెప్పాడు విశాఖ తీరంలో తన తొలి యవ్వనాన్ని వెతుక్కుంటానని. ఈ తొలి 20 ఏళ్లు వెతుక్కునే క్రమంలో 1930లలో ఆయన ఉద్యమ జీవితం ప్రారంభమైంది. అప్పుడే ప్రపంచంలో ఆర్థిక మాంద్యం ప్రారంభమైంది. సామ్రాజ్యవాద ప్రపంచమంతా ఆర్థిక మాంద్యానికి గురయింది. రూజ్‌వెల్ట్ అమెరికా అధ్యక్షుడిగా అప్పటికి రెండుసార్లు ఎన్నికైనప్పటికీ

కూడా ఆ ఆర్థిక మాంద్యం నుంచి సామ్రాజ్యవాద దేశాలను బయట పడేయలేకపోయాడు. సరిగా ఇప్పటి పరిస్థితి. ఇప్పుడు మళ్లీ సామ్రాజ్యవాద ప్రపంచమంతా ఆర్థిక మాంద్యానికి గురైంది. విషాదమల్లా అప్పుడు సోషలిస్టు శిబిరం ఉంది. ఆ శిబిరాన్ని ఆ ఆర్థిక మాంద్యం అంటలేదు. ఆ ఆర్థిక మాంద్యం నేపథ్యం నుంచే స్పెయిన్ అంతర్యుద్ధం వచ్చింది. స్పెయిన్ అంతర్యుద్ధానికి కర్టెన్ రెయిజర్‌లాగ శ్రీశ్రీ 'జయభేరి' గీతం రాశాడు. శ్రీశ్రీ జయభేరి గీతం రాసేనాటికి ప్రపంచ వ్యాప్తంగా నాజీజానికి, ఫాసిజానికి వ్యతిరేకంగా రచయితలందరూ కూడా సంసిద్ధమౌతూ రెండో ప్రపంచ యుద్ధ కాలానికి గోర్కీ ఇచ్చినటువంటి 'మేధావులారా మీరెటువైపు?' అని సామ్యవాద, ప్రజాస్వామిక శక్తుల వైపు నిలబడమని చెప్పినరోజులు.

లండన్‌లో ప్రోగ్రెసివ్ రైటర్స్ మానిఫెస్టో వెలువడితే విశాఖలోని ఆంధ్రా యూనివర్సిటీలో పని చేస్తున్న అబ్బూరి రామకృష్ణారావు దానిని శ్రీశ్రీకి అందించి దీని ఆధారంగా కవిత్వం రాయమన్నప్పుడు ఆయన 'జయభేరి' కవిత రాశాడు. 1933 నుంచి సాహిత్యకారుల కర్తవ్యమేమిటి? బుద్ధిజీవుల కర్తవ్యమేమిటి? రచయితల కర్తవ్యమేమిటి? చాలా గతంలోకి వెళ్లకుండా ఏ 1936 నుంచి 40 దాకా రెండవ ప్రపంచయుద్ధాన్ని వాయిదా వేసిందని చెప్పుకునేటటువంటి స్పెయిన్ అంతర్యుద్ధంలో కవులూ, కళాకారులూ ఏం చేశారు? మీరు ఏ సాహిత్య విమర్శకుని పేరు చెప్పండి. ఏ కవి పేరు చెప్పండి. ఏ కళాకారుని పేరు చెప్పండి. ఏ తత్వవేత్త పేరు చెప్పండి. ఏ మేధావి పేరు చెప్పండి. 1930లలో బతికిన వాండ్లు. వీళ్లందరూ చేతిలో తుపాకి పట్టుకుని ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి యుద్ధ రంగంలోకి దిగారు. వాళ్లందరికీ 30 ఏండ్లే. ఎట్లా శ్రీకాకుళం పోరాటంలో చేతిలో తుపాకి పట్టుకుని మేధావులూ, బుద్ధిజీవులూ ఆదివాసీ ప్రజల పక్షాన పోరాటానికి దిగారో అట్లా 1930ల నుంచి అటువంటి సందర్భాలు వచ్చినప్పుడు శ్రీశ్రీ ఆ ప్రజల పక్షం నిలబడ్డాడు. అది స్పెయిన్ అంతర్యుద్ధం కావచ్చు, అది శ్రీకాకుళ పోరాటం కావచ్చు. అట్లా బుద్ధిజీవులూ, కళాకారులూ పోరాడుతున్న ప్రజల పక్షం నిలబడ్డారో, ప్రజాస్వామ్యం కాపాడుకోవడానికి నిలబడ్డారో, విప్లవం తేవడానికి నిలబడ్డారో, వాళ్ల పక్షం శ్రీశ్రీ నిలబడ్డాడు. సరిగ్గా ఆయన కవిత 'జయభేరి' కావచ్చు, 'ప్రతిజ్ఞ' కావచ్చు, అది 'జగన్నాథ రథచక్రాలు' కావచ్చు. ఏ కవితైనా ఆ కాలంలో ఆయన రాసిన కవితలన్నీ చూడండి. అది స్పెయిన్ అంతర్యుద్ధం ప్రేరణతోటి, అవి సామ్యవాద శక్తుల విజయం ప్రేరణతో రాసిన కవితలు. ఈ కాలమంతా కూడా స్పెయిన్ అంతర్యుద్ధంలో రచయితలు నిర్వహించిన పాత్ర ఏమిటి? ఇంత చెప్పి విప్లవ రచయితల సంఘం సాహిత్య, సాంస్కృతిక రంగంలో ఒక నూతన ప్రజాస్వామిక విప్లవానికీ, ఒక ప్రజా యుద్ధానికీ అండగా నిలబడతామని చెప్పడం తప్ప స్పెయిన్ అంతర్యుద్ధంలో లాగ రచయితలందరూ తుపాకులు పట్టుకుని యుద్ధరంగంలోకి వెళ్లడం లేదు. కాని రచయితలందరూ తుపాకులు పట్టుకుని ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి యుద్ధరంగంలోకి వెళ్లమనే ఆదర్శం మన ముందుంది. ఆ ఆదర్శం స్ఫూర్తి నుంచి వచ్చిన వాడు శ్రీశ్రీ. ఆ ఆదర్శాల్ని ఎత్తి పట్టి తన 'మహాప్రస్థాన' గీతాలను రాసినటువంటి వాడు శ్రీశ్రీ. ఇది ఆయన ఉద్యమ జీవితంలోని ఒక స్ఫూర్తి. 1933 నుంచి 44 దాకా, 36లో ప్రేంచంద్, సజ్జాద్ జహీర్ నాయకత్వంలో ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్, ఇప్టా అనే రెండు సంస్థలు ఏర్పడ్డాయి. ఈ రెండు సంస్థలూ తెలుగు నేల మీద అరసంగా, ప్రజా నాట్యమండలిగా ఏర్పడినప్పుడు శ్రీశ్రీ అధ్యక్షుడయ్యాడు. అయితే ప్రపంచంలోనే అపూర్వంగా, ఫాసిజం ఓడిపోయి, నాజీజం ఓడిపోయి, సామ్యవాద శక్తుల నాయకత్వంలో ప్రజాస్వామిక శక్తులు కూడా గెలిచి వలస దేశాలు విముక్తమయ్యే కాలానికి, తెలంగాణలో రైతాంగ సాయుధ పోరాటం ప్రారంభమై అభ్యుదయ రచయితల సంఘానికి, ప్రజానాట్య మండలికి తెలుగు నేల మీద ఉండే అభ్యుదయ రచయితలకు అది సవాలుగా నిలిచింది. అది ఫాసిజానికి వ్యతిరేక పోరాటంగా మాత్రమే గాక, అది వీర తెలంగాణ రైతాంగ పోరాటంగా తెలిసొచ్చింది. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం ఫాసిస్టు వ్యతిరేక పోరాటం నుంచి అరసంను, ప్రజానాట్య మండలిని ఒక అడుగు ముందుకు వేసి వర్గ పోరాటాన్ని బలపరిచే సాహిత్య, సాంస్కృతిక సంస్థలుగా పదనెక్కించింది.

ఆ నేపథ్యంలో 43 నుంచి 55 లో రాజమండ్రిలో మహాసభలు జరుపుకునేంత వరకు శ్రీశ్రీ అరసం అధ్యక్షుడు. రాజమండ్రి సభలో శ్రీశ్రీ అద్భుతమయిన అధ్యక్షోపన్యాసం చేసారు. అరసం, ప్రజానాట్యమండలి తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటాన్ని బలపరుస్తూ చాలా సాహిత్యాన్ని తెచ్చాయి. చాలా నాటకాలు వేశాయి. సాంస్కృతిక ప్రదర్శనలు చేశాయి. ప్రజా నాట్యమండలి తెచ్చినటువంటి 'మా భూమి' నాటకం గానీ, ప్రజా నాట్యమండలి భారత దేశ చరిత్రలోనే కమ్యూనిస్టు పార్టీ కొరకు మహిళల నాయకత్వంలో బుర్రకథ దళాన్ని కొండపల్లి సీతారామయ్య తయారు చేయడం కానీ, తెలంగాణ సాయుధ పోరాటానికి అండగా సాహిత్య సాంస్కృతిక కంట్రిబ్యూషన్‌ను గానీ, దోహదం గానీ ఇవాళ మనం గుర్తు చేసుకుంటే, ఈ దేశంలోనే బహుశా ప్రపంచంలోనే వర్గ పోరాటానికి అండగా నిలిచేటటువంటి సాహిత్యాన్ని సృష్టించడం శ్రీశ్రీ నాయకత్వంలో జరిగింది.

అందుకని తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాన్ని శ్రీశ్రీ బలపరచలేదని మాట్లాడే వాళ్లు శ్రీశ్రీని వ్యక్తిగా చూస్తున్నారు. తెలంగాణ సాయుధ పోరాటాన్ని బలపరిచిన అరసానికి ఆయన అధ్యక్షుడు. 1943 నుంచి 1955 మధ్య కమ్యూనిస్టు పార్టీ నిషేధించబడిన కాలంలో ఆయన అధ్యక్షుడు. 'మా భూమి' నాటకం నిషేధింపబడిన కాలంలో ఆయన అరసానికి అధ్యక్షుడు 1955 దాకా. అంత మాత్రమే కాదు, హరీన్ ఛటోపాధ్యాయ రాసిన కవిత గురించి తెలిసిందే. కాటూరు, ఎలమర్రులో గాంధీ విగ్రహం చుట్టూ మహిళలను పురుషులను వివస్త్రలను చేసి మలబారు పోలీసులు చిత్రహింసలు పెట్టినప్పుడు హరీన్ ఆ కవిత రాశాడు. ఆ రచనను మొట్టమొదట అనువాదం చేసినవాడు శ్రీశ్రీ. అయితే అది పూర్తి అనువాదం కాదు. దాని గురించి చాలా మంది ఆరుద్రే ఆ గీతం మొట్టమొదటి అనువాదకుడనుకుంటారు. ఆరుద్ర పూర్తిగీతం అనువాదం చేసాడు. అదే సుందరయ్యగారి 'వీర తెలంగాణ పోరాట గుణపాఠాలు' పుస్తకం అనుబంధంగా వేయడంతో ఎక్కువ ప్రచారం అయ్యింది. శ్రీశ్రీ స్వతంత్ర, సంక్షిప్త అనువాదం మొదటిది. 'ఖడ్గసృష్టి'లో ఉంది.

ఆరుద్ర 'త్వమేవాహమ్'కు ముందుమాట రాస్తూ శ్రీశ్రీ తెలంగాణను ఎట్లా ఆవాహన చేసుకున్నాడో చూడవచ్చు. తెలంగాణ సాయుధ పోరాటం విరమణ జరిగింది 1951లో. మొత్తంగా కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల రాజకీయాలకు పోయింది. పోయింది గానీ దున్నేవారికి భూమి అనేటువంటి భూసంస్కరణ నినాదం ఏ కమ్యూనిస్టు పార్టీ తీసుకొచ్చిందో అదింకా అమలవుతుందని భ్రమలు పడుతున్న రోజులలో, ఆశలు ఉన్న రోజుల్లో ఆంధ్రలో 1955లో ఉప

ఎన్నికలొచ్చాయి. ప్రకాశం పంతులు ప్రభుత్వం పడిపోయి అవొచ్చాయి. చాలా మంది రచయితలూ బుద్ధిజీవులూ రాజకీయాలలో పాల్గొనాలన్న విషయంలో ఒక ఇన్‌హిబిషన్ ఫీలవుతారు. అదొక తక్కువ భావంగా చూస్తారు. అయ్యో రచయిత ఏమిటీ? ఇటువంటి రాజకీయ కార్యకర్త కావడమేమిటీ? అని కూడా అనుకుంటుంటారు. బహుశా ఆనాటికీ ఈనాటికీ ఆ ఆంధ్ర ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ ప్రచారంలో శ్రీశ్రీ తిరిగినట్టుగా, ఏ కవీ, రచయితా తిరిగి ఉండడు. ఆయన మహా కవిత్వ లక్షణంగానీ, కమ్యూనిస్టు పార్టీ ప్రచారంగానీ, మహాకవి బిరుదు కానీ మొత్తంగా బహుశా కాంప్లిమెంటే. ఎందుకంటే శ్రీశ్రీ ఒక్కడుగా, నార్ల చిరంజీవి లాంటి వాళ్లు ఒకరిద్దరు అండగా ఉండి మొత్తం సాహిత్య దిగ్గదంతులంతా రెండు పత్రికల వల్ల చీలిపోయిన కాలమది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు అనుకూలంగా ఇవాళ మీడియా ఎంతో దుర్మార్గంగా ఆలోచిస్తున్నది. మొత్తం మీడియా, సాహిత్యం కార్పొరేటీకరణకు లోనవుతున్నది. నిన్న హైదరాబాద్‌లో జరిగినటువంటి సభ శ్రీశ్రీని కార్పొరేటీకరించడానికి జరిగిన కుట్ర. ఇది ఒక శ్రీశ్రీనే హైజాక్ చేసేందుకు చేసిన ప్రయత్నం కాదు. ఇవాళ తెలుగు నేల మీద సాహిత్య రంగాన్ని కో ఆప్ట్ చేసుకునే పద్ధతిని మీరు చూసినట్టయితే, సంఘాలు ఉండగా, (సంఘాలు లేని వేరే రాష్ట్రాల్లో ఇటువంటి ప్రయత్నాలు చాలా కాలంగానే మొదలయ్యాయి) కాని సంఘాలుండగా, ప్రజా సంఘాలుండగా, విప్లవ రచయితల సంఘం ఉండగా, తెలుగు రచయితలను, తెలుగు కళాకారులను కోఆప్ట్ చేసుకోవడానికి ఎంత దుర్మార్గమైన కుట్ర జరుగుతున్నదో. దానికి పరాకాష్ట నిన్న శ్రీశ్రీ మూడు సంపుటాలను ముఖ్యమంత్రి చేతుల మీదుగా ఆవిష్కరింపచేయడం. ఏ శ్రీకాకుళ రైతాంగ పోరాటంలో అమరులైన 370 మంది నెత్తురంటిన చేతుల మీదుగా ఏ రెండు వేల రూపాయల పర్సును తీసుకోవడానికి నిరాకరిస్తున్నానని శ్రీశ్రీ చెప్పాడో, ఆ శ్రీకాకుళ పోరాటం ఆనాటికి సెట్‌బ్యాక్‌కు గురయింది కావొచ్చు. నిజానికి సత్యం, కైలాసంలు మిగిలి ఉన్నారు. పాణిగ్రాహి అమరుడయ్యాడు. భాస్కర రావయ్యాడు, మల్లికార్జునుడయ్యాడు. పంచాది నిర్మలయ్యింది. అందరూ అమరులైపోయారు. 370 మంది అప్పటికే చనిపోయారు. సత్యం, కైలాసంలు మాత్రమే మిగిలి ఉన్నారు. అటువంటి సమయంలో శ్రీకాకుళ పోరాటం పక్షం శ్రీశ్రీ నిలబడకుండా చేయడం కోసం ఆయనను తమలో కోఆప్ట్ చేసుకోవడానికి అభ్యుదయ రచయితల సంఘం, అప్పుడు అక్కినేని నాగేశ్వరరావు, ఇప్పుడు చిరంజీవి అప్పుడు నక్షత్రస్తపకం అనే సంస్థ, ఇప్పుడు మనస్సు ఫౌండేషన్ అనే సంస్థ. చాలా విచిత్రంగా పోలిక ఎట్లా జరిగిందో చూడండి. ఇప్పుడు మనస్సు అనే సంస్థను ముందర పెట్టి ఒక చిరంజీవి ఒక రోశయ్య వీళ్లు, వీళ్ల చేతుల మీదుగా ఆయన సంపుటాలు ఆవిష్కరింపజేశారు. ఇవాళ రోశయ్య చేతులు గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగంగా నెత్తురులో తడిశాయి. వాకపల్లిలోనూ, భల్లుగూడలోనూ స్త్రీలను లైంగిక అత్యాచారం చేసిన స్థితిలో సిగ్గుపడాల్సిన చేతులవి. ఆ చేతుల మీదుగా శ్రీశ్రీ సంపుటాలు ఆవిష్కరణయ్యాయి. దేని కొరకు? శ్రీశ్రీని, తెలుగు సాహిత్యాన్ని కార్పొరేటీకరించడానికి. విప్లవ సాహిత్యాన్ని కార్పొరేటీకరించడానికి. ఇటువంటి దుర్మార్గం జరుగుతున్న సమయంలో మరి సరిగ్గా ఇప్పుడు మీడియా నిర్వహిస్తున్న పాత్రే, ఇప్పుడు సాహిత్యాన్ని కార్పొరేటీకరించే కుట్ర నేపథ్యం నుంచి ఒకసారి 55 ఎన్నికలలో ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ అనే రెండు పత్రికలు, నార్ల వెంకటేశ్వరరావు, పండితారాధ్యుల నాగేశ్వరరావు అనే ఇద్దరు దిగ్గంతులైన సంపాదకులు ఒక క్యాంపెయినుగా తెలుగు నేలమీద ఉండే రచయితలందరినీ, అభ్యుదయ రచయితలందరినీ కూడగట్టి శ్రీశ్రీని ఒంటరిని చేశారు. ఎన్ని రోజులు ఎన్నికలు జరిగాయో, ఎన్ని రోజులు ఎన్నికల ప్రచారాలు జరిగాయో అంతటా శ్రీశ్రీ కాలికి బలపం కట్టుకుని తిరిగాడు. నేను ఇది ప్రత్యేకించి ఎందుకు చెబుతున్నానంటే ఇంత ఇన్వాల్వయి రాజకీయాలలో తిరిగినటువంటి ఒక కవి ఏ స్థితికి వెళ్లాడు. మనసా, వాచా, కర్మణా అంటారు. అంత మనసా, వాచా, కర్మణా అందులో తిరిగి పిచ్చివాడయిపోయాడు శ్రీశ్రీ. ఇది ప్రత్యేకంగా యువతరం కవులకు ఎందుకు చెబుతున్నానంటే కారణం ఉంది. సిగ్గుపడకండి రాజకీయాలలో పని చేయడానికి. రాజకీయాలు లేకుండా కవిత్వం లేదు. రాజకీయాలే కవిత్వానికి పునాది. ఎందుకంటే రాజకీయాలు భూమి గురించి మాట్లాడుతాయి. కవిత్వం భూమి ఉపరితలం. విప్లవ రచయితల సంఘం, భూమి పుత్రుల సంస్కృతి గురించి మాట్లాడుతుంది. విరసం మంచి రాజకీయాల గురించి కృషి చేసే సంస్థ. మంచి రాజకీయాలను సాంస్కృతిక రంగంలో ప్రచారం చేయడానికి వచ్చినటువంటి సంస్థ. కాని పునాది అయినటువంటి రాజకీయాలలో పని చేయడానికి వచ్చినటువంటి వారు గర్వపడాల్సిన విషయంగా శ్రీశ్రీ మనకు ఆదర్శంగా నిలిచాడు 1955 ఎన్నికలలో. 55 ఎన్నికలను నేను వర్గపోరాటం అంటున్నాను. చాలా విచిత్రంగా మూడు పార్లమెంట్ ఎన్నికలు వర్గపోరాటంగా జరిగాయి. 55లో జరిగింది, 59లో నంబూద్రిపాద్ ప్రభుత్వం పడిపోయింది. ఆయన దున్నేవారికి భూమి ఇస్తానన్నందుకు కాదు, విద్యా సంస్థలు జాతీయం చేసినందుకు. ఎవరికైనా భ్రమలుంటే పార్లమెంటరీ రాజకీయాల పట్ల చరిత్రలోకి వెళ్లి తొలగించుకోండి. కమ్యూనిస్టు పార్టీ ఇస్తానన్నటువంటి హామీ భూమి ఇస్తానన్నందుకు కాదు. ప్రైవేట్ యాజమాన్యాల చేతిలో ఉన్న విద్యను జాతీయం చేస్తానన్నందుకు ఆయన ప్రభుత్వాన్ని పడగొట్టారు. సరిగా 73లో చిలీలో ప్రభుత్వానికి వచ్చినటువంటి అలెండీ కూడా పడిపోయాడు. అది ఆఖరి ప్రయోగం. 55, 59, 73 పార్లమెంటరీ రాజకీయాల పట్ల ఎవరికైనా భ్రమలు ఉంటే విడిపోయిన ఆఖరి ప్రయోగం చిలీ అలెండీ ప్రభుత్వం. కమ్యూనిస్టులూ, ప్రజాస్వామికవాదులూ, దేశాభిమానులూ అందరూ కలిసి అలెండీని దేశాధ్యక్షుడిగా పెట్టి ఎన్నుకున్నారు. అలెండీ పాబ్లో నెరుడా వంటి కవి ప్రోత్సాహంతో ఎన్నికలలో గెలిచాడు. అధికారానికి వచ్చాడు. రాగి పరిశ్రమను జాతీయం చేశాడు. అంతే రాగి పరిశ్రమ, అంతర్జాతీయ రాగి పరిశ్రమ కుట్ర చేసి అలెండీ రాష్ట్రపతి భవనం మీద బాంబువేసి అలెండీని చంపేసింది. క్యాన్సర్‌తో బాధపడుతున్న పాబ్లో నెరూడాను చూడడానికి ఎవరూ పోవద్దని ఆంక్షలు విధించారు. వారంరోజుల తర్వాత ఆయన బలవన్మరణం చెందాడు.

చిన్న సంస్కరణలు కూడా చేయలేమనే విషయం కమ్యూనిస్టు పార్టీ 1955 ఎన్నికలప్పుడు ఓడిపోయినపుడు రుజువైంది. 59, 73లప్పుడు పూర్తిగా తెలిసొచ్చింది.

1964-65లో కమ్యూనిస్టుపార్టీ చీలిపోయింది. చాలామంది ఏమనుకున్నారంటే ఈ చీలిక అనేది వర్గపోరాటం కారణంగానే చీలిపోయిందని. కాని వర్గ సమాజం ఉన్నంతవరకు వర్గపోరాటం జరగాల్సిందే గదా అని అనుకున్నారు.

1956లో కృశ్చేవ్ శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీ, శాంతియుత సహజీవన సిద్ధాంతం ప్రతిపాదించిన తరువాత గ్రేట్ డిబేట్ నడిచింది. అది ప్రారంభమైనప్పుడు శ్రీశ్రీ 'ఖడ్గసృష్టి' కవిత రాయడం ప్రారంభించాడు.

'రెండు రెళ్లు నాలుగు అన్నందుకు
గూండాలు గుండ్రాళ్లు విసిరే సీమలో
క్షేమం అవిభాజ్యం అంటే జైళ్లు నోళ్లు తెరిచే భూమిలో'

అని మొదలవుతుంది. పూర్తి చేయలేదు. 1966లో పూర్తి చేశాడు. 10 ఏళ్లు పట్టింది 'ఖడ్గసృష్టి' కవిత పూర్తి చేయడానికి. ఇది చాలా యాదృచ్ఛికంగా కావొచ్చు. ఎంత విచిత్రం! ఎందుకంటే ఎవరో చెప్పినట్టు ఆయన మాటల వెంట అర్థాలూ భావాలూ పరిగెత్తుతాయి. ఈ పరిగెత్తడానికి ఆయన ఆకాశం నుంచి ఊడిపడడం కాదు. తన సమకాలీన చైతన్యాన్ని ఆయన రక్తంలో ఇంకించుకున్నాడు. అందువల్ల సందర్భానికి స్పందించడం అనేది శ్రీశ్రీలో మనకు కనిపిస్తుంది. 56లో మొదలు పెట్టిన కవిత 66లో ఏమని ముగుస్తుంది.

'అహింస ఆశయమే కాని
ఆశయం సాధించడానికి
ఆయుధం అలీనం కాదు
అందుకే అంటున్నాను నేను
అందుకో ఆయుధం అని'

ఎందుకు ఈ పదేళ్లు పట్టింది. వ్యక్తిగా పదేళ్లు పట్టిండొచ్చుగానీ, ఈ గ్రేట్ డిబేట్ పదేళ్లు నడిచింది. కృశ్చేవ్ శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీ, శాంతియుత సహజీవనం చెప్పిన తరువాత, కార్మిక వర్గానికి ఓ పదేండ్ల పాటు ఏ కార్యక్రమం లేని సమయం. అంటే కమ్యూనిస్టు పార్టీకి కూడా ఏ కార్యక్రమం లేకపోవడం. కమ్యూనిస్టుపార్టీలో ఉండేటటువంటి సాహిత్య సాంస్కృతిక ప్రజాసంఘాలకు ఏ కార్యక్రమమూ లేకపోవడం కూడా. ఈ గ్రేట్ డిబేట్‌కు పదేళ్లు ముగిసి 'వర్గ సమాజం ఉన్నంత కాలం వర్గ పోరాటం ఉంటుంది. వర్గాలనేవి ఎక్కడో ఉండక్కరలేదు. కమ్యూనిస్టు పార్టీలోనే ఉండొచ్చు.' అందుకు రెండు పంథాల మధ్య పోరాటం జరుగుతుంది. 'అందుకే బంబార్డ్ ది హెడ్‌క్వార్టర్స్' కేంద్రాన్నే బద్దలు కొట్టండి. 'స్విమ్ అగెనెస్ట్ టైడ్' ఏటికి ఎదురీదండి. 'ఓపెన్‌గా ఉండండి' పారదర్శకంగా ఉండండి. 'కుట్రలూ, కుహకాలూ చేయకండి' అని 66లో శ్రామివర్గ సాంస్కృతిక విప్లవం పిలుపునిచ్చిన తరువాత, సరిగా 66లో 'ఖడ్గసృష్టి' రచన ముగిసింది. 66లో వచ్చిన శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం ప్రభావంతో నక్సల్బరీ ప్రారంభమయింది. శ్రీకాకుళ పోరాటం గోదావరి లోయంతా విస్తరించినకాలం. ఈ మధ్యకాలంలో అంటే 1965లో కమ్యూనిస్టు పార్టీ చీలిపోయింది. ఈ చీలిక సమయంలో విడిపోయిన సి.పి.ఎం. వర్గపోరాటం చేస్తుందని చాలామంది ఆశపడ్డారు. లేదా భ్రమపడ్డారు. అప్పటి కేంద్ర హోంమంత్రి గుల్జారీలాల్ నందా పార్లమెంట్‌లో శ్వేతపత్రం పెట్టాడు. చీలిపోయిన సిపిఎంలోకి వచ్చిన వాళ్లంతా కూడా చైనా యుద్ధాన్ని, 1962 నాటి యుద్ధాన్ని ఆసరాగా చేసుకుని హిమాలయాలలో ట్రెంచెస్ తవ్వాలని పిలుపునిచ్చారని చెప్పాడు. తరువాత సిపిఎం నాయకత్వాన్నంతా జైల్లో పెట్టారు. పెట్టినప్పుడు దేశమంతా ఎం.సి. ఛటర్జీ నాయకత్వంలో పౌరహక్కుల పోరాటం, ఉద్యమం ప్రారంభమయింది. అట్లా ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పడినటువంటి ఎపిసిఎల్‌ఎకు శ్రీశ్రీ అధ్యక్షుడు. అంటే ఇవాళ మనం చూస్తున్న పౌరహక్కుల ఉద్యమానికి ముందు ఆ సంఘానికి తొలి అధ్యక్షుడు శ్రీశ్రీ.

ఆయన 65లో తొలి అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. పౌరహక్కులకోసం ఉద్యమించాడు. పోరాడాడు. సరే మార్క్సిస్టు పార్టీకి దాని అవసరం తన వాళ్ల విడుదలతో తీరింది. పౌరహక్కులు అవసరం లేకుండా పోయాయి. అందుకే అంటే కొద్దికాలంలోనే శ్రీకాకుళంలో ఎప్పుడయితే రైతాంగ పోరాటం ప్రారంభమయిందో వాటిని రాష్ట్ర ప్రభుత్వం 'కల్లోలిత ప్రాంతం'గా ప్రకటించింది. శ్రీకాకుళం మొదలుకొని గోదావరి లోయలో ఉండేటటువంటి ఖమ్మం, వరంగల్, కరీంనగర్ జిల్లాలలో కొత్తగూడెం, ఎల్లెందు, నర్సంపేట, మానుకోట, ములుగు, ఏటూరునాగారం, మంతెన, మహాదేవపురం మొదలైన ప్రాంతమంతా కూడా కల్లోలిత ప్రాంతంగా ప్రకటించబడింది. ఆ ప్రకటనను వ్యతిరేకిస్తూ, ఎన్‌కౌంటర్లను వ్యతిరేకిస్తూ పోలీసు క్యాంపులను వ్యతిరేకిస్తూ ముఖ్యంగా శ్రీకాకుళం ప్రాంతంలో నాగిరెడ్డి గారి కోరిక మేరకు శ్రీశ్రీ దిగంబర కవులతో కలిసి పర్యటించాడు. ఆ తరువాత శ్రీశ్రీ విశాఖపట్నంలో తన షష్టిపూర్తి కోసం కర్నూలు వచ్చినప్పుడు కటకం నుంచి కర్నూలు దాక విప్లవం పురిటి నొప్పులు అనుభవించిందని చెప్పాడు.

కటకం రెఫరెన్సు ఎందుకంటే ఒరిస్సాలో ఉండేటటువంటి కటకం నుంచి శ్రీకాకుళం రైతాంగ ఉద్యమ ప్రాంతం నుంచి విశాఖపట్నం కర్నూలు దాకా శ్రీశ్రీ దిగంబర కవులు, కామ్రేడ్స్ చెరబండరాజు, నిఖిలేశ్వర్, జ్వాలాముఖిలతో కలిసి విస్తృతంగా రాజ్యహింసకు వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. పౌరహక్కుల సంఘం ఏర్పడడానికి ముందే తిరుగుతూ ఇట్లా పౌరహక్కుల సంఘం ఏర్పడగానే ఆయన అధ్యక్షుడయ్యాడు. ఆ రోజులలోనే శ్రీశ్రీ షష్టిపూర్తి పేరుతో సాహిత్యరంగంలో ఒక రకంగా మలుపు. ఇది జరగడానికి ముందే 'తెలుగు వెలుగు' అనే పత్రికలో ఎ.బి.కె. ప్రసాద్, కాశీపతి ఆయనను ఇంటర్వ్యూ చేశారు. శ్రీకాకుళ పోరాటం గురించి మీరేమనుకుంటున్నారు అని అడిగారు. "నేను యువకునిగా ఉంటే శ్రీకాకుళం పోయే వాడి'నని చెప్పాడు.

కాశీపతి శ్రీకాకుళ సాయుధ పోరాటాన్ని మీరు బలపరుస్తారా? అంటే పోరాటం చీపురు పుల్లలతో చేయరు కదా అని స్పాంటేనియస్‌గా చెప్పినాడు. బహుశా మహాప్రస్థానం గురించి మాత్రమే మాట్లాడేవాళ్లు, లేదా 'మానవుడా' కవిత గురించి మాట్లాడేవాళ్లు 'ఖడ్గసృష్టి'లో ఉండేటటువంటి శరచ్చంద్రిక, మరో ప్రస్థానంలో ఉండేటటువంటి 'జట్కావాలా' ఎంత అద్భుతమైన కవితలవి, భాషాపరంగా, కవిత్వ పరంగా. ఒక సున్నితమయిన భావాలకు రూపమిచ్చే విషయంలో, గొప్ప మనిషి మనస్వి రాసేటటువంటి కవితలవి. శరచ్చంద్రిక గానీ, జట్కావాలా గానీ. జట్కావాలా నిర్దిష్టంగా చెబుతాడు. మరో ప్రస్థానంలో ఉండేటటువంటి చాలా కవితలు నిర్దిష్టమైనవే. మహాప్రస్థానంలో ఉండే కవిత్వమంతా విహంగ వీక్షణంలో ఉండేటటువంటిది, అంతర్జాతీయ దృష్టి గల కవిత్వమయితే, మరో ప్రస్థానంలో భూమార్గం పట్టించాడు. నిర్దిష్టంగా భూమార్గం పట్టించాడు. మొత్తం మరో ప్రస్థానంలోని కవితలు నిర్దిష్టమైనవే. రెండో విషయం ఏమిటంటే 70ల ముందు కవితలు మీరు చూడండి. అవి మహాప్రస్థానంలోవిగానీ, ఖడ్గసృష్టిలోవిగానీ వాటిలో యూరపియన్ కవితానువాదాలు ఉంటాయి. కాని 70ల తర్వాత మరో ప్రస్థానంలో

ఉండే కవితలన్నీ స్థల కాలాలను చెప్పే కవితలు. చాలా వరకు లాటిన్ అమెరికన్ కవితలు. ఒకే ఒకటి టర్కీ కవిత. అది కూడా మూడో ప్రపంచం. ఇవాళ విప్లవం నడుస్తున్న ప్రపంచమంతా మూడో ప్రపంచమే. గూగీ చెప్పినట్టు విప్లవం కేంద్రం ఇటు తూర్పునకు మారిపోయింది. ఈ తూర్పునకు మారిపోయిన క్రమం శ్రీశ్రీ పట్టుకున్నాడు. మరో ప్రస్థానం కవితలలో చాలా ఉద్దేశపూర్వకంగా ఆయన చేసిన అనువాదాలన్నీ లాటిన్ అమెరికన్ కవులవే. ఈ శ్రీకాకుళం పోరాటం సందర్భంగానే మళ్లీ ఆయన పిలుపునిచ్చాడు:

*వెళ్లండి నా పాటల్లారా! విశాఖ పట్టణానికి*
*మొక్కవోని ధైర్యంతో కదలండి*
*ఉక్కు సంకల్పంతో నడవండి*
*వెళ్లండి నా పాటల్లారా!*
*విశాఖ పట్టణం మీదికి*
*వెనకా ముందూ ఏమీ ఎవరూ లేనోళ్లని*
*అరిగేలా తిరిగే కాళ్లని*
*ఆకలితో అరిచే నోళ్లని*
*మోసగిస్తూ - తిండిని దొంగలించే వాళ్లని*
*విషాన్ని రంగరించే వాళ్లని*
*శిక్షార్హులుగా నిలబెడతామని చెప్పండి నా పాటల్లారా!*

*ఆగ్రహం కొలిమిలో మండే*
*ఆశయాలే ఆయుధాలుగా*
*సంఘటిత శక్తిని*
*కవచంగా ధరించి*
*శపథం వహించి*
*సాహసంగా ప్రతిఘటించి*
*సాగరంలా పరాక్రమిస్తే*
*సైన్యాలే వెనుకంజ వేస్తాయని*
*చాటండి నా పాటల్లారా*
*నాటండి విప్లవ బీజాలు*
*మూగుతున్నాయి మేఘాలు*
*మోగుతున్నాయి బాజాలు*
*మెరుపు తళతళల్లో*
*ఉరుముల పెళపెళల్లో*
*విజయం వర్షించాలి!*
*విప్లవం వర్ధిల్లాలి!*
*వెళ్లండి నా పాటల్లారా*
*అశేషాంధ్ర జనానీకపు*
*విశాల హృదయాల్లోకి!*
*విషాన్ని రంగరించే వాళ్లని*
*శిక్షార్హులుగా నిలబెడతామని చెప్పండి*
*నా పాటల్లారా విప్పండి*
*మీ గొంతుకను*
*నా గొంతుక ద్వారా*

*అన్నం కావాలని*
*కోరడం అపరాధమవుతుంటే*
*హక్కులు కావాలని కోరడం*
*అపచారమౌతుంటే*
*మనిషిగా జీవించే అవకాశాలే*
*మాయమౌతుంటే*
*ఒళ్లంతా గాయమౌతుంటే*
*చదువులు తరిమేసి*
*విద్యాలయాలలో మరణం*
*ప్రవేశిస్తుంటే*
*(ఉస్మానియా క్యాంపస్‌లో విద్యార్థులపై రాపిడ్ యాక్షన్ ఫోర్స్,*
*గ్రేహౌండ్స్ దాడి మన కళ్లకు కట్టడం లేదా!)*
*అక్రమాలూ, అన్యాయాలూ,*
*అజమాయిషీలూ*
*అబద్ధం*
*పరిపాలిస్తుంటే*

రాక్షస ఉగాదికి రాసిన గీతం ఇది. సందర్భానికి స్పందించి ఎవరి కోసం రాసినట్టు! ఇప్పుడు ఇక్కడ కూర్చున్న మన కోసం రాసినట్టు. విరసం కోసం రాసినట్టు. విప్లవ ప్రజానీకం కోసం రాసినట్టు. ఇవాళ దండకారణ్యంలో జరుగుతున్న యుద్ధంలో ప్రజల పక్షం నిలబడడానికి రాసినట్టు. ఇవ్వాళ ఆయన బతికుంటే

*వెళ్లండి నా పాటల్లారా*
*దండకారణ్యంలోకి వెళ్లండి.*
*అక్కడి ప్రజలు చేస్తున్న*
*పోరాటాలకు అండగా నిలబడండి*
*చాటండి నా విప్లవ సందేశాన్ని*

అని చెప్పేవాడు శ్రీశ్రీ.

83లో చనిపోయిన తరువాత కూడా ఇవ్వాటికీ ఇంత ఉద్యమ ప్రాసంగికత శ్రీశ్రీకి ఉంది. అ

వ్యాసం

# స్త్రీల పట్ల శ్రీశ్రీ దృక్పథం

- కాత్యాయనీ విద్మహే

కష్టజీవికి అటూ ఇటూ ఉండే వాడే కవి అని చెప్పగలిగిన వర్గ దృక్పథం శ్రీశ్రీది. ఆర్థిక అసమానతల అవకతవకల సమాజ లక్షణాన్ని గుర్తించిన వాడతను. ఐశ్వర్యం ఒకచోట కేంద్రీకరింపబడుతుంటే దరిద్రం మరొకవైపు దట్టమవుతున్న క్రమాన్ని అర్థం చేసుకున్న వాడు. అందుకే ఆర్థిక అసమానతలు లేని ఒక నవ సమాజాన్ని, సామ్యవాద వ్యవస్థను శ్రీశ్రీ కలగన్నాడు. సామ్యవాద వ్యవస్థ నిర్మాణానికి సాయుధ విప్లవాన్ని ఆహ్వానించాడు. సాహిత్యాన్ని సాయుధం చేసి లక్ష్యం పట్ల నిబద్ధతను ప్రకటించాడు. మరణించే వరకు దానికే కట్టుబడి ఉన్నాడు. ఆర్థిక అసమానతలను గుర్తించిన శ్రీశ్రీ స్త్రీ పురుష అసమానతలను గుర్తించాడా? స్త్రీ సమస్యల పట్ల ఆయన దృక్పథం ఏమిటి? అన్న కోణం నుండి శ్రీశ్రీని ఇప్పుడు అంచనా వేయాలి.

1975 తరువాత అభివృద్ధి చెందిన స్త్రీల ఉద్యమం, స్త్రీవాద దృక్పథం సాహిత్యాధ్యయనంలోకి స్త్రీల దృష్టికోణాన్ని ప్రవేశపెట్టాయి. స్త్రీలు పాఠకులుగా పురుషుల సాహిత్యాన్ని స్త్రీల ప్రయోజనాల దృష్ట్యా విలువకట్టే అధ్యయన పద్ధతి, విమర్శనా పద్ధతి అందులో భాగంగానే తెలుగు సాహిత్యంలోకి ప్రవేశించాయి. "ఆయా రచయితలకు స్త్రీవాదం అంటే ఏమిటో తెలుసా?" అన్నది ముఖ్యం కాదిక్కడ. స్త్రీవాదం ఒక సిద్ధాంతంగా రూపొందింది. నిత్య జీవితానుభవాల నుండే అన్నది మరిచిపోరాదు. రచయితలు సమాజంలో భాగంగా ఉంటూ జీవితంలో స్త్రీపురుష సంబంధాలను ఎలా అర్థం చేసుకొంటున్నారు? కనీస లౌకిక దృక్పథంలోనైనా స్త్రీ సమస్యను గురించిన అవగాహన కనబరచ గలుగుతున్నారా? అన్న ప్రశ్నలతో ఈ అధ్యయనం సాగుతుంది. ఈ క్రమంలోనే తెలుగులోనూ లింగ వివక్ష స్వరూప స్వభావాలను రచయితలు ఏ మేరకు తమ సృజన సాహిత్య వస్తువుగా చేసుకొన్నారో, ఏ మేరకు దానిపై ధిక్కారం ప్రకటించారో గుర్తించి, ఆ మేరకు ఆయా రచయితలను వర్తమాన స్త్రీవాద ఉద్యమావసరాలకు ఉపయోగపడగల సాంస్కృతిక శక్తులుగా గౌరవంతో స్వీకరించడం మొదలయింది. అదే సమయంలో ఎంతటి గొప్ప రచయితలైనా, అభ్యుదయ దృక్పథం కలవాళ్లైనా స్త్రీ సమస్యలను అర్థం చేసుకొనటంలో ఎన్ని పరిమితులకు లోనయ్యారో, ఎంత సంప్రదాయ భావాలకు తలొగ్గారో నిరూపించి, నిరసించటం, నిరాకరించటం పరిపాటయింది. ఇది మొత్తంగా సాహిత్య విమర్శకు కొత్త చేర్పు అని చెప్పొచ్చు.

ఈ నేపథ్యంలో శ్రీశ్రీ లాంటి కవిని, రచయితను స్త్రీల పట్ల ఆయన వైఖరి ఎటువంటిదో నిరూపించే అధ్యయనం అవసరమవుతుంది. స్త్రీ సమస్యను ఎజెండాలోకి తీసుకొనలేదని మార్క్సిజం మీద విప్లవోద్యమాల మీద విమర్శ పెట్టింది స్త్రీవాదం. ఆ క్రమంలోనే అది శ్రీశ్రీ సాహిత్య స్వభావాన్ని నిర్ధారించగలిగిన విలువ అవుతుంది. శ్రీశ్రీ ప్రభవలో ప్రారంభించి మహాప్రస్థాన కవిత్వ రచన ముమ్మరం చేసింది 1930ల్లో. అప్పటికి స్త్రీల సమస్యను సాహిత్య వస్తువుగా చేసిన కందుకూరి, గురజాడల వారసత్వం ఉంది. సమకాలికుడైన చలం స్త్రీ సమస్య మీద తీవ్ర ధ్వనితో రచనలు చేస్తున్నాడు. ఆ విషయంలో విశ్వనాథకు ప్రతిద్వంద్విగా నిలబడ్డాడు చలం. శ్రీశ్రీ కూడా విశ్వనాథకు ప్రతిద్వంద్వే. అయితే ఆయన సంప్రదాయ దృక్పథానికి, రామాయణాది సంప్రదాయ కావ్యరచనకు సామాజిక జీవిత సంబంధంలేని భావ కవితా ధోరణికి - ప్రతిద్వంద్వి మాత్రమే.

అదలా ఉంటే శ్రీశ్రీకి గురజాడ సాహిత్యం మొత్తంగా కన్యాశుల్కం ప్రత్యేకంగా చాలా ఇష్టమైనవి. కన్యాశుల్కం కంఠోపాఠం. సందర్భానికి తగిన వాక్యాలు కన్యాశుల్కం నుండి ఏరి జీవితానికి అన్వయించడం సరదా. అంతగా కన్యాశుల్కం చదివినా 'కన్యాశుల్కమున స్త్రీ వ్యక్తులు సంఘ స్త్రీ స్వభావమును స్పష్టం చేస్తూ ఉంటారు' అన్నాడే కానీ ఆ స్వభావం ఏమిటో దానిని నిర్ణయించే విలువలేమిటో వివరించే ప్రయత్నం చేయలేదు. మధురవాణి పాత్రను తెగమెచ్చుకున్నాడు. 'మనస్పూర్వకమైన మానవత్వం' ఉన్న వ్యక్తిగా పేర్కొన్నాడు. కానీ కన్యాశుల్కంలోని లింగవివక్షా స్వభావం గానీ, దానిని ఎవరెవరు పనిగట్టుకొని బలోపేతం చేశారు? ఎవరెవరు ఏ రకంగా ఏమేరకు విమర్శించారు? ధిక్కరించే ప్రయత్నం చేశారు? అన్న విషయాలు శ్రీశ్రీ దృష్టికి రాలేదు. ఒకవైపు చలం స్త్రీల లైంగిక, కౌటుంబిక సమస్యలను రకరకాల కోణాల నుండి కథలుగా, నవలలుగా రాస్తూ లింగవివక్షా స్వభావాన్ని ప్రశ్నిస్తుంటే, శ్రీశ్రీ వర్గ సమాజ దుర్మార్గాన్ని, దోపిడీ స్వభావాన్ని నిరూపించడం పైననే దృష్టి పెట్టి రాశాడు. సమాజంలో సమస్యలు ఎన్నయినా ఉండవచ్చు. రచయిత అన్నింటిని వస్తువుగా చేసుకొని తీరాలన్న నియమం ఏమీలేదు. రచయిత ఎంచుకొనేది ఏదో ఒకటి మాత్రమే కావచ్చు. రచయితల చైతన్య వికాసానికి దోహదపడే ప్రత్యేక పరిస్థితులు అందుకు కారణమవుతుంటాయి. శ్రీశ్రీ పుట్టి పెరిగిన వాతావరణం, స్నేహాలు, సాహిత్య ప్రభావాలు, నడిపించిన చారిత్రక శక్తులు, సందర్భాలు, శ్రీశ్రీ చూపును వర్గ వివక్షమీద కేంద్రీకృతమయ్యేలా చేశాయనుకోవచ్చు.

అలాగని శ్రీశ్రీ స్త్రీల గురించి అసలేమీ ఆలోచించలేదా? అనలేదా? అంటే జీవితమే వస్తువుగా సాహిత్య రచన చేసిన వాళ్లు ఎవరైనా సమాజంలో సగమైన స్త్రీల గురించి ఎక్కడో ఒకచోట, ఏదో ఒకటి అనకుండా ఉండడం అసాధ్యం. అందువల్ల శ్రీశ్రీ కవిత్వం దగ్గర నుండి కథలు, నాటికలు, వ్యాసాలు మొదలైన వచన సాహిత్యం వరకు తనలోకి తాను చూసుకొన్న మనిషిగా ఆత్మపరీక్షగా రాసుకొన్న అనంతం నుండి సామాజిక జీవిత సంబంధాలలో ఎంతోమందితో సంవదించడానికి, సంభాషించడానికి అవకాశం ఇచ్చిన 'ప్రజ', 'వారం వారం' వంటి కాలమ్ రచనల వరకూ అన్నింటిని పరిగణనలోకి తీసుకొని పరిశీలిస్తే శ్రీశ్రీ స్త్రీల గురించి ప్రస్తావించిన సందర్భాలు తక్కువేమీ కాదు అని స్పష్టమవుతుంది. ఆ సమాచారమంతా స్త్రీల గురించి శ్రీశ్రీ దృష్టికోణాన్ని విశ్లేషించుకొనటానికి ఉపయోగపడుతుంది.

'మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు

పదండి త్రోసుకు

పోదాం పోదాం పైపైకి' - అని శ్రీశ్రీ సంబోధించిన ప్రజా సమూహంలో స్త్రీలున్నారా? భావోద్విగ్నాల నైరుప్యచిత్రం కవిత్వం. అందులో పురుషులు స్త్రీలు వేరువేరుగా స్పష్టమైన రేఖలతో కనబడక పోవచ్చు. కానీ శ్రీశ్రీ కథా ప్రధాన, పాత్ర ప్రధాన కవితలు కొన్ని రాశాడు. 'బాటసారి' కవితలో

'కూటికోసం కూలికోసం
పట్టణంలో బ్రతుకుదామని
తల్లిమాటలు చెవిని పెట్టక
బయలుదేరిన బాటసారి' గురించి చెప్పి ఆ బాటసారి వెనక 'తల్లి'ని మూర్తిమంతం చేశాడు. కొడుకు కోసం కళ్ళు వాకిట నిలిపి చూడడం, పలవరించడం, పీడకలలు కనడం - పేదరికపు బరువు స్త్రీ మీద పెట్టే ఒత్తిడిని సూచించేవే. అదే సంవత్సరం 'భిక్షువర్షీయసి' కవితలో ఆరిన కుంపటి విధాన కూర్చున్న దిక్కులేని ముసలి బిచ్చగత్తె గురించి రాసి సమాజానికి అలాంటి వాళ్ల పట్ల బాధ్యత ఏమీ లేదా? అని ఆవేదన చెందాడు. 1937లో 'కవితా! ఓ కవితా!' రాస్తూ కవిత్వాన్ని ఆవాహన చేశాడు. ప్రపంచపు బాధలు వింటూ, భావనలు కంటూ ఇంకా నేనేం విన్నానా అని ఒక జాబితా ఇచ్చాడు. అందులో

'నడిరేనిద్దురలో
అపుడే ప్రసవించిన శిశువు నెడదనిడుకొని
రుచిర స్వప్నాలను కాంచే
జవరాలి మనః ప్రపంచపుటావర్తాలు'న్నాయి.

'కడుపు దహించుకుపోయే
పడుపుకత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధల పాటల పల్లవి' విన్నాడు.

'సమ్మె కట్టిన కూలిల భార్యల...
ఆకటి చీకటి చిచ్చుల
హాహాకారం ఆర్తారావం' విన్నాడు. ఈ విన్నవాటినే కవిత్వంగా విన్నవించడానికి పూనుకున్నాడు. ఆ రకంగా పునరుత్పత్తిలో, లైంగిక పీడనలో, ఆర్థిక దోపిడీలో స్త్రీలనుభవించే వేదనామయ జీవితం శ్రీశ్రీ కవితా వస్తువైంది.

1946లో స్త్రీ స్త్రీ అని ఒక కవిత రాశాడు శ్రీశ్రీ. "కథానాయిక ఆహా ఆడది ఆఘనిశ్రేణి గరళద్రోణి తన వేదనలో మన జనయిత్రి" అని ప్రారంభమయ్యే ఈ కవితలో పాపాలకు మూలంగా కుటిలత్వపు మూర్తిగా ఆడదాని గురించి చెప్పే సామాజిక నీతిని తిరస్కరిస్తూ తాను మరణయాతన పడుతూ శిశువుకు జన్మనిచ్చే మాతృమూర్తిగా స్త్రీని ప్రతిపాదించాడు. ఆ మాతృత్వం చేతనే వంచితురాలు అవుతూ వివాహం వల్ల ప్రేమరాహిత్యంలోకి నెట్టబడుతూ వంటింటి కుందేలు జీవితానికి, ఘోషాకు బందీ చేయబడుతున్న స్త్రీ దుఃస్థితిని ప్రస్తావించి 'అన్యాయానికి అనుమతించిన అజ్ఞాని స్త్రీ' అని యుగ యుగాలుగా ఆమె ఏ దుస్థితిలో జీవిస్తున్నదో చెప్పాడు శ్రీశ్రీ. ఈనున బుట్టెడెందమున హెచ్చిన' అన్న పద్యపాద భాగంతో సత్యభామను 'వరమున బుట్టితిన్ భరత వంశము' అన్న పద్యభాగంతో ద్రౌపదిని ప్రస్తావించి అసమానతకు, అన్యాయానికి గురి అయిన స్త్రీ ధిక్కార చరిత్రను సూచించాడు.

"కథానాయిక నేటికాలపు రుద్రమదేవి
టాంకు మీద ఝాన్సీ రాణి
యుద్ధ నౌక మీద విజయపతాక' అన్న కవితాభాగంలో స్వయం శక్తితో, నిర్ణయాధికారంతో చరిత్రలో నిలిచిన వారిని స్ఫూర్తిగా చూపించాడు. స్త్రీల జీవితంలోని వివిధ పార్శ్వాలను వెలుగు నీడలను చూపించే ఈ కవిత స్త్రీ గురించి శ్రీశ్రీ ఆలోచన ఆయన వర్గ దృక్పథానికి అనువుగానే సాగుతున్నదని స్పష్టం చేస్తుంది.

1973లో సేద్యగాడిని సంబోధిస్తూ రాసిన 'మరోప్రస్థానం' గేయంలో రైతు శ్రమను, సంపదను దోచుకునే భూస్వాములు, ఆసాములు, దొరలు - రైతుల స్త్రీలపై - వాళ్లు రైతుల భార్యలు కావచ్చు, కూతుళ్లు కావచ్చు - జరిపే లైంగిక దోపిడీని ప్రస్తావించాడు. 1976లో రాసిన పంచరత్నాలులో కూడా

"చేదు నిజాలే ఇప్పుడు
నా కవితా వస్తువు" అని చెప్పి ఒళ్లమ్మి బతక్క తప్పని చిన్నమ్మి కన్నీటి జీవితాన్ని ప్రస్తావించాడు. ఆర్థిక అసమానతలున్న సమాజంలో స్త్రీలు లైంగిక పీడనకు గురికావడమో, ఒళ్లమ్ముకొని బతకాల్సి రావడమో అతి తరచుగా జరుగుతుండడాన్ని శ్రీశ్రీ కవిత్వం నమోదు చేసింది. కనుక

'పతితులార
భ్రష్టులార
బాధాసర్పదష్టులార
ఏడవకండేడవకండి" అని శ్రీశ్రీ ఓదార్చి నడిపించిన వారిలో స్త్రీలు తప్పక ఉండే ఉంటారు.

1970 నాటికి దేశీయ విప్లవోద్యమం స్పష్టమైన రూపాన్ని తీసుకొన్నది. విప్లవోద్యమంలో స్త్రీల భాగస్వామ్య చరిత్రను శ్రీశ్రీ ప్రత్యక్షంగా చూస్తున్నాడు. అందువల్ల 'మహాప్రస్థాన' కాలంలో స్త్రీలను సమూహంగా చెప్పిన శ్రీశ్రీ 'మరోప్రస్థానం' నాటికి నిర్దిష్టంగా వాళ్లను గుర్తించి చెప్పగలిగాడు. 'ఉడుకు నెత్తురుప్పొంగే యువతీ యువకుల్ని అడవుల్లోకి పంపించిన వాడా' అని చారు మజుందారును కీర్తించాడు. స్త్రీలకు ఒక ఆదర్శనీయ నమూనాగా పంచాది నిర్మలను చూడగలిగాడు. చూపించగలిగాడు. యుద్ధాలలో స్త్రీల భాగస్వామ్యం చరిత్రలో రకరకాల రూపాలలో కొనగుతున్నదే. పల్నాటి యుద్ధంలో మాంచాల పాత్ర బాలచంద్రుడిని యుద్ధోన్ముఖంగా ప్రేరేపించటమయితే, బొబ్బిలి యుద్ధంలో మల్లమ్మ పాత్ర స్వపక్షపు ఓటమి, శత్రు పక్షపు విజయమూ తెలిసి అంతఃపుర స్త్రీల ఆత్మాభిమానాన్ని కాపాడడానికి ఆత్మాహుతికి సిద్ధపడడం, బ్రిటిష్ వలస పాలనకు వ్యతిరేకంగా ఝాన్సీ లక్ష్మీ బాయి వీరోచిత పోరాట కార్యాచరణలో భాగమయింది. జాతీయోద్యమ రాజకీయాలలో సరోజినీదేవి క్రియాశీలక పాత్ర వహించింది. భార్యలుగానో, జాతీయ భావ ప్రేరేపితులుగానో వాళ్లు చేసిన పనుల వల్ల వారందరూ కీర్తించబడుతున్నారు. చరిత్రలో వాళ్లకు స్థానం దక్కింది. కానీ ఈ చరిత్రే పంచాది నిర్మల వంటివారి పట్ల వ్యతిరేకంగా ఉంటుంది. అది ఆ చరిత్ర పాక్షికత. పంచాది నిర్మల అంతర్జాతీయ తాత్విక సిద్ధాంతాలతో ప్రభావితమై దేశీయంగా నిర్మించబడిన విప్లవోద్యమ నిర్మాణంలో భాగస్వామి కావడమే అందుకు కారణం.

"మాంచాలను కొలుస్తారు మల్లమ్మను తలుస్తారు
ఝాన్సీ లక్ష్మీబాయికి బాష్పధార విడుస్తారు
సరోజినీదేవి ఫొటో పటం కట్టి పొగుడుతారు

*పంచాది నిర్మలంటే భయం పుట్టి వణుకుతారు"* అని చరిత్రలోని ఈ వైరుధ్యాన్ని, పాక్షికతను శ్రీశ్రీ స్పష్టం చేశాడు.

శ్రీశ్రీ స్త్రీలను సంబోధిస్తూ ఒక పాట కూడా రాశాడు :

*'కదలండి నవభారత*

*నారీమణులారా! ఓ వీరాంగనలారా'* అని ప్రారంభమయ్యే ఆ పాట 'ఆర్థిక అసమానతలు తొలగింపు'నకు పిలుపునియ్యటమే కాదు లింగ వివక్ష పాతబడిన సమాజపు లక్షణమని గుర్తించి దానిపై యుద్ధానికి కూడా సంసిద్ధం కమ్మంటుంది. ఆర్థిక అసమానతలు అందరికీ సంబంధించిన సమస్య అయితే స్త్రీలే అదనంగా వరకట్నం వంటి సామాజిక దురన్యాయాలకు, పురుష పీడనకు గురవుతున్నారన్న స్పృహను ఈ పాటలో కనబరిచాడు శ్రీశ్రీ.

స్త్రీల పట్ల శ్రీశ్రీ దృక్పథం మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడానికి ఉపకరించేవి ఆయన కథలు. **1926**లో అచ్చయిన శ్రీశ్రీ తొలి కథ 'అనందమందిరము'. తాగుబోతు భర్తను సంస్కరించుకొని అతని సంపదను సంరక్షించడానికి స్వీయ వివేకంతో ప్రవర్తించిన ఈ కథలోని మాలతికి గురజాడ వారి కమలిని మూలమేమోననిపిస్తుంది. 'బొమ్మ' అలిగరీ పద్ధతిలో రాసిన కథ. బొమ్మ గురించి చెప్తున్నట్లుగా ఉంటుంది కానీ 'బొమ్మ'లా ఒక ఫ్రేములో బిగింపబడిన 'భార్య' గమనాన్ని, గమ్యాన్ని చూపించే కథ బొమ్మ. తాను వ్యవస్థకు నిబద్ధమై పురుషుడిని దానికి లోబరుస్తుంది స్త్రీ. పురుషుడు స్త్రీ కోసం 'వివాహ వ్యవస్థను' ఆమోదిస్తాడు అనే బుచ్చిబాబు మాట ఈ కథా నాయకుడికి అచ్చంగా అనువర్తిస్తుంది. బొమ్మ మీద అభిమానంతో దాన్ని కొని తెచ్చి తన ఇంట్లో అలంకరించుకొన్న పురుషుడు ఇక ఆ ఇంటికే కట్టుబడి ఉండడం ఇందులో గమనించవచ్చు. 'ఏ లోపం లేకుండా తీర్చిదిద్దినట్లుగా ఉండడం' బొమ్మ లక్షణమైతే 'అలా ఉండడమే దాని లోపం' అని కథకుడి శిల్పి మిత్రుడన్నమాట ఆలోచనకు పదును పెట్టే కీలక సూత్రం. స్త్రీ బొమ్మల్లాగా ఉండడానికి ఇయ్యబడే శిక్షణలు కత్తిరించబడి, సాపు చేయబడి తమను తాము కోల్పోయి ఒక అసహజ స్థితిలోకి చైతన్య రాహిత్యంలోకి వెళ్లిపోతారు. బొమ్మ వంటి అలాంటి స్త్రీలతోటి సాహచర్యంలో పురుషులు కూడా క్రమంగా చలన చైతన్యాలకు దూరమై ఒక మూసలో బతికెయ్యడానికి అలవాటు పడతారు. ఇది పురుషులకే హానికరం. 'చేసుకున్న పాపంలాంటిది కొనుక్కున్న బొమ్మ' అన్న కథ ముగింపు వాక్యం దానినే సూచిస్తుంది.

లైంగిక వివక్ష గురించిన స్పృహ శ్రీశ్రీకి పూర్తిగా ఉన్నదనడానికి నిదర్శనం 'ఒసే తువ్వాలందుకో' కథ. ఈ సమాజంలో ఆడది మగవాని చేతి ఆట వస్తువని ఎంచే పాతబడిన భావాలకు దాసులైన పురుషులే ఎక్కువమంది. సమానత్వం ప్రకృతిలోనే లేదనుకునే సదరు వ్యక్తికి ఆడదాన్ని గుమ్మం కదలనివ్వకపోవడమే ఆచరించదగిన విలువ. ఆడదాన్ని రక్షించడం, శీలాన్ని కాపాడడం పురుషుడి కర్తవ్యాలను కొనడం, ఆడవాళ్లకి చదువు అవసరమే కాదు హానికరం అనుకోవడం, ఆడదానికి స్వాతంత్ర్యం ఇవ్వకూడదనుకొనడం, మొగుడు అథార్టీ చెలాయిస్తూ ఉంటేనే ఆడది అణగి మణిగి ఉంటుందనుకొనడం ఇవన్నీ అతని ఆదర్శాలు. అలాంటి పురుష ప్రవృత్తిని చూపిస్తూనే చదువుకొనడానికి, సంగీతం నేర్చుకొనడానికి వీల్లేకుండా బలవంతంగా పెళ్లి పేరు మీద జీవితం వంటింటికి కుంచించుకు పోవడం పట్ల, భర్తతో స్నేహం లేక, స్వతంత్రత లేక, ఆర్థిక స్వాతంత్ర్యం అసలే లేక, తిరగబడాలనుకొంటే అందుకు ధైర్యం చాలక, ఈ లోకంలో ఆడదై పుట్టడమంత హీనం ఇంకోటి లేదు' అని అసంతృప్తికి, అశాంతికి గురయ్యే భార్య అంతరంగ వేదనను ఈ కథ ఆవిష్కరిస్తుంది. ఒకరి పట్ల ఒకరికి విశ్వాసం, ప్రేమలేని దాంపత్య సంబంధాల దూరపుతనాన్ని బయటపెట్టడం ద్వారా ఈ కథ పురుషుల మీద విమర్శను పెట్టింది. స్త్రీల పట్ల సానుభూతి కనబరిచింది. స్త్రీ మీద పురుషుడి హక్కును స్థాపించే సాంస్కృతిక వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాలు బానిస యజమాని సంబంధాలుగా మిగులుతున్న విషాదాన్ని ఈ కథ ధ్వనిస్తుంది.

'చరమరాత్రి' కథ అర్ధరాత్రి ఆత్మహత్యకు తలపడ్డ ఒక యువకుడి అంతరంగపుటాలోచనల ప్రదర్శన. ఆత్మహత్యకు కారణాలు కుళ్లిపోయిన సంఘ మర్యాదలు, బిగిసిపోయిన సామాజిక ఆంక్షలు, నియంత్రణలు - తనకు ఆస్తి, అందం, చదువు అన్నీ ఉన్నా సామాజిక అసమానతలు, అన్యవ్యస్తతలు అతనికి ఊపిరాడకుండా చేస్తున్నాయి. అతని బాధ అతని స్వంత బాధకాదు. ప్రపంచపు బాధ. పీడితులు తాడితుల బాధ అతని బాధ. ఫ్యాక్టరీ కూలీ, ఆఫీసులో కుర్రాడు, గుమాస్తా, బడి పంతులు, హోటల్ పనివాడు ఇలాంటి వారిని వరుసగా ప్రస్తావిస్తూ గుడిసెలో ముసలమ్మని వారి జాబితాలో చెప్పాడు. ఇక్కడ బ్రాకెట్లోని మాటలు గమనించదగినవి. "ఆహా, స్త్రీలోకంలో ఉదాహరణలు స్మరిస్తే చెయ్యి వణుకుతుంది. పురుషులదేం కష్టం? కష్టాకష్టాల సహనాన్ని చెప్పాలంటే స్త్రీలని స్మరించు" అన్న ఈ మాటలు కష్టజీవులలో కెల్ల కష్టజీవులు స్త్రీలన్న విషయాన్ని నొక్కి చెప్తున్నాయి. పీడితులలోకెల్ల పీడితురాలు - బానిసకొకబానిసకొక బానిస - పితృస్వామ్యం అనే అదనపు కాడిని మోస్తున్న స్త్రీ గురించిన అవగాహన శ్రీశ్రీకి ఉన్నదనడానికి దాఖలా ఈ మాటలు. శ్రీశ్రీ ఇచ్చిన పీడిత స్త్రీల జాబితాలో -

1) అప్పుడే చచ్చిపోయిన బిడ్డని చేతుల్లో పెట్టుకున్న పదహారేళ్ల బాలింతరాలు.
2) మగడు చచ్చిపోయాడని టెలిగ్రాము వస్తే ఏడుస్తూ కూర్చున్న ఇల్లాలు.
3) వృద్ధాప్యం మీదపడినా, చాకిరీ చెయ్యకపోతే దినం వెళ్లని దీనురాలు.
4) నీళ్లు తోడుతూ అంట్లు తోముతూ బతికే దాసీ.
5) గతిలేక శరీరాన్ని అమ్ముకొనే వేశ్య - ఇంత మంది ఉన్నారు.

ఇదే కథలో ఆత్మహత్య చేసుకోదలచిన యువకుడు తానే ఎందుకు చావాలి అన్న విచికిత్సకు లోనవుతాడు. ఆలోచనలనేవే లేకుండా తృప్తిగా, నిశ్చింతగా బతికేసేవారు - కార్లలో షికార్లు చేసే మొద్దబ్బాయిలు, సినిమాలకు వెళ్లే సింగిరెద్దులు, లంచాలు తినే పెద్దమనుషులు ఎందుకు చావకూడదు అని ప్రశ్నించుకొంటాడు. చావ వలసిన వాళ్లు అసలు వాళ్లే అన్నది అతని తాత్పర్యం. చావవలసినవాళ్లు అని అతను తలచిన వాళ్లలో ఒక స్త్రీ కూడా ఉంది. "బనారసు చీరకట్టుకుని బంగారం పెట్టుకున్న, ఒళ్లంతా అన్ని దిక్కులా బలిసి ఆడవాళ్ల సభలో ఆగిపోయే ఇంగ్లిష్‌లో ఉపన్యాసం చేయబోతున్న యువతీ రత్నం' ఆమె. డబ్బున్నవాళ్లు, నాగరికత ముదిరిన వాళ్లు స్త్రీలయినా అతను సానుభూతి చూపలేదు. బొజ్జమ్మా - బొచ్చుకుక్క కథలో భర్తల ఆర్థిక హోదాను బట్టి భార్య ఆర్థిక హోదా నిర్ణయమయ్యే సమాజ లక్షణాన్ని ఆస్తుల వారసత్వంతో పాటు, తాతల పేర్లు

మనవలకి, అమ్మమ్మల పేర్లు మనవరాళ్లకి వచ్చే సమాజం తీరును, ఎదిగిన మగపిల్లలు ఉద్యోగాలకు, ఎదిగిన ఆడపిల్లలు అత్తారిళ్లకు వెళ్లడాన్ని రివాజుగా చేసిన లోకం పోకడను గుర్తించి చెప్పిన శ్రీశ్రీ వర్గ స్పృహతో పాటు లింగ స్పృహను కనబరచడమే కాదు, బొజ్జమ్మ వంటి జమీందారీ స్థాయిలోని ఆడపిల్లల హోదా ప్రదర్శనల అలవాట్లను వెక్కిరించాడు కూడా.

'వారం వారం' శీర్షికకు రాసిన రెండు సందర్భాలు స్త్రీల పట్ల శ్రీశ్రీ వైఖరిని తెలియజేస్తాయి. 1945లో కొత్త పత్రికల గురించి రాస్తూ జీవితం స్థాణువు కాదు, చలనశీలమైనది. ఈ యుద్ధజ్వాలలో తుప్పుపట్టిన అనేక భావాలు దగ్ధమైపోయాయి... అని అంటూ మన దేశం సంగతే ఆలోచిస్తే స్త్రీలు ఉద్యోగాలకర్హులు కారు అనే సంకుచిత దృష్టి సమసిపోయిందని చెప్పాడు. స్త్రీలు ఉద్యోగాలు చేయడం గుర్తించిన శ్రీశ్రీ అనుకూల అభ్యుదయకర దృష్టి ఆ రకంగా నమోదయింది. 1976లో ఫకీర్‌షా పలుకులు 'సినిమారంగంలో స్త్రీల శరీరం' అనే అంశంపై రాశాడు. సెన్సార్ నిబంధనల నుండి బయటపడడానికి పౌరాణిక గాథలను ఆశ్రయిస్తున్న నిర్మాతలను విమర్శిస్తూ 'కుష్టురోగి అయిన మొగుడ్ని ముండ దగ్గరకు మోసుకు వెళుతుంది ఒక పతివ్రత. ఆమెను ఆదర్శ భారత నారీమణిగా మనం అంగీకరించాలి. ఇదేమిటని అడిగేవారు హిందూ సంస్కృతికే విరోధి' అంటాడు శ్రీశ్రీ. ఆ అనడంలో స్త్రీని మగవాడి ప్రయోజనాల రీత్యా నిర్వచించి అదే భారతీయ సంస్కృతి అనడంపై తీవ్రమైన నిరసన స్వరం వినబడుతుంది.

ఇక వివిధ పత్రికలకు తనను ఇంటర్వ్యూ చేసిన వారి నుండి, పత్రికలు నిర్వహించిన ప్రశ్నలు జవాబులు శీర్షికలో పాఠకుల నుండి తరచు స్త్రీ సమస్యకు సంబంధించిన ప్రశ్నలను శ్రీశ్రీ ఎదుర్కోవలసి వచ్చింది. ఆయా సందర్భాలలో శ్రీశ్రీ ఇచ్చిన జవాబులు ఆయన స్త్రీ చేతనను స్పష్టం చేస్తాయి. 1969 మే ప్రగతి పత్రికలో 'ప్రశ్నలు జవాబులు' శీర్షికలో స్త్రీ సమస్యకు సంబంధించినవి మూడున్నాయి. దేశంలో వ్యభిచార వృత్తి క్షణక్షణానికీ దినదినానికీ వృద్ధి చెందడానికి కారణం ఏమిటన్న ప్రశ్నకు పతనం వైపు క్షణక్షణవేగంతో పరుగెత్తుతున్న పెట్టుబడిదారీ విధానమని జవాబిచ్చాడు శ్రీశ్రీ. బానిసత్వంలో మగ్గుతున్న నేటి స్త్రీని విముక్తి చెయ్యాలంటే దేనిని మార్చాలి అన్న ప్రశ్నకు బానిసత్వంలో మగ్గుతున్నది ఒక్క స్త్రీలు మాత్రమేనా? స్త్రీలకైనా పురుషులకైనా సమాజంలోని ఎగుడు దిగుడుల్ని చదునుగా మార్చినప్పుడే విముక్తి అని జవాబిచ్చాడు. సాంప్రదాయమగు చక్కని చిన్నది సాయంకాలం సినిమాకు వెళ్లడం ఎందుకు? చీకటి మరుగున చేతులు వేశారని బాధపడడమెందుకు అన్న మరొక ప్రశ్నకు ఆ చిన్నది మీరనుకొని ఆలోచిస్తే జవాబు దొరుకుతుంది అని సమాధానమిచ్చాడు. ఈ మూడింటిని పరిశీలిస్తే శ్రీశ్రీ పెట్టుబడిదారీ ఆర్థిక విధానానికి స్త్రీల దుస్థితికి ఉన్న అంతర్గత సంబంధం అర్థం చేసుకున్నాడని, స్త్రీల విముక్తిని ఆయన ఏకైక అంశంగా చూడలేదని ఆర్థిక అసమానతలున్న సమాజాన్ని సమష్టితికి తీసుకొని రావడంలోనే స్త్రీ పురుషులిద్దరి విముక్తి సాధ్యమని నిశ్చితాభిప్రాయంతో ఉన్నాడని స్త్రీ ఏమి చేయాలో ఏమి చేయవద్దో పురుషులు తీర్పు ఇవ్వడం కాక, స్త్రీల అవసరాల నుండి, ఆకాంక్షల నుండి, స్త్రీ కోణం నుండి సమస్యను అర్థం చేసుకోనవలసి ఉందని భావించాడని స్పష్టమవుతుంది.

స్త్రీకి సమాజంలో ఎలాంటి స్థానం ఉండాలనుకొంటున్నారు? మీ రచనలో స్త్రీని గురించిన ప్రసక్తి లేదెందుచేత అని 1970లో వేనరెడ్డి వేసిన ప్రశ్నలకు జవాబుగా శ్రీశ్రీ స్త్రీకి సంపూర్ణ సమానత్వం కావాలని చెప్పాడు. ఇంతవరకు స్త్రీ సమస్య ప్రత్యేక సమస్యగా భావించకపోవడం వలన తన సాహిత్యంలో స్త్రీని చిత్రించలేకపోయానని నవల రాస్తే స్త్రీ పాత్రలను సృష్టిస్తానని చెప్పాడు. సుధామకు ఇచ్చిన ఇంటర్వ్యూలో పురుషాధిక్యం ఎక్కువ ఉన్న సమాజం ఇదనీ, పురుషుల జబర్దస్తీకి, అన్యాయాలకు స్త్రీలు ఆహుతి అవుతున్నారని అంగీకరించాడు. స్త్రీ పురుషుడితో సమాన స్థాయికి ఎదగడానికి ఈ వ్యవస్థ సామ్యవాద వ్యవస్థగా మారాలి అని భావించాడు. స్త్రీ తన జీవితాన్ని తన భవిష్యత్తును తానే నిర్ణయించుకొనే స్థితికి ఎదగాలని ఆకాంక్షించాడు. తాడితులు పీడితులు అయిన స్త్రీల సమస్యను తాను ప్రత్యేకంగా రాయకపోయినా తాను వారి పక్షాన ఉన్నాననే ఆయన స్పష్టం చేశాడు. తాను సమస్యను జనరలైజ్ చేసి రాశానని పర్టిక్యులర్‌గా స్త్రీ సమస్య మీద రాయకపోయినా జరుగుతున్న అన్ని రకాల ఎక్స్‌ప్లాయ్‌టేషన్‌ని చూపించానని అందులో స్త్రీల సమస్య కూడా భాగమేనని శ్రీశ్రీ అభిప్రాయపడ్డాడు. పురుషాధిక్యం రద్దుకాని సమాజంలో స్త్రీ వ్యక్తిది రెండో తరగతి పౌరసత్వం మాత్రమే అవుతుందని చెప్పగలిగిన చైతన్యం శ్రీశ్రీది. నిజమైన సామ్యవాద సమాజంలో మాత్రమే స్త్రీ పురుషుల మధ్య గౌరవప్రదమైన సమానతా, స్వాతంత్ర్యం సాధ్యమవుతుందని శ్రీశ్రీ నిశ్చితాభిప్రాయం.

స్త్రీల సమాన హక్కుల ఉద్యమాన్ని చౌకబారు విమర్శలతో హేళన చేసే వాళ్లకు శ్రీశ్రీ ఘాటుగానే సమాధానాలిచ్చాడు. సమాన హక్కుల కోసం బజారున పడుతున్న స్త్రీలు రేపటి నుంచి పెండ్లిలో మగవాడి మెడలో తామె తాళి కడతామని అంటారేమో అన్న ఒక ప్రశ్నకు 'ప్రస్తుత భారత స్త్రీలు కాబోయే మొగుడి మెడలో తామె తాళిబొట్టు కట్టే హక్కు కోసం బజారున పడరు. మగవాడి ఆర్జన మీద ఆధారపడవలసిన ఆగత్యం లేని ఆర్థిక స్వాతంత్ర్యం కోసం వాళ్లు పోరాడుతున్నారు' అని జవాబిచ్చాడు.

ఆడపిల్లలు ఎంతవరకు చదువుకోవాలి అనే ఒక ప్రశ్నకు చదువుకు ఆడా మగా అనే భేదం లేదు. ఎంతవరకయినా చదుకోవచ్చును. ఆడపిల్లలకు చదువే అనవసరం అన్న కాలం పోయి చాకలి పద్దులు రాసే చదువు చాలన్నంత స్థాయి వచ్చిందని అలాంటి భావాలకిప్పుడు కాలం చెల్లిందని 1982లో శ్రీశ్రీ చెప్పాడు. ఆధునిక కవిత్వంలో స్త్రీల కృషి ఏ పాటిది అన్న ఒక ప్రశ్నకు జవాబుగా ఒక్క తెలుగులోనే కాక ప్రపంచ భాషలన్నింటిలోనూ కవితలు రాసే పురుషులు ఎక్కువగానూ స్త్రీలు తక్కువగానూ నవలలు రాసే స్త్రీలు ఎక్కువగానూ, పురుషులు తక్కువగానూ ఉండడం చూస్తాం - అని జవాబిచ్చి శ్రీశ్రీ అందుకు కారణం స్త్రీల కంటే పురుషులు మితభాషులు కావడమేనని చమత్కరించాడు కూడా. తెలుగులో నేటి రచయిత్రులపై మీ అభిప్రాయం అని అడిగిన ఒకరికి బీనాదేవి, రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి ఏ రచయితకూ తీసిపోనివారని ప్రశంసిస్తూ సమాధానమిచ్చాడు. సినిమా రచయితలలో స్త్రీలు లేరని కూడా గుర్తించి చెప్పాడు. సాహిత్యరంగంలో అభివృద్ధి చెందవలసిన స్త్రీల పాత్రను గురించి కూడా శ్రీశ్రీ ప్రస్తావించాడు. (అనంతం, 1986, పు.85) అయినా 'ఉగ్రవాద ఫెమినిస్టు'ల గురించి ఆయన భయాలు ఆయనకు లేకపోలేదు. (అనంతం, పు. 286). సందర్భాన్ని బట్టి ఉగ్రవాద ఫెమినిస్టుల లక్షణం శ్రీశ్రీ దృష్టిలో పురుషుడిని

వ్యాసం

# శ్రీశ్రీని ఎలా అర్థం చేసుకోవాలి?

- పాణి

ఎల్లకాలాలకు ఒకే కవి సరిపోడు. అన్నికాలాల అవసరాన్ని ఒకానొక కవిత్వమే తీర్చజాలదు. కాలంతోపాటు జీవితం మారినట్టే, జీవితావసరంగా, సమాజ పరిణామానికి సృజనరూపంగా కవిత్వమూ మారుతుంది. వాస్తవికత గురించిన అవగాహన పెరిగేకొద్దీ, దాన్ని మార్చే మానవ కార్యాచరణ విస్తృతమయ్యే కొద్దీ సాహిత్యం మారుతూ ఉంటుంది.

శ్రీశ్రీకి ఈ దృష్టి ఉన్నదనడానికి ఎన్ని ఉదాహరణలైనా చూపవచ్చు. ఎంత సోదాహరణంగానైనా వివరించవచ్చు. శ్రీశ్రీ పరిణామం గురించి, పరివర్తనాశీలమైన తెలుగు సాహిత్య ప్రపంచం గురించి, అందులో శ్రీశ్రీ స్థానం గురించి మహాప్రస్థానం నుంచి మరోప్రస్థానం చివరి గీతం దాకా, సామాజికజీవిగా శ్రీశ్రీ రూపొందిన తొలి బిందువు నుండి విరసం నాశాశ్వత చిరునామా అనే తుది ప్రకటన చేసి భౌతికంగా నిష్క్రమించేదాకా తనలోని వ్యక్తి పరిణామాన్ని, తన సాహిత్య పరిణామాన్ని సామాజిక చరిత్ర అనే (1930 నుండి 80ల దాకా) మొత్తంలో భాగంగా ఆయనే ఎప్పటికప్పుడు చెప్తూ వచ్చాడు.

ఇది శ్రీశ్రీ నిర్మాణాన్నే కాదు, పదే పదే పునర్నిర్మాణమైన శ్రీశ్రీని సూచిస్తుంది. అంటే సుమారు అరవై ఏళ్ల క్రమం. దీనిలోంచి ఏదో ఒక ముక్కను మాత్రమే స్వీకరించే వాళ్లున్నారు. మిగితా వాటిని తృణీకరించి, దాచేసి, వక్రీకరించి సంబరపడే వాళ్లున్నారు. శ్రీశ్రీని చరిత్ర నుండి తొలిగించగలిగితే బాగుండు అనుకొనేవాళ్లూ ఉన్నారు. శ్రీశ్రీ అనే మొత్తాన్ని తెలుగు సమాజ సాహిత్య చరిత్ర అనే మొత్తంలో చూడాలని తెలియకపోవడం గురించి ఏమీ అనలేం. అయితే చరిత్రలో పరాచకాలాడకూడదు. చరిత్ర ముందు బాల్య చేష్టలు పనికిరావు. మానవులందరూ చరిత్ర కల్పితమే. చరిత్రలో భాగంగా పుట్టి దాని పరిణామంలో పాలుపంచుకునేవారే.

ఎల్లకాలాలకు తన కవిత్వమే సరిపోతుందని శ్రీశ్రీ అనుకోలేదు. ఈ శతాబ్దం నాది అన్నవాడే - తాను నడిపించిన కాలాన్ని, తనను నడిపించిన కాలాన్నీ స్పష్టంగా చూడగలిగాడు. సమాజ అవసరంగా, వ్యక్తీకరణగా ఎప్పటికప్పుడు వస్తున్న కొత్త సాహిత్యాన్ని స్వాగతించి తానిక రాయవలసిన పనిలేదని చాలా సందర్భాల్లో చెప్పాడు. ఏది రేపటి సాహిత్యంగా నిలబడుతుందో ప్రతిరోజూ గుర్తించాడు. అట్లా అని ఒకచోట నిలబడిపోయిన 'పెద్ద మనిషి' కాదాయన. ఏ రోజుకారోజు తగినట్టుగా, రేపటి అవసరం తీర్చగలిగేట్టుగా తనను తాను పునర్నిర్మించుకుంటూ సాగాడు.

శ్రీశ్రీ అనే వ్యక్తి, సాహిత్యమూర్తి ఇంత సంక్లిష్టమైన, సుదీర్ఘమైన పరిణామం. కవితా సమితి నుండి విరసం దాకా, భారత కమ్యూనిస్టు పార్టీ నుండి పీపుల్స్ వార్ దాకా సాహిత్య, రాజకీయ నిర్మాణాల మైలు రాళ్ల మధ్య సాగిన సమాజపు అన్ని పొరల పరిణామాలకు ఆయన ప్రభావితమయ్యాడు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో - సామీప్యంగానో, సుదూరంగానో - రాసీ, మాట్లాడ్డం ద్వారానో, మౌనంగా ఉండటం ద్వారానో వాటన్నిటి మీద ప్రభావం వేయగలిగాడు.

అందువల్లనే ఆయన్ను అంచనా వేయడంలో చాలా చిక్కు సమస్యలున్నాయి. ఒక ప్రభావశీలమైన వ్యక్తినయినా, ఉద్యమాన్నయినా తలచుకొనేటప్పుడు ఉద్వేగపు పాలు కాస్త ఎక్కువగానే ఉంటుంది. దాన్ని ప్రకటించుకోవడమే లక్ష్యమైతే శక్తిమేరకు ఉద్వేగపడి సరిపుచ్చుకోవచ్చు. దాని ఫలితం దానికి తప్పక ఉంటుంది. అలాగాక.. చరిత్రలో ఆ వ్యక్తి పాత్రను విశ్లేషించదలుచుకుంటే, వర్తమానంలో ఆ వ్యక్తిని పునర్నిర్మించదల్చుకుంటే చారిత్రక దృష్టి ప్రదర్శించాలి.

శ్రీశ్రీ వీరారాధకులు ఈ పని చేయలేరు. శ్రీశ్రీని పదే పదే తలచుకొని, పులకించి కొన్ని సత్య ప్రవచనాలు చెప్తుంటారు. వీళ్లను శ్రీశ్రీ ప్రచారకులు అనవచ్చు. అదీ అవసరమే.

ఇక పోతే, తెలుగు సాహిత్యకారులో శ్రీశ్రీకి రివిజనిస్టుల బెడద ఎక్కువ. వ్యక్తిగా, ఉద్యమపరంగా వాళ్లతో తెగతెంపులు చేసుకొని వచ్చినా గడచిన చరిత్రవల్ల ఆయన వాళ్ల చేతిలో నానారకాల వక్రీకరణలకు, అసత్య ప్రచారాలకు, కుదింపులకు గురవుతుంటాడు. శ్రీశ్రీ జీవితంలో విరసం అనే చివరి పదమూడేళ్ల చరిత్రను రద్దు

---

అధిగమించడం, విశృంఖల లైంగిక స్వేచ్ఛ, డామినేషన్ ఎవరి వైపు నుండీ వాంఛనీయం కాదంటాడు.

స్త్రీల హక్కుల కోసం స్త్రీల పక్షాన నిలబడిన శ్రీశ్రీ జీవితంలో స్త్రీవాంఛ కారణంగా వివాదాస్పదుడు కావడం ఒక విరోధాభాస. సెక్సు అనేది జీవితంలో ప్రధాన భాగం అంటాడు శ్రీశ్రీ. అందులో రెండో మనిషి భాగస్వామ్యం ఉంది కనుక ఆర్థిక, సాంఘిక, మానసిక సమస్యల సంబంధంలో దానిని చూడవలసి ఉంటుందంటాడు. తాను డబ్బు ఇచ్చి స్త్రీ నుండి సుఖాన్ని పొందిన విషయాలను, తత్పరిణామాలను నిస్సిగ్గుగా 'అనంతం'లో విప్పిచెప్పిన శ్రీశ్రీయే 'మన సమాజంలో ఆడది డబ్బిచ్చి కొనుక్కొనే భోగ వస్తువు కావడం కన్నా హేయమైన విషయం ఇంకొకటి ఉండబోదు' (అనంతం, 1986 పు. 75) అని చెప్పాడు. పెట్టుబడిదారీ విధానం ఈ రీతిని పెంచి పోషిస్తుందని, మాస్కో, చైనా వంటి చోట్ల అట్లాంటి దానికి అవకాశం లేదని ఆ ప్రాంతాలు తనలాంటి వాణ్ని కూడా నియంత్రించాయని చెప్పాడు. 'అనంతం' రాయడంలో అన్నింటికన్నా ముఖ్య లక్ష్యం మనం జీవిస్తున్న పెట్టుబడిదారీ విధానపు పరువుతీసి బయటపెట్టడం. ఆ ప్రయత్నంలో నా పరువు కూడా బయటపడడం సహజమే' అని వ్యవస్థా స్వభావానికి వ్యక్తి దుర్లక్షణాలకు ఉండే సంబంధాన్ని సూచించాడు. అయితే వ్యవస్థ ఆర్థికంగా, రాజకీయంగా మారిపోయినంతనే వ్యక్తి సంస్కారాలు వాటంతటవి బాగుపడవని శ్రీశ్రీకి తెలుసు. అందువల్లనే ఆయన ముఖ్యంగా నాటి కాలంలో ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాల తరువాత మనిషి సాధించవలసిన మానసిక స్వాతంత్ర్యాన్ని గురించి ప్రస్తావిస్తూ వచ్చాడు. కలలు కన్నాడు. సామ్యవాద సమాజం, ఉత్తమ మానవ సంస్కారం ఈ రెండూ ఇంకా సాధించబడవలసినవే. అంతవరకు మన ఆలోచనల దీపం వెలిగింపచేసే తైలం శ్రీశ్రీ సాహిత్యం.

అ

చేయాలనే వాళ్ల తాపత్రయాన్ని అర్థం చేసుకోవచ్చు. విప్లవ రంగం మీదికి రాకపోతే కమ్యూనిస్టు ముసుగులో యథేచ్ఛగా కొనసాగేవాళ్లంకదా అనుకోవడాన్నీ క్షమించవచ్చు. కానీ చరిత్ర గడ్డు వాస్తవం. అందులో శ్రీశ్రీ అనే నిత్య పరిణామంలోని విప్లవాంశనే తుడిచేయాలనుకోవడం దురాశ. మహాప్రస్థానం, ఖడ్గసృష్టిలోని వాచకాలను వల్లించడం తప్ప అందులోని విప్లవాంశ నక్సల్బరీలో గుణాత్మక మార్పుకు లోనైందని వాళ్లు అంగీకరించలేరు. శ్రీశ్రీ లోని కొన్ని ముక్కలను నిర్జీవంగా ఎత్తి చూపి ఆనందిస్తుంటారు. వీళ్లు పైన చెప్పిన పని ఉద్దేశపూర్వకంగానే చేయరు. మార్క్సిజాన్ని వదిలేసుకున్నారు కాబట్టి ఆ సత్తా కూడా ఉండదు.

మూడోరకం వాళ్ల గురించి కొంచెం వివరంగానే మాట్లాడుకోవాలి. వీళ్లంతా ఒకటి కాకపోయినా శ్రీశ్రీ విమర్శకులుగా గుర్తించవచ్చు. ఏ విమర్శనైనా స్వాగతించాల్సిందే. విమర్శ- సంఘర్షణ అత్యవసరం.

విప్లవ సాహిత్యోద్యమం ఎల్లకాలాలకు ఆయన్నే కవిగా నిలబెట్టాలనుకుందనే అపోహ వీళ్లలో కొందరికి ఉంది. విప్లవ సాహిత్యోద్యమం పొరబాటున కూడా అట్లా అనుకోలేదు. శ్రీశ్రీ యే దానికి వ్యతిరేకం. శ్రీశ్రీ సాధికార విశ్లేషకుడు కెవిఆర్ నుంచి ఇప్పటిదాకా శ్రీశ్రీ విశ్లేషణలో, ప్రాసంగికతా చర్చలో ఒక రకమైన తాదాత్మ్య భావన వినిపించవచ్చు. అది చర్చనీయాంశమేగాని , పైన చెప్పిన పరంపరలో ఎవరూ శ్రీశ్రీయే అన్నికాలాలకూ మహాకవి అనే అచారిత్రక దృష్టి ప్రదర్శించలేదు. నిజానికి శ్రీశ్రీని గొప్ప చేస్తూ అనేక రకాల భావజాలాల సాహిత్యకారులు చేసిన సూత్రీకరణలను విప్లవసాహిత్యోద్యమమే సవరించవలసి వచ్చింది. కెవిఆర్ అయితే శ్రీశ్రీ స్పెషలిస్టుగా ఎంత కృషి చేసినా, తన వికాసంలో శ్రీశ్రీ ప్రభావం కీలకమైనదే అయినా ఆయన శ్రీశ్రీకి విమర్శనాత్మక విశ్లేషకుడిగా చివరి దాకా ఉన్నాడు. మార్క్సిస్టు చరిత్రకారుడిగా - ప్రజలు చరిత్ర నిర్మాతలనీ, ఆ ప్రజలు కూడా తాము అనుకున్నట్టు చరిత్రను నిర్మించలేరనే చరిత్ర నిర్మాణక్రమంలో శ్రీశ్రీని చూశాడు. కాబట్టి చరిత్ర అనే అవధికి అన్ని రకాలుగా లోబడిన అంచనాలే ఇచ్చాడు. పైన చెప్పిన తాదాత్మ్య భావన ఆయనలో కూడా ఉండవచ్చుగాని, చరిత్రకు-చరిత్రకారుడికి ఉండవలసిన సంబంధాన్ని ఆయన భావోద్వేగ రహితంగా పాటించాడని గట్టిగా చెప్పవచ్చు. బహుశా శ్రీశ్రీ గురించి మన ప్రగతిశీల శిబిరంలో రూపొందిన చాలా అవగాహనలకు వనరు కెవిఆరే. ఆయన శ్రీశ్రీ విషయంలో, శ్రీశ్రీ వీరాభిమానుల వ్యాఖ్యల విషయంలో చాలా విమర్శనాత్మకంగా, చరిత్రకారుడిగా, సాహిత్యచరిత్రకారుడిగా వ్యవహరించాడు. అయితే ఆయన చారిత్రక దృష్టి, అంచనాలు కూడా పునఃసమీక్షించడం తప్పేమీకాదు, అవసరం కూడా.

అసలు ఎవరైనా తమ తర్వాతి కాలాల్లోనూ నిలిచి ఉండేందుకు కారణాలేమిటి? అసలు వాళ్లు రూపొందిన క్రమంతో సంబంధం లేకుండా చరిత్రలో ఎలా నిలిచి ఉంటారు? ఒకటికి రెండు సార్లు పుస్తకాలు అచ్చేయడం ద్వారా, సభలు పెట్టడం ద్వారా సదరు వ్యక్తి నిలిచి ఉంటాడా? అట్లా నిలిపి ఉంచామని ఎవరైనా అనుకోవడమూ, దాన్ని విశ్వసించి విమర్శించడమూ రెండూ చారిత్రక శక్తులపట్ల అమాయక ప్రేలాపన అవుతుంది. శ్రీశ్రీని చరిత్రలో నిలబెట్టిన శక్తి ఏమిటి? కుట్రలు కూహకాల వల్ల నిలబడిపోయాడని అనుకుంటే మన చారిత్రక దృష్టికి మనమే అపచారం చేసుకున్నట్టవుతుంది. నిజానికి శ్రీశ్రీ ప్రభావం ఆయన జీవిత కాలం అన్ని దశల్లో ఒకేలా లేదనవచ్చు. శ్రీకాకుళ పోరాటం తర్వాత సాహిత్య ప్రపంచానికి ఆవల ఉండే విశాల ప్రజా జీవితాన్ని విపరీతంగా కదిలించాడు. ముఖ్యంగా విద్యార్థి, యువజనులను. బహుశా సాహిత్యరంగానికి బైట అట్లా ఆయన కాలంలో మరెవరూ ప్రభావితం చేసి ఉండరు. ఆయనే అంతక ముందు అట్లా ప్రభావం చేసి ఉండడు.

ఒక వ్యక్తి సమాజాన్ని ప్రభావితం చేయడం, అది చరిత్రలో పదేపదే పునశ్శక్తి పొందడం ఎలా సాధ్యమైంది. ఆ ప్రభావాలు కూడా సరళ రేఖలాగా లేవని తెలుసుకుంటే ఈ ప్రశ్న మరింత గాఢమవుతుంది. అంబేద్కర్ ఆయన జీవిత కాలంలోనే అతి పెద్ద ప్రభావాన్నినెరపిన ఆలోచనాపరుడు, ఉద్యమకారుడు. ఆయన మరణం తర్వాత వారసులు ఆయన స్థాపించిన రాజకీయ సంస్థలను నడిపించడానికి చాలా ప్రయత్నం చేశారు. కానీ అప్పటి కంటే అంబేద్కర్ ఆ తర్వాతి కాలంలోనే సమాజంలో ప్రబల శక్తిగా రూపొందాడు.

దీన్ని ఇలా అర్థం చేసుకోవచ్చు. అంబేద్కర్ ఉదార ప్రజాస్వామిక ఆలోచనలనుంచి రాజ్యాంగ రచనా ప్రక్రియలో పాలు పంచుకొని దళితుల సంక్షేమానికి కొన్ని రక్షణ చర్యలు నిర్దేశించాడు. ఓ ఇరవై ఏళ్ల కాలంలో వాటి మార్గదర్శకంలో దళితులు కొంచెం పైకి వచ్చి ఉండవచ్చు. కానీ దారుణమైన భౌతిక దాడులు, అణచివేత పెచ్చరిల్లి పోయాయి. అభివృద్ధి అంచులో కొంచెం చోటు దొరకడం వల్ల కలిగిన చైతన్యం- నానాటికి పెరిగిపోతున్న దాడులు అనే సంఘర్షణలోంచి అంబేద్కర్ ప్రభావం పునర్జ్వలించింది. దళితుల ఆత్మగౌరవ ప్రకటనకు, ఉద్యమానికి అవసరంగా ముందుకు వచ్చాడు. అంతక ముందు లేదని కాదు, దానికీ, ఇప్పుడు అంబేద్కర్ వేస్తున్న ప్రభావానికీ పోలిక లేదు.

శ్రీశ్రీ కూడా నక్సల్బరీ తర్వాత వేసిన ప్రభావం చాలా తీవ్రమైనది. ఆయనలోని విప్లవాంశ వాస్తవ దృశ్యంగా చరిత్ర రంగం మీదికి రావడం వల్ల శ్రీశ్రీలోని సకల శక్తులూ ఆ వైపు వెల్లువెత్తాయి. ఆయనలోని తిరుగుబాటుకు అది సాకారం. తదనంతర కాలంలో ఆయన్ను నిలబెట్టిన శక్తి అదే. అందు వల్ల ఆయన జీవితంలో అత్యంత ప్రభావశీలమైందిగా ఆ కాలం నిలిచిపోయి, విప్లవోద్యమం విస్తరించేకొద్దీ శ్రీశ్రీ విస్తరిస్తున్నాడు. ప్రభావరీత్యానే గాదు, ఆలోచనాపరుడిగా కూడా శ్రీశ్రీ అవసరం పెరుగుతున్నది. అట్లని అంతక ముందటి జీవితం, ఆయన రాసిన సాహిత్యం పాత్ర ఉండదని కాదు. అంతా కలిపే ఇట్లా చూడవచ్చు. ఈ ప్రభావంలో పడి ఎవరైనా ఉద్వేగంగా శ్రీశ్రీ తర్వాత మళ్లీ అంతటి కవి లేడు, రాలేదు అని ఉంటే అది అచ్చంగా గుడ్డి ఆలోచనే. అది చారిత్రక వ్యాఖ్య కాజాలదు. అసలు శ్రీశ్రీకి ఉన్న విస్తృత ప్రభావం వల్ల ఏఏ సందర్భాల్లో ఎవరు ఏ అర్థంలో ఏమాట అన్నారో, వాటి తేడాలు ఏమిటో తేల్చడం కొంచెం కష్టమే. ఎవరి అభిప్రాయాలు ఎవరి ఖాతాలోకి విస్తరించి, స్థిరపడ్డాయో చెప్పడంలో చిక్కు ఉంది. శ్రీశ్రీ మీద ప్రగతిశీల శిబిరంలో సాధికార విశ్లేషకులందరికి వ్యక్తిగతంగా శ్రీశ్రీ చాలా సాన్నిహిత్యం కాబట్టి, ఈ విశ్లేషకులు రూపొందడంలో శ్రీశ్రీ ప్రభావం గణనీయం కాబట్టి చాలా విరివిగా శ్రీశ్రీ గురించి రాశారు కాబట్టి వస్తుగత దృష్టితో పాటు వ్యక్తిగత అభిప్రాయాలు కూడా ఉండే అవకాశం ఉంది.

అవన్నీ అలా ఉంచి.. తెలుగు సాహిత్యానికి శ్రీశ్రీయే పరమం

అని ఎవరు ఎందుకు అని ఉన్నా అది సమర్థనీయం కాదు. శ్రీశ్రీకి ఈ రోజు ఏ ప్రాసంగికతా లేదనీ, చారిత్రక ప్రాధాన్యతేగాని శ్రీశ్రీకి వర్తమానంలో చోటే లేదనే వాదనలాంటిదే అదీ. ఇలాంటి అభిప్రాయాలు పరస్పర పోటీగా వస్తుంటాయి. అవీ, ఇవీ చారిత్రక దృక్పథానికి వ్యతిరేకం.

విప్లవం అనేది వర్తమానంలోంచి, భవిష్యత్తులోకి అనుక్షణం నిర్మాణమయ్యే సజీవ చరిత్ర. శ్రీశ్రీ అనే ఒకే కవి చరిత్ర సాంస్కృతిక అవసరాలన్నీ తీరుస్తాడనుకోవడం హాస్యాస్పదం, మూర్ఖత్వం. చారుమజుందార్ ఎంత కీలకపాత్ర పోషించినా, నేటికీ స్ఫూర్తిదాయకం అయినా విప్లవోద్యమం ప్రతిదశలో తనకు అనుగుణమైన నాయకత్వాన్ని, కార్యకర్తలను తయారు చేసుకున్నది. ఇలాంటి వాస్తవ ఆచరణలో భాగమైన సాహిత్యోద్యమం శ్రీశ్రీ ఎల్లకాలాలకు ఒకే కవిగా ఎలా భావిస్తుంది? ఆయన్ను ఒక విగ్రహంగా ఎందుకు నిలబెడుతుంది?

శ్రీశ్రీ మీద ఈగవాలకుండా, గార్డియన్స్‌గా ఫీలవుతారని, సొంత ఆస్తి అన్నంత పొసెసివ్‌నెస్‌తో వ్యవహరిస్తారని, శ్రీశ్రీ చేసిన ప్రతి పిచ్చిపనికీ సంజాయిషీలు ఇచ్చి కాపాడుకోవాలని చూస్తారనేది మరో అభిప్రాయం.

శ్రీశ్రీని భక్తి ప్రపత్తులతో చూసేవాళ్లు ఈ రుగ్మతను ప్రదర్శించుకోవచ్చు. వ్యక్తిగా శ్రీశ్రీలోని లోపాలు, ఆయన అవగాహన లోని లోపాలు తెరచిన పుస్తకంలాంటివి. ఆయన్ను చారిత్రక వ్యక్తిగా భావించేవాళ్లెందరూ ఆ పనికి పూనుకోలేదు. ఆయన వ్యక్తిగత, అవగాహన బలహీనతలతో విప్లవ సాహిత్యోద్యమమే చివరంటా ఘర్షణ పడింది. అదంతా ఆయన్ను నిలబెట్టుకోవడానికి కాదు. స్టాలిన్ మీద మావో అంచనా, చారుమజుందార్ మీద తదుపరి నాయకత్వం అంచనా ఎంత నిక్కచ్చిగా, శాస్త్రీయంగా ఉన్నాయో ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి. శ్రీశ్రీ మీద కూడా విప్లవ సాహిత్యోద్యమానికి అలాంటి అంచనా ఉంది. ఇంకా వెనక్కి వెళ్లి చెప్పాలంటే - లెనిన్ గోర్కీ గురించి ఏమన్నాడో శ్రీశ్రీయే గుర్తు చేసి అది తనకూ వర్తిస్తుందని అంగీకరించాడు. శ్రీశ్రీని మొత్తంగా అర్థం చేసుకోవడానికి ఇలాంటివి ప్రాతిపదికలు. అందుకే ఆయనతో రాజీలేకుండా ఘర్షణ పడుతూ, ఆయనలోని పాజిటివ్ విషయాలకు తానే వారసురాలినని విప్లవ సాహిత్యోద్యమం చెప్పుకుంది. కాబట్టి శ్రీశ్రీ మీద అవసరమైన విమర్శలన్నీ విప్లవసాహిత్యోద్యమమే పెట్టింది. అయితే ఇప్పుడు శ్రీశ్రీ సాహిత్యం మీద, ఆయన ప్రాసంగికత మీద వస్తున్న విమర్శలు ఈ చట్రానికి బైటివి.

వాటిలో శ్రీశ్రీ కులం గురించి, తెలంగాణ గురించి, ఇంకా ఇతరాల గురించి రాయలేదే అనే విమర్శ ముఖ్యమైనది.

ఆయన రాసిన వాటివల్లనే చరిత్రలో చోటు ఉంటుంది. రాయని దానికి కూడా మార్కులు వేయనవసరం లేదు. అది మంచి పద్ధతికాదు. జీవితాన్నీ, సమాజాన్ని ఆయన అర్థం చేసుకున్న తీరుకు, దానికి దారిచూపిన జాతీయ, అంతర్జాతీయ సంఘర్షణలకు వెలుపల చూస్తే ప్రయోజనం ఏమీలేదు. వర్తమానంలో నుంచి ఒక చారిత్రక వ్యక్తిని పునర్నిర్మించి, పునరంచనాలకు రావడం అంటే ఇదికాదు. ఇది మన అనవసర ప్రయాస. శ్రీశ్రీ కులం గురించి రాయలేదని చెప్పడానికి, రాశాడని చెప్పడానికి నిరర్థకమైన యాతన పడనవసరం లేదు. కులం, ప్రాంతం మొదలైనవన్నీ ఆయన సాహిత్యంలో ఉండాలనే ఉబలాటం మనకెందుకు? ఎవరైనా శ్రీశ్రీ వారసులు అవన్నీ ఆయన రాశాడని అంటే నిలదీయాలి. రాయకపోయినా సరే ఆయనే యుగాంతం దాకా ఏకైక కవి అని అంటే ప్రశ్నించాలి. మహాకవి అనే మాట ఒక నానుడి కావచ్చుగాని నిజానికి అది ఆయన చూపిన వొరవడిని, వేసిన ప్రభావాన్ని, నడిపిన ఉద్యమాన్ని, మొత్తంగా తెలుగు సాహిత్య సామాజిక రంగాలకు అందించిన చూపును ఆ మాట సూచిస్తూ వాడుకలోకి వచ్చింది. (మహాకవి, యుగకర్త అనే మాటలు చరిత్రలోని అనేక సంప్రదాయాలవల్ల ముందుకు వచ్చినవేగాని ఆ మాటలే ఏ విశ్లేషణలూ ఇవ్వజాలవు. వ్యక్తుల పాత్ర, ప్రభావం విడుదల చేసిన భావజాలం నుంచి విడుదలైన విశేషణాలు విశ్లేషణ సామర్థ్యాన్ని మొద్దుబరిచే భావజాల అవరోధంగా మారుతాయి. ఇప్పుడు ఆ విశేషణాలు పెద్దగా వాడటం లేదు. వాడినా ఊత పదాలుగానే తప్ప పాత అర్థంలో కాదు. ఎందుకంటే - ప్రజా పోరాటాల్లో ఎంత కీలకమైన నాయకుణ్ణి అయినా మహానాయకుడు అనే సంప్రదాయం లేదు. కీలకపాత్ర పోషించిన నాయకుల విశిష్టత చెప్పుకోవచ్చు...) దీని మీద ఎవరి అంచనాలు, ప్రమాణాలు వాళ్లకుండచ్చు గాని, శ్రీశ్రీ ప్రభావశీలమైన సాహిత్య వ్యక్తిత్వాన్నయితే కాదనలేరు. మహాకవి అనే మాటను పక్కన పెట్టేసి శ్రీశ్రీ ప్రభావం ఏమిటో తేల్చుకోవడం అత్యవసరం. కానీ శ్రీశ్రీ విమర్శకుల్లో కూడా.. శ్రీశ్రీ అంటే ఉన్న ఇమేజ్ వల్ల.. ఎల్లకాలాలకూ వర్తించే కవిగా శ్రీశ్రీని ముందు చిత్రించి, లేదా అంగీకరించి.. ఇక ఆ తర్వాత ఆయన అది రాయలేదు... ఇది రాయలేదు.... అని డిస్క్వాలిఫై చేస్తుంటారు. శ్రీశ్రీ తెలంగాణ అస్తిత్వ రాష్ట్ర ఉద్యమానికి ఒక్క నినాదాన్ని ఇవ్వలేదే, ఒక గీతాన్ని రాయలేదే అనే వగపుకు అర్థం ఏముంది? తెలంగాణ అస్తిత్వ పోరాటానికి కూడా ఆయనే వైతాళికుడని ఎవరైనా చెప్తే అభ్యంతరపడాలి.

తెలంగాణ గురించైనా, కులం గురించైనా ఆయన జీవితకాలపు సమాజ చైతన్యానికి అనుగుణంగా - కొంచెం ముందుచూపుతోనో, వెనకచూపుతోనో రాసి ఉంటాడు. అందులో ఆయన కులం గురించీ, తెలంగాణ గురించీ ఆలోచించాడనీ, రాశాడనీ చెప్పడానికి కొన్ని ఆధారాలు ఉంటాయి. వాటిని వెతికి సరికొత్తగా, సమగ్రంగా శ్రీశ్రీని అర్థం చేసుకుందామనే ప్రయత్నం వేరేసంగతి. కానీ ఇప్పుడు జరుగుతున్నది అదికాదు. ఆయన్ను మహాకవి అంటారు కాబట్టి అన్నీ రాసి ఉండాల్సిందే అనే వాదన ఇది.

అట్లయితే శ్రీశ్రీని దళితులు, తెలంగాణ వాళ్లు, ముస్లింలు ఇంకా అనేక సామాజిక సమూహాల నాయకులూ ఆయన్ను ఎందుకు గుర్తించాలి? అనే ప్రశ్న వస్తుంది. తమ తమ కులాల గురించి రాయలేదు కాబట్టి తెలుగు సమాజానికి, ఉద్యమ చైతన్యానికి ఆయన ఏమీ అందివ్వలేదనీ నిర్ధారించదల్చుకుంటే దానికి శ్రీశ్రీ ఏమీ చేయలేడు. ఆయన వారసులు కూడా ఈ వాదనలు చేసే వాళ్లను ఒప్పించనవసరం లేదు. శ్రీశ్రీ ఏమైనా ఎన్‌సైక్లోపీడియానా ? అన్నీ ఉన్నాయని ఎత్తి చూపడానికి? ఆ మేరకు ఆయా అస్తిత్వ ధోరణుల నాయకులు శ్రీశ్రీని గుర్తించం అంటే తప్పేమీకాదు.

మరి శ్రీశ్రీ గొప్ప ఏమిటి?

ఇదీ అసలు ప్రశ్న. గొప్ప అని కాకపోయినా తెలుగువారి సామాజిక సాంస్కృతిక చైతన్యంలో, ఉద్యమావరణలో నేటికీ మిగిలి ఉండే అంశమేదైనా శ్రీశ్రీలో ఉన్నదా? ఇవ్వాల్టికీ ఆయన మనకేమైనా అవసరమా ? అని ప్రశ్నించుకోవాలి.

❖ ❖ ❖

వలసవాదం కింద ఉన్న భారత సమాజంలో రెండు వైపుల నుండి రెండు ముఖ్యమైన చలనాలు బయల్దేరాయి. అవి వలసవాద ప్రేరణతో తలెత్తి దానితో ఐక్యత - ఘర్షణ అనే ప్రాతిపదిక మీద విస్తరించాయి. ఒకటి భారత సమాజంలోని పై కులాల, వర్గాల నుండి మొదలైన పునరుజ్జీవన లేదా సంఘ సంస్కరణోద్యమం అనే స్థూల చట్రంలోనిది. రెండు కింది కులాల నుండి బయల్దేరిన పునరుజ్జీవన, సాంస్కృతిక ఉద్యమం. ఈ రెండు పాయల మధ్య సంబంధాలు, పరస్పర ప్రభావాలు ఎలా ఉన్నదీ మనం స్పష్టంగా చెప్పలేం. అయితే ఒక ఉమ్మడి బిందువు దగ్గరికైతే రాలేదు. ఈ రెండు ప్రవంతుల ద్వారా మనదేశంలో ఆధునికత ప్రవేశించింది.

భూస్వామ్య సాంస్కృతిక సాంప్రదాయాలకు, వలసవాదానికి వ్యతిరేకంగా వచ్చిన బూర్జువా ప్రజాస్వామిక చైతన్యం ఈ రెండు ప్రవంతుల్లో ఒకేలా వ్యక్తం కాలేదు. భూస్వామ్య వ్యతిరేకత ఉన్నంతగా వలసవాద వ్యతిరేకత ఉండకపోవచ్చు. భూస్వామ్యంలో కూడా పై కులాల సంస్కర్తలు హిందూ మత రూపాలను ఎక్కువగా వ్యతిరేకిస్తే, కింది కులాల సంస్కర్తలు నేరుగా కుల వ్యవస్థను ఎదుర్కొని ఉండవచ్చు. పై కులాల వాళ్లు వాళ్లకున్న వెసులుబాటువల్ల వలసవాదంతో ఐక్యత - ఘర్షణ సూత్రంలో కొందరు ఎక్కువ ఘర్షణవైపు మొగ్గితే కింది కులాలవాళ్లు తమ ప్రత్యేకతల వల్ల ఎక్కువ ఐక్యత పాటించి ఉండవచ్చు. యిదంతా వలసపాలనాధికారం స్థిరపడిన క్రమంతో, దాని ప్రత్యర్థి వర్గం బలం పుంజుకున్న తీరుతో, అది తీసుకున్న వైఖరులతో ముడిబడి ఉన్న అంశం.

రాజారామ్మోహన్‌రాయ్, పూలే కాలానికి ; మన దగ్గర కందుకూరి, గురజాడ కాలంనాటికి చాలా మారిపోయింది. వీరేశలింగం స్వతంత్రంగా ఉంటూ భూస్వామ్య సంస్కృతిపై పోరాడుతూ ఆంగ్ల సామ్రాజ్యాన్ని కీర్తించాడు. గురజాడ ఒక ఆస్థానంలో ఉండి భూస్వామ్యాన్ని, వలసవాదాన్ని తెగనాడాడు. ఒక్కో ప్రాంతంలో ఒక్కో కాలంలో, ఒక్కో వ్యక్తి ప్రత్యేకమైన వైఖరులు తీసుకున్నారు. దానికి అసమానమైన పాత్ర పోషించారు.

అట్లా పై కులాల సాంఘిక సాంస్కృతిక, నాస్తిక, హేతువాద బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమ ఆవరణ నుండి, ఆ పూర్వ రంగం నుండి ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం బయల్దేరింది. ఈ నిర్దిష్ట పరిస్థితి చుట్టూ ఒక అంతర్జాతీయ వాస్తవికత ఉన్నది. పెట్టుబడిదారీ విధానం సృజించిన 'వ్యక్తి'కి భిన్నంగా సోషలిస్టు విప్లవం చరిత్ర మనోఫలకం మీదికి విశ్వ మానవుణ్ణి తీసుకుని వచ్చింది. యిది ఆ కాలపు తీవ్రశక్తుల సంఘర్షణలో ప్రజల అఖండ విజయం. శ్రీశ్రీ మానవుడా! అని సంభావించింది ఈ విశ్వ మానవుణ్ణే. విశాఖ, మద్రాసు రోడ్ల వెంట ఆయనకు కనిపించిన అన్నార్తులు, దరిద్రులు, నెత్తురు అమ్ముకునే కార్మికులు, నిరుద్యోగులు.... ఆరిపోయిన కుంపటి విధాన ఉన్న దీనులు, ఈ దుస్థితికి వ్యతిరేకంగా పోరాడుతున్న సామాన్యులు.... వీళ్లందరిలోని ఆత్మ ఈ విశ్వమానవుడే. శ్రీశ్రీ అనే వ్యక్తి ఈ విశ్వమానవుణ్ణి దర్శించడానికి, నిజం చేయడానికి చేసిన ప్రయత్నమే ఆయన కవిత్వం.

దీనికి సైద్ధాంతిక భూమిక ఉన్నది. ప్రజలు వేతన కార్మికులుగా మారి తమ శ్రమశక్తిని అమ్ముకోవడం వల్ల పెట్టుబడిదారులు అదనపు విలువను దోచుకోవడం అనే మౌలిక ప్రాతిపదిక మీద ఈ భావన రూపొందింది. యావత్ మానవ సమాజం అదనపు విలువ దోపిడీ అనే ఏకైక పునాది మీద పునర్నిర్మాణం అవుతున్న తరుణం అది. దానికి సోవియట్ యూనియన్‌లో కార్మికులు గండికొట్టారు.

చారిత్రకంగా వలసవాదం వల్ల ఆధునికత సంక్రమించడం, బైటి ప్రపంచంతో మన సాంఘిక, రాజకీయ వ్యవస్థలన్నీ అనుసంధానం కావడం, యావత్ ప్రపంచమంతా పెట్టుబడిదారీ విధానం- సోషలిజం అనే తీవ్ర సంఘర్షణలో తలమునకలై ఉండటం అనే సన్నివేశంలో శ్రీశ్రీ కవిగా ఆవిర్భవించాడు. సహజంగానే ఆయన - మొదట చెప్పిన రెండురకాల చలనాల్లో పై కులాల సాంఘిక సాంస్కృతికోద్యమ నేపథ్యంలోంచి కమ్యూనిస్టు ఉద్యమావరణలోకి చేరుకున్నాడు.

అందుకే ఆయన అడుగుజాడ గురజాడ అని చాలా చారిత్రక స్పృహతో అన్నాడు. అంటే బూర్జువా ప్రజాస్వామిక ఆలోచనల పూర్వరంగంలోంచి కార్మికవర్గ విప్లవ చైతన్యంలోకి చేరుకున్నాడు. మన సామాజిక చరిత్ర క్రమంలోని ఒక ముఖ్యమైన పాయకు అనుగుణమైన సాహిత్య వ్యాఖ్య అది. కార్మికవర్గ విప్లవం అట్లా ఆయన ఆలోచనలో భాగమై నలభై ఏళ్ల తెలుగు సమాజ, భారతదేశ రాజకీయ పరిణామాలతో సంఘర్షిస్తూ, విస్తరిస్తూ శ్రీకాకుళ పోరాటంలో అది పరిపూర్ణమైన అవగాహనగా వ్యక్తమైంది. విరసంకు- ఆయనకు మధ్య సంఘర్షణ అంతా ఆయన వ్యక్తిగత దౌర్బాల్యానికి, కొన్ని సమస్యలపై రాజకీయ అవగాహన లోపాలకు, వాటి నుంచి తలెత్తిన నిర్మాణ సమస్యలకు సంబంధించినవేగాని, నక్సల్బరీ పంథాకు సంబంధించింది కాదు.

విప్లవం గురించి, దానికున్న అంతర్జాతీయ స్వభావం గురించి, అందులో భాగమైన అనేకానేక అంశాల గురించి ఆయనకు ఉన్న అవగాహన అంతా క్యాపిటలిజం వర్సెస్ సోషలిజం అనే చట్రంలోనిది. చారిత్రకంగా వలసవాదం నుంచి తలెత్తిన ఆధునికతా క్రమాల్లో ఒక దానికి ప్రవక్తలని చెప్పదగిన గురజాడ, వీరేశలింగాలు రూపొందించిన భూమిక మీది నుంచి శ్రీశ్రీ బూర్జువా ఆధునికతను సోషలిస్టు ఆధునికతగా ముందుకు తీసుకపోవడానికి కృషి చేశాడు. ఆ విషయంలో ఆయన పాత్ర వల్ల ఆయన కార్మికవర్గ విప్లవానికి సాంస్కృతిక, భావజాల ప్రతినిధిగా నిలబడ్డాడు. దీనికి బోల్షివిక్ విప్లవం, సోవియట్‌యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణం అనేవి విడుదల చేసిన ప్రచండమైన భావజాలం కీలకంగా పని చేసింది. అది మానవజాతికి అంతకుముందు లేని కొత్త చూపును అందించింది. సోషలిస్టు నిర్మాణంతోపాటు ఫాసిస్టు వ్యతిరేకపోరాటంలో ప్రజల విజయం, చైనా విప్లవం, సాంస్కృతిక విప్లవం అనే చారిత్రక ఘట్టాల నేపథ్యంలో వాటికి మన దగ్గర శ్రీశ్రీ భావజాల ప్రతినిధి అయ్యాడు. శ్రీశ్రీ రూపొందిన ఈ భావజాల ఆవరణ అంతా బైటి సమాజాల్లో పీడితులు సాధించిన అద్భుత విజయాల నుంచి తయారైనదే. వీటిని ఆకళింపు చేసుకున్న అతికొద్ది మంది తెలుగు సాహిత్యకారుల్లో శ్రీశ్రీ ముఖ్యుడు. దీనివల్లనే భారత సమాజంలోని ప్రగతిశీల పరిణామాలను, ఉద్యమాలను ఆయన చాలా మందికంటే మెరుగ్గా గుర్తించగలిగాడు. కాపిటలిజం-సోషలిజం మధ్య ప్రపంచవ్యాప్తంగా నడచిన తీవ్ర సంఘర్షణను ఆయన అంతగా పట్టించుకోడానికి కారణం ఆయన ప్రధానంగా నగర కవి కావడమే. వ్యక్తిగా ఆయన విశాఖపట్టణంలో పుట్టి అంతకంటే పెద్ద పట్టణాల్లో తిరగడం వల్ల పెట్టుబడిదారీ శక్తుల విజృంభణను అర్థం చేసుకున్నాడు. కవిగా ఆయనది నగరాత్మ. 'నేను' వైపు నుంచి సాగిన కవిత్వ వ్యక్తీకరణలో పెట్టుబడిదారీ వ్యవస్థలోని వ్యక్తి లేదా ఒంటరి అనుభవం వినిపిస్తుంటుంది. దానికి విరుగుడుగా సోషలిస్టు మానవుడు అనే విశ్వనరుడ్ని అత్యంత శక్తివంతంగా ముందుకు తీసుకవచ్చాడు. శ్రీశ్రీ

దళితుడిగా పుట్టలేదు కాబట్టి దళిత అనుభవం లేదనడానికి వేరే సిద్ధాంతాలేవీ అక్కర్లేదు. అనుభవవాదం సరిపోతుంది. అయితే కులం గురించి రాయకపోవడానికి పుట్టుక అనే షరతే గాక సామాజికుడిగా, ఆలోచనాపరుడిగా, సృజనకారుడిగా ఆయన నిర్మాణమైన తీరులో ఉన్న అనేక ప్రత్యేకతలు కారణమవుతాయి. ఆయన రాసిన వాటికి, రాయనివాటికి కూడా ఈ ప్రత్యేకతలే కారణం.

అయితే శ్రీశ్రీ భూస్వామ్య వ్యతిరేక సాంఘిక సాంస్కృతిక పోరాటాల పూర్వరంగం నుండి వచ్చాడని మర్చిపోవద్దు. అందుకే ఆయన దేవుడు, నమ్మకాలులాంటి ఆధ్యాత్మిక సామాగ్రిని చాలా తీవ్రంగా ఎత్తి పొడిచాడు. బ్రాహ్మణ, హిందూ మతాన్ని చాలా చైతన్యవంతంగా ఎండగట్టాడు. ఇక సంఘ పరివార్ గురించైతే చెప్పనవసరమే లేదు. కుటుంబరావు, శ్రీశ్రీ దాని ప్రమాదం పట్ల చాలా అప్రమత్తంగా ఉండేవారని వాళ్ల రచనల ఆధారంగా చెప్పవచ్చు. సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు అనడం ద్వారా భారతదేశంలో ప్రజల సాంఘిక అస్తిత్వం పట్ల శ్రీశ్రీకి ఉన్న స్పృహ తెలుస్తుంది. తెలుగు సాహిత్యంలోకి తొలిసారిగా ఆధునిక దృష్టితో శ్రమ సంబంధాలను తెచ్చింది ఆయనే. వాటికి సాంఘిక పార్శ్వం ఉందని ఆయనకు తెలుసు. అంతఃపుర సాహిత్యం, భాష, సంస్కృతి మొదలైనవాటి నుండి శ్రమ సంబంధాలను చూచేటప్పుడల్లా ఇది వెల్లడవుతూ వచ్చింది. ఆయన ఒక చోట భాష గురించి చెప్తూ... 'తెలుగుభాష.... ఇది ఒకటి కాదు. మడికట్టుకున్న భాష, దానికి వెలుపల ఉన్న భాష అని అంటాడు. ఇలాంటివి ఎన్నయినా చూడవచ్చు.

అయితే యివన్నీ విశ్వమానవుడికి - అదనపు విలువ రూపంలో శ్రమశక్తి దోపిడీకి గురయ్యే కార్మికుడికి ఈ దేశంలో (ఏ దేశంలోనైనా ఏదో ఒక సాంఘిక అస్తిత్వం ఉండేదే, బైటి దేశాల్లో ప్రజలకు ఆర్థిక అస్తిత్వం తప్ప సాంఘిక అస్తిత్వం ఉండదని అమాయకంగా వాదిస్తుంటారు. ఏ సమాజంలోనైనా ఏదో ఒక సాంఘిక వ్యవస్థ ఉంటుంది. అది మన కులవ్యవస్థలాంటిది కాకపోవచ్చు. అది వేరే విషయం) ఒక సాంఘిక పార్శ్వం ఉన్నది అనేంత వరకు ఆనాటి కమ్యూనిస్టులకు ఉన్న అవగాహన శ్రీశ్రీకి కూడా ఉన్నది. తెలుగు సమాజానికి సంబంధించినంత వరకు కమ్యూనిస్టు ఉద్యమం - బూర్జువా ఆధునికత, నాస్తికహేతువాద ఉద్యమాలు, మొత్తంగా సంఘసంస్కరణోద్యమాలు అనే భూమిక మీది నుంచి భూస్వామ్య వ్యతిరేక చైతన్యంతో ముందుకు వచ్చింది. ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలు సాంఘిక సాంస్కృతిక రంగాల్లోనే ప్రబలంగా సాగాయి. అక్కడ కమ్యూనిస్టుల ఆచరణ చాలా విస్తారమైనది. ముందే అన్నట్లు అది చారిత్రకంగా పై కులాల, వర్గాల ప్రవంతి అయినా దాని సాంఘిక పార్శ్వం చిన్నది కాదు. ఈ పరిధిలో కాపిటలిజం వర్సెస్ సోషలిజం అనే చారిత్రక సంధియుగంలో నిలిచిన ఆధునిక మానవుడిని అదనపు విలువ దోపిడీకి గురయ్యే కార్మికుడిగానే అర్థం చేసుకున్నా, ఆ కార్మికుడికి ఒక సాంఘిక సాంస్కృతిక అస్తిత్వం ఉందని శ్రీశ్రీకి, ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమానికి కొంచెం అవగాహన ఉంది.

ఆయన కులం గురించి రాయలేదనే విమర్శకు జవాబుగా ఇప్పుడు మనకున్న అవగాహనతో ఆయన అన్నీ రాసేశాడనీ, ఆయన రాసిన దానిలో అన్నీ ఉన్నాయని, అవేవీ రాయకపోయినా ఆయన ఆయనే అని అర్థంలేని సిద్ధాంతాలు చేయనవసరం లేదు. అసలు ఈ ఊసే లేకుండా శ్రీశ్రీ గురించి మాట్లాడుకుంటూ పోవడం వల్ల సాధించేదేమీ ఉండదు. ఇది ఎలాంటిదంటే సరిగ్గా - ఆయన కులం గురించి ఇప్పుడు నేను సంతృప్తి పడే విధంగా అప్పట్లోనే ఎందుకు రాయలేదు? అనే వాదం లాంటిదే అవుతుంది. ఇలాంటివి ఏవీ చారిత్రక వ్యక్తుల పాత్రను అంచనా వేయడానికి, వాళ్ల సమకాలీనత చెప్పడానికి పనికిరావు. ఈ వాదవివాదాల్లో ఆయనకున్న ఆధునిక కార్మిక వర్గ స్పృహను పలుచన చేస్తే మొత్తంగా శ్రీశ్రీ గల్లంతవుతాడు.

కులం గురించి యింత కొంచెమే తెలిసిన వ్యక్తిని దళితులు ఎందుకు అంగీకరించాలి? అనే ప్రశ్నతోపాటు ఇంత కొంచెం అవగాహనతోనే విప్లవం ఎట్లా సాధ్యం? అందులో అదనపు విలువ దోపిడీ రద్దు అవుతుందేమోగాని, సాంఘిక విముక్తికి భరోసా ఏమిటి? ఈ తరహా అవగాహన ఉండే శ్రీశ్రీ ఏం విప్లవ కవి? ఆయనలాంటి వాళ్ల మార్గంలో వచ్చేది ఏం సోషలిజం? అనే ప్రశ్నలు కూడా తోడవుతాయి.

ఇవి మంచి ప్రశ్నలే. ఇవి శ్రీశ్రీ అవసరాన్ని ఈ రోజు నిగ్గుదేల్చడానికి పనికి వస్తాయి. ఈ సందేహాలు తార్కికమైనవే కాబట్టి వాటి ఆధారంగా శ్రీశ్రీ ఇప్పుడేమీ ఉపయోగపడడు అనవచ్చు. వాటి ఆధారంగానే శ్రీశ్రీ సమకాలీన ప్రాధాన్యతనూ వివరించవచ్చు.

శ్రీశ్రీ ఏవైతే రాయలేదనే విమర్శ ఉందో అది సత్యమే అనుకున్నా, దానికి చూపిస్తున్న కారణాలు సబబే అని ఒప్పుకున్నా శ్రీశ్రీ రాసిన దానికి ఉండే ప్రాసంగికతను ఎవ్వరూ తీసెయ్యలేరు. శ్రీశ్రీ నాలుగు తరాలుగా సమాజం మీద వేస్తున్న ప్రభావం ఏమంటే - తిరుగుబాటు వైపు మళ్లించడం. శ్రీశ్రీ చెప్పని అమూల్యమైన విషయాలు చాలా మంది చెప్పి ఉండొచ్చు. కానీ శ్రీశ్రీ ప్రత్యేకత ఏమంటే - తిరగబడమని, ఉద్యమించమని చెప్పడం. ఈ మాట కూడా ఇంకా చాలా మంది చెప్పారు. కానీ శ్రీశ్రీ పలుకు తిరగబడవలసిన వాళ్లకు ఈ రోజు, రేపూ ఆ శక్తిని ఇస్తుంది. గత నలభై యాభై ఏళ్లలో సామాజిక రాజకీయ పోరాటాల్లోకి వచ్చిన చాలా మంది వెనుక శ్రీశ్రీ ఇన్స్పిరేషన్ ఉన్నది. శ్రీశ్రీని చదివి, ఆయన పాటలు విని సామాజికులుగా పరివర్తన పొందడాన్ని మనం దగ్గరిగా చూడవచ్చు. ఆయనే అన్నట్టు 'కదిలేదీ... కదిలించేది...' ఆలోచనా ప్రపంచంలో మొదలై మానవ కర్తృత్వం దిశగా తీసికెళ్తుంది. ఆలోచింపచేసే సాహిత్యం మనకు చాలా ఉన్నది. శ్రీశ్రీ అట్లా గొప్పగా ఆలోచింపచేసేలా రాయడమేగాక మనిషిని మార్పు క్రమంలోకి తీసికెళ్తాడు. అందులో భాగం కావడానికి ప్రేరేపిస్తాడు. అది ఏ ఆధిపత్యానికి వ్యతిరేకంగా సాగే పోరాటం? ఎలాంటి రూపం? అనేది వేరే విషయం. ఇవాళ శ్రీశ్రీని తీవ్రంగా విమర్శిస్తున్న వాళ్లందరి పరిణామంలో ఎక్కడో, ఎంతో కొంత శ్రీశ్రీ ఉంటాడు. అన్ని రకాల ఆధిక్యాల గురించి, అణచివేతల గురించి ఆయన విడివిడిగా రాయలేదేమో గాని, అలాంటి పోరాటాల గురించే వేర్వేరుగా ఉద్బోధించలేదేమోగాని ఆ కాలంలోని ప్రజలందరినీ ఆధిపత్యానికి, దోపిడీకి వ్యతిరేకంగా మార్పు క్రమంలోకి నడవమని ప్రేరేపించాడు. శ్రీశ్రీ సాహిత్యం ఈ సమాజాన్ని విమర్శించడానికేగాక ఈ రోజు కూడా అట్లా పోరాటాల్లోకి నడవమంటుంది. అంటే మనిషిని క్రియాశీలం చేసే గుణం ఆయనలో పుష్కలంగా ఉంది. సాహిత్యానికి ఉండాల్సిన ముఖ్య లక్షణంగా ఆధునికులందరూ దీన్ని అంగీకరిస్తారు. అది ఆయనే అన్నట్టు గద్దర్ లాంటి కవులు, కళాకారులు తన కంటే ఎక్కువ చేయగలరనే మాట వాస్తవం. తిరుగుబాటు ఎలా ఉండాలో శ్రీశ్రీకి ఒక క్రమంలో స్పష్టత ఏర్పడింది. అది నక్సల్బరీ పంథా. దీనితో

ఏకీభావం లేనివాళ్లు కూడా తిరుగుబాటు అవసరం అనుకుంటే శ్రీశ్రీ అవసరం ఉంటుంది. శ్రీశ్రీ లేదా అతని వారసులు చెప్తున్న మార్గంలో విప్లవం రాదని నమ్మేవాళ్లకు కూడా విప్లవంతో పేచీ లేనంత వరకు శ్రీశ్రీ అవసరం ఉంటుంది.

అయితే శ్రీశ్రీ తర్వాత తెలుగు సాహిత్యావరణం చాలా మారిపోయింది. ఆయనే సంభ్రమానికి గురయ్యేంతగా తెలుగు కవిత్వ రూపం మారిపోయింది. కొత్త వస్తువు భాషలో, రూపంలో, వ్యక్తీకరణలో ఈ మార్పులను తీసుకొని వచ్చింది. అట్లాగే శ్రీశ్రీని రూపొందించిన భావజాలం, ఆయన ప్రాతినిధ్యం వహించిన భావజాలం ఇవాళ కొత్త రూపాల్లోకి వెళ్లింది. శ్రీశ్రీ కాలంలో ఆది అంత ప్రచండశక్తిగా ఉండటానికి అంతర్జాతీయ నేపథ్యం కారణం. మన దేశంలో అప్పటికంటే ఇప్పుడే విప్లవోద్యమం చాలా ఉన్నత దశకు చేరుకున్నా అప్పటి వలె భావజాల తీవ్రత లేదు. శ్రీశ్రీ గురించి మాట్లాడుతున్నప్పుడు ఈ మారిన సన్నివేశాన్ని దృష్టిలో పెట్టుకోకుండా శ్రీశ్రీ కాలంలోని భావజాల తీవ్ర స్వరంతో మాట్లాడ్డంలో ఇబ్బంది ఉన్నది. అది శ్రీశ్రీ ప్రాసంగికత గురించిన సమస్యకాదు. నిజానికి విప్లవోద్యమానికి ఇవాళ శ్రీశ్రీ అవసరం చాలా ఎక్కువ ఉంది. కానీ విప్లవోద్యమం ఆ రోజుల్లోలాగా భావజాలాన్ని ఉత్పత్తి చేయడం లేదు. పెట్టుబడి మెడలు వంచి సామాన్యులు చరిత్రగతిని మార్చేస్తూ సాధించిన విజయం ప్రపంచమంతా భావజాలంగా విస్తరించింది. ఇప్పుడు అట్లాలేదని కొత్తగా చెప్పనవసరం లేదు గాని మన సాహిత్యంలో దానికి ప్రతినిధి అయిన శ్రీశ్రీ గురించిన వ్యాఖ్యానంలో ఈ ఎరుక అవసరం. శ్రీశ్రీ గురించి కొందరైనా ఈ శతజయంతి సందర్భంలో పాత స్వరంతో మాట్లాడారు. విప్లవ సాహిత్యోద్యమం ఈ విషయంలో అప్రమత్తంగా ఇప్పుడు శ్రీశ్రీ గురించి ఏ స్వరంతో మాట్లాడాలి? ఇప్పుడున్న సాహిత్యావరణంలో ఏయే విషయాలు పరిగణనలోకి తీసుకుని శ్రీశ్రీ గురించి మాట్లాడాలో ఒక అవసరమైన చర్చను ప్రారంభించి ఉండాల్సింది! శ్రీశ్రీ మీద గత కొన్నేళ్లుగా వ్యతిరేకత లాంటి విమర్శ రావడానికి అనేక అకారణ, సకారణాలతో పాటు (ముఖ్యమైంది దృక్పథసమస్యే అయినా )ఈ ధోరణి కూడా ప్రేరేపించిందనడంలో తప్పు లేదు.

శ్రీశ్రీ దృష్టిలో మార్పు అనేది పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోసి సోషలిజంలోకి వెళ్లడం. మానవ సమాజం ఒక సంధి దశను అధిగమించి ఒక కొత్త దశలోకి వెళ్లడం. అంటే మార్క్స్ అన్నట్టు నిజమైన చరిత్రలోకి వెళ్లడం. ఈ సమూల మార్పు గురించి ఆలోచించడానికి, మార్పే మానవకర్తృత్వానికి ప్రేరణ ఇవ్వడం శ్రీశ్రీ స్ఫూర్తి. ఆ సమూల మార్పులో ఉండాల్సిన యితర ముఖ్యమైన అంశాలు లేనప్పుడు అదెలా సమూల మార్పు అవుతుంది? సోషలిజం అవుతుంది? అన్నదానికి ఒకటే సమాధానం.

శ్రీశ్రీ ఇరవైవ శతాబ్దపు సోషలిస్టు ప్రయోగాలకు అత్యద్భుతమైన సాటిలేని కాల్పనిక ప్రతినిధి. ఇవాళ అది చరిత్రలో భాగం. ఇరవై ఒకటో శతాబ్దపు సోషలిజంలో మన దగ్గరున్న కులం రద్దు అనే సాంఘిక విముక్తి మాత్రమేగాక యింకా చాలా ఉంటాయి. ఇరవైవ శతాబ్దం ఎదుర్కోని చాలా సమస్యలు ఆ తర్వాత రంగం మీదికి వచ్చాయి. పెట్టుబడిదారీ విధానం, దాని అత్యున్నత రూపమైన సామ్రాజ్యవాదం అనేది స్థూల చట్రంలో గతంలో లేని సమస్యలు తలెత్తాయి. ఇవన్నీ రేపటి సోషలిజం రూపురేఖలను నిర్దేశిస్తాయి.

కాబట్టి శ్రీశ్రీ వర్గ దృక్పథంలో కులం లేదనే విమర్శతోపాటు -యింకా చాలా, గంభీరమైన ప్రశ్నలు చాలా వేసుకోవాల్సి ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే - అదనపు విలువ దోపిడీ అనే మౌలిక ప్రాతిపదిక మీద నిర్మాణమైన మార్క్సిస్టు సిద్ధాంత చట్రంలో కులం తదితర సాంఘిక విముక్తులను వివరించే సంవిధానం ఎలా ఉంటుంది ? అని ప్రశ్నించుకుంటే మంచిది. ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు అనే పరిశీలనా పద్ధతి ప్రకారం వీటన్నిటినీ వివరించగల ఆవరణ మార్క్సిజంలో పుష్కలంగా ఉన్నది.

అయితే శ్రీశ్రీ సందర్భంలో పనిలో పనిగా చాలా సిద్ధాంత పరిభాష వాడటమేగాని( ఈ రకమైన సిద్ధాంత చర్చకు శ్రీశ్రీ తగిన సందర్భం కాదు. ఆయన గొప్ప సృజనకారుడిగా సాటిలేని భావజాల ప్రతినిధి మాత్రమే) మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనలో ఏమైనా సమస్యలున్నాయా అనే పరిశోధన ఏమీ చేయడం లేదు. దళిత వాదులకైతే ఏ సమస్యా లేదు. శ్రీశ్రీలాంటి వాళ్లు పై కులాల్లో పుట్టిన వాళ్లు కాబట్టి ఇలా జరిగింది అని సరిపెట్టుకోగలరు. దీనికి వాళ్లను తప్పు పట్టలేం. అస్తిత్వాన్ని పుట్టుక నిర్ణయిస్తుందనే అవగాహన ఆ ధోరణిలో కీలకమైనది. దాన్ని స్వీకరించాక అదే మాట అనాలి. ఇంకో మాట అంటే గర్తింపువాదం కాజాలదు. అందువల్లే వాళ్లు మార్క్సిజానికి మరేదో కలపకుంటే సాధ్యం కాదనే వాదన చేస్తారు. రాజకీయ పరిభాషలో మార్క్సిజాన్ని, అంబేద్కర్ ఆలోచనలను కలిపి మాట్లాడ్డం తప్ప దానికెవరూ ఒక సిద్ధాంత రూపాన్ని ఇవ్వలేదు. అది వాళ్ల సమస్య. ఈ గోదాములోకి దిగితే మార్క్సిస్టు సిద్ధాంత రంగంలోని సమస్యలనూ పట్టించుకోక తప్పదు. ఇది మార్క్సిస్టులు వాయిదా వేయలేని కీలక విషయం. శ్రీశ్రీ దాన్ని కూడా ముందుకు తెస్తున్నాడంటే ఆయన ప్రాసంగికత ఏమిటో అర్థం చేసుకోవచ్చు. Ⓐ

వ్యాసం

# బి.ఎస్.ఎన్.ఎల్ ప్రైవేటీకరణ

- ఇ.ఎస్. బ్రహ్మచారి

ఇటీవలి కాలంలో టెలికాం కంపెనీల విస్తరణ ఊహాకందకుండా ఉంది. దేశంలో 2009 డిసెంబర్ చివరికి మొత్తం 52 కోట్లా 56 లక్షలమంది మొబైల్ వాడకందారులున్నారు. ప్రతి 100 మందిలో 45 మందన్నమాట. అతిపెద్ద సంస్థ భారతి ఎయిర్ టెల్ వాటా 12 కోట్ల 18 లక్షలు. రెండవది రిలయన్స్ కమ్యూనికేషన్స్ 9 కోట్ల 29 లక్షలు. వొడాఫోన్ ఎస్సార్ 9 కోట్ల 14 లక్షలు. టాటా టెలి సర్వీసెస్ 5 కోట్ల 84 లక్షలు ఐడియా సెల్యులార్ 5 కోట్ల 76 లక్షలు. బి.ఎస్.ఎన్.ఎల్ 5 కోట్ల 72 లక్షలతో 6 వ స్థానం. లాండ్ లైన్ వివరాల్లోకి పోతే: 2 కోట్లా 80 లక్షలతో మొదటిస్థానం బి.ఎస్.ఎన్.ఎల్ ది. 35 లక్షలతో రెండోస్థానం ఎం.టి.ఎన్.ఎల్ ది. భారతీ ఎయిర్టెల్ 30 లక్షలతో మూడోది. రిలయన్స్ 11 లక్షలా 65 వేలతో నాలుగోది. తర్వాత 11 లక్షలతో టాటా టెలీ. లాండ్‌లైన్లు నవంబర్‌లో 3 కోట్లా 71 లక్షల నుంచి డిసెంబర్ చివరికి 3 కోట్లా 70 లక్షలకి తగ్గాయి

బి.ఎస్.ఎన్.ఎల్ ప్రపంచంలో పెద్ద టెలికం సంస్థల్లో 7వ స్థానంలో ఉంది. ఈక్విటీ పెట్టుబడి 12 వేల కోట్లు. నికర ఆస్తులు 1 లక్షా 35 వేల కోట్లు. టర్నోవర్ 35 వేల కోట్లు. 7 లక్షలా 50 వేల కిలోమీటర్ల ఆప్టిక్ ఫైబర్ ఉంది. 40 వేల టవర్లున్నాయి. ప్రభుత్వ ఖజానాకి 2007-08 లో డివిడెండ్, లైసెన్స్ రుసుం, కార్పొరేట్ పన్ను, సర్వీస్ టాక్స్ వగైరా అన్నీ కలిపి 14 వేల కోట్లు జమచేసింది. భారీగా చెల్లించే సంస్థల్లో ఇదొకటి. నవరత్న హోదా కల్పించలేదు కాని అంతటి స్థాయి ఉన్న సంస్థే.

2010 జనవరి చివరికి దేశంలో మొత్తం ఫోన్‌లు 58 కోట్ల 18 లక్షలు. అందులో సెల్‌లు 54 కోట్లా 50 లక్షలు. 2009 డిసెంబర్‌లో కంటే ఇంచుమించు 2కోట్లు పెరిగాయి. వైర్‌లైన్లు 3 కోట్లా 67 లక్షలు. 2009 డిసెంబర్‌లో కంటే 3 లక్షలు తగ్గాయి. టెలి డెన్సిటీ 49.50.

ఈ రంగంలో ఇంకా అభివృద్ధికి అవకాశాలు మెండుగా కనిపిస్తున్నాయి. అందుకే ప్రైవేట్ కంపెనీల కన్ను బి.ఎస్.ఎన్.ఎల్ మీద పడింది. దానిలో వాటాలు కావాలని చాలాకాలంగా ప్రయత్నిస్తున్నాయి. మంత్రులు బాగానే సహకరిస్తున్నారు. సంస్థని ఎదగనివ్వటం లేదు. ఇక నష్టాలు రాబోతున్నాయని భయం నటిస్తున్నారు. వాళ్ల ప్రయోజనాలు వాళ్లవి.

ఈ ఏడు మొదట్లో మన్మోహన్ సింగ్ బి.ఎస్.ఎన్.ఎల్ లాభదాయకత మరీ పడిపోయిందని వాపోయాడు. 2004-05లో పదివేల కోట్ల లాభం వస్తే, 2008-09 లో రు. 574 కోట్లు మాత్రమే వచ్చింది. 2009-10 లో నష్టాల్లో పడినా పడవచ్చు. దాని పునరుద్ధరణకి చర్యలు సూచించేందుకు ప్రధాని సలహాదారు శ్యాం పిట్రోడా సారథ్యంలో బాంకర్ (హెచ్.డి.ఎఫ్.సి చైర్మన్) దీపక్ పరేఖ్, టెలికాం సెక్రెటరీ పి.జే. థామస్ లతో ఒక కమిటీ వేశాడు. లాభాల పెంపుకి సలహాలూ సూచనలూ అడిగాడు. పిట్రోడా 9-2-2010 న నివేదిక ఇచ్చాడు. ఆయన సిఫారసుల్ని మార్చ్ మొదట్లో మీడియా బయట పెట్టింది.

పిట్రోడా పానల్ సంస్థని పునరుద్ధరించటానికీ, పోటీలో ముందుంచటానికీ 15-పాయింట్ల పథకాన్ని రూపొందించినట్లు చెప్పుకుంటున్నది. బి.ఎస్.ఎన్.ఎల్ బోర్డు పిట్రోడా నివేదికని సూత్ర ప్రాయంగా ఆమోదించింది. వీటి అమలు గురించిన నిర్ణయం ప్రభుత్వానికి వదిలేసింది బోర్డ్. రిపోర్ట్ చాలా చిన్నది 4 పేజీలే. ఉన్న విషయం ఎంతో పెద్దది. కొద్ది కాలంలో సంస్థని ప్రైవేట్ పెట్టుబడి దారులకి కట్టబెట్టే పథకం అందులో ఉంది. ఆయన సిఫారసులు చూస్తే ఆంతర్యం ఇట్టే తెలుస్తుంది

- సంస్థ కార్యకలాపాలు నిర్వహించేందుకు మేనేజ్డ్ సర్వీస్ మోడల్ని అవలంబించాలి. అంటే ఎక్విప్‌మెంట్‌ని ఎవరి దగ్గర కొంటారో వాళ్లే దాన్ని నిర్మించి, నిర్వహిస్తారు. ఆ విధానం అనుసరిస్తున్న కంపెనీలకి ఇందుకు సొంత ఉద్యోగులకు పనిలేదు.
- 30 శాతం వాటా అమ్మాలి. అంతేకాదు. సిగ్నల్ టవర్ల వంటి మౌలికసదుపాయాల అమ్మకం ద్వారానూ, రియల్ ఎస్టేట్ ద్వారానూ నిధులు సమకూర్చుకోవాలి.
- 9 కోట్లా 30 లక్షల లైన్లతో జి.ఎస్.ఎం. మొబైల్ నెట్ వర్క్ ని 35 వేల కోట్ల ఖర్చుతో విస్తరించాలనే ప్రతిపాదనకు స్వస్తి చెప్పాలి. పరికరాల ఆర్డర్లని ఆపివేయాలి. నెట్ వర్క్ ని ఔట్ సోర్సింగ్ చేసుకోవాలి. .
- లోకల్ కాపర్ కేబుల్ లూప్ అన్‌బండ్లింగ్ చేయాలి. లోకల్ లూప్‌ని ప్రైవేట్ కంపెనీలకి బ్రాడ్ బాండ్ సర్వీసులు అందించేందుకు వీలుగా అద్దెకు ఇవ్వాలి. బి.ఎస్.ఎన్.ఎల్ కి నగరాల్లో , పల్లెల్లో లోకల్ కాపర్ కేబుల్ నెట్‌వర్క్ ఉంది. దీని ద్వారా మెరుగైన బ్రాడ్‌బాండ్ సేవలని అందిస్తున్నది. ఈ రంగంలో ప్రైవేట్ కంపెనీలకన్నా చాలా ముందున్నది. ఈ సంస్థదే అగ్రస్థానం. ఇది కూడా లేకుండా చెయ్యాలనే కుట్ర జరుగుతున్నది. పోటీ కంపెనీలు ఈ కేబుల్‌ని వాడుకోవాలను కుంటున్నాయి. మంత్రులూ ప్రభుత్వమూ రెడీ. ఇక పిట్రోడా ఈ లోకల్ కాపర్ కేబుల్ లూప్ అన్‌బండ్లింగ్ కి సిఫారస్ చేసేశాడు.
- సంస్థకున్న ఖాళీ భూముల్ని వాణిజ్య పరంగా వాడుకోవాలి. ఆ పని చెయ్యటానికి ఒక రియల్ ఎస్టేట్ సంస్థని ఏర్పరచాలి- అదీ ప్రైవేట్ భాగస్వామ్యంతో. రక్షణ, రైల్వేల తర్వాత ఈ సంస్థకే భూమి ఎక్కువ. 3500 పట్టణాలలో లక్షల హెక్టార్ల భూమి ఉంది. కోటాను కోట్ల రూపాయల విలువచేస్తాయి. వాడని స్థలాల్నీ, ఇతర రియల్ ఎస్టేట్ ఆస్తుల్నీ అధీనంలో ఉంచుకునేందుకు ఒక ప్రత్యేక సబ్సిడియరీని ఏర్పరచాలని పిట్రోడా సిఫారసు చేశాడు. "మేము అగ్రిమెంట్ లో ఉన్నాం. ఇప్పటికే ఒక ప్రత్యేక డివిజన్‌ని ఏర్పాటు చేశాం. దాన్ని ప్రత్యేక సబ్సిడియరీగా చేయవచ్చు" అని బోర్డ్ ఒక లేఖలో రాసింది.
- 3 లక్షల మంది ఉద్యోగుల్లో 1 లక్షమందిని స్వచ్ఛంద పదవీ విరమణ (వి.ఆర్.ఎస్)లాంటి పథకాలుపెట్టి రిటైర్ చేయించాలి. 10 శాతం అమ్మితే వచ్చే డబ్బు ప్రభుత్వానికి జమకావాలి.

మిగతా 20 శాతం అమ్మగా వచ్చే డబ్బుని లక్ష మంది ఉద్యోగుల వి.ఆర్.ఎస్. కి, సంస్థ అభివృద్ధికి ఖర్చుపెట్టాలి. వి.ఆర్.ఎస్ కి పెద్దగా ఖర్చు ఉండదు ఎందుకంటే ఎక్కువమంది 1970 లలో చేరినవాళ్లు. ఏటా 10 వేల మంది రిటైర్ అవుతున్నారు. 2012, 2013 కల్లా చాలామంది రిటైర్ అవుతారు. కనక ఈ డబ్బు కూడా ప్రభుత్వానికి చేరేదే.

పిట్రోడా నివేదిక ఇచ్చాడో లేదో బోర్డ్ తలూపింది. మొదటిదీ, ముఖ్యమైనదీ చైర్మన్ మేనేజింగ్ డైరెక్టర్ (సి.ఎం.డి) పదవిని విభజించి చైర్మన్‌గా ఒకర్నీ, మేనేజింగ్ డైరెక్టర్‌గా మరొకర్నీ నియమించాలి. చైర్మన్ నాన్ ఎక్జిక్యూటివ్. రోజువారీ వ్యవహారాల్ని ఎం.డి/సి.ఈ.ఓ. నిర్వహిస్తాడు. ఇతను సంస్థ లోపలివాడూ కావచ్చు. పరిశ్రమ నుంచీ రావచ్చు. కమిటీ సూచన మేరకు ప్రైవేట్ రంగంలో సమర్థుణ్ణి ఈ సంస్థకి చైర్మన్ చేసినా అభ్యంతరం లేదని గోయల్ చెప్పాడు.

సిఫారసులు ఎప్పటినుంచి అమలయ్యేదీ చెప్పకపోయినా ఈ విభజన తోనే మొదలుకావచ్చు. ఎందుకంటే ఇది వ్యవస్థాగత మార్పు. జూలైలో సి.ఎం.డి ని మారుస్తుంటారు. అప్పుడు డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికమ్యూనికేషన్ సంస్థలోని వ్యక్తిని నియమిస్తుంది. అతను తన అధికారాల్ని వదులుకోడానికి ఇష్టపడడు. కనక విభజనకి అడ్డు పడతాడు. కనక సి.ఎం.డి.ని నియమించకుండానే బయటవ్యక్తిని చైర్మన్‌గా తెస్తారు. ఆ తర్వాత వరసగా అన్ని సిఫారసులూ అమలవుతాయి.

సరళీకరణకి ముందు దేశానికంతా ప్రభుత్వం టెలికాం డిపార్ట్ మెంట్ ద్వారా సేవలందించింది. ముంబాయ్, ఢిల్లీ నగరాలు వేగంగా విస్తరిస్తున్న నేపథ్యంలో 1986 లో ఎం.టి.ఎన్.ఎల్ (మహానగర్ టెలిఫోన్ నిగం లిమిటెడ్) ని విడగొట్టారు. ప్రభుత్వం నడిపే ఈ రెండు సంస్థల్నీ కలపాలనే ప్రతిపాదన ఒకటొచ్చింది. అయితే బి.ఎస్.ఎన్.ఎల్ నీ ఎం.టి.ఎన్.ఎల్ నీ కలిపే ప్రసక్తేలేదని పిట్రోడా జనవరి 8న తేల్చి చెప్పాడు. ఎం.టి.ఎన్.ఎల్, బి.ఎస్.ఎన్.ఎల్ రెండూ కలిస్తే మంచి దంటూనే గోయల్ అది తన సొంత అభిప్రాయం మాత్రమే అన్నాడు.

ప్రైవేట్ ఆపరేటర్లు 1998లోనే జి.ఎస్.ఎం. రంగంలో అడుగుపెట్టారు. తర్వాత 4 ఏళ్లకి 2002లో బి.ఎస్.ఎన్.ఎల్. ఇందులోకి దిగింది. ఇంత ఆలస్యానికి కారణం రాజకీయ నాయకులకీ సర్వీస్ ప్రొవైడర్లకీ ఉన్న లాలూచీయే అని అందరకీ తెలిసిందే. అప్పటికి ముందంజలో ఉన్నా ఎయిర్‌టెల్‌ని తప్ప మిగిలిన అన్నింటినీ దాటి ముందుకు పోయింది. 2006 దాకా ఊపుగా ఉంది. 2007 నుంచి వెనక్కి నడుస్తోంది. ఇది కమ్యూనికేషన్ల మంత్రి పుణ్యం. ఆయన ప్రైవేట్ ఆపరేటర్ల ప్రయోజనాలు కాపాడేందుకు జి.ఎస్.ఎం పరికరాల టెండర్‌ని రెండేళ్లు కదలనివ్వలేదు. అప్పుడు సగం అంటే 4.55 కోట్ల పరికరాలు కొనడానికి ఒప్పుకున్నాడు. అనేక సర్కిళ్లలో ఒక్క కొత్త లైన్ కూడా వెయ్యలేదు. పరికరాల కొరతవల్ల మార్కెట్ వాటా తగ్గిపోయింది. 2006లో 24.38 శాతం ఉన్న వాటా 2010 కి 15.08కి దిగజారింది. అప్పుడు 2వ స్థానంలో ఉన్నది ఇప్పుడు 6 వ స్థానానికి పడిపోయింది. ఇప్పుడున్న మార్కెట్ వాటా అయినా నిలకడగా ఉండాలంటే 10 కోట్ల జి.ఎస్.ఎం. లైన్లు కావాలి. దీన్ని అడ్డుకుంటున్నాడు పిట్రోడా.

నెట్ వర్క్‌ని ఔట్ సోర్స్ చెయ్యమనేది మరొక సిఫారసు. ఇప్పటికే 50 వేల టవర్లనీ, 5 లక్షల కిలోమీటర్ల ఆప్టిక్ ఫైబర్ కేబుల్‌నీ ఔట్ సోర్స్ చేసేందుకు ప్రయత్నాలు సాగుతున్నాయి. 5 ఏళ్లలో ఇది మొత్తం 10 వేల కోట్ల రూపాయలు. ఇది జరిగితే 30 వేలమంది ఇళ్లకి పోక తప్పదు.

డిజిన్వెస్ట్ మెంట్ ఈ ప్రభుత్వరంగ సంస్థలో 30 శాతం వాటాని విక్రయించాలని కమిటీ సిఫారసు చేసింది. ఎంతవాటా అమ్మాలో తుది నిర్ణయం తీసుకోల్సింది ప్రభుత్వమేనని చెప్పింది. బోర్డ్ అధ్యక్షుడు కులదీప్ గోయల్ : ఎంత భాగం అమ్మాలో నిర్ణయించమని మేము ప్రభుత్వాన్ని కోరాం అన్నాడు.

ఎయిర్‌టెల్ వినియోగదారులు 12 కోట్ల 20 లక్షలమంది. ఉద్యోగులు 25000 మంది. అదే బి.ఎస్.ఎన్.ఎల్ ఉద్యోగులు 3 లక్షల మందికి పైన్నే.

2007-08లో నికరలాభం రు.3009 కోట్లు. అది 2008-09లో రు. 574 కోట్లకి పడిపోయింది. ఎయిర్‌టెల్ కి ప్రస్తుతం 12 కోట్లా 20 లక్షలమంది వినియోగదారులున్నారు. ఉద్యోగులు 25,000 మంది. మొబైల్ విభాగంలో ప్రతి ఉద్యోగికీ 10,500 కస్టమర్లు ఉన్నారు. బి.ఎస్.ఎన్.ఎల్ కి 6 కోట్లా 50 లక్షలమంది వైర్లెస్ కస్టమర్లూ, 2 కోట్ల 79 లక్షలమంది వైర్‌లైన్ వాడకందారులూ ఉన్నారు. ఉద్యోగులు 3 లక్షల మంది. ప్రతి ఉద్యోగికీ 350 మంది కస్టమర్లు మాత్రమే ఉన్నారు. 12 కోట్లకి పైగా వినియోగదారులున్న ఎయిర్‌టెల్ 25 వేలమంది ఉద్యోగులతో కార్యకలాపాలు నిర్వర్తిస్తుంటే, 9కోట్ల వినియోగదారులున్న బి.ఎస్.ఎన్.ఎల్ కి 3 లక్షలమంది ఎందుకు? ముందొక లక్ష మందిని తగ్గించాలి అని పిట్రోడా సిఫారసు చేశాడు. ఈ రెండు సంస్థల మధ్య ఉన్న తేడాలని కావాలనే పట్టించుకోలేదు.

- లాండ్ లైన్లు నామ మాత్రమే. బి.ఎస్.ఎన్.ఎల్ విషయానికొస్తే, దేశం నలుమూలలకూ లాండ్ లైన్ నెట్ వర్క్ విస్తరించి ఉంది. గ్రామీణ ప్రాంతాల్లో కోటిన్నర లాండ్ లైన్లిచ్చింది. 5 లక్షలా 22 వేల పబ్లిక్ ఫోన్లిచ్చి సేవలందిస్తున్నది. కనక ఉద్యోగులు ఎక్కువమంది కావాలి.
- ప్రైవేట్ కంపెనీలు సొంత టెలిఫోన్ ఎక్స్ఛేంజిల్ని నడపవు. బి.ఎస్.ఎన్.ఎల్. పద్ధతి వేరు తన నెట్‌వర్క్‌ని తన ఉద్యోగులతోనే నడుపుతుంది. కనక ఈ పనులు చేసే ఉద్యోగులు కూడా ఉంటారు.
- ఎక్విప్‌మెంట్‌ని ఎవరి దగ్గర కొంటారో వాళ్లే దాన్ని నిర్మించి, నిర్వహిస్తారు. ఈ పద్ధతిని మేనేజ్డ్ సర్వీస్ సిస్టం అంటారు. ఆ విధానం అనుసరిస్తున్న కంపెనీలకి ఇందుకు సొంత ఉద్యోగులు పనిలేదు.
- ఎయిర్టెల్ సెల్‌ఫోన్ సర్వీసుల ఎక్విప్‌మెంటు, నెట్‌వర్కుల స్థాపననీ, నిర్వహణనీ తన ఉద్యోగులతో చేయించదు. ఈ పనుల్ని విదేశీ టెలికం ఎక్విప్మెంట్ తయారు చేసే కంపెనీలకి అప్పగిస్తుంది. కనక ఆమేరకు ఉద్యోగుల అవసరం ఉండదు. బ్రాండింగుకీ, మార్కెటింగుకీ పరిమితమైనందువల్ల తక్కువ సిబ్బందితో నెట్టుకొస్తుంది.
- అంతే కాదు ఉద్యోగుల మీద మోపే పని భారం చాలా ఎక్కువ. పనిగంటలూ ఎక్కువే.
- లాండ్ లైన్లు నామ మాత్రమే. బి.ఎస్.ఎన్.ఎల్ విషయానికొస్తే, దేశం నలుమూలలకూ లాండ్ లైన్ నెట్ వర్క్ విస్తరించి ఉంది. గ్రామీణ ప్రాంతాలలో కూడా సేవలందిస్తున్నది. లాండ్ లైన్ల లో మొదటిస్థానం. దాని వినియోగదారుల సంఖ్యలో ఎయిర్‌టెల్

9 వంతు మాత్రమే. ఎం.టి.ఎన్.ఎల్ కంటే కూడా తక్కువే.

కనక ఉద్యోగులు ఎక్కువమంది కావాలి.

రెండేళ్లుగా కంపెనీ రెవిన్యూ రు.35 వేలకోట్ల దగ్గరే ఆగిపోయింది. వృద్ధి లేదు. 2007-08 నికర లాభం రు. 3009 కోట్లు 2008-09లో నికర లాభం 81 శాతం పడిపోయి రు. 574 కోట్లయింది. ఖర్చులేమో పెరిగిపోతున్నాయి. రెవిన్యూలో 40 శాతం జీతాలకే పోతున్నది. ఇదే ఎయిర్‌టెల్ ఉద్యోగుల జీతాలకు రెవిన్యూలో 5 శాతమే సరిపోతున్నది. ఇందువల్ల 2009-10లో నష్టం వచ్చినా ఆశ్చర్య పోనక్కరలేదు.

మొత్తం ఉద్యోగుల్లో 'సి' గ్రూపు 'డి' గ్రూపు వాళ్లు - లైన్‌మెన్లూ, ఆపరేటర్లూ, క్లర్కులూ లాంటివాళ్లే ఎక్కువ మంది. కంపెనీని నడిపే 'ఐ.టి.ఎస్.' ఆఫీసర్లకి ప్రైవేట్ రంగంలో తోటి వాళ్లకిచ్చే జీతాలకంటే బి.ఎస్.ఎన్.ఎల్. లో తక్కువ. మిగిలిన ఉద్యోగులకి ప్రైవేట్ కంపెనీల్లోకంటే బి.ఎస్.ఎన్.ఎల్. లో ఎక్కువ. క్లర్కుల జీతం రు. 50 వేలు. ప్యూన్లకి రు. 30 వేలు అంటున్నారు.

రిటైర్‌మెంట్ కి చేరినవారి జీతాలైనా ఇంత లేవు. 15 వేల లోపు జీతాల వాళ్లు సుమారు 50 వేలమంది ఉంటారు. 15 వేలు, 20 వేల మధ్య 1 లక్షమందీ, రు. 20,000 నుంచి రు. 30,000 దాక వచ్చేవాళ్లు 60 వేల మంది ఉంటారు. ప్యూన్లకి 30 వేలనేది అతిశయోక్తే కాదు. పచ్చి అబద్ధం. ఏ క్లర్కుకీ రు. 50 వేల జీతం ఉండదు. వివరాలు దొరకటం కష్టం కాని ప్రైవేట్ కంపెనీలు ఎగ్జిక్యూటివ్‌లందరికీ బి.ఎస్.ఎన్.ఎల్ కంటే ఎక్కువ జీతాలు ఇస్తారా? ఒకవేళ ఇచ్చినా బహు కొద్దిమందికి ఇస్తే ఇవ్వచ్చు. చాలామందికి తక్కువే ఇచ్చి వీలైనంత ఎక్కువ పని పిండుతారనేదీ, నిద్రకూడా సరిగా పోనివ్వరనేదీ అందరికీ తెలిసిందే. సెలవులూ, రిటైర్‌మెంట్ పథకాలూ సరైనవి ఉన్నాయా? బి.ఎస్.ఎన్.ఎల్ లో రిటైర్ అయిన వాళ్లని తీసుకుని తక్కువిచ్చి పనిచేయించు కుంటున్నారు. ప్రభుత్వోద్యోగం రాక ప్రైవేట్ సంస్థల్లో చేరేవాళ్లే ఎక్కువ మంది. అదిసరే. కోర్ ఉద్యోగులకి ఎక్కువ ఇస్తున్నవాళ్లు క్లర్కులకి, ప్యూన్లకి కూడా బి.ఎస్.ఎన్.ఎల్ కంటే ఎక్కువ ఇవ్వచ్చుకదా! ఎందుకివ్వరు? కొద్దిమంది కాబట్టి ఇంజనీర్లకి ఎక్కువిచ్చినా, ఎక్కువ మంది ఉన్న మిగిలిన వాళ్లకి మరీ తక్కువిచ్చి మిగుల్చుకుంటారు. పనంతా 25,000 మందితోనే ఎయిర్‌టెల్ చేయిస్తున్నదంటే ఆ ఉద్యోగుల మీద పడే పని ఒత్తిడి ఎంతో ఎవరైనా అర్థం చేసుకోగలరు. ఇలాంటి ఒత్తిడి తట్టుకోలేకే ఫ్రాన్స్ టెలికాం ఉద్యోగులు 2008 జనవరి నుంచి 37 మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. ఇప్పటికీ అక్కడ సమస్య సమసి పోలేదు.

ఇతర సంస్థలతో పోటీ పెట్టి మాట్లాడుతున్నారు ఇది తప్పు. ప్రభుత్వ సంస్థనీ , ప్రైవేటు సంస్థనీ స్థాపించటంలో ఉద్దేశం ఒకటికాదు. ప్రభుత్వ సంస్థ కూడా లాభాలను స్వీకరిస్తుంది. కాని దానికి లాభాలే పరమావధి కాదు. కాకూడదు. సేవాతత్పరతా, ఉద్యోగుల సంక్షేమమూ, ఉద్యోగ భద్రతా ముఖ్యమైనవి. ప్రైవేటు పెట్టుబడిదారులకి లాభం లాగడమే ఏకైక లక్ష్యం. మరో అంశం పట్టదు. ఈరెంటికీ లాభాల్లో పోటీ ఎలా కుదురుతుంది? సంస్కరణల తర్వాత ప్రభుత్వాలు ప్రైవేట్ కంపెనీల్లాగా ప్రవర్తిస్తున్నాయి. దీన్ని ఉద్యోగులు వ్యతిరేకిస్తున్నారు.

ఏదైనా పరిస్థితుల్లో నష్టం వచ్చినా మూసెయ్యకూడదు. ప్రైవేట్ కంపెనీలకి నష్టంవస్తే మూసేస్తున్నారా? లాభలొచ్చేట్టు చూసు కుంటారు. బి.ఎస్.ఎన్.ఎల్. కి గతమంతా లాభాలే గదా! 2009 లోనూ లాభమే. రు. 574 కోట్లు. మరి ప్రధానమంత్రికి ఆందోళన ఎందుకు? జరుగుతున్న సంవత్సరంలో నష్టాలొస్తాయట. సరే రాకుండా తీసుకునే చర్యల గురించి ఆలోచించింది లేదు. ఉద్యోగ సంఘాలు చెప్పే మార్గాలు సరైనవో కావో పరిశీలించింది లేదు. అంటే సంస్థని నష్టాల్లోకి నెట్టి నిర్వీర్యం చెయ్యాలనేది లక్ష్యంగా కనిపిస్తున్నది.

ఇదంతా ఒక పథకం ప్రకారం జరుగుతున్నదనిపిస్తున్నది. 2009 డిసెంబర్ 10 న రాజీవ్ చంద్రశేఖర్ (స్టాండింగ్ కమిటీ సభ్యుడు) నానాటికీ దిగజారుతున్న బి.ఎస్.ఎన్.ఎల్. ఆర్థిక పరిస్థితి గురించి ప్రధానికి ఒక లేఖ రాశాడు. ప్రధానిని తక్షణం జోక్యం చేసుకొని సంస్థని పతనం కాకుండా కాపాడమనీ, లేకపోతే దాని విలువ దిగజారి ఖజానాకి తీవ్ర నష్టం వాటిల్లుతుందనీ అందులో స్పష్టంగా రాశాడు. ప్రధాని వెంటనే నడుం బిగించాడు. ప్రధాని ఆఫీసు జనవరి 6 న సమావేశం ఏర్పాటు చేసింది. వినియోగదారులు ఈ రంగంలో పెరుగుతున్నారు. రు. 36,000 కోట్ల రూపాయల రెవెన్యూకి రు. 574 కోట్ల రూపాయల లాభం ఏమిటి? అంటే సంస్థ విఫలమైందన్నట్లే అని నిర్ధారిస్తున్నారు.

టెలికాంలో డిజిన్వెస్ట్‌మెంట్ ఉండబోదని గతంలో ప్రభుత్వం ఎన్నోసార్లు ఇచ్చిన హామీని వెనక్కి తీసుకోవడమే అవుతుందని ఉద్యోగులు తప్పుబడుతున్నారు.

"బి.ఎస్.ఎన్.ఎల్ లో ఏదేనీ విభాగాన్నిగానీ లేక ఎంతోకొంత భాగాన్ని గానీ ప్రైవేటీకరించే ప్రసక్తే లేదు. ఇది నూటికి నూరు శాతం ప్రభుత్వరంగ సంస్థ గానే కొనసాగుతుంది" అని 2004 మే లో సంస్థ చైర్మన్ వి.పి. సిన్హా హామీ ఇచ్చాడు. 2008 ఆగస్ట్‌లో సింథియా ప్రైవేటీకరణ ప్రతిపాదనేదీ లేదన్నాడు. ఉద్యోగుల్లో కొందరికి స్వచ్ఛంద పదవీ విరమణ (వి.ఆర్.ఎస్.) ఇచ్చి ఉద్యోగుల్ని తగ్గించుకోబోతున్నారా అనే ప్రశ్నకి అలాంటిదేమీ లేదు అని 2009 జూలైలో చెప్పాడు గోయల్. ఇలా పదే పదే హామీలిస్తూ చివరికి మాటతప్పింది ప్రభుత్వం. ఇలా చెయ్యటం పాలకులకి పరిపాటే.

2006 వరకూ బి.ఎస్.ఎన్.ఎల్ వినియోగదారుల సంఖ్యలోనూ, రెవిన్యూలోనూ ముందే ఉంది. అక్కడనుంచీ పనిగట్టుకుని ప్రభుత్వం సంస్థని బలహీనపరిచే విధానాలు అవలంబించింది. తాము చేయగలిగినదంతా చేసి, లాభాలు తగ్గాయనీ, నష్టాలు వస్తాయేమోననీ రాగాలు తీస్తూ కొరవా దరవా (ప్రైవేటీకరించే) పనిని పిట్రోడాకి అప్పజెప్పారు.

నూటికి 80 లాండ్‌లైన్లు ఈ సంస్థవే. ఇవి ఎన్నడూ లాభాలు తేలేవు. గతంలో లాండ్ లైన్లని టెలికాం డిపార్ట్‌మెంట్ నిర్వహించినంత కాలం ఎస్టిడి కాల్ రేట్లు ఎక్కువ ఉండేవి. దాంతో లాండ్‌లైన్ నెట్‌వర్క్‌కి వచ్చే నష్టాన్ని పూడ్చేవాళ్లు. బి.ఎస్.ఎన్.ఎల్ ఏర్పడ్డాక ప్రైవేట్ కంపెనీల నుంచి వసూలు చేసిన ఏక్సెస్ డెఫిసిట్ ఛార్జ్ నుంచి సబ్సిడి వచ్చేది. అయితే ప్రైవేట్ కంపెనీల ఒత్తిడి మేరకి ఆ ఛార్జీని రద్దు చేసింది ప్రభుత్వం. ఫలితంగా నష్టాలతోనే లాండ్ లైన్లు కొనసాగించాల్సి వస్తోంది.

ఇక మొబైల్ రంగం విషయానికొస్తే ఈ సంస్థని 2002 దాకా అనుమతించలేదు. ప్రైవేట్ కంపెనీలకి 1994 లోనే అనుమతించారు. అయినా 2006 కల్లా ఎయిర్‌టెల్ తర్వాత రెండో స్థానాన్ని దక్కించుకుంది. దాంతో దీని పురోగతిని నిరోధించే కుట్ర మొదలైంది. 4 కోట్ల మందికి సేవలందించేందుకు 4 కోట్ల లైన్లకోసం జి.ఎస్.ఎం సామాగ్రి కొనేందుకు టెండర్ పెడితే దాన్ని కోర్టు కేసులనీ, మంత్రి అభ్యంతరాలనీ సాకులు చెప్పి ముందుకు పోనివ్వలేదు.

నోకియా సీమన్స్ కంపెనీ తన టెండర్ని నిరాకరించిందని బి.ఎస్.ఎన్.ఎల్ మీద కోర్టుకెక్కింది. ఆ పిటీషన్ని కోర్ట్ కొట్టేసింది. సెంట్రల్ విజిలెన్స్ కమిషన్‌కి మరొక కంప్లైంట్ వెళ్లింది. దాని అనుమతితో నియమితమయిన కమిటీ కూలంకషంగా పరిశీలించి పొరపాట్లేమీ జరగలేదంది. ఆ తర్వాత ధరలు తగ్గించాలని సంస్థ ఎరిక్సన్ కంపెనీతో సంప్రదింపులు జరిపింది. అయితే టెండర్ పూర్తయ్యాక సంప్రదింపులు కుదరవు అని విజిలెన్స్ కమిషన్ అభ్యంతరం తెలిపింది. అయితే అంతకు ముందు అలాంటి వాటిని అనుమతించారు. 11-7-2007న ఒకరోజు సమ్మెచేశారు. 2 కోట్ల లైన్లకి సరిపడా సామాగ్రి కొనటానికి ఒప్పుకున్నారు. అయితే మళ్లీ 9.3 కోట్ల లైన్లకి టెండర్ పిలిచారు. చైనా కంపెనీ హువాయ్ నుంచి కొనే ప్రతిపాదనకి అభ్యంతరం చెప్పారు. అది దేశభద్రతకి ముప్పు అన్నారు. అయితే రిలయన్స్‌కి సరఫరా చేసి, నిర్వహిస్తున్నది అదే కంపెనీ. ఈ టెండర్‌ని బి.ఎస్.ఎన్.ఎల్ రద్దు చేసుకోవలసి వచ్చింది. ఆ విధంగా ప్రభుత్వం నుంచి, దాని ఏజెన్సీలనుంచి చాలాసార్లు అడ్డంకులు వచ్చాయి. ఉద్దేశపూర్వకంగా 2007 నుంచి మోకాలు అడ్డుతున్నది. లేనిపోని ఆటంకాలు కలిగిస్తున్నది. కాపర్ కేబుల్ కనీస నిర్వహణ నిలిపివేశారు. ప్రైవేట్ వాళ్లని వాడుకోనిస్తే రిపేర్లు వాళ్లే చేసుకుంటారు అంటున్నారు. ఇదే జరిగితే బి.ఎస్.ఎన్.ఎల్ కి ఉన్న బ్రాడ్ బండ్ అనుకూలత పోతుంది. ఆ తర్వాత సంస్థ మూత బడటానికి ఆట్టే కాలం పట్టదు. వీటి మరమ్మత్తులు చేపట్టి, జి.ఎస్.ఎం లైన్ల టెండర్ ఖరారు చెస్తే ఈ సంస్థ వైభవోపేతంగా నడుస్తుంది. ఏ ప్రైవేట్ సంస్థా దీనిముందు నిలబడలేదు.

భారతీ ఎయిర్ టెల్ తన నెట్ వర్క్ ని ఆధునీకరణకి 130 కోట్ల డాలర్ల సామాగ్రిని ఎరిక్సన్ నుంచి కొంటోంది. ఇది ఇవాల్వ్‌డ్ ఎడ్జ్ టెక్నాలజీ ద్వారా డాటా రేట్ ని పెంచుతుంది. మాటా పలుకూ స్వచ్ఛంగా ఉంటుంది. ఒక బేస్ స్టేషన్‌ని ఎక్కువమంది వాడుకునే వీలు కలిగిస్తుంది. దీంతో వినియోగదారులకి అవతలివాళ్ల గొంతూ, మాటలూ స్పష్టంగా వినిపిస్తాయి. ఒకపక్క పోటీ కంపెనీలు కొత్త యంత్రాలు అమరుస్తుంటే, బి.ఎస్.ఎన్.ఎల్. మాత్రం ఎప్పుడో ఇచ్చిన కొనుగోలు ఆర్డర్లని వెనక్కి తీసుకుంటున్నది. ఇందుకు ప్రభుత్వ విధానాలే కారణం. సంస్థని అన్నివిధాలా దిగజార్చి అప్రతిష్ట పాల్జేసి అమ్ముకోజూస్తున్నది. అసలు ప్రభుత్వ రంగ సంస్థలే ఉండకూడదనేది నయా ఉదారవాద సూత్రం. దాన్ని తు చా తప్పకుండా అమలు పరచటమే మన్మోహన్ సింగ్ కర్తవ్యంగా భావిస్తున్నాడు .

అలా దాని వృద్ధికి అడ్డం పడీ పడీ దాన్ని మెరుగుపరచటాని కంటూ పిట్రోడా కమిటీని నియమించింది. సంస్థ మెరుగుదలకి ఆకమిటీ చేసిన సూచనలేమీలేవు. విస్తరణకు కావలసిన చర్యలేవో చెప్పనే లేదు. పైగా అందుకవసరమైన జి.ఎస్.ఎం. పరికరాల కొనుగోలు ఆపాలని చెప్పింది. అలాచేస్తే సంస్థ నష్టాల్లో పడక తప్పదు. ఆ సాకుతో ప్రైవేటు సంస్థలకు కట్టబెట్టవచ్చు. ఉద్యోగుల్ని ఇళ్లకు పంపవచ్చు. వాటాలు అమ్ముకోవచ్చు. ఇదీ అసలు కోరిక.

పైగా నిధులకోసం 30 శాతం డిజిన్వెస్ట్ మెంట్ చెయ్యాలని సూచించాడు. నిజానికి సంస్థకి నిధుల కొరత లేదు. 2008-09 లెక్కల ప్రకారం రు. 70,000 కోట్ల రిజర్వూ, అదనమూ ఉంది. నిధులకోసం పెట్టుబడిని ఉపసంహరించాల్సిన అవసరమేమీ లేదు.

బి.ఎస్.ఎన్.ఎల్ మేనేజర్లు 1500 మంది ఉన్నారు. వీళ్లు ఐ.టి.ఎస్ అధికారులు. వీరి నేతృత్వంలో సంస్థ నడుస్తుంది. అయితే వీళ్లని డెప్యుటేషన్‌లో ఉంచారేగాని సంస్థలో విలీనం చెయ్యలేదు. విలీనం చేస్తే సంస్థని సొంతం అనుకొని వృద్ధి మీద పూర్తి ధ్యాస పెడతారు. అప్పుడు అభివృద్ధి సరిగా సాగుతుంది.

2008 ఆగస్ట్‌లో సింధియా ప్రైవేటుపరం చేసే ఉద్దేశమేమీ లేదనీ, కాకపోతే ఐ.పి.ఓ గా రావాలనీ, అదీ 10 శాతం పరిమితితో నేననీ నమ్మకంగా చెప్పాడు. మరివ్వాళ 30 శాతం వాటాలు అమ్మటానికి సిద్ధమయింది ప్రభుత్వం. ప్రభుత్వం అసలు ఆంతర్యం బి.ఎస్.ఎన్.ఎల్.ని ప్రైవేటు పరం చేయటం.

30 శాతం అమ్మితే 30 వేలకోట్లు వస్తాయి. 2010 బడ్జెట్ ప్రసంగంలో పి.ఎస్.యు. ల వాటాల అమ్మకం ద్వారా 40 వేల కోట్లు ఆదాయం రాబడతానని ప్రణబ్ ముఖర్జీ ప్రకటించిన సంగతి అందరికీ తెలిసిందే. అందులో భారీ భాగం దీనినుంచి లాగాలనే ప్రయత్నమే ఇది. 10 వేల కోట్ల విలువ ఉన్న వి.ఎస్.ఎన్.ఎల్ ని టాటా కంపెనీకి కేవలం 1320 కోట్లకి కారుచౌకగా అమ్మేశారు. లోపాయికారీగా ఎవరి వాటాలు వారికి గుట్టుచప్పుడు కాకుండా చేరాయనేది తెలియని వారుండరు. ఇప్పుడు జరిగే తంతూ అదే. ఉద్యోగులకిది తెలియంది కాదు. అన్ని సంఘాలూ అప్రమత్తం గానే ఉన్నాయి. అన్ని యూనియన్లూ కలిసి సమ్మెకు సమాయత్త మవుతున్నాయి.

2010 జనవరి 31 న కంపెనీల మార్కెట్ వాటా

వైర్ లెస్ వినియోగదారులు

| ఆపరేటర్ | డిసెంబర్ 2009 | జనవరి 2010 |
|---|---|---|
| బి.ఎస్.ఎన్.ఎల్ | 62,861,214 | 65,109,439 |
| ఎం.టి.ఎన్.ఎల్ | 4,875,913 | 4,920,929 |
| భారతీ ఎయిర్‌టెల్ | 118,864,031 | 121,714,243 |
| రిలయన్స్ | 93,795,613 | 96,599,256 |
| వోడా ఫోన్ ఎస్సార్ | 91,401,959 | 94,143,364 |
| ఐడియా సెల్యులార్ | 57,611,872 | 59,887,404 |
| టాటా టెలీ | 57,329,449 | 60,311,302 |
| ఇతరులు | 38,407,871 | 42,362,199 |
| మొత్తం | 525,147,922 | 545,048,136 |

వైర్ లైన్ వినియోగదారులు

| ఆపరేటర్ | డిసెంబర్ 2009 | జనవరి 2010 |
|---|---|---|
| బి.ఎస్.ఎన్.ఎల్ | 28,095,939 | 27,978,356 |
| ఎం.టి.ఎన్.ఎల్ | 3,491,244 | 3,251,926 |
| భారతీ ఎయిర్‌టెల్ | 2,988,546 | 3,015,618 |
| రిలయన్స్ | 1,164,793 | 1,168,871 |
| టాటా టెలీ | 1,103,172 | 1,120,698 |
| ఇతరులు | 220,448 | 222,390 |
| మొత్తం | 37,064,142 | 36,757,859 |

ఉద్యోగులు మార్చ్ 26న ఆఫీసుల ముందు ధర్నా చేశారు. ఏప్రిల్ 20న ఎగ్జిక్యూటివ్‌లతో సహా 3 లక్షలమంది నిరవధిక సమ్మె మొదలుబెట్టారు. గంటల్లోనే ప్రభుత్వం చర్చల కొచ్చింది. పిట్రోడా సిఫారసులు అమలు చేసేముందు యూనియన్లని విశ్వాసంలోకి తీసుకుంటామని కేంద్ర మంత్రి రాజా మాట ఇచ్చాడు. జీతభత్యాలకి సంబంధించిన డిమాండ్లు ఒప్పుకున్నాడు. దాంతో సమ్మె గంటల్లోనే ముగిసింది. అయితే ప్రైవేటీకరణ ఆగినట్లేనా? పిట్రోడా సిఫారసులు లేనట్లేనా? అంటే కాదనే చెప్పాలి. కాకపోతే కాలం గడుస్తుంది.

ప్రధాని మన్మోహన్‌సింగ్‌కి ప్రైవేటీకరణే ప్రాణం. మొట్టమొదటి సంస్కరణల బడ్జెట్‌ని ప్రవేశపెట్టింది ఆయనే. అప్పట్లో ఆర్థిక మంత్రి, ఇప్పుడు ప్రధాన మంత్రి హోదాలో ఉన్నాడు. అదీ రెండో సారి.

గతంలో ఉద్యోగులు ప్రతిఘటించి సఫలీకృతులైనారు. ప్రభుత్వం 2007 నుంచీ రెండు సార్లు 10 శాతం అమ్మాలని ప్రయత్నించినా ఉద్యోగుల తీవ్ర వ్యతిరేకతని తట్టుకోలేక అప్పటికి సర్దుకున్నది. మళ్లీ మొదలుబెట్టింది. ఈసారి ప్రధాని గట్టి పట్టుదలతో ఉన్నాడు. పైగా ప్రైవేట్ పెట్టుబడి పట్టు దిట్టవడుతోంది. తట్టుకోవాలంటే ఉద్యోగులు గట్టిప్రయత్నం చెయ్యక తప్పదు.

ఎన్నిసార్లు దెబ్బతిన్నా మళ్లీమళ్లీ ప్రయత్నిస్తారు పాలకులు. మొత్తం ఒక్కసారే చెయ్యలేకపోయినా దఫదఫాలుగా చేస్తారు. ఉద్యోగుల్నీ , సంఘాల్నీ విడగొడతారు. కొన్ని విభాగాల్లో తొలిగిస్తారు. కొన్ని కాడర్ల వాళ్లని మాత్రమే సాగనంపుతారు. వీటన్నిటినీ తట్టుకొని ఉద్యోగులు నిలబడి ఐకమత్యంగా పోరాడితేనే సంస్థ ఉంటుంది. ఎవరి ప్రయోజనాలు వాళ్లు చూచుకుంటే సంస్థ అంతరించటానికి ఎంతోకాలం పట్టదు. మిగిలిన ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేట్ వ్యక్తులకు కట్టబెట్టకుండా ఉండాలంటే వీళ్లతో పాటు ఆయా సంస్థల ఉద్యోగులు కూడా కలిసి పోరాడక తప్పదు.

బి.ఎస్.ఎన్.ఎల్ ఉద్యోగుల జీతాలు ఎంత? 4 ఉదాహరణలు (రు.లు)

| | ఉదాహరణ 1 | | ఉదాహరణ 2 | | ఉదాహరణ 3 | | ఉదాహరణ 4 | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఇస్తున్నవి | కొత్తవి | ఇస్తున్నవి | కొత్తవి | ఇస్తున్నవి | కొత్తవి | ఇస్తున్నవి | కొత్తవి |
| బేసిక్ | 5560 | 12486 | 10500 | 23632 | 5320 | 10254 | 8500 | 19146 |
| డి.ఏ | 5921 | 3121 | 11183 | 5908 | 3775 | 2564 | 9053 | 4786 |
| డి.పి | 2780 | 0 | 5250 | 0 | 260 | 0 | 4250 | 0 |
| అద్దె | 834 | 1872 | 1575 | 3544 | 798 | 1538 | 1275 | 2872 |
| ఇతరములు | 956 | 975 | 1328 | 1410 | 425 | 852 | 525 | 1222 |
| **మొత్తం** | **16051** | **18454** | **29836** | **34494** | **10578** | **15208** | **23603** | **28026** |

**ఉదా 1 : ఈ ఉద్యోగికి 13 సంవత్సరాల సర్వీస్ ఉంది. ఎన్.ఇ. 1 కాటగరీ. పాత పేస్కేల్ 4000-120-5800. 30వేలు పట్టుకెళుతున్న ఉద్యోగి నిజానికి కొత్తస్కేల్లో తీసుకునేది 19 వేల లోపే.**

**ఉదా 2 : ఈ ఉద్యోగికి 35 సంవత్సరాల సర్వీసు ఉంది. శ్రీజా10 కాటగరీ. పాత పే స్కేల్ 7800-225-11175. నెలకి 50 వేలు అని ఆరోపిస్తున్న తరగతి ఉద్యోగి. 35 ఏళ్ల సర్వీసున్న ఈయనకి కొత్త జీతాల్లో వచేది 35 వేలు**

**ఉదా 3 : ఈ ఉద్యోగికి 5 సంవత్సరాల సర్వీసు ఉంది. శ్రీజా6 కాటగరీ. పాత పే స్కేల్ 4720-150-6970. కొత్తస్కేల్లో తీసుకునేది 16 వేల లోపే**

**ఉదా 4 : ఈ ఉద్యోగికి 13 సంవత్సరాల సర్వీస్ ఉంది. డీ.ఎన్.1. పాత పే స్కేల్ 7100-200-1010. కొత్తస్కేల్లో తీసుకునేది 28 వేలు. ఉద్యోగుల జీతాలే సంస్థ నష్టాలకి కారణం అని నమ్మించటానికే 50 వేలూ 30 వేలూ అనే తప్పుడు ప్రచారం.** అ

పుస్తక పరిచయం

# దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర

- ఎం. రత్నమాల

ఐక్యరాజ్య సమితితో ఆరంభించి భారతదేశంతో సహా అనేక ప్రపంచ దేశాలు మహిళా సాధికారత పేరుతో ఎంతో అట్టహాసంగా ఏకంగా మహిళా సాధికార సంవత్సరాలే ప్రకటించి ఆర్భాటాలు చేస్తున్నాయి. కోట్లాది రూపాయల నిధులు ఖర్చు చేస్తున్నా మహిళా సాధికారత నినాదప్రాయంగానే ఉండిపోయింది. ఈ మధ్య హైదరాబాదు మేయర్ కార్తీకరెడ్డి భర్త అనధికార మేయర్‌గా అధికారాల్ని చెలాయిస్తున్నాడంటూ అధికారపార్టీ శాసనసభ్యురాలు జయసుధ ముఖ్యమంత్రి రోశయ్యకు ఫిర్యాదు చేయడం దాఖలా. పాలకవర్గాల చేతిలో మహిళా సాధికారత స్థితి ఇలా ఉండగా నిత్య నిర్బంధాలను ఎదుర్కొంటూ అనేక ఆటంకాల్ని కష్టనష్టాల్ని అధిగమిస్తూ దండకారణ్య మహిళా ఉద్యమం క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన నేతృత్వంలో మహిళా సాధికారత సాధించు కుంటూ స్త్రీ విముక్తి లక్ష్యంగా, స్త్రీ పురుష సమానత్వ సాధన దిశగా, సమసమాజ నిర్మాణోద్యమంలో వేలాది మంది కార్యకర్తలతో లక్షలాది మహిళలని సమీకరిస్తూ, లక్షలాది మంది ప్రజల జీవితాల్ని ప్రభావితం చేస్తున్న తీరు దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర తెలియ జేస్తుంది.

ఏప్రిల్ - మే 2010 విశాఖలో జరిగిన విరసం సభలో ఆవిష్కరించిన ఈ పుస్తకం శబరి కూర్పు. విరసం ప్రచురణగా వచ్చింది. గత ఏడెనిమిది సంవత్సరాలుగా దండకారణ్యంలో పురోగమిస్తున్న మహిళా ఉద్యమం గురించి అప్పుడప్పుడు అస్పష్ట, అసంపూర్తి వార్తలు చదవడం, నాకు దొరికిన ఒకటిరెండు పోరుమహిళ పత్రికలు (క్రాంతికారీ ఆదివాసి మహిళా సంఘ ప్రచురణ) చదవడం, పట్టణ మధ్యతరగతి మహిళా ఉద్యమం కంటే ఎంతో స్పష్టమైన స్త్రీ విభక్త జనతన మన సర్కార్‌ల అండదండలతో నిత్య నిర్బంధంలో పురోగమిస్తున్న ఉద్యమాన్ని ప్రత్యక్షంగా అధ్యయనం చేయాలనుకున్న నాకోరిక నెరవేరక పోయినా, ఈ పుస్తకాన్ని కూర్చిన శబరి వివరంగానే కాదు, చాలా స్పష్టంగా నిర్దిష్ట దృక్పథంతో, విషయ వివరణతో దండకారణ్య మహిళా ఉద్యమాన్ని అధ్యయనం చేయాలన్న నా కోరిక కొంతవరకు తీరింది. దాదాపు 20 సంవత్సరాలకు పైగా (1986 నుంచి 2009 వరకు) మహారాష్ట్ర, ఛత్తీస్‌ఘడ్‌లలోని జిల్లాల్లో 40లక్షలకు పైగా జనాభా కల్గిన వేలాది ఆదివాసీ గ్రామాల్లో పనిచేస్తున్న క్రాంతికారీ ఆదివాసీ సంఘం ఈ ప్రాంతంలోని 19లక్షల 88వేల మంది మహిళా జనజీవితాలను మహిళా సాధికారత వైపు, కోట్లాది ప్రజలను స్త్రీ పురుష సమానత్వం వైపు ప్రభావితం చేస్తూ పురోగమిస్తున్న తీరును శబరి ఎంతో అద్భుతంగా ఈ పుస్తకంలో వివరించారు. ఈ పుస్తకం నేను చదివిన వెంటనే మహిళా ఉద్యమంలో పని చేస్తున్న చాలా మందికి ఇది తప్పక చదవండి అని చెప్పాను. ఎందుకంటే నేను ఎన్నో సంవత్సరాలుగా విరసం, ఎ.పి.సి.ఎం.ఎస్., పి.డి.ఎస్.యు., పి.ఒ.డబ్ల్యూ.ఎం.ఒ.కు ఇతర సంస్థలకి చెప్పిన మహిళా ఉద్యమ చరిత్ర పాఠ్యాంశం శీర్షిక మొదట (విరసం వేసవి పాఠశాల 1988) 'వంద సంవత్సరాల మహిళా ఉద్యమ చరిత్ర గుణ పాఠాలు' ఆ తర్వాత క్రమంలో 1995ల నుంచి దండకారణ్య మహిళా ఉద్యమం గురించి విన్న తర్వాత, చదివిన తర్వాత ఈ పాఠ్యాంశం శీర్షికని 'దాక్షిణ్యావాదం నుంచి దండకారణ్యం దాకా మహిళ ఉద్యమ చరిత్ర గుణపాఠాలు'గా చెప్పూవస్తున్నాను. పుస్తకంగా రాయాలనుకుని రాయలేకపోయిన పుస్తకం ముగింపు భాగం కూడా దండకారణ్య మహిళా ఉద్యమం. అందుకని నేను నా పాఠ్యాంశంలో అసంపూర్తిగా అస్పష్టంగా (సమాచార పరిజ్ఞానం, ఆచరణాత్మక జ్ఞానం లేనందువల్ల) ఉన్న అంశాలు ఈ పుస్తకం చదివితే అర్థం అవుతాయని గతంలో నేను చెప్పిన మహిళా ఉద్యమ చరిత్ర పాఠం విన్న వాళ్లకి చెప్పాను. ఇలా ఎందరికని చెప్పడం. అందరూ ఈ పుస్తకంలోని విషయాలు తప్పక తెలుసుకోవాల్సి ఉందని నా కోరిక. అందుకే ఈ పరిచయ ప్రయత్నం.

ఏదైనా విషయాన్ని సమగ్రంగా తెలుసుకోవడానికి ముందు దాని పూర్వాపరాలు కూడా తెలుసుకోవాల్సి ఉంటుంది. అందుకే దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర చదివే ముందు అంటూ శబరి తన కూర్పు ముందు మాటగా - *'1986 నుండి 2009 వరకు అంటే దాదాపు 23 ఏండ్ల క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్ (కె.ఎ.ఎం.ఎస్) చరిత్రను పొందుపరచడానికి ప్రయత్నించాం. నిజానికి కె.ఎ.ఎం.ఎస్ ఏర్పడడానికి పూర్వరంగం అంతకుముందే ఆరంభమైంది కనక దాదాపు 30 ఏండ్ల మహిళా ఉద్యమ చరిత్ర అని కూడా చెప్పుకోవచ్చు. ఒక పావు శతాబ్దకాలం పాటు నడిచిన ఒక మహిళా సంఘం కృషిని చరిత్రగా నమోదు చేయడం అంటే చిన్న పని కాదు. అంతసులభమైంది కాదు. అందులోనూ అది ఒక వెనుక బడిన ప్రాంతంలో యుద్ధంలో మునిగి ఉండి, రహస్యంగా పనిచేసే సంఘం అయినప్పుడు (రహస్యం రాజ్యాంగ యంత్రానికే ప్రజలకుకాదు) ఆ కష్టం మరింత ఎక్కువే ఉంటుందని ఎవరికైనా అర్థమయ్యే విషయమే అయినప్పటికీ ఈ పుస్తకం వెలువడడం భారత విప్లవ మహిళా ఉద్యమానికి ఎంత అవసరమైన పనో గుర్తించి అనేక రకాలైన అడ్డంకుల్నీ, ఆటంకాల్నీ, ఇబ్బందుల్నీ అధిగమిస్తూ చేసిన మా ఈ ప్రయత్నాన్ని మీ ముందుంచుతున్నాం'* అంటూ (పేజీ అయిదు) దండకారణ్య ఉద్యమేతర మహిళా ఉద్యమానికి కరదీపికవంటి ఒక గొప్ప ఆచరణను మనకు ఈ పుస్తకంలో వివరించే ప్రయత్నం చేసింది. క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘం, ఆ సంఘ నాయకత్వం కూర్పు చేసిన - శబరి చెప్పినట్టు ఈ పుస్తకంలో ఎందరో మహిళల జ్ఞాపకాలు, మరెందరో కె.ఎ.ఎం.ఎస్ కార్యకర్తలు అక్షరబద్ధం చేసుకున్న నోట్సులు, కార్యక్రమాల నివేదికలు, సంఘ గ్రామస్థాయి యూనిట్ల మినిట్సు కూర్చిన అమూల్యమైన ప్రయత్నం ఈ పుస్తకం.

దండకారణ్య (డి.కె) పోరుమహిళను అర్థం చేసుకోవడానికి 1825 నాటి పరాల్‌కోట పోరాటంలోకి ఎలా వెళ్లాలో దండకారణ్యం (డి.కె.) విప్లవ మహిళా ఉద్యమాన్ని అర్థం చేసుకోవాలంటే మనం నక్సల్బరీ దగ్గర మొదలవ్వాలి. నక్సల్బరీ వసంత మేఘగర్జన భారత దేశ విముక్తికి నూతన ప్రజాస్వామిక విప్లవమే మార్గం అనే వాస్తవాన్ని తిరుగులేని సత్యంగా ప్రతిష్ఠించింది. అది మొత్తంగా దేశ పీడిత ప్రజల విముక్తికేకాక అందులో భాగంగా మహిళా విముక్తికీ మార్గాన్ని చూపింది (పేజీ అయిదు). అందుకనే నేడు డి.కె. మహిళా ఉద్యమ చరిత్ర నిర్దిష్టంగా ఈ పుస్తకంలో ఉన్నా దేశ వ్యాప్త విప్లవోద్యమంలో భాగంగా,

దేశవ్యాప్తంగా పెంపొందుతున్న విప్లవ మహిళా ఉద్యమంలో భాగంగానే దీన్ని చూడాల్సి ఉంటుంది. అలాగే దీనిలో రెండోలక్షణం ఇది అన్నింటిలోకి సంఘటితమైన, అత్యధిక సభ్యత్వం కలిగిన ఉన్నతస్థాయి ఉద్యమం కావడం. ఈ రెండు లక్షణాలు డి.కె మహిళా ఉద్యమాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సి అవసరాన్ని కలిగిస్తూ ఉన్నాయి (పేజీ ఆరు).

ఈ పుస్తకానికి సంబంధించి అర్థం చేసుకోవాల్సిన మరో అంశం ఇక్కడి మహిళా ఉద్యమానికి, ప్రజాయుద్ధానికి గల అంతర్ సంబంధం గురించి. ఇది అర్థం కాకుండా ఈ చరిత్ర అర్థం కావడం కష్టమే కాదు అసాధ్యం కూడా. ఈ విషయం మొత్తంగా దేశ వ్యాప్తంగా వేర్వేరు ప్రాంతాల్లో పెంపొందుతున్న విప్లవ మహిళా ఉద్యమానికంతటికీ వర్తించేదే (పేజీ ఏడు)

అటానమస్ ఉమెన్ మూవ్‌మెంట్స్ పేరుతో స్త్రీల సమస్యలు స్త్రీలేమాట్లాడాలి, స్త్రీలేరాయాలి (ఎవరి అనుభవాలు వారే చెప్పాలి) ఎవరి సమస్యలకై వారే ఉద్యమించాలి. ఎవరి బాధలు వారివే అన్న కొన్ని స్త్రీవాద ధోరణులు ఉన్న స్థితిలో అందరూ కలిసి పని చేయాల్సిన బాధలు ఉన్నాయని, స్త్రీ పురుష సమానత్వ భావన స్త్రీలు పురుషుల్లో మొత్తంగా సమాజం అంతటిదీ అన్న అవగాహన ఇస్తుంది మనకీ పుస్తకం.

*'డి.కె మహిళా ఉద్యమ చరిత్ర కేవలం ఒక మహిళా సంఘం చరిత్రగా లేదు. ఉండదు కూడా. ఎందుకంటే కె.ఎ.ఎం.ఎస్ ఒక స్వయం ప్రతిపత్తి సంఘం కాదు. అది కార్మికవర్గ నేతృత్వాన్ని ఆమోదిస్తుంది. అది విప్లవ పార్టీ నేతృత్వంలో ఏర్పడి, దాని మార్గ దర్శకత్వంలో నడిచే మహిళా సంఘం. దాని పుట్టుకా, పెరుగుదలా, భవిష్యత్తూ విప్లవ పార్టీతో, విప్లవోద్యమంతో పెనవేసుకుపోయి ఉంటాయి. అది విడిగా ఒక విప్లవ ప్రజాసంఘంగా స్వంత ప్రణాళికా నిబంధనావళిని కలిగి ఉండి, స్వంత ఆచరణను కలిగి ఉంటుందనడంలో సందేహంలేదు. కానీ అదే సమయంలో అది విప్లవోద్యమ పురోగమనంతో ముడివడి ఉండి దానికనుగుణంగా తన కార్యాచరణను మలుచుకుంటూ ముందుకు సాగుతుంది. శత్రుఫాసిస్టు నిర్బంధాన్ని ఎదిరించి నిలవాలంటే సంఘం ప్రజాసైన్యం నుంచి రక్షణ పొందడమే కాక స్వయంగా ప్రజాయుద్ధంలో భాగం కావాల్సి ఉంటుంది. అందుకనే ఈ పుస్తకంలో డి.కె మహిళా ఉద్యమ చరిత్రను చెప్పేటప్పుడు విప్లవ పార్టీ ప్రస్తావన తరచూ వస్తూ ఉంటుంది. అది సంఘం సంస్థాపన సందర్భంగా కావచ్చు. పార్టీ పిలుపుల్ని అమలు పరచడంలో కావచ్చు. పార్టీ మార్గదర్శకత్వం పొందిన సందర్భాలలో కావచ్చు. అలాగే కె.ఎ.ఎం.ఎస్. ప్రజాసైన్య రక్షణలోనే అనేక కార్యక్రమాలను విజయవంతం చేసుకున్న సందర్భాలు తారసపడ్తూనే ఉంటాయి. మొత్తంగా డి.కె. మహిళా ఉద్యమంలో మహిళల పాత్రను అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతుందనీ పార్టీ, సైన్యం, మిలీషియా, జనతన సర్కార్లలో మహిళల పాత్రల్ని కూడా విడిగా చేర్చాం. మా ప్రధాన కేంద్రీకరణ మహిళా ఉద్యమ చరిత్రను చెప్పడంపైనే ఉన్నా వీటి అన్నింటితో ముడివడిన చరిత్రను చెప్పడమే చరిత్ర అవుతుంది. మహిళా సంఘం ఏర్పాటు సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో తెచ్చిన మార్పుల్ని చెప్పే అధ్యాయాన్ని చదివేటప్పుడు కూడా అది కేవలం మహిళా సంఘం తెచ్చిన మార్పుగా అర్థం చేసుకుంటే ఒక మొత్తంలో నుండి ఒక భాగాన్ని విడదీసి చూసినట్టే ఉంటుంది. మహిళా సంఘం ఆ మార్పుల్ని తేవడానికి ఎజెండాగాపెట్టుకుని ముందుండి కృషి చేయడం ఎంతవాస్తవమో, పార్టీ నాయకత్వంలో పెంపొందిన విప్లవోద్యమం మొత్తంగా కల్పించిన వాతావరణం లేకుండా అది సాధ్యమయ్యేవి కావు అనేది అంతే వాస్తవం. ఈ గతితార్కిక సంబంధం స్పష్టమవ్వాలి. లేకుంటే చరిత్రకు న్యాయం చేయలేం'* (పేజీ ఏడు, ఎనిమిది).

డి.కె మహిళ పాల్గొనని ఉద్యమం, పోరాటం, సభ, సమావేశం, నిర్మాణం, బంద్, ర్యాలీ, నిరసన ప్రదర్శన-ఒక్క మాటలో చెప్పాలంటే ఏ విప్లవ కార్యకలాపం ఒక్కటి కూడా లేదు అని శబరి పుస్తకానికి ముందు మాటగా (పేజీ పది) చెప్పారంటే దండకారణ్యా మహిళా జనజీవనంలో విప్లవోద్యమం, విప్లవ మహిళా ఉద్యమం ఎంతగా పెనవేసుకున్నదో అర్థం చేసుకోవచ్చు. ఇంతగా ఆదివాసీ మహిళా జనజీవితాలలో పెనవేసుకొని సాగుతున్న దండకారణ్యా మహిళా ఉద్యమంపై దైనందిన నిర్బంధంతో ఆదివాసీ జనజీవనాన్ని ప్రభావితం చేస్తున్న క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘంపై ప్రభుత్వ పోషిత సల్వాజుడుం, పోలీసులు కలికట్టుగా సాగిస్తున్న అకృత్యాలు దమన కాండను గురించి చెప్తూ...

*'ఇక మూడవదిగా మేం పాఠకుల దృష్టికి తేదలచిన అంశం కె.ఎ.ఎం.ఎస్.డి.కె. మహిళా ఉద్యమ భవిష్యత్తులకు సంబంధించినది. ఈ చరిత్ర గడిచిపోయింది కాదు ఇంకా రూపొందుతూ ఉన్నది.* ఇటీవల దేశ ప్రజల దృష్టికే కాక ప్రపంచవ్యాప్తంగా ఉన్న ప్రజాస్వామిక వాదులందరి దృష్టికి వచ్చిన ఫాసిస్టు సల్వాజుడుం రాజకీయ సైనిక క్యాంపెయిన్ మావోయిస్టు ఉద్యమాన్ని అణచడానికే పాలకవర్గాలు పన్నిన కుట్ర అనడంలో ఎవరికీ సందేహాలు లేవు. నేడు ప్రజా ప్రతిఘటనతో విప్లవోద్యమం దాని (సల్వా జుడుం) మీద పై చేయి సాధించింది. కాని ఏనాటికానాడు మరింత క్రూరమైన, ఫాసిస్టు *దమనకాండను డి.కె ఉద్యమ అణచివేతకై...'* మహిళా ఉద్యమం ఏ విషయాల్లోనైతే స్త్రీలపై పీడననూ, వివక్షనూ అంతం చేసిందో చేయబూనుకుందో సరిగ్గా ఆ అంశాలనే సల్వాజుడుం తిరగదొడి సమాజాన్ని వెనక్కి నడిపించే ప్రయత్నం చేసింది. (ఛత్తీస్‌ఘఢ్ గ్రామాల్లో పోలీసు క్యాంపులను ఒక నిజ నిర్ధారణలో భాగంగా పర్యటించినపుడు మేం ఈ విషయాలను స్పష్టంగా చూడగలిగాం... పరిచయకర్త) పెరుగుతున్న నిర్బంధకాండలో కూడా మహిళా ఉద్యమ విజయాల్ని వెనక్కి తిప్పడం పాలకవర్గాలకి ఒక ముఖ్యమైన విషయంగా ఉందనేది సులభంగానే గమనించవచ్చు. మాడ్‌పై ఎక్కుపెట్ట బోతున్న దాడి కూడా దాన్నే మరోసారి పునరావృతం చేయబోతోంది. మరి మహిళా ఉద్యమాన్ని గానీ, దాని విజయాల్ని గాని అది తనకు తానుగా కాపాడుకోగలుగుతుందా? లేదు, అని ఈ చరిత్రను చదివిన పాఠకులకు కూడా గ్రహింపుకొస్తుంది. విప్లవోద్యమంలో భాగంగా అభివృద్ధి అయిన మహిళా ఉద్యమం, విప్లవోద్యమం మొత్తంగా నిలదొక్కుకున్నప్పుడే తాను నిలదొక్కుకోగలుగుతుంది. ఇది ఓటమిపాలు అయితే వెనుకంజవేస్తుంది.

అందుకని ఇక్కడ మహిళా ఉద్యమ భవిష్యత్ ఉజ్వలంగా ఉండాలని కోరుకునే ప్రజాస్వామిక వాదులూ, దేశభక్తులూ, అభివృద్ధి కాముకులూ, ముఖ్యంగా మహిళా ఉద్యమకారులూ, మహిళా మేధావులూ కె.ఎ.ఎం.ఎస్.కూ, దేశవ్యాప్తంగా ఈ విధంగానే పెంపొందుతున్న విప్లవ మహిళా ఉద్యమానికి అండగా నిలవాలని అంతకంటే ఓ అడుగు ముందుకు వేయగల వాళ్లు ఇందులో భాగం కావాలని కోరుతున్నాం అంటున్నారు ఈ పుస్తక రచయితలు (పేజీ ఎనిమిది, తొమ్మిది)

దండకారణ్యంలో మహిళా సంఘాల నిర్మాణం-సామాజిక నేపథ్యం - వివరిస్తూ : ఆదివాసీ స్త్రీ పురుషుల నిష్పత్తి దాదాపు

సమానంగా ఉంది (ఆదివాసేతర ప్రాంతాలలో ఈ నిష్పత్తి వేయి మంది పురుషులకు 936 నుంచి 972 మాత్రమే - పరిచయ కర్త) ఆదివాసీల్లో 25 శాతం మించని అక్షరాస్యత, స్త్రీలలో మరీ తక్కువ. బస్తర్-దంతెవాడ తాజాగణాంకాల ప్రకారం ఆదివాసీ స్త్రీల అక్షరాస్యత 17 శాతం మాత్రమే. గడ్‌చిరోలి, బస్తర్ ప్రాంతాలు శిశుమరణాల రేటులో దేశంలోనే మొదటి వరుసలో నిలిచిన ఆదివాసీ ప్రాంతాలు. గర్భిణీ స్త్రీలు కాన్పు సమయంలో జీవించడం అంటే మరో పుట్టుకతో సమానంగానే వారి జీవితాలు గడుస్తున్నాయి. ఒంటి నిండా బట్ట ఉండదు. రెండు పూటలా తిండి ఉండదు. ఇది ఒక యథార్థ జీవితం.

*'దండకారణ్య ఉద్యమ ప్రాంతం ప్రధానంగా ఆదివాసీలతో నిండి ఉంది. ఆదివాసీలలో పలు తెగలకు చెందిన వారున్నప్పటికీ కోయ, దొర్ల (రాజ్‌గోండ్), కోలాం మొదలైనవారందరి జీవన విధానంలో, రీతిరివాజుల్లో పెద్దగా తేడాలు లేవు. వీరితో పాటే సహజీవనం చేస్తున్న నేతీ (మహర్), హల్బి, గోవారీ, ప్రధాన్ (డోలి) కాసరి మొదలైన తెగలు, కులాల వారి సాంప్రదాయాలు కొంత భిన్నంగా ఉంటాయి. అయినప్పటికీ ఈ అన్ని సమూహాలకు చెందిన మహిళలు తరతమ తేడాతో పితృస్వామ్య కాడిని అదనంగా మోస్తున్న వారే. కుళ్లిన మనువాద నీతుల పాదాల కింద బతుకులీడుస్తున్న వారే. వీరిని ప్రజాయుద్ధం సంఘటితం చేసింది. స్త్రీపురుష సమానత్వాన్ని ఎజెండా మీదకి తెచ్చింది. మహిళల విముక్తికోసం వారు విప్లవించాలనీ, మహిళలు లేని విప్లవం గెలవబోదని నినదించింది.'* (పేజీ పద్నాలుగు).

పోరు బావుటాలు ఎత్తిన ఆదివాసీ మహిళ : దండకారణ్య ఆదివాసీ సమాజంలో పలు ఎత్నిక్ గ్రూపులున్నా వాటిలో కోయ, దొర్ల లేదా రాజ్‌గొండి, మాడియాగొండి, మూరియా సమూహాలే సాపేక్షికంగా పెద్దవని చెప్పుకోవచ్చు. దండకారణ్యంలో ఆదివాసీ సమూహాలు ఏ ఎత్నిక్ గ్రూపునకు చెందినవైనా వాటన్నింటి జీవన విధానంలో పెద్దమార్పులేవి లేవనుకోవచ్చు. కాకపోతే మాడ్ కొండల్లో నివసించే అతి స్వల్ప జనాభా మినహా అన్ని రకాల తెగల ఆదివాసీ ప్రజాజీవితాలు దాదాపు ఒకేలా ఉన్నాయి. వారి ఆచార వ్యవహారాల్లో వైవిధ్యం కన్నా సారూప్యతే అధికం అని చెప్పుకోవచ్చు. కట్టూ, బొట్టూ, మాటా, ముచ్చటా, తిండి తిప్పలూ మొదలైన విషయాలన్నింటిలోనూ, అనుభవాలలోనూ అన్ని తెగల మహిళలు అక్కా చెల్లెళ్లే. ఆమెను తెగ పితృస్వామ్యం మొరటుగా అణచివేసింది. ఓ దగ్గర అన్‌చడ్ మరొక దగ్గర ముత్తి అంటూ హింసించేది. విప్లవోద్యమ ప్రవేశానికి ముందు ఆమె వర్ణణాతీతమైన పితృస్వామ్య హింసను, వేదనను భరించింది.

ఆదివాసీ మహిళ అలుపెరుగని శ్రమజీవి. ఆస్తిపై అధికారాన్ని చేజిక్కించుకున్న పురుషుడు స్త్రీతో పాటు శ్రమశక్తిని వెచ్చించడంలో కొంత వెసులుబాటును పొందాడని ఆదివాసి సమాజాన్ని చూస్తే సులువుగానే అర్థం అవుతుంది. ఆదివాసీ మహిళ ఉత్పత్తిలో, సామూహిక ఉత్పత్తిలో, ఇంటి చాకిరీ గృహశ్రమలలో పురుషుడికన్నా అధికంగా శ్రమిస్తుంది. ఆమె మొగాళ్లతో పాటు నాగలి పడుతుంది. అయితే గత కొంత కాలంగా షానెక్కిన పౌరసమాజం ఆమెను ఉత్పత్తి క్రమం నుంచి దూరం చేయడంలో భాగంగా నాగలిపట్టడాన్ని మాన్పిస్తోంది. ఆమె పంట కాపు కాస్తుంది. అదిఏపుగా ఎదిగి పండినాక దాన్ని కొడవలితో కోస్తుంది. వరి మోపులు మోస్తుంది. భారమైన పనులన్నింటిలో పురుషుడితో పోటీపడి పనిచేస్తుంది. కాకపోతే ఆస్తిపై అధికారానికి సంకేతంగా నిలిచే అతికొద్ది పనులపై తెగ పితృస్వామ్యం విధించిన పోల్, మేలోలు (నిషేధాలు) మినహా ఉత్పత్తిలో ఆమె శ్రమలేకుండా ఉత్పాదనే లేదని రూఢీగా చెప్పవచ్చు. కానీ ఆమెను ఆ ఉత్పత్తిపై హక్కునించి వంచించారు.

ఆమె సామూహిక ఉత్పత్తిలో పాలుపంచుకుంటుంది. ఆమె అడవిలో క్రూర జంతువుల వేటలో పాల్గొంటూంటే 'ఓల్గానుంచి గంగాతీరం' వరకు సాగిన మానవ ఇతిహాసం మస్తిష్కంలో మెదలుతుంది. ఆమె తనవాళ్లతో జంతువులను తరుముతుంది. అలసిన జంతువులను వలతో బంధిస్తుంది లేదా ఆయుధాలతో కాచుకు కూచుండి తమవారివైపు తరిమి తరిమి వాటిని బలిచేస్తుంది. చేపల వేటలో అయితే ఆమెకు ఆమే సాటి. అయితే పితృస్వామ్యం ఆమెతో గాయపడ్డ జంతువులను మోయిస్తుంది కాని ఆమెను సాయుధం కానియ్యకుండా కట్టుదిట్టం చేసింది. వేట ఫలితంపై మగాడి మాటే చెల్లుబాటు అవుతుంది. శ్రమలో సమానత్వాన్ని, ఫలితంలో అసమానత్వాన్ని ఆమె మౌనంగా భరించింది. పోనుపోను వేట తమ సమూహం కోసం కాకుండా వ్యాపారం కోసం విచ్చలవిడిగా చేయడం మొదలయ్యాక ఆమె తన అటవీ సంపదను సంరక్షించు కోవడంలో తన వాళ్లతో పాటుగా నడుంబిగించాల్సి వస్తోంది.

ఉత్పత్తి, సామూహిక ఉత్పత్తిలోపాల్గొనే మహిళ గృహశ్రమలో తన అధిక శక్తిని వినియోగిస్తుంది. కేవలం గృహశ్రమలోనే ఆమె పాల్గొంటుందంటే మాత్రం అది అర్ధసత్యమే అవుతుంది. ఆమె గృహావసరాలు చాలావరకు సమకూర్చుకుంటుంది. వంట చెరకు నుంచి ప్రకృతి ప్రసాదించే ఆకు, అలము, కాయ, పండు, కంద మూలాలు, వెదురు మొక్కలు, పుట్టకొక్కులు, పువ్వులు, నూనె గింజలు (గారి) ఎన్నో గృహావసరాలను పురుషుడితో పొత్తు లేకుండానే సంపాదించుకుంటుంది. అది ఆమె తన బాధ్యతగా చేయాల్సిందే తప్ప మగవాళ్లని మీరూ ఇందులో పాలుపంచుకోండి అని కోరకూడదు. ఇది ఆమె పట్ల అమలవుతున్న సామాజిక న్యాయం ఆమె శ్రమకి విలువకట్టే షరాబే లేడు.

ఆమె అన్నిరకాల కూలిపనుల్లో పాల్గొంటుంది. ఆదివాసుల అడవుల నుంచి అత్యంత విలువైన ప్రకృతి సంపదను దోపిడీదారులు కొల్లగొట్టుకుపోవడానికి దోపిడి ప్రభుత్వాలు చేపట్టిన రోడ్ల నిర్మాణాలన్నింటిలో ఆమె తన శ్రమశక్తిని వెచ్చించని రోడ్డే లేదంటే అతిశయోక్తి కాదు. ప్రభుత్వ భవనాల నిర్మాణంలో ఆమె రెక్కల కష్టం దాగుంది. తునికాకుల ద్వారా ఎన్నెన్నో సంపదలను కూడబెట్టు కుంటున్న టెకేదార్ల దోపిడీలో ఆమె చెమట, నెత్తుర్లున్నాయి. నెత్తిన మూటతో గూడెం గూడెం తిరిగి వస్తుమార్పిడి విధానంలో హద్దులేని మోసాలతో కుబేరులైన షావుకార్ల నీతి మాలిన సంపాదనలో ఆమె అమాయకత్వం, ఆమె పేదరికం ఆమె అవసరాన్ని దర్శనమిస్తాయి. కాగితపు పరిశ్రమల నుంచి మార్కెట్టులోకి అందంగా తయారైవచ్చే తెల్లని కాగితాల్లో ఆమె ఆక్రందనలున్నాయి. ఆమె అడవికి యజమానురాలు. కాని ఆమె అన్నివిధాల వంచనకు గురై కూలీ బతుకును ఈడుస్తోంది. ఆమె కేవలం శ్రమదోపిడీకి మాత్రమే గురి అవుతున్నది కాదు. లైంగిక దోపిడిని, అత్యాచారాలను, వేధింపులను, అవమానాలను మౌనంగా భరించేది.

(ఇంకా ఉంది) అ

కేంద్ర హోంమంత్రికి బహిరంగ లేఖ

# ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను జార్ఖండ్ నుంచి విరమించుకోవాలి!

- గ్లాడ్‌సన్ డుంగ్ డుంగ్
(జార్ఖండ్ ఇండిజినస్ పీపుల్స్ ఫోరం)
(తెలుగుసేత : *గీతాంజలి*)

డియర్ సర్ ! మార్చ్ 10, 2010 నుంచి జార్ఖండ్ జిల్లాలోని చాలా ప్రాంతాల్లో మొదలైన ఆపరేషన్ గ్రీన్‌హంట్ లేదా నక్సల్ వ్యతిరేక ఆపరేషన్ వలన ఎంతోమంది గ్రామస్తులు, ముఖ్యంగా వేల సంఖ్యలో ఆదివాసుల జీవనం, స్వేచ్ఛ చిన్నాభిన్నమై వారు ప్రాణ భయంతో బతుకుతున్నారు. అడవుల్లో, అడవుల చుట్టూ వాటిపై ఆధారపడి జీవించే ఆదివాసులను అలా తిరగకుండా భద్రతా బలగాలు అడ్డుకుంటున్నాయి. చెరువులు, కుంటలు మొదలైన నీటి వనరులు వీరి కబ్జాల్లోకి వెళ్లడంతో పాటు, ఆదివాసులను హింసించడం, పిల్లల్ని బడులకు పోనీయకుండా అడ్డుకోవడం జరుగుతోంది. పిల్లల బడులన్నీ మిలిటరీ క్యాంపులుగా మార్చివేడయం వలన పిల్లలు స్వేచ్ఛగా బళ్లకు పోవడమనే ప్రాథమిక హక్కుకు దూరమవుతున్నారు. మిలిటరీ క్యాంపుల్లోని బలగాలు ఆదివాసీ స్త్రీలతో అసభ్యంగా ప్రవర్తిస్తున్నాయి.

మాకు తెలిసినంత వరకు చాలా కాలం నుంచి పలాము ప్రాంతం జార్ఖండ్‌లో మావోయిస్టు ప్రాబల్యం ఉన్న ప్రాంతం. ప్రస్తుతం సిమ్‌డెడ్‌గా జిల్లా కూడా అదే కోవకు చెందుతుంది. నిజానికి యాంటీ నక్సల్ ఆపరేషన్ మొదటిసారిగా మైనింగ్ ఇండస్ట్రీస్ లేదా ఖనిజ పరిశ్రమలు, స్టీల్ ప్లాంట్‌లు, పవర్ ప్రాజెక్టులు స్థాపించడానికి అధిక సంఖ్యలో అవగాహన పత్రాలు సంతకాలు అయిన కొల్హాన్ ప్రాంతంలో మొదలైంది.

నిజానికి ఖనిజ, స్టీలు, పవర్ ప్రాజెక్టులు, డ్యాములు, స్పాంజ్ ఐరన్ ఫ్యాక్టరీలు స్థాపనను ఈస్ట్ సింగ్ భం, వెస్ట్ సింగ్ భం, కుంతి, గుమెలా, బొకారో, గిరిదిహ్ ఛాత్ర - లాట్‌హర్, రామ్‌గర్, హజారీబాగ్ లాంటి జిల్లాల్లో ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారని తెలిసిన తర్వాతే ఈ ప్రాంతాలలో నక్సల్ వ్యతిరేక ఆపరేషన్‌ను ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

విషాదకరమైన అంశం ఏంటంటే భారత ప్రభుత్వం మార్చ్ 17న అవే జిల్లాల్లో ఎక్కడైతే నక్సల్ వ్యతిరేక ఆపరేషన్‌ను ప్రవేశపెట్టిందో అక్కడే 'ఆపరేషన్ మినరల్ హంట్'ను మొదలుపెట్టింది. తాజా రిపోర్టుల ప్రకారం అక్కడ అంటే ఛోటా నాగ్‌పూర్‌లో ఖనిజాల వేట ఏరియల్ సర్వేల రూపంలో కొనసాగుతోంది. రెండు ఆపరేషన్‌లూ ఏకకాలంలో భారత ప్రభుత్వం కొనసాగిస్తోంది.

అందువల్ల మాకు చాలా స్పష్టంగా అర్థమైన విషయం ఏంటంటే ఈ ప్రాంతాల్లోని గ్రీన్‌హంట్ అడవిలోని ఆదివాసుల, ఇతర స్థానిక ప్రజల భూముల్ని ఖాళీ చేసి కార్పొరేట్ కంపెనీల కోసం ఇవ్వడానికే కానీ, మావోయిస్టులను తరమడానికి కాదని. దీనికోసం ప్రభుత్వం మావోయిస్టుల బూచిని ప్రజలకు చూపిస్తూ, ఆదివాసులను తమ స్థావరాల నుంచి బేదఖల్ చేస్తూ భయానక అభద్రతా వాతావరణాన్ని సృష్టిస్తోంది. మేం ఈ అటవీ భూమి పుత్రులం అని తెలిసి కూడా, మా పైన జాతి అభివృద్ధి పేరున కొనసాగుతున్న హింస వల్ల చాలా అభద్రతతో కూడిన (రాష్ట్రంలో) ప్రాంతాల్లో ఉండవల్సి వస్తున్నది. మేం అభివృద్ధి వ్యతిరేకులం కాదు. కానీ, అదే సమయంలో మా శ్మశానాల్లో పునాది రాళ్లు పాతుతూ చేసే అభివృద్ధికి మేం వ్యతిరేకులం. ప్రస్తుత పరిస్థితుల్లో ఆదివాసులు అన్ని వైపుల నుంచి వేటాడ బడుతున్నారు. అభివృద్ధి ఫలాలు ఇంకెవరికో అయితే మేం మూల్యం చెల్లిస్తున్నాం. అటు మావోయిస్టులు, ఇటు రాజ్యం రెండు వైపుల హింసకూ బలయ్యేది, అవుతున్నది మేమే. అందువల్లనే ఈ ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ని వెంటనే ఆపివెయ్యాలని డిమాండ్ చేస్తున్నాం. నక్సలిజం రూపుమాపడానికి యుద్ధమొకటే పరిష్కారం కాదని బలంగా నమ్ముతున్నాం. నక్సలిజానికి సంబంధించిన విషయాలపై మీకు నిజంగా చిత్తశుద్ధి ఉంటే - మేం మీకు సూచించే ఈ కింది విషయాలను పాటించమని చెపుతున్నాం.

- సూక్ష్మ స్థాయిలో ఒ.జి.ఎచ్. గురించి గ్రామాల్లో వెంటనే సర్వే చేయాలి. అలాగే ఆదివాసుల తక్షణ అవసరాలపై దృష్టి పెడితే స్థానిక ప్రజల విశ్వాసాన్ని చురగొంటారు.
- గ్రామస్తులకు మిగిలిన వనరులు, ఇతర జీవనాధారాలు కొల్లగొట్టద్దు. 2000 సంవత్సరం నుంచి కార్పొరేట్ కంపెనీలతో కలిసి చేసిన అవగాహన పత్రాలను (ఎం.ఒ.యు.) వెంటనే వెనక్కు తీసుకోవాలి. అభివృద్ధి ప్రాజెక్టుల కోసం గుంజుకున్న గ్రామస్తుల భూములను తిరిగి ఇచ్చెయ్యాలి. అలాగే కొత్త ఎం.ఒ.యు. లపై సంతకం పెట్టె ముందు, స్థానిక, సాంప్రదాయక గ్రామ సభలను దానిలో భాగస్వామ్యం చేయాలి.
- 100 శాతం అభివృద్ధి ఫలాలు - సంరక్షక పథకాలు స్థానిక ప్రజలకు చేరేట్లు చెయ్యాలి. డబ్బు నేరుగా గ్రామ సభలు, ఇతర స్థానిక సంస్థల నుంచి గ్రామస్తులకు చేరాలి.
- ప్రభుత్వ సంస్థలైన బడులు, ఆసుపత్రులు, పౌరసరఫరా సంస్థలు ఐ.సి.డి.లు, స్థానిక సంస్థలు సరిగా పనిచేసేట్లు చూడాలి.
- అన్ని రకాల అభివృద్ధి పథకాల్లో స్థానిక ప్రజలకు సంబంధం ఉండాలి.
- కొనసాగుతున్న భూమికి సంబంధించిన చట్టాలు అలాగే కొనసాగడమే కాకుండా ఆదివాసుల భూములు వాళ్లకే చెందాలి.
- అటవీ వ్యవసాయం స్థానిక ఆదివాసులకే చెందాలి కాని కార్పొరేట్ కంపెనీలకు కాదు.
- ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వెంటనే జార్ఖండ్‌లోని అన్ని జిల్లాల నుంచి విరమించాలి.

మా విన్నపం ఏమంటే మావోయిస్టులతో చర్చలు జరపాలి. అది కూడా స్థానికులు, సామాజిక సంస్థలు మానవ హక్కుల సంఘాలు, రచయితలు - సామాజిక కార్యకర్తలు ఈ చర్చల్లో పాల్గొనాలి. మేం తప్పకుండా శాంతి ప్రాతిపదికగా, యుద్ధానికి వ్యతిరేకంగా మీతో కలిసి నడుస్తాం. మీ నుంచి ఆశావహ సమాధానాన్ని కోరుతున్నాం.

అ

(మార్క్సిస్టు మౌలిక రచనలను 'అధ్యయనం' శీర్షికన నెల నెలా పరిచయం చేయాలని భావిస్తున్నాం. - సం.)

# మార్క్స్ ముందుమాట నుంచి...

మనుషులు తమ మనుగడను సామాజికంగా ఉత్పత్తి చేసుకొనే క్రమంలో అనివార్యంగా కొన్ని కచ్చితమైన సంబంధాల్లోకి ప్రవేశిస్తారు. అవి వారి ఇష్టాఇష్టాలను బట్టి ఏర్పరచుకొనేవి కావు. వీటిని మనం ఉత్పత్తి సంబంధాలు అంటాం. ఈ ఉత్పత్తి సంబంధాలు ఆనాటికి మనుషుల భౌతిక ఉత్పత్తి శక్తులు అభివృద్ధిలో ఏ దశకు చేరుకొని ఉంటాయో ఆ దశకు తగిన విధంగా ఉంటాయి. ఈ ఉత్పత్తి సంబంధాల మొత్తం సమాజ ఆర్థిక నిర్మాణంగా రూపొందుతుంది. అసలైన ఈ పునాదిపైనే చట్టపరమైన, రాజకీయపరమైన ఉపరితలం ఒకటి తలెత్తుతుంది. ఈ ఉపరితలానికి అనురూపమైన కొన్ని కచ్చితమైన సామాజిక చైతన్య రూపాలు ఉద్భవిస్తాయి. సామాజిక, రాజకీయ, బౌద్ధిక జీవనానికీ సంబంధించిన సాధారణ క్రమాలకు భౌతిక జీవిత ఉత్పత్తి విధానమే నిబంధనలు (కండీషన్స్) విధిస్తుంది. మనుషుల అస్తిత్వాన్ని వారి చైతన్యం నిర్ధారించదు. వారి సామాజిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్ధారిస్తుంది. ఒక సమాజం భౌతిక ఉత్పత్తి శక్తులకు, అవి అభివృద్ధి చెందే క్రమంలో ఒకానొక దశలో అప్పటికి ఉనికిలో ఉన్న ఉత్పత్తి సంబంధాలకు ఘర్షణ ప్రారంభమవుతుంది. ఇదే విషయాన్ని చట్ట పరిభాషలో చెప్పాలంటే, ఈ ఉత్పత్తి శక్తులు తాము అంత వరకు ఏ ఆస్తి సంబంధాల చట్రం ద్వారా పని చేశాయో ఆ ఆస్తి సంబంధాలతో ఘర్షించడమన్నమాట. అంతవరకూ ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి వ్యక్తీకరణలుగా ఉన్న ఉత్పత్తి సంబంధాలు వాటికి అవరోధాలుగా మారుతాయి. అప్పుడు సాంఘిక విప్లవాల యుగం ప్రారంభమవుతుంది. ఆర్థిక పునాదిలో వచ్చే మార్పులు కొంచెం అటు ఇటుగా బృహత్తరమైన ఉపరితలం మొత్తం అంతటా వ్యాపించి దాని పరివర్తనకు దారితీస్తుంది.

ఇలాంటి పరివర్తనలను అధ్యయనం చేసే సమయంలో మనం తప్పక గమనించవలసిన తేడా ఉంది. ఉత్పత్తికి సంబంధించిన ఆర్థిక పరిస్థితుల్లో వచ్చే భౌతిక పరివర్తనకూ: న్యాయ, రాజకీయ, మత, కళా, తాత్విక రంగాల్లో వచ్చే మార్పులకూ మధ్య ఒక ముఖ్యమైన తేడాను మనం దృష్టిలో తీసుకోవల్సి ఉంది. మొదటి రకం (ఆర్థిక) మార్పులను ప్రకృతి శాస్త్రాల అంత కచ్చితత్వంతో నిర్ధారించడానికి వీలవుతుంది. ఇక రెండవ రకం మార్పులు - వాటిని స్థూలంగా భావజాల రంగానికి సంబంధించిన మార్పులు అనవచ్చు. వీటి పట్ల మనుషులు మొదట చైతన్యం పొంది ఆ పోరాటాలను నిర్వహిస్తారు. ఎలాగైతే ఒక మనిషిని అతను తన గురించి తాను ఏమనుకుంటున్నాడు అనేదానిపై ఆధారపడి అంచనా వేయరాదో అలాగే పరివర్తనా దశలో ఉన్న ఒక సమాజాన్ని ఆనాటి దాని చైతన్యంపై ఆధారపడి అంచనా వేయరాదు. నిజానికి ఈ చైతన్యం ఎందుకు అలా ఉందో భౌతిక జీవితంలోని వైరుధ్యాల ద్వారా వివరించవలసి ఉంటుంది. మరో మాటలో చెప్పాలంటే సామాజిక ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య ఉన్న ఘర్షణ ద్వారా వివరించవలసి ఉంటుంది. ఏ సామాజిక వ్యవస్థ కూడా దాని లోపల ఏ మేరకు ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందేందుకు అవకాశం ఉన్నదో ఆ ఉత్పత్తి శక్తులన్నీ ఆ మేరకు అభివృద్ధి చెందేంతవరకు అది నశించదు. అలాగే సామాజిక వ్యవస్థ చట్రం లోపల తమ ఉనికికి అవసరమైన భౌతిక పరిస్థితులు పరిపక్వం కానంత వరకు పాత ఉత్పత్తి సంబంధాల స్థానంలో వాటికన్నా ఉన్నతమైన కొత్త ఉత్పత్తి సంబంధాలు ఏర్పడవు.

మానవ జాతి అనివార్యంగా తాను ఏ కర్తవ్యాలను పూర్తి చేయగలదో వాటినే తన ముందుంచుకుంటుంది. దానికి కారణం ఏమిటంటే - జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఏ సమస్య అయినా దాని పరిష్కారానికి అవసరమైన భౌతిక పరిస్థితులు ఏర్పడ్డాకనో, ఏర్పడే క్రమంలోనో తలెత్తుతుంది. స్థూలంగా చెప్పాలంటే ఆసియా తరహా, ప్రాచీన ఫ్యూడల్, ఆధునిక బూర్జువా ఉత్పత్తి విధానాలను సమాజ ఆర్థిక అభివృద్ధి ప్రగతి పథంలోని ముఖ్యమైన మైలురాళ్లుగా మనం భావించవచ్చు. బుర్జువా ఉత్పత్తి విధానం అన్నది వైరుధ్యభరితమైన సామాజిక ఉత్పత్తి క్రమాల్లో చిట్టచివరిది (ఇదేదో వ్యక్తులు మధ్య వైరుధ్యం కాదు. వ్యక్తుల అస్తిత్వాన్ని రూపొందించే సామాజిక పరిస్థితులలో నుంచి బయలుదేరిన వైరుధ్యం). బూర్జువా సమాజం లోపల అభివృద్ధి చెందే ఉత్పత్తి శక్తులే ఈ వైరుధ్యాన్ని పరిష్కరించడానికి అవసరమైన భౌతిక పరిస్థితులను కూడా సృష్టిస్తాయి. ఈ సామాజిక వ్యవస్థతో పాటుగానే మానవ సమాజం చరిత్ర పూర్వదశ అంతమవుతుంది.

*(మార్క్స్ తన 'క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకనామీ' పుస్తకానికి రాసిన ముందుమాటలోని కొంతభాగం)*

అ

**రచయితలకు విజ్ఞప్తి !**

అరుణతారకు రచనలు పంపండి. కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి. అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి. మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ -

- సం

కథనం

# ఓ గండాన్ని గడవడం...

- షిరీన్

బుందేల్‌ఖండ్ ప్రాంతంలో ఒక చిన్న వెనకబడిన గ్రామం. పట్నంలోని ప్రధాన మార్గం నుండి దాదాపు మూడు కిలోమీటర్ల దూరంలో. ఆ గ్రామంలో ఒక ఇల్లు. మేం ఇంటిలోకి ప్రవేశించేసరికి కేవలం ఇద్దరు కోడళ్లూ, ఇద్దరు కూతుళ్లూ, బోలెడుమంది పిల్లలు మాత్రమే ఉన్నారు. మా మార్గదర్శకుడి బంధువుల ఇల్లు అది. వసారాలోకి వెళ్తూనే పొడుగాటి ముసుగులు వేసుకుని ఇద్దరు కోడళ్లు వచ్చారు. వచ్చి నేనెంత అభ్యంతరపెడ్తున్నా వినకుండా నా కాళ్లను పైనుండి కింది వరకు వత్తుతూ వత్తుతూ నా పాదాలకు మొక్కారు. (ఇంటికొచ్చిన అతిథులకు అలా చేయడం ఆ ప్రాంతపు ఆచారం - అను).

'మేం మిమ్మల్ని గుర్తు పట్టలేదక్కా...' అన్నారు. నేను నా మార్గదర్శకుడి చిరునామా చెప్పాను. ఆ తర్వాత మొదలైంది వారితో సంభాషణా క్రమం. పెద్ద కోడలికి ముగ్గురు కూతుళ్లు. చిన్న కోడలికి ఇద్దరు కూతుళ్లూ, ఒక కొడుకూ. పెద్ద కోడలి వయసు దాదాపు 24 ఏండ్లుడచ్చు. చిన్న కోడలికి 19-20 ఏండ్లుంటాయి. ఇద్దరి భర్తలూ కూలిపనులు చేయడం కోసం వేరే ప్రాంతాలకు వెళ్లారు. ఒకరు ముంబాయ్‌కి వెళ్లగా, ఇంకొకాయన కూడా పనులు వెతుక్కుంటూ పట్టణాల దోవ పట్టాడు.

ముగ్గురూ కూతుళ్లే ఉన్న పెద్ద కోడలు - 'అక్కా, మాకు దేవుడు ఆడపిల్లల్నేల ఇస్తూ పోతున్నాడు' అంది.

ముగ్గురూ కూతుళ్లే ఉంటే మరి నువ్విప్పుడు కొడుకు కోసం ఎదురుచూస్తున్నావా అని అడిగాను.

'అక్కా, నాకైతే ఆపరేషన్ చేయించుకోవాలని ఉంది. కానీ ఇంట్లోవాళ్లూ, ఊర్లోవాళ్లూ నన్ను చేయించుకోనివ్వడం లేదు.'

'నాలుగో బిడ్డ కూడా ఆడపిల్ల అవుతే? ఐదోసారి కొడుకు కోసం ఎదురు చూస్తావా?'

'చూద్దాం ఏమౌతుందో?'

ఇద్దరు కోడళ్ల ఒళ్లోనూ 7, 8 నెలల పసిపాపలు ఉన్నారు. ఒకటి, రెండేళ్ల తేడాలో ఇద్దరికీ ముగ్గురేసి పిల్లలున్నారు. కొంచెం సేపట్లోనే వాళ్లిద్దరితో ఒక ఆత్మీయత ఏర్పడిపోయింది. నేను వాళ్లిద్దరితో మాట్లాడుతూ ఉండగానే దొడ్లోకెళ్లిన వాళ్ల అత్త తిరిగి వచ్చింది. పరిచయం చేసుకున్నాక ఆమె చాలా కలివిడిగా ఉండింది. తర్వాత సంభాషణంతా ఆమె చేతుల్లోకి వెళ్లిపోయింది. మాటలు మొదలుపెడ్తూనే ఆమె దేవుడి మీద ఫిర్యాదు చేసింది.

'దేవుడెందుకో అందరు ఆడపిల్లల్నీ మా ఇంటికే పంపుతున్నాడు.'

కోడళ్లు రొట్టెలు చేయడంలో నిమగ్నమయ్యారు.

అత్త 'పద, అక్కడి వసారాలోకి వెళ్దాం' అంది. నేను ఆమెతో పాటు రెండో వైపున ఉన్న వసారాలోకి వెళ్లాను. అక్కడ మంచం వాల్చి ఉంది. అత్త తన పుట్టింటి వైభోగం గురించి చెప్పసాగింది. మధ్య మధ్యలో ఆమె తన కోడళ్లకి కూతుళ్లే పుట్టడం గురించి చెప్పి దుఃఖపడ్తోంది. ఇంట్లో ఉన్న ఒకే ఒక్క మగపిల్లాడ్ని (రెండో కోడలి కొడుకు) ఆమె తన కళ్ల ముందే ఉంచుకుంటోంది. పిల్లాడికి కూడా గారాబం ఎక్కువైంది - మామ్మ నెత్తినెక్కి కూచుంటున్నాడు.

'మామ్మా, నాకు నల్లకోడల్ని వెతక్కు. నల్లకోడల్ని చూస్తే నాకు వాంతికొస్తుంది' అన్నాడు.

మూడేళ్ల ఆ పిల్లాడిలో పెంపొందుతున్న 'పురుషుడ్ని' చూసి నేను మ్రాన్పడిపోయాను. మామ్మ నవ్వి వాడిని కౌగలించుకుంది. ఆడపిల్లలు దగ్గరకొస్తే మాత్రం వాళ్లని ఛీత్కరించుకుంటోంది. కానీ మళ్లీ నేను ఉన్నానని వాళ్లని దగ్గరకు పిలుస్తోంది. నేను ఆ ఇంటి పరిస్థితిని అర్థం చేసుకోవాడనికి ప్రయత్నిస్తున్నాను. ఇంట్లోని అందరు తల్లులకూ ఆడపిల్లల పట్ల ఒక నిరాశ, దుఃఖం ఉన్నాయని నాకర్థమైంది. రెండు రోజుల క్రితం బిబిసిలో విన్న వార్త గుర్తుకొచ్చింది. పంజాబ్‌లో ఒక గ్రామంలో చేసిన సర్వేలో ఉన్నత వర్గానికి చెందిన ఇండ్లలో ప్రతి పదిమంది అబ్బాయిలకు కేవలం ముగ్గురే ఆడపిల్లలు ఉన్నారని, దేశవ్యాప్తంగా తీసిన లెక్కలు కూడా నిరంతరం తగ్గిపోతున్న ఆడపిల్లల సంఖ్య పట్ల కలవరాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఇక్కడ చూస్తేనేమో ఆడపిల్లలు ఎక్కువున్నారని దుఃఖం, క్షోభ కన్పిస్తున్నాయి.

మాటల సందర్భంగా అత్త నాతో ఇలా అంది - 'ఈ రోజుల్లో కోడళ్లకి ఏ మాత్రం ఓర్పు ఉండట్లేదు. ప్రపంచం ఇంత ముందుకు పోయింది. కానీ వీళ్లేమో ప్రతి ఏడూ పిల్లల్ని కంటున్నారు. చూడు చిన్న కోడలు మళ్లీ కడుపుతో ఉంది.'

'ఏంటీ' నిర్ఘాంతపోయాను నేను.

ఇరవై ఏండ్ల అమ్మాయికి ఏడాది ఏడాది తేడాలో ముగ్గురు పిల్లలు - చిన్న పిల్లకి 8 నెలలే - ఆమె మళ్లీ తల్లి కాబోతోంది!

గర్భపాతం కావాలని కొడుకుతో 'ఐదు' వందల రూపాయల మందు తెప్పించుకుని మింగింది కోడలు అని చెప్పింది. (ఆమె వక్కాణింపు అంతా పైసల మీదే ఎక్కువగా ఉండింది). అయినా గర్భపాతం కాలేదు. ఇప్పుడు నాలుగు నెలల కడుపుతో ఉంది. గత రెండు నెలలుగా రక్తస్రావం అవుతోంది. పొట్టలో ఏముందో తెలీదు.

'డాక్టర్‌కి చూపలేదా?' అడిగాను.

'ఎంతకని చేయను నేను మాత్రం? వాళ్ల పుట్టింటికి ఫోన్ చేసేశాను, వచ్చి తీసుకెళ్లండి - అక్కడ వైద్యం గీద్యం చేయించండి అని. మాకేం అంత ఆస్తులు లేవు ప్రతి ఏడూ ఆడపిల్లల్ని కంటూ ఉంటే పోషిస్తూ పోవడానికి. ఇక పుట్టింటి వాళ్లు ఏం చేయదలుచుకుంటే అది చేయనీ' అందావిడ.

అప్పుడిక ఏకైక కులదీపం నాకు నిద్రొస్తుంది మామ్మా అనడం మొదలెట్టాడు. వాడిని తన పక్కన పడుకోబెట్టుకుని నిద్రపుచ్చింది. పక్కనే చిన్న చిన్న ఆడపిల్లల ఏడుపు కూడా వినిపిస్తోంది. తల్లులేమో వంటపనిలో మునిగిపోయి ఉన్నారు.

చిన్న కోడలు మళ్లీ తల్లి అవుతుంది అని అత్త చెప్పింది విని నాకు దిమ్మ దిరిగిపోయింది. నాకిప్పుడు ఇక సంభాషణ మీద మనసు లేదు. చిన్న కోడలి ఈ స్థితికి ఆమె అత్త ఆమెనే దోషిగా నిలబెడ్తోంది. కోడళ్లు చేసిన ఆకు కూరా, రొట్టెలూ తిని నేను మంచం మీద వాలాను. కానీ నిద్ర నాకు కోసుల దూరంలో ఉంది. నేను ఆలోచిస్తూ పోతున్నాను. 20-24 ఏండ్ల వయసులో ముగ్గురేసి పిల్లల్ని కన్న ఆ అమ్మాయిల గురించి. ఇప్పుడేమో ఈ ఇరవై ఏళ్ల అమ్మాయి నాలుగో

బిడ్డ కనబోతోంది. ఇందులో ఆమె దోషం ఏముందసలు? నేను నాకున్న 'జ్ఞానం'తో వాళ్ల భూస్వామ్య సమాజ బాధితులు అని మాత్రం నిర్ధారించగలిగాను. మెల్లగా నేను నిద్రదేవి ఒడిలో ఒరిగిపోయాను.

ఉదయాన్నే నిద్ర లేచాక అత్త తన పనుల్లో మునిగి ఉన్నప్పుడు నేను మళ్లీ ఒకసారి రొట్టెలు చేస్తున్న కోడళ్ల దగ్గరకు వెళ్లిపోయాను. బోలెడు కబుర్లు చెప్తూ చిన్న కోడలు స్వయంగా తన పరిస్థితి గురించి చెప్పుకొచ్చింది.

'అక్కా, నాకు ఒంట్లో ఏదో సరిగా లేదని అనిపిస్తోంది - రెండు నెలలుగా ఆగకుండా రక్తస్రావం అవుతోంది.'

'డాక్టరుకెందుకు చూపించలేదు?'

'పట్నం వెళ్లి నర్సుకు చూపించాం. కానీ ఆమె శుభ్రం చేయడానికి సిద్ధపడలేదు. రెండు నెలల్నుండి ఆగకుండా రక్తం కారుతున్నా ఎవరూ నేను చెప్పేది పట్టించుకోవడమే లేదు, ఆయనేమో వదిలేసి వెళ్లిపోయాడు.'

అప్పుడిక పెద్దకోడలు మండిపడింది. 'అక్కా, ఈ ఇంట్లో అందరూ కసాయిలే - అహ కసాయిలకంటే కూడా ఘోరమైనవాళ్లు.'

ఇక ఆ ఇద్దరు కోడళ్ల మానసిక క్షోభంతా బైటికి తన్నుకొచ్చింది. చిన్నామె, 'ఎలాగైనా ఈ గండం గట్టెక్కితే చాలనుంది అక్కా, నాకసలు ఈ బిడ్డని కనాలని లేదు, అసలు మిగతా పిల్లలు కూడా చచ్చిపోయినా బాగుండనిపిస్తోంది' అంది.

ఇరవై ఏళ్ల ఆ అమ్మాయి 'మాతృత్వం'తో విసిగిపోయి ఉంది. ఆ తర్వాత ఆమె తననీ స్థితిలో వదిలేసి ముంబయ్‌కి వెళ్లిన భర్తని తిట్టసాగింది.

హఠాత్తుగా ఆమె నన్నడిగింది, 'అక్కా, ఈ పిండం అయితే పడిపోతుంది కదా?'

నాకు ఇటువంటి విషయాల గురించి ఏ మాత్రం తెలీదు. నా పుస్తక జ్ఞానం ఈ విషయంలో ఏ మాత్రం సహాయం చేయగలిగే స్థితిలో లేదు. నేను ప్రభుత్వం చేసే ప్రచారాల్లోలాగ ఆమెకు సలహాలివ్వ సాగాను.

'చూడు, నీకు ఇప్పటికే ఇద్దరు కూతుళ్లూ, ఒక కొడుకూ ఉన్నారు. మళ్లీ ఈ బిడ్డను కనే ప్రమాదాన్ని ఎందుకు కొని తెచ్చుకున్నావు?'

దీనికి పెద్ద కోడలు జవాబిచ్చింది.

'అక్కా, ఇక్కడ మా మాట ఎవరూ వినరు. మేం బజార్లోకి కూడా వెళ్లం. ఇదంతా మా భర్తలు ఆలోచించాలి. వాళ్ల దగ్గర మా మాట అస్సలు చెల్లదు. ఈ పిల్లలందర్నీ బలవంతంగా కన్నామనే అనుకో. పైపెచ్చు ఊర్లో అందరూ ఒక్క పిల్లాడు ఉండకూడదు, జతగా ఇద్దరుండాలి అంటారు.'

ఇద్దరు కోడళ్లూ ఆక్రోశాన్ని వ్యక్తం చేస్తున్నారు.

'అక్కా, అందరికంటే పెద్ద తప్పు చేస్తున్నది మా భర్తలే. వాళ్లే పట్టించుకోనప్పుడు ఇంట్లో ఇంకెవరు పట్టించుకుంటారు.'

చిన్నకోడలు 'ఇప్పుడిక నా స్థితి ఇలా అయ్యిందని నన్ను పుట్టింటికి పంపించేస్తున్నారు. నేనైతే అక్కడికెళ్లాక కూడా డాక్టర్లకు చూపించుకోను. వాళ్లెందుకు పైసలు ఖర్చుపెట్టాలి. నేను చనిపోయినా సరే గానీ డాక్టర్‌కి మాత్రం చూపించుకోను.'

నా దగ్గర వాళ్ల స్థితికి గానీ, కోపానికి గానీ, ప్రశ్నలకు గానీ ఎటువంటి జవాబు లేదు. నా పుస్తక జ్ఞానం అంతా విఫలమైపోయింది.

మధ్యాహ్నం పని నుండి బైటపడి కోడళ్లు మళ్లీ నా దగ్గరకు వచ్చారు. మళ్లీ అవే చర్చలు. కొంచెంసేపట్లో నేను బైల్దేరే ప్రయత్నాల్లో పడ్డాను. ఇద్దరు కోడళ్లూ నన్ను బతిమాలసాగారు - 'అక్కా, ఇవాళ వెళ్లకు, ఉండిపో. నిన్ను కలిశాక మాక కొంచెం ప్రశాంతంగా ఉంది' అంటూ. చిన్నకోడలు మరింతగా బతిమాలుతోంది గానీ నాకు వెళ్లక తప్పదు. 'సరే అక్కా, అయితే చాయ్ తాగిపోదువు' అంటూ చిన్నకోడలు చాయ్ చేయడానికి వెళ్లింది.

బైల్దేరడానికి తయారై నేను మంచం మీద కూచుని చాయ్ తాగుతున్నా. అప్పుడే అత్త నా దగ్గరకు వచ్చి 'అక్కా ఓసారి ఇటురా' అంది.

నేను లోపలకెళ్లాను.

'చూడు, కోడలికేమౌతోందో.'

కోడలు గట్టు మీద గొంతుకు కూచుని ఉంది.

'అక్కకి చూపించు.'

ఆమె తన లంగా పైకెత్తింది. ఆమె పొట్ట కింద భాగంలో శరీరం నుండి ఒక మాంసపు ముద్ద వేలాడుతోంది. నేను అది చూసి భయపడిపోయాను. ఎలాగో ధైర్యం తెచ్చుకుని ముందు తనని అక్కడి నుండి లేపు ఊళ్లోని ముసలమ్మల్నీ, దీని గురించి తెలిసిన ఆడవాళ్లనూ పిలిపించండి అన్నా అత్తతో. అత్త వాళ్లని పిలుచుకురావడానికి వెళ్లింది. నేను చిన్నకోడలిని లేపి గదిలోకి తీసుకువచ్చాను. ఆమెను మంచం మీద పడుకోబెట్టాను.

అప్పటివరకి గ్రామంలోని మహిళలు గుమిగూడసాగారు. ఒక్కొక్కరుగా అందరూ ఆమె లంగా ఎత్తిచూడసాగారు. చూస్తూనే వాళ్ల మాటలు మొదలయ్యాయి. అందరూ ఒకేసారి మాట్లాడసాగారు.

అత్త అంటోంది, 'అంతా ఆమె ఖర్మ. ముందసలు అది కడుపులోకి ఎలా వచ్చింది? సరే వచ్చిందనుకో మందులు ఎందుకు మింగాలి? ఇప్పుడేమో ఇలా...'

మహిళలు అసభ్యంగా మాట్లాడసాగారు. ఒకామె ఒకటంటే ఇంకొకామె ఇంకోటి... కొందరైతే హాస్యాలు కూడా ఆడుతున్నారు. అక్కడేమో కోడలు నెప్పితో, భయంతో, మానసిక క్షోభతో సతమతమవుతోంది. నా చెవులు గళ్లు పడుతున్నాయి.

ధైర్యం చేసి ఇక అన్నాను 'మీరేమైనా చేయగలిగితే చెప్పండి. లేదంటే ఈమెను ఆసుపత్రికి తీసుకెళ్లండి.'

'డాక్టరంటే దాదాపు 40 కిలోమీటర్ల దూరంలో నగరంలో దొరుకుతాడు. పట్నంలో ఒక నర్సు ఉంది' అంది ఒకామె.

ఒక ముసలామె 'లేదు, ఆమెను ఎక్కడికీ తీసుకెళ్లక్కరలేదు. ఉత్త పుణ్యానికి నాలుగైదు వందలు ఖర్చు అవుతాయి. ఆమెను మంచం మీంచి లేపి ఇటుల మీద కూచోబెట్టండి' అంది.

ఇటుకలు వచ్చాయి. కోడలిని లేపి ఇటుకల మీద గొంతుకు కూచునేలా చేశారు. ఒకళ్లిద్దరు మహిళలు ముందుకు జరిగి ఆమె శరీరం నుండి వేలాడుతున్న పిండాన్ని బైటికి లాగడానికి ప్రయత్నించసాగారు. ఒకామె ఆమె పొట్ట మీద చేత్తో రాస్తోంది. మిగతా మహిళలు ఏవేవో వ్యాఖ్యలు చేస్తున్నారు. కొందరి ముఖంలో ఆందోళన కూడా కనిపిస్తోంది.

నేను మధ్య మధ్యలో అంటూనే ఉన్నా - 'చూడండి, బలవంతంగా దాన్ని లాగద్దు, డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లండి' అని.

అప్పటివరకు ఉగ్గబట్టుకుని ధైర్యంగా ఉన్న చిన్న కోడలు ఇక అరిచింది 'లేదు, నేను డాక్టర్ దగ్గరకు వెళ్లను. నన్ను ఇలాగే చనిపోనివ్వండి'.

దాదాపు రెండు గంటల ప్రయాస తర్వాత ఆమె శరీరం నుండి సగంలో చిక్కుకున్న ఆ మాంసపు ముద్ద కింద పడింది. ఇప్పుడిక మహిళలే ఆ పిండాన్ని సచిత్రంగా వర్ణించసాగారు.

'అరే, చూడండి, చిన్న చిన్న చేతులూ, కాళ్లూ ఉన్నాయి. గోర్లు కూడా కనిపిస్తున్నాయి. కళ్లు కూడా ఏర్పడిపోయాయి.'

నేను స్థాణువైపోయాను. ఒకామె కర్ర తీసుకుని ఆ పిండాన్ని అటూ ఇటూ కదిపింది.

'అరే ఇది ఆడపిల్ల.'

వెంటనే ఇంకొకామె 'ఆడపిల్ల కాబట్టే తల్లి కడుపుకు అతుక్కుపోయింది - కిందపడ్డమే లేదు.'

నేను మాటా పలుకూ లేకుండా ఉండిపోయాను... ఇదేనా మాతృత్వం? దీన్నేనా అందరూ కీర్తించేది?

ఇప్పుడిక బొడ్డుతాడుకి సంబంధించిన సమస్య ముందు కొచ్చింది. నేను గోష పెడ్తూనే ఉన్నా ఆమెను నర్సు దగ్గరికి తీసుకెళ్లండి లేదా నర్సునైనా తీసుకురండి. ఇలాగే ఉంటే ఆమె పరిస్థితి ఘోరంగా తయారవుతుంది అంటూ. చివరికి అత్త మంత్రసానికి కబురు చేసింది. ఒక గంట తర్వాత మంత్రసాని వచ్చింది. అప్పటివరకూ మహిళల ప్రేలాపనలు కొనసాగుతూనే ఉన్నాయి. నేను జీవితంలో ఇంత నిస్సహాయతను అనుభవించింది ఎన్నడూ లేదు. మంత్రసానిని చూస్తూనే కోడలు గట్టిగట్టిగా ఏడవసాగింది. మహిళలు ఆమెకు ధైర్యం చెప్తున్నారు. మంత్రసాని ఆమెను మళ్లీ మంచం మీద పడుకోబెట్టింది. ఆమె తన మురికి వేళ్లను అలాగే కడుక్కోకుండానే ఆమె శరీరంలోకి జొనిపింది. దాంతో బొడ్డుతాడు తెగింది. చివరికి మంత్రసాని ఓటమినంగీకరిస్తూ,

'మాయ లోపలకెళ్లిపోయింది. ఈమెను వెంటనే నర్సు దగ్గరకి తీసుకెళ్లండి' అంది.

కోడలి ఏడుపు ఇంకా ఎక్కువైంది. ఆమె డాక్టర్ దగ్గరకు వెళ్లడానికి సిద్దంగా లేకుండింది. ఆమె గట్టిగట్టిగా ఏడుస్తోంది. చివరికి ఆమె నా చేయి పట్టుకుని,

'అక్కా, నువ్వూ మాతోపాటు రావాలి' అంది.

ఎలాగో గ్రామం నుండి రెండు మోటారు సైకిళ్లు తయారు చేశారు. ఇంతలోకి కోడలికి రక్తస్రావం మరింతగా పెరిగింది. ఒక మోటారు సైకిల్ మీద కోడలిని పట్టుకుని నేను కూచున్నాను. రెండో దాని మీద అత్త, ఇంకొకామె కూర్చున్నారు. దారంతా కోడలు ఏడుస్తూనే ఉండింది.

'అక్కా, నన్ను మాత్రం వదిలేసి వెళ్లద్దు' అంటోంది నాతో. నేను ఆమెకు ధైర్యం చెప్తూ ఉన్నాను. లోపల్లోపల నాకు బరువుగా అయిపోతోంది. నా దగ్గర ఆమె కోసం మాటలు తప్ప ఇవ్వడానికింకేమీ లేవు. దాదాపు 16-17 కిలోమీటర్లు గతుకుల రోడ్డు మీద ప్రయాణం చేసి మేం పట్నంలో ఒక కాంక్రీటు ఇంటి ముందు ఆగాం. ఇక్కడే ఎక్కడో డాక్టర్ ఉండి ఉంటారని నేను వెతుకుతున్నా. లోపలికి వెళ్లేసరికి అక్కడ ఒక మురికి మంచం ఉంది. ఒక మూలకు గ్లూకోజ్ బాటిల్ పెట్టే స్టాండ్, ఒక బల్ల, చెల్లాచెదురుగా పడేసిన మందులూ, మురికీ ఉన్నాయి. లోపల గదిలో ఒక మంచం మీద 40-50 ఏండ్ల మహిళ పడుకుని ఉంది. ఆమె మొబైల్‌ని టకటకలాడిస్తోంది. పక్కనే ఒక మహిళా హెల్పర్ నుంచుని ఉంది. మేం అక్కడికెళ్లగానే ఆమె మాకేసి కళ్లెత్తి చూసింది. మొబైల్‌తో ఆడుతూనే అనాసక్తిగా అడిగింది 'ఏంటీ?' అని.

అత్త మళ్లీ కోడలి మీద దోషారోపణ చేస్తూ వివరంగా చెప్పడం మొదలు పెట్టింది. 'కోడలు మందు మింగింది...' అంటూ.

మొత్తానికి ఆమె లేచింది. ఆ మంచం మీదే ఆమెను పడుకోబెట్టింది. మళ్లీ మొదలైంది 'చెక్ అప్' కార్యక్రమం. చేతి తొడుగులు వేసుకోకుండానే ఆమె వేళ్లను కోడలి శరీరంలోకి జొనిపేసింది. కోడలికి రక్తస్రావం ఎంత ఎక్కువగా అవుతుందంటే మొత్తం మంచం అంతా, నర్సు బట్టలన్నీ రక్తంతో తడిసిపోయాయి. కొద్దిసేపు పరీక్ష చేశాక ఆమె చెప్పేసింది.

'ఈమెను నగరానికి తీసుకెళ్లండి' అని.

ఆమె ఫీజు చెల్లించి మేం బయటకు వచ్చాం. ఆమెను నగరానికి ఎలా తీసుకువెళ్లాలి అనే చర్చలతో మరో గంట గడిచిపోయింది. కోడలేమో స్పృహ కోల్పోయే స్థితికి వచ్చేసింది. చివరికి ఒక మోటార్ సైకిల్ మీద ఆమెను నగరానికి తీసుకువెళ్లాలనీ, రెండో దాని మీద గ్రామానికి తిరిగి వెళ్లి పైసలు సమకూర్చుకోవాలనీ నిర్ణయం జరిగింది. కోడలూ, మాతో వచ్చిన పూరామే మోటారు సైకిల్ మీద నగరానికి వెళ్లారు.

నేనూ, అత్తా తిరిగి గ్రామానికి వెళ్లాం. 'అక్కా నన్ను వదిలిపెట్టి వెళ్లిపోకు' అంటూనే ఉండింది. ఆమె చివరివరకు. గ్రామానికి తిరిగి వెళ్లేటప్పటికి రాత్రి అయింది. రెండు గంటల తర్వాత కోడల్ని ఆసుపత్రిలో చేర్పించారు అని కబురు వచ్చింది. రక్తం బాగా పోయిందట. అందుకని రక్తం ఎక్కించాల్సి వస్తుందట. కోడలు అక్కడ ఆసుపత్రిలో స్పృహ లేకుండా పడి ఉంది. ఇక్కడ అత్తేమో కోడలి తప్పుల్ని ఎంచుతూ తన పక్షాన 'అభిప్రాయాన్ని మలుస్తోంది'. కోడలితో పాటే నా శక్తంతా హరించుకుపోయినట్లయింది. ఏ రకంగా ప్రతిస్పందించాలో నాకసలు అర్థం కావట్లేదు.

పొద్దున్నే ఫోన్ వచ్చింది - కోడలు స్పృహలోకి వచ్చిందని. అత్త పైసలు సమకూర్చుకుని భర్తతో పాటు నగరానికి వెళ్లింది. నేను కూడా ఆలోచనల్లో మునిగి తేలుతూ బస్సులో కూచున్నా.

'ఈ ప్రపంచం రెండిటి మీద నడుస్తోంది - ఉత్పత్తి, పునరుత్పత్తి. రెండిటి మీదా స్త్రీలకు ఏ మాత్రం హక్కు లేదు. పునరుత్పత్తి మీద స్త్రీలకూ, ఉత్పత్తి మీద కార్మిక వర్గానికీ హక్కు లభించే వరకూ మనం ఎదురు చూడాల్సిందే. అప్పటి వరకూ ఎంతమంది మహిళల శరీరాల నుండి ఎన్ని లీటర్ల రక్తం ప్రవహిస్తుందో... కానీ ఆ 'త్యాగం' ఎందుకూ కొరగానిది.'

(బుందేల్‌ఖండ్ ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఒక అత్యంత వెనకబడిన ప్రాంతం. అక్కడి స్త్రీలు అనేక రకాలుగా చాలా అమానుషమైన భూస్వామ్య పితృస్వామ్య అణచివేతకూ, వివక్షకూ గురవుతున్నారు. మహిళా సంఘాల నిర్మాణం ద్వారా అక్కడి మహిళల్లో చైతన్యం పెంపొందించడానికి ఆ ప్రాంతంలో తిరుగుతున్న క్రమంలో తనకు ఎదురైన ఈ హృదయాన్ని మెలిపెట్టే అనుభవాన్ని ఉన్నదున్నట్టుగా షిరీన్ అనే మహిళా కార్యకర్త అక్షరబద్ధం చేశారు. షిరీన్ అక్కడి భాషా నుడికారాన్ని ఈ రచనలో ఉపయోగించారు.)

(హింది అనువాదం : ప్రభాత్) అ

# పంపకాలు

- పి. చిన్నయ్య

"అన్నా ఉన్నవ?" మొగిలిపాక శ్రీను అనుకుంట ఇంట్లకు నడిచిండో లేదో

"వాడొచ్చిట్ల నోట్ల ముద్దెటిండో లేదో అప్పుడే పుడతరు బెల్లంసుట్టు ఈగలు మూగినట్టు, గింత తిననిస్తర లేకుంటే సంపుతర్రా" ఎల్లమ్మ ఎగవడ్డది.

"ఆ, అన్ననేమి గుంజుక పోతలేదు లెయి..." ఎప్పటి లాగె గొణుక్కుంట వంగపల్లి రవి పక్కన కూర్చుని

"అంబేద్కర్ భవనం దగ్గర జమైతున్నరు, నీవు నల్లగొండ నుండి వచ్చినవో లేదోనని భయమేసిందన్న."

"అందరు వస్తుండ్రా" చివరి ముద్ద తిని నీళ్లు తాగేముందు అండు.

"ఆ వస్తుండ్రన్న... మీ 'ఊరోళ్లు' బందలోల్లు, వంగపల్లోల్లు, బొట్లోల్లు, కొల్లురోల్లు... మా 'వంతుకు లేనోళ్లు' బోగారపోల్లు, మొగిలిపాకోళ్లు, చందుపట్లోళ్లు, బావండ్లపల్లోల్లు, బొడ్డోలు, మామిడికాయ, సురుపంగ, నల్లోల్లు ఇంటికొకరు వస్తున్నట్టుంది..."

"మాల, మాదిగల గొడవె తేలకపాయే, పైగ మనకులంలనె 'ఊరోళ్లు', వంతుకు లేనోళ్లు, వర్గీకరణ మొదలు పెట్టినవా!" రవి.

"వట్టిగనె అన్న తీయన్న!" శ్రీను.

"వట్టిగన్న, గట్టిగన్న నీవన్నదాంట్ల తప్పేముంది? మన కులంల ఊరోళ్లకు వంతుకు లేనోళ్లంటె చిన్నచూపు నిజమెగ!"

ఇద్దరు మాట్లాడుకుంట ఇంట్ల నుండి బయటకొస్తుంటె ఎల్లమ్మ అంది

"పొద్దుగాల నీవు పోయినంక నర్సయ్య, పెంటయ్య వచ్చిండ్రు, మేతరి (పెద్దమాదిగ) యుండిగా మాలోల్లతో, వంతుకు లేనోళ్లతో తిరుగుడు ఏంది, సస్తే ఆలోచ్చి మునుగుతర, పాలోల్లు పాలోల్లు ఒకటిగానాలన్నరు, అయినా పాలోల్లతో గొడవల ఎందుకు బిడ్డా, ఇప్పటికె నీ మీద గొంతుదాకుండె..." ఎల్లమ్మ ఇంకా ఏదో అనబోతుండగానే శ్రీను అందుకుండు మధ్యల.

"అనమ్మ అను, మేము వంతుకు లేనోళ్లమె, మీ ఊరోళ్లు దొరలైతిరి, గందుకె బొట్లకు ముందె, బోనాలకు ముందె, గవర్నమెంట్ నుండి ఏదోచ్చిన మీరె ముందు, గిట్ల ఎంతకాలము మా కడుపులు కొడతారో కొట్టండి, మాకు రోజులొస్తయి..." ఇట్లాంటి వాదన ఎల్లమ్మతో పెట్టుకోవుడు అలవాటె శ్రీనుకు!

"పోర సచ్చినోడ, నీ కడుపు ఏడ గొట్టినరా, గిన్నెల అన్నముంది ఏస్కొని తినుపో" ఇలా తిట్టుడు మామూలె ఎల్లమ్మకు.

"అమ్మా నీకు తెల్వదు తీయి, గొడవలు ఏం గావు" రవి సర్దిచెప్పుకుంట బజార్ల కొచ్చినరు ఇద్దరు.

"అవునన్న నాకు అర్థం గాక అడుగుతున్న మనకులంలనె ఈ ఊరోళ్లు, వంతును లేనోళ్లను తేడాలెందు కొచ్చినయి?" శ్రీను.

అమ్మతో శ్రీను వాదనపడ్డ దగ్గర్నుండి దీని గురించె ఆలోచనల పడ్డడు. తన కర్థమయినంత వరకు చెప్పిండు.

"మన కులపోల్లు ఈ వూర్ల మొదటినుండి బతుకుతున్నోళ్లను ఊరోళ్లని, ఆ పిదప ఈ వూర్లకు బతుకొచ్చినోళ్లను వంతుకు లేనోళ్లనో, బతుకొచ్చినోళ్లనో, చిల్లరసాలోల్లనో, పొరంబోకోలనో వివిధ ప్రాంతాల్లో వివిధ పేర్లు పుట్టిండొచ్చు. ముందుటి సందున్న వాళ్లకు తర్వాత బతుకొచ్చినోళ్లంటే చిన్నచూపే గద, అదే అసమానతగ మారుండొచ్చు. అన్ని సమాయాల్లో, అన్ని ప్రాంతాల్లో ఇట్లనె జరిగిందని గాదు..." ఆశ్చర్యంతో ఆలోచిస్తు అండు రవి.

అప్పుడప్పుడే చీకటి ముసురుకుంటుంది. దాంతో పాటె చలిగూడ, ఈ సారి నవంబరులనె చలి అందుకుంది.

అప్పటికె చాల మంది అంబేద్కర్ భవనం ఎన్కున్న అరుగుల మీద, ఖాళీస్థలంల కూర్చున్నరు. ఆ భవనం ముందు మూడు షటర్స్‌తో, వెనుక పెద్ద హాల్‌తో కట్టబడుంది.

ఆడ కూర్చున్న గుంపుల్ని చూస్తుంటె శ్రీను చెప్పినట్టు ఆశ్చర్యమనిపిస్తుంది రవికి. తను అనేక ప్రాంతాల్ని తిరిగినోడే. ఇంతకంటె అట్టడగు జీవితాల్ని చూసినోడే.

ఎవరోకూర్చో బెట్టినట్లు వంగపల్లోల్లు, బొట్లోల్లు, బందలోల్లు, కొల్లూరోళ్లు ఓ దగ్గర కూర్చుంటె, కొద్ది దూరంల బోగారపోల్లు, మొగిలిపాకోల్లు, బావండ్లపల్లోల్లు, మామిడికాయోల్లు, సురుపంగ, నళ్లోల్లు కూర్చున్నారు. వీళ్లందరికి దూరంగ మాలోల్లు ముగ్గురు నలుగురు కూర్చున్నారు. అటుగాకుంట ఇటుగాకుంట తన పరిస్థితి ఏమిటన్నట్లు ఒంటరిగ చిందు ముత్తులింగం కూర్చున్నడు. బుడిగజంగాలకు చెప్పి పంపిన రాలె.

రవి, శ్రీను పోయి ముత్తులింగం పక్కన కూర్చున్నరు. ముగ్గురు నలుగురు యువకులొచ్చి ఆడనె కూర్చున్నరు.

ఇదంత చూస్తున్న వంగపల్లి నర్సయ్యకు మంటలేస్తుంది. బలవంతంగ ఆపుకుంట పక్కనె ఉన్న బొట్ల పెంటయ్యకు ఎల్లగక్కిండు.

"చూసినవ రవిగాడు ఏడకూర్చుండో, అంతగానం పోయి ఎల్లమ్మకు చిలక్కుచెప్పినట్లు చెప్పొస్తిమి. వీడికి మన పాల్లోల్లంటె పట్టింపు లేదు. ఆ చిందోని పక్కన ఎట్ల కూర్చుండో చూడు?"

"ఎంతకాలం వాళ్లతో రాస్కొని పూస్కొని తిర్గుతడో సూద్దంగాని, ముందు మొదలుపెట్టు" పెంటయ్య రెచ్చగొట్టిండు. ఇద్దరికి మందు ఎక్కువైనట్టుంది ఈ రోజు.

"పెద్దోల్లంత వచ్చినట్టుంది, ఏందో చెప్పుండ్రి..." రవిని దృష్టిల పెట్టుకొని వెటకారంగ అండు నర్సయ్య.

దాంతో అప్పటిదాంక ఆడున్న గోలంతతగ్గి నిశ్శబ్దమైనది. బీడీలు, సుట్టలు, సిగరెట్లు ముట్టించెటోళ్లు ముట్టిస్తున్నరు. ఆర్పెటోళ్లు ఆర్పేస్తున్నరు. ఓపికతో మొదలు పెట్టిండు రవి.

"చెప్పేది ఏంది, సంవత్సరము సంది నడుస్తుందె గదా, ఈ అంబేద్కర్ భవనం గట్టిగూడ సంవత్సరం దాటె, దీన్ని ఏదో ఒకటి చేయకుండ ఎంతకాలం గిట్ల పడాపెడతం, వాడుకుంటె నాలుగు డబ్బులొస్తయి, ఉపయోగముంటది..."

"ఎట్ల వాడుకుందమో, అదిగూడ చెప్పరాదు..." పెంటయ్య.

"ఎట్లంటె అందరం సమానంగ వాడుకుందం" రవి.

"గదె ఎట్ల చెప్పు?" పెంటయ్య.

"ఇంతకు ముందు ఎన్నిసార్లనుకోలె, ఆడున్న మూడు షట్టర్లలో ఒకటి మాదిగోళ్లకుపోతే, ఇంకొకటి మాలలకు, మిగిలింది చిందోళ్లకు,

బుడిగజంగాలకయితది. ఎనకున్న హాల్ అందరం పెండ్లిల్లకో, పండుగలకో, గ్రంథాలయానికో వాడుకుందం..." శ్రీను.

"మాదిగ, మాలోల్ల పాలె తేలక పాయె, మూడోపాలుకు పట్టుకు వచ్చిండ్రా?" నర్సయ్య.

"వాళ్లు మనోళ్లు గాద?" రవి.

"అవునో కాదో, ఆ బిల్డింగు కోసం చెప్పులరిగెటట్టు తిరిగినం. ఎం.ఎల్.ఎ.ను బతిమిలాడుకున్నం, ఇంటికి వంద రూపాయలు ఏసుకున్నం..." నర్సయ్య.

"మీరు తిరిగెటపుడు మాకు చెప్పిండ్రా, ఇప్పుడిస్తం డబ్బులు తీసుకోండ్రి" గడ్డమీద ముత్తయ్య అందుకుండు మాలోల్ల తరపున.

"చేసేటపుడు ఎవడుండడుగాని, బంతిలకు మాత్రం సిద్దంగుంటరు" పెంటయ్య గొణిగిండు.

"చూడుండ్రి, మాదిగలె తిరగొచ్చు, కట్టించొచ్చుగాని దీన్ని మాదిగలు, మాలలెగాదు లేనోళ్లందరు వాడుకోవచ్చు..." రవి మాటల్లోని కొత్త ప్రమాదాన్ని పసిగట్టి అందుకుండు నర్సయ్య.

"మాలోల్లు ఖర్చులకిస్తే ఒక పాలిస్తం, మరిగా చిందోళ్లకు, బుడిగజంగాలకు పాలెంది, ఎట్లిస్తం?"

"ఎట్లిచ్చుడేంది, దాన్నేమైన నీ సొమ్ముత కట్టించినవా, అది గవర్నమెంట్ సొమ్ము, గవర్నమెంట్ సొమ్మంటె లేనోళ్లందరి సొమ్ము..." శ్రీను వాదన మొదలు పెట్టిండు.

❖ ❖ ❖

"కాదు పెదనాయన, చిందోళ్లకు, బుడిగెజంగాలకు పాలిస్తే తప్పేంది? మనకంటె ఆగంగ బతుకుతున్నరు వాళ్లు..."

"వాళ్లు మనుర్లుంటున్నరా? పక్క గూడెంల ఉంటుండె వాళ్లకెందుకియ్యాలి?" పెంటయ్య తిరకాసు పెట్టబోతె వెంటనే అందుకుండు శ్రీను.

"వాళ్లు పక్కగూడెమయితేంది, మన గ్రామ పంచాయితీ కిందోళ్లెగద, వోట్లు గూడ ఈడనె ఏస్తుంటిరి, మొన్న ఓట్లప్పుడు వాళ్ల గూడెంపోయి మనందరం ఒకటె, ఓట్లు మన జాతోనికి (మాదిగకు) ఏయాలంటు తిరిగితిరి, ఇప్పుడు ఇట్లేందిరి?" చురకబెట్టిండు.

"మాలోల్లకు ఒప్పుకోవుడే మహా ఎక్కువ, మీదికి వీళ్లను పట్టుకొచ్చిండ్రు మూడో పొత్తుకు. ఇట్లనె ఉంటె డక్కలోల్లను, పిచ్చకుంట్లోల్లను, దొమ్మరోల్లను పట్టుకొచ్చెటట్టుంది నాలుగో పొత్తుకు. ఏం చేసుకుంటరో చేసుకోండి మూడో పొత్తుకు ఒప్పుకునేది లేదు..." మొండితనానికి దిగిండు నర్సయ్య.

"మంచిదే నీవన్నట్లు ఒక పాలు మాదిగలకు, ఇంకోటి మాలోల్లకు, మూడో షట్టర్ ఎవరికుంటది?" శ్రీను.

"ఎవరికుంటదో తర్వాత సంగతి, అది, అట్లుంటది..." నర్సయ్య, పెంటయ్య మొండిగ అన్నరు.

"ఒట్టి గుంచుడు ఏంది, ఎవరికన్న ఇస్తే ఉపయోగముంటది గాని..." రవి.

"మీరు చెప్పినట్లు ఇనెటందుకు మీ కాలమనుకుంటుండ్రా, అదెప్పుడో పోయింది, ఏం చేసుకుంటరో చేసుకోండి" అనుకుంట లేచి పాలోల్లవైపు తిరిగి

"ఏహే లేండ్రి, ఈళ్లతో ఏంది..." బలవంతంగా పాలోల్లను లేపిండు నర్సయ్య.

నర్సయ్య, పెంటయ్యల తీరు పాలోల్లకు చాలామందికి మింగుడు పడటం లేదు. ఏమన్న అందామంటె కులం కట్టు. ఒక్కమాట మీదుండాలంటరు. పొద్దున లేస్తే డబ్బుకో, దస్కానికో నర్సయ్య దగ్గరకు పోక తప్పదు. ఈయనతో గొడవెందుకని లేచి నిలబడ్డరు.

మాదిగోలందరు ఆడి నుండి పోయినంక రవి దగ్గరకొచ్చి మాల ముత్తయ్య

"మీరు చేయబట్టి మాకు పాలిస్తమని అంటున్నరుగాని లేకుంటే కష్టమె బిడ్డా, మూడో పాలు 'ఊరోల్లె' ఉంచుకుందామనుకుంటుండె, చిందోలకు, బుడిగజంగాలకెట్లిస్తరు?

... అయినా ఈల్లు ఎప్పుడు సక్కంగున్నరు బిడ్డా, అప్పట్లో భూమి పంపకాలప్పుడు మాకు అన్యాయం చేస్తిరి. శ్రీను ఉండబట్కి అట్లనో ఇట్లనో కొట్లాడినం, లేకుంటే ఇంకా అన్యాయం చేద్దు.. ఇంట ముసల్దానికి బాగలేదు బిడ్డ, రేపు కలుద్దాం..." చెప్పి ముత్తయ్య మిగిలిన మాలోల్లు ఇంటికి పోయినరు.

అప్పుడే భువనగిరి నుండి రాత్రి చివరి బస్సొచ్చి అంబేద్కర్ భవనం ముందాగింది. ముగ్గురు నలుగురు ప్రయాణికులు దిగినరు.

... నర్సయ్య మాటలె బాధపెడుతున్నయి. అవి తననుద్దేశించో, ఉద్యమం గురించో కావచ్చు. ఎందుకిట్లవుతున్నరు? వాళ్లకేమైన ఉద్యమం అన్యాయం చేసిందా? అట్లాంటిది ఏమి లేదు తనకు తెల్సి. ఈడ జరిగిన సంఘటనలలో ఎంతో కొంత తన పాత్రుంది. ఊర్ల దళితులు, సూదరోల్లు ఈరోజు ఇంత ధైర్యంగ ఆత్మగౌరవంతో తిరుగుతున్నరంటె ఉద్యమమే గదా. ఈ ప్రయత్నంలో ఈ ప్రాంతంలో ఎంతమంది ప్రాణాలు కోల్పోలేదు. దీంట్ల ఇమిడె శక్తి, ఓపిక లేక అనారోగ్యమో, మరో పేరుతో ప్రాణాలతో తనలాంటోడు బయటపడితె పడొచ్చు.

కాని ఉద్యమం చేయబట్కెగద ఊర్ల జీతగాళ్ల జీతాలు పెరుగుడు, కూలోల్ల కూలీలు పెరుగుడు. అప్పట్లో ఊర్ల హోటల్ల కూర్చుని చాయ్ తాగేటందుకే భయపడే మాదిగలు, సూదరోల్లు ధైర్యంగ తాగటం మొదలుపెట్టిన. ఇప్పటికి గుర్తు తనకు, నారాయణ హోటల్లో బెంచి మీద కూర్చుని చాయ్ తాగుతుంటే రెడ్డోల్లు మిటమిట చూడటం! కాని ఏం చేస్తరు అప్పటికె ఉద్యమం సుట్టుముట్టు గ్రామాల్లో బగ్గుమంటుంది!

ఏ సమస్యొచ్చిన దళితులు, సూదరోల్లు కలిసి కట్టుగ ఉండెటోళ్లు. అటువంటిది ఏ కులానికాకులం విడిపోవుడు, ఒకరిద్దరు ఉద్యమంపై ద్వేషం పెంచుకోవుడు, ఎందుకిట్లవుతుంది? ఆ ఆలోచనలు, చైతన్యం ఎటుపోయింది...?

"ఏందన్న ఆలోచనల పడ్డవు, నర్సయ్య గురించెనా?" రవి ఆలోచనల్ని అర్థం చేసుకున్న వాడిలా అడిగిండు శ్రీను.

అవునన్నట్టు తలూపి, తిరిగి అడిగిండు రవి.

"ముత్తయ్య అట్లన్నడేంది, రెడ్డోళ్ల తూర్పు బక్కరేగడి భూముల్ని మాల మాదిగలకు ఇంటికి రెండెకరాల చొప్పున పంచితిరి గదా?"

"పంచింది నిజమేగాని, పంపకాల్లో అన్యాయం జరిగిందన్న. అప్పుడు నీవు లోపలున్నవుగా నీకు తెల్వదు. రెడ్డోళ్ల మిగులు భూముల్ని చూసుకోటానికి బాధ్యులుగ నర్సయ్య, పెంటయ్యలనె పెట్టింది ఉద్యమం. అప్పటిదాక ఉద్యమం చెప్పినట్టు ఇంటమన్న రెడ్డోల్లు నిర్బంధం మొదలయినంకె మాట మార్చినరు. రెడ్డోల్లు నర్సయ్య, పెంటయ్యలను పట్టుకొని బతిమిలాడుకున్నరు. డబ్బిస్తమని ఆశ

చూపినరు. తెలివిగ రెడ్డోళ్లు తమ భూమిని ఎస్.సి. కార్పొరేషన్‌కు అమ్మించి, తిరిగి కార్పొరేషన్ నుండి భూమిని మాల మాదిగలకు ఇప్పించి రెడ్లు, పెద్దమనుషులు లాభ పడ్డరు. పంపకాలు న్యాయంగ జరగలె..."

"ఎట్ల?"

"ఎట్లేందన్న మంచి భూముల్ని, బాట పొంటున్న భూముల్ని నర్సయ్య, పెంటయ్య తమకు, తమ మనుషులకు రెండెకరాల చొప్పున ఇప్పించుకున్నరు. చివరకు పనికిరాని భూమిని, రెండెకరాల కంటె తక్కువ భూమిని నోరులేని మాదిగలకు, మాలలకు ఇస్తిరి..."

"ఎవ్వరు అడగలేదా?"

"అడిగెటట్టుందా పరిస్థితి అప్పుడు, తీసుకుంటే తీసుకోండి లేకుంటే అది గూడ రావని బెదిరించినరు..."

"ఊరోళ్లకు ఉండాల్సిన పొత్తుల చెర్లబాయి ఎనిమిదెకరాల భూమిని పట్టా చేయించుకుండు నర్సయ్య అదే అదును చూసుకొని..." పక్కనున్న యువకుడు అండు.

"నర్సయ్య కొడుకు అప్పట్లో మనకు అనుకూలంగ ఉండెటోడుగద, ఇప్పుడెట్లుండు?" రెండో కొడుకు రాజును గుర్తు చేసుకుంటు అడిగిండు రవి.

"వాడి బొంద, అప్పుడెట్లుండెంటోడో గాని, ఇప్పుడు మాత్రం ఆగమయిండు."

"ఏవిదంగ!"

"యూనివర్సిటీల సదువుతుండగ, మాటలు నేర్చిండు. పైగా రిజర్వేషన్ పోరాట సమితికి నియోజకవర్గ బాధ్యుడంట. ఏమన్నంటె మాలోల్ల మీద ఎగురుతడు. మనమిట్లుండటానికి మాలోల్లే కారణమంటడు. ఏ ఆంధ్రల మాలోల్ల పెత్తనముండొచ్చుగాని మనకాడ ఏడుందంటే ఒప్పుకోడు. పోని మానూర్ల మాలోల్ల వల్ల మాదిగలకు జరిగిన ఒక్క అన్యాయం సూపమంటె సూపడు. మీ నాయిన చేయబట్టి మాలలకు అన్యాయం జరిగింది గదాంటె, మన కులం నుండి పెట్టుబడిదారులు పుట్టాలంట, కార్పొరేట్ కల్చర్ అభివృద్ధి చేసుకోవాలంట, అప్పుడే మనం బాగుపడుతమంట, అసలు వాడేందో, వాడి తత్వమేందో అర్థం కాదు..." శ్రీను ముగించిండో లేదో

"గుండుకేనేమో, రాజుగాడు ఉన్నోళ్ల పోరలతో సోపతిచేసుడు. వీడి సంగతి తర్వాతగాని ముందు వీడన్న పేరుమీదున్న ప్లాటును గుంజాలన్న, ఈయన ఈడుంటుండా హైద్రాబాద్‌ల సర్కార్ ఉద్యోగం చేస్తుండె, ఈడెట్ల ఇస్తరు, ముందు ఊర్ల లేనోళ్లకు ఇవ్వాలిగాని..." కోపంతో ఇంకో యువకుడు.

చలి ఎక్కువ కావటంతో అందరు అంబేద్కర్ భవనంలోకి నడిచినరు.

"అర్థంగాక అడుగుత... ఒక వర్గం ఇంకో వర్గాన్ని పీడిస్తే ఎట్ల కొట్లాడాలో మార్క్స్ చెప్పిండుగాని, ఒక కులపోడు తన కులపోన్ని మోసం చేస్తుంటే ఏం చేయాలో అంబేద్కర్ ఏడనన్న చెప్పిండాన్న..." చినిగిన చాపను నేల మీద పరుస్తూ అండు యువకుడు.

"ఊర్ల డబ్బున్నోళ్లు ఇంతకు ముందులాగ కాక, మన కులపోల్లను ఒకరిద్దరిని ముందు పెట్టుకొని ఇసుకదందాలు, భూములు అమ్మించి లక్షలు సంపాదిస్తుండె, సంపాదించెటోడు మన కులపోడేగదాని బదిలిపెట్టాలో, ఏం చేయాలో అర్థం కావటం లేదన్న..." న్యూస్ పేపర్లను నేలమీద పరుస్తూ ఇంకో యువకుడు.

"గీ అంబేద్కర్ భవనాన్ని అందరం సమానంగా వాడుకుందమంటనె గింత గొడవలవుతున్నయి, సమాజంల మొత్తం సంపదను తిరిగి పంపకాలు జరపాలంటె, పరిస్థితులు ఎట్లుంటయో ఊహించుకుంటనే బయమేస్తుందన్న..." శ్రీను రవి పక్కన సాపమీద ఒరుగుతు అండు.

అర్ధరాత్రి వరకు అట్లాంటి ముచ్చట్లు పెట్టుకుంటు అట్లనె నిద్రపోయినరు రవి తప్ప.

శ్రీను పెడుతున్న గురకకంటె ఆలోచనలె ఇబ్బంది పెడుతున్నయి. ఇప్పటిదాక మిత్రుల మాటల్లోని సారాంశాన్ని పట్టుకునె ప్రయత్నం చేస్తుండు. వాళ్లడిగిన ప్రశ్నలకు ఎప్పుడో ఓసారి జవాబు చెప్పాల్సుంటుంది.

పనికి పోవటం వల్ల పొద్దుగాల పేపర్ సదవలేదు. సాయంత్రం ఇంటికి రాంగనె పేపర్ కోసం అంబేద్కర్ భవనం దగ్గరకు పోయిండు. జిల్లా స్పెషల్‌ల ఏడచూసిన తెలంగాణ ఉద్యమ వార్తలే. ఆలేర్‌ల బుడిగజంగాల తెలంగాణ కోసం తీసిన ర్యాలీ దానికి సంబంధించిన వార్త, ఫొటో చూసుకుంట ఆలోచనల పడ్డడు. ఒకరిద్దరొచ్చి రవిని పలుకరించుకుంట అరుగుమీద కూర్చున్నరు. శ్రీను కోసం ఎదురు చూస్తుండగ, అప్పుడే పెంటయ్య ఇద్దరితో ఆడికి వచ్చిండు, వచ్చిరావటంతోనే

"బిడ్డా ఎట్లన్న చెయ్యి..." రవి చేతులు పట్టుకుండు.

రవికి అర్థంగాలె ఏం జరిగుండొచ్చు? ఆలోచిస్తుండగానే...

"ఏ ఏడ్వకు, జరిగింది నేను చెపుతుండు" పక్కతను చెప్పటం మొదలు పెట్టిండు.

"తమ్మీ, పెంటయ్య పెద్ద కూతురుండెగ, తక్కువ కట్నమని దాన్ని మేనోళ్లకిచ్చి పెండ్లి చేసిండు, ఆ పోరి పెండ్లయిన నెలకే దెంకొచ్చింది మొగుడు ఎడ్డోడని, అప్పట్నుండి ఈడనె ఉంటుంది...

చెల్కలు పక్కపక్కనాయె, రోజు పశువులు తోలకపోతుండె పోరి, గా కాపోడు ఏమిచ్చిండో, ఏ ఆశ సూపిండో ఈ పోరికి, లొంగదీసుకుండు. దానికిప్పుడు నాలుగో నెల కడుపు. పోని వానింటికి పంపుదమంటె పెండ్లాం పిల్లలుండె వాడికి. ఏం చేయాల్నో అర్థం గావట్లె..."

"జంగారెడ్డి గాడు ఏడున్నడు?" విషయం అర్థమయినంక అండు.

"వాడు హైద్రాబాద్ దెంకపోయిండు. వాడు బంధువులొచ్చి బతిమిలాడుతున్నరు" పెంటయ్య.

"ఏమని?"

"పోరికి యాభై వేలు బ్యాంకుల ఏస్తమంటున్నరు."

"నీ బిడ్డేమంటుంది?"

"వాడితోనె ఉంటానంటుంది."

"నీ వేమనుకుంటున్నవె."

"ఎడ్డోనికిచ్చి అట్ల ఆగం చేస్తి, కాపోడు అట్ల ఆగం చేసె, ఈ పోరి అంటుంది గాని, కాపోడు ఏలుకుంటడా బిడ్డా, వాగు పంటి రెండెకరాలన్న ఇప్పియంద్రి..."

"నర్సయ్యకు చెప్పినవ?"

"వానింట్ల ఏర్పడు పోయ, అయిందానికి కాందానికి వానెంటున్నందుకు మంచి బుద్ధి చెప్పిండు. ఆ కాపోళ్లు ఏమిస్తమన్నరో వాళ్ల వైపె మాట్లాడుతుండు."

"ఏమంటున్నడు."

"రెండు చేతులు కలిస్తే గాని చప్పట్లు మోగవు, మన పోరిది తప్పుండే, డబ్బులు తీసుకో అంటుండు..."

"చెప్పుతీసుకొని మూతిమీద ఏయక పోయినవ, పెద్ద మనిషైతే తర్వాత సంగతికాని" ఎప్పుడచ్చిండో గాని కోపంతో అండు శ్రీను.

"దాంతో ఆడ వాతావరణం వేడెక్కినట్టయింది. జనం చాలా మంది పోగయినరు అప్పటికె. దళితులెగాదు, సూదరోల్లు వచ్చినరు.

జంగారెడ్డి కుటుంబాన్ని, నర్సయ్యను ఈడికి గుంజుక రావాలంటున్నరు కొందరు. లేదు ఈ పోరిని తీసుకోపోయి జంగారెడ్డి గానింట్ల పెట్టాలంటున్నరు కొందరు. అందర్ని సముదాయించి రవి.

"పోలీస్ స్టేషన్‌ల కేసు పెడదమ వాడి మీద" పెంటయ్య అండు.

"కేసు పెడితే తేల్తదా తమ్మి, తిమ్మిని బమ్మిని చేస్తరు పోలీసులు, అపుడే కాపోల్లు పోయి వాడి కులపోడు ఎం.పి. గానితో పోలీసులకు ఫోన్ చేయించుకున్నరంట" పెంటయ్య.

"ఎట్ల చేద్దాం?"

"నీవె చెప్పు బిడ్డా?"

"నేను చెప్పితే నీకు నచ్చుతదో లేదో..."

"సచ్చిన పామును ఇంకా సంపుత వేంది తమ్మి..." పక్కతను.

"ఊర్ల కులంకొకరిని పిలుద్దం, ఊర్ల కాదని ఎట్ల ఒప్పుకోడో చూద్దాం"ఎవరెవరిని పిలువాలో చెప్పిండు రవి.

"నర్సయ్య కులంలనె పంచాయతీ పెట్టాలంటె ఎట్ల?" శ్రీను.

"వాడట్లచేస్తే నేను ఊకుంటన, కులం పెద్ద మనిషిననుకుంట ఏం చేసిండో, ఎట్ల సంపాదించిండో నాకు తెల్వదా, బజార్లకు గుంజుతా..." కోపంగ లేచిండు పెంటయ్య.

"ఇంకేడుండు నర్సయ్య, మబ్బుల్నె బస్సెక్కి హైద్రాబాద్‌ల కొడుకు దగ్గరకు పోయిండు" గుంపుల నుండి ఎవరో అన్నరు.

"ఎంతకాలం పోతడు, ఊర్లున్న ఇల్లుని, భూముల్ని వదిలిపెట్టి, మళ్లీ రావల్సిందేగా?" ఎవరో అనుకుంట పోతున్నడు.

"ఏందన్న తొందరగ రమ్మని చెప్పి పంపినవు" అందరు పోయినంక నెమ్మదిగ అండు శ్రీను.

"గదె మీటింగు గురించి ఏదో ఒకటి చేయాలి..."

"ఏమొన్న గా దొంగలతో పనిచేసుడు నా కిష్టం లేదు..." గొణిగుండు శ్రీను.

ఆ దొంగల ఎవరో తెలుసు రవికి అందుకే నెమ్మదిగ.

"ఇప్పుడు అవన్ని ఆలోచించొద్దు శ్రీను" సముదాయింపుగా అండు రవి.

"ఎట్ల మరుస్తుమన్న వాళ్లు చేసిన పనులను..."

"నిజమే గాని ఇపుడు ఈళ్లుగాదు మనకు తక్షణ శత్రువులు, వేరే ప్రాంతంల ఉన్నరు..."

"ఎట్లన్న?"

"మన అంబేద్కర్ భవనమే ఉంది, దాంట్ల పంపకాల్లో చిందోల్లకు, బుడిగజంగాలకు అన్యాయం జరిగిందనెగ మనం కొట్లాడేది, ముందు ఎవనికి దక్కాల్నో వాడికి దక్కాలనెగా...

గట్లనె మన ప్రాంతంల మనోళ్లకు న్యాయంగ దక్కాల్సిన నీల్లు, నిధులు, ఖనిజ సంపద, ఉద్యోగాలు వేరే ప్రాంతపోల్లు అన్యాయంగా దొబ్బుకు పోతున్నరు. ముందు వాళ్లనుండి బయటపడితే ఓ సమస్య తీరుతది. ఆ పిదప మన ప్రాంతంలున్న దొరలు, దొంగల గురించి ఆలోచిద్దం ఒకేసారి ఆ ప్రాంతపు దొంగలతో, ఈ ప్రాంతపు దొంగలతో కొట్లాడలేము కదా!"

"ఆ ప్రాంతపోల్లందరు మనకు శత్రువులెట్లవుతరూ, పేదోళ్లు లేరా ఆడ?" శ్రీను.

"పేదోళ్లు లేరని ఎవరంటున్నరు? మన కంటె పెదోళ్లుండొచ్చు ఆడ. వీళ్లు గాదు మన శత్రువులు, మన ప్రాంతంల మనకు దక్కాల్సింది దక్కకుండ చేస్తున్న కొన్ని కులాలున్నాయి ఆ ప్రాంతల. వాళ్ల చేతులనె అధికారం ఆస్తులు పోగుబడ్డయి..."

"ఆ ప్రాంతంల పేదోళ్ల సంగతి ఏంది?" శ్రీను.

"మన ప్రాంతంల మన శత్రువులెవరో గుర్తించి కొట్లాడుతున్న మనం, ఆ ప్రాంతంలోని పేదోళ్లు తమ శత్రువులెవరో గుర్తించి కొట్లాడాలి వాళ్లు..."

"కొద్ది కొద్దిగ అర్థమవుతుందన్న, మన రాష్ట్రమే వచ్చిందనుకో న్యాయం జరుగుతదా మనలాంటోళ్లకు?"

"జరక్కుంటె మళ్లా కొట్లాడుడె, పంపకాల్లో అన్యాయం చేసేటోళ్లు మన ప్రాంతపోడయితే ఏంది, మన కులపోడయితే ఏంది, ఎవని మీదనైన కొట్లాడల్సిందె, అంబేద్కర్ భవనాన్ని పంచినట్లు పంచాలిసిందె..."

"ఆడు కాకుంటే ఈడు, ఈడు గాకుంటె ఆడు, మన బతుకంత అని మీద ఈని మీద కొట్లాడుడే అయ్యేటట్టుంది!" రవి వెనుక నడుచుకుంట అండు శ్రీను.

అ

కథ

# శిక్ష

- మిడ్కో

బోసినవ్వులతో ఒక్కో అడుగూ వేసుకుంటూ వస్తున్నాడు సన్ను. వాడిప్పుడిప్పుడే నడక నేరుస్తున్నాడు. పగలంతా నిద్రపోయి లేచి అమ్మ దగ్గర కడుపు నిండా పాలు తాగినందుకేమో, ముఖం ఎప్పటికంటే మరింత ప్రశాంతంగా, సంతోషంగా వుంది. సాయంకాలపు నీరెండలో దిశమొలతో వున్న వాడి చామన ఛాయ దేహం మెరిసిపోతోంది. దేన్నో పట్టుకోబోతున్నట్టు, ఒక చేయిని ముందుకు చాచి ఒక్కో అడుగు వేసుకుంటూ వస్తున్నాడు. వాడికి ప్రతి అడుగూ ఒక పెద్ద విజయంలాగే వుంది. ఆ విజయ గర్వంతో కళ్లు మెరుస్తున్నాయి. వాడినలా చూస్తుంటే ఎవరిలోనైనా వాత్సల్యం పొంగకుండా వుండగలదా?

అందుకే తమ పాకలోని మంచంలో కూర్చొని వున్న బోక్లు తన కేసి వస్తున్న సన్నును చూసి చేతులు చాచాడు.

బోక్లు చేతులు చాచడం చూసి, సన్ను కేరింతలు కొడుతూ మరింత వడిగా అడుగులు వేయసాగాడు.

సన్ను తన దాకా వచ్చేదాకా బోక్లు నిలువలేకపోయాడు. చేతులలాగే చాచి వుంచి మంచంలోంచి లేచి పాక బయటకు వచ్చి రెండడుగులు వేశాడు. మరొక్క క్షణమైతే ఆ బుజ్జిగాడిని రెండు చేతులతో పైకెత్తి, రెండు బుగ్గల్ని ముద్దాడి, గుండెలకు హత్తుకునే వాడే! కానీ ఇంతలో సయ్యిమంటూ వచ్చింది సన్ను వాళ్లమ్మ గులారీ. సన్నును టకీమని లేపి చంకలో వేసుకొని, "నీ పాపిష్టి చేతులతో వాన్నెప్పుడూ ముట్టుకోకు" అని కోపంగా అంటూ పక్కనే వున్న తన ఇంటివైపు సర సరా అడుగులేసింది.

తన స్వేచ్ఛను హరించి జబర్దస్తీగా ఎత్తుకున్నందుకేమో సన్ను ఏడుపు లంకించుకున్నాడు.

హతశుడయ్యాడు బోక్లు. మొహం నల్ల బడిరది. అప్పుడే పాక పక్కనే వున్న తమ ఇంట్లో నుంచి గుమ్మంలోకి వచ్చిన బోక్లు భార్య కన్ని, పాకలోనే మరో మంచంలో కూర్చొని వున్న బోక్లు తల్లి అడిమే చూశారా దృశ్యాన్ని.

"ఈ గులారీ ఎప్పుడే ఇంతే. ఈయనను చూస్తేనే కళ్లల్లో నిప్పులు పోసుకుంటుంది" అంది కోపంగా కన్ని.

"ఛ! ఊరుకో ఆ పిల్ల విన్నదంటే మళ్లీ గొడవలయి పోతయి" అడిమే.

"గొడవలకు భయపడి ఎన్ని రోజులిలా నోర్మూసుకొని ఉండాలి? ఆమె ఏమన్నా పడాల్నా?" కోపమూ నిష్టూరమూ కలగలిసి పోయాయి కన్ని గొంతులో.

"నోరు మూసుకునే ఉండాలి. తప్పు చేసిన వాళ్లం పడాల్సిందే. ఏదో ఇలానన్న ఊళ్లో ఉండనిచ్చారు. దానికి మనం సంతోషపడాలింకా..."

కన్నిలో కోపం దిగిపోవడం మొదలయింది. "తప్పు ఒప్పుకున్నాడుగా. అంత పెద్ద పంచాయితీలో ఆయన్ని క్షమించాలనీ, అందరూ ఎప్పటిలాగా ఆయన్ని తమలో కలుపుకోవాలనీ తీర్పు చెప్పారుగా... దళం వాళ్లు కూడా ఆయనతో మంచిగానే వుంటున్నారుగా..."

"కలుపుకోవాలని చెప్పారులే ...చెప్పగానే అందరూ అన్నీ మరిచిపోయి కలుపుకుంటారా? పాపం ఆ పిల్ల ఎంత గోస పడింది."

బోక్లు తిరిగివచ్చి మంచంలో వాలిపోయి కళ్లు మూసుకున్నాడు. భార్యా తల్లి మాట్లాడుతున్న మాటలు అతని చెవుల్లో పడుతూనే వున్నాయి.

అతన్నలా చూస్తుంటే ఆడవాళ్లిద్దరి హృదయాలు బాధతో మూల్గాయి.

"బాధ పడకు నాయనా. కొన్ని రోజులు ఓర్చుకోవాలి ఇవన్నీ. రోజులు గడుస్తున్నకొద్దీ అందరూ మర్చిపోతారు..." అంటూ ఓదార్చసాగింది తల్లి.

యాంత్రికంగా అక్కడ్నుంచీ కదిలి ఇంటి పనుల్లో పడింది కన్ని. నెలక్రితం జరిగిన పంచాయితీలో గులారీ గట్టిగా మాట్లాడిన మాటలు ఇప్పటికీ ఆమెకు చెవుల్లో వినబడుతూనే వున్నాయి.

❖ ❖ ❖

"వీళ్లను బతకనియ్యడమా? వీళ్లే జుడుం గూండాలను వెంట బెట్టుకొని వచ్చింది. వీళ్లు లేకపోతే జుడుం వాళ్లు మన వూరికి అంత నష్టం చెయ్యగలిగేవాళ్లే కాదు.." కోపంతో ఊగిపోతున్నాడు పొజ్జాల్.

"నిజమే కానీ ఇప్పుడు తప్పు ఒప్పుకుంటున్నారుగా..." అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు అడమాల్. అడమాల్ అక్కడి జనతన సర్కార్ అధ్యక్షుడు.

అతని మాటలను పూర్తి చేయనీయకుండానే అందుకుంది గులారీ. "ఏందన్నా నువ్వు చెప్పేది? చేసిందంతా చేసి, ఇప్పుడు తప్పయింది అంటే సరిపోయిందా? వీళ్లను బతుకనిచ్చుడా? నరికి పోగులు పెట్టినా పాపం లేదు..." ఆవేశంతో కందిపోయిందామె మొహం.

"అవును వీళ్లను బతకనిచ్చేది లేదు చంపాల్సిందే..." కమ్లి.

"అవును చంపాల్సిందే!" అనేక మంది గొంతుల్నుంచి వచ్చిందా మాట. అందరిలోనూ ఆవేశం రగులుతోంది.

అది దండకారణ్యంలోని బైరంగఢ్ ప్రాంతంలోని పొట్టెం గ్రామం. దాదాపు నూటా యాభై ఇండ్లున్నాయా వూళ్లో. ఊరికి కుడివైపున వున్న మామిడి చెట్ల వద్ద ఆ గ్రామస్తులే కాక ఆ జనతన సర్కార్లో వున్న మరో నాలుగు గ్రామాల ప్రజలు ఓ అయిదారు వందల మంది గుమికూడారక్కడ. ఆగస్ట్ మొదటి వారం కనుక ఆకాశం మబ్బు పట్టి వుంది. మధ్యాహ్నం భోజనాలు కానిచ్చి పంచాయితీకి వచ్చారందరూ.

న్యాయశాఖ బాధ్యురాలు జైని పంచాయితీని నడిపిస్తోంది.

ప్రజలంతా అర్ధ చంద్రాకారంలో కూర్చుని వున్నారు. చిన్న చిన్న రాళ్ల మీదనో, కర్ర పేళ్లమీదనో కూర్చున్నారు కొందరు. మరి కొందరు తమ చెప్పులనే కింద వేసుకొని కూర్చున్నారు. కొందరు మాత్రం నిలబడే వున్నారు. వాళ్లకు ఎదురుగా బోక్లు, మంగాల్లు తలవంచుకొని కూర్చున్నారు. వాళ్లకి కుడివైపున అడమాల్‌తో పాటు మరికొందరు జనతన సర్కార్ సభ్యులూ, గెరిల్లా దళ సభ్యులూ వున్నారు. ఎడమ వైపు బోక్లు, మంగాల్ల కుటుంబ సభ్యులు కూర్చొని వున్నారు. జైని నిలబడే వుంది.

"నిజమే వీళ్లు ఘోరమైన తప్పులే చేశారు. కానీ వీళ్లంతట వీళ్లు ఆ తప్పులు చేయలేదు. ప్రభుత్వం ఒక పథకం ప్రకారం జుడుంను తెచ్చింది. జుడుం నాయకులూ, పోలీసు ఆఫీసర్లు వీళ్ల చేత ఆ తప్పులు చేయించారు..."

ఇంకా నివరించబోతున్న ఆడమాల్ మాటలకు అడ్డం పడుతూ "వాళ్లు చేయిస్తే వీళ్ల బుద్ధేమయింది? అసలు వీళ్లు జుడుంలో ఎందుకు చేరారు? అప్పుడు మన మాట కాదని వెళ్లారు. మళ్లీ ఇప్పుడు ఏ మొఖం పెట్టుకొని వచ్చారు?" ఆవేశంగా అన్నాడు సోమాల్.

"తెల్సో తెలియకో, భయానికో భక్తికో చాలా మంది జుడుంలో చేరారు. ఇప్పుడు తప్పు తెల్సుకొని వస్తున్నారు. తప్పు తెల్సుకున్న వారిని మనం క్షమించాలి కదా..." మరో జనతనా సర్కార్ సభ్యుడు జుగ్రు.

"తెలియక పోవడం ఏముంది? కమిటీ వాళ్లు మీరంతా మీటింగు చేసి చెప్పారు కదా..." గులారీ.

"మనం చెప్పినా గానీ అప్పటి పరిస్థితి ఎలా వుంది? శత్రువు పెద్ద ఎత్తున ప్రచారం కూడా చేశాడు కదా. ఆ ప్రచారాన్ని చాలా మంది నమ్మారు..." జుగ్రు.

"జుడుంలో కలిస్తే కల్సారు. కల్సి ఏమన్నా మామూలుగా వున్నారా? ఎస్పీవోల్లో చేరారు. ఎన్నిసార్లు మనూరి మీద దాడులు చేయించారు? ఎన్ని ఇళ్లను తగుల బెట్టారు. ఎన్ని పంటలను నాశనం చేశారు? ఎందర్ని చంపారు? ఎంత మంది ఆడవాళ్లను బలాత్కారం చేయించారు?" ఆవేశం ఆగడం లేదు సోంవారీకి.

"మనూళ్లో అయిదుగురు ప్రాణాలను నిలువునా తీశారు. అయిదుగురు ఆడవాళ్లను బలాత్కారం చేశారు..." ఇడిమే అందుకుంది.

ఇడిమే ఆ మాటలంటున్నప్పుడు గులారీ, కమ్లి, ఐతేల్లో ఒకేసారి కోపమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి. వాళ్లు ముగ్గురూ అత్యాచారానికి గురయ్యారు. మరో ఇద్దరు యువతులు ఆ పీడకల నుంచి పారిపోవడానికి ఊరు వదిలి లోతట్టుగ్రామాల్లోని తమ బంధువుల ఇండ్లల్లో వుంటున్నారు.

"సల్వాజుడుం దాడుల్లో మనూరికి చాలా నష్టమే జరిగింది. గానీ వీళ్లు స్వయంగ్గానైతే ఎవర్నీ చంపలేదనీ, బలాత్కారం చేయలేదని మనకు తెల్సు కదా..." ఆడమాల్.

"వాళ్లు స్వయంగా చంపకపోవచ్చు. కానీ వీళ్లు తీసుకువచ్చిన మూకనే కదా అవన్నీ చేసింది..." సోంవారీ.

నిలబడి వున్నజైని అటు ఇటు కదులుతూ ప్రజల వాదనలూ వాళ్ల హావభావాలూ పరిశీలించసాగింది. ఆమెక్కూడా నిజానికి దోషులను విడిచిపెట్టకూడదని బలంగా వుంది. అలా వాదిస్తున్న వారితో చేరి తన వాదనలు కూడా గుప్పించాలని వుంది. కానీ న్యాయశాఖకు బాధ్యురాలిగా వున్న తను తన వ్యక్తిగత వాదనలను వినిపించడానికి వేదిక అది కాదని తెల్సుకనుక తనను తాను బలవంతంగా నిగ్రహించుకుంటోంది.

కమిటీ సభ్యులు ఎంత చెప్పినా ప్రజలు సమ్మతించక పోవడంతో దళ కమాండర్ మంగ్తు లేచి నిలబడ్డాడు. అతను ఉపన్యాస ధోరణిలో మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

"కామ్రేడ్స్! ఒకసారి నేను చెప్పేది వినండి, విని ఆలోచించండి... సల్వాజుడుం మొదలైన కొత్తలో ప్రజల్లో భయాందోళనలు విపరీతంగా వుండేవి. ఆ భయాన్ని మరింత పెంచుతూ దాని గురించి విపరీతమైన ప్రచారం వుండేది. ఇక్కడ నక్సలైట్లను పూర్తిగా రూపుమాపుతామనీ, ఇవ్వాల కాకపోతే రేపైనా ప్రజలందరూ శిబిరాల్లో చేరాల్సిందేననీ... ఇలా ప్రచారం జరిగినప్పటికీ చాలా మంది ప్రజలు ధైర్యంగానే నిలబడ్డారు. ఈ గడ్డను వదిలి వెళ్తే తమకు బతుకు లేదనుకున్నారు. కాబట్టి చావో బతుకో ఇక్కడే వుండి పోవాలనుకున్నారు. కానీ కొందరు భయపడ్డారు. కొందరు అయోమయంలో పడ్డారు. ఇక్కడ వుంటే అనవసరంగా చచ్చిపోతాం కదా అనుకున్నారు. పార్టీ కూడా తుడిచిపెట్టుకుపోవడమో, లేదంటే ఇక్కడి నుండి రిట్రీట్ అయిపోవడమో జరుగుతుందనుకున్నారు. దానితో జుడుంలో చేరిపోయారు. జుడుంలో చేరిన తర్వాత ఇక వాళ్లకు స్వేచ్ఛేం వుంటుంది? వాళ్లు ఎస్పీవోల్లో చేరమంటే ఎస్పీవోల్లో చేరాల్సిందే, గూండాల్లో చేరమంటే గూండాల్లో చేరాల్సిందే. కొందరు ఇష్ట పూర్వకంగానే చేరవచ్చు. కానీ కొందరు బలవంతంగా అయిష్టంగానే చేరారు. కానీ వాళ్లు భయపడ్డట్టు పార్టీ ఇక్కడ తుడిచిపెట్టుకుపోలేదు. మన ప్రతిఘటన పెరిగింది. అంతేకాదు జుడుంలో చేరినవాళ్లు తిరిగి తమ గ్రామాలకు రావాలని మనం పిలుపునిచ్చాం. దానికి తోడు శిబిరాల్లో అత్యాచారాలను భరించలేకపోయారు. అక్కడి రోత బతుకుపై ఏవగింపు పుట్టింది. దానితో చాలామంది సరిగ్గా ఆలోచించడం మొదలుపెట్టారు. తిరిగి వచ్చి ఇక్కడే పి.ఎల్.జి.ఎ. రక్షణలో బతకాలనుకుంటున్నారు. ఇదొక మంచి పరిణామం. మొదట పొరపాటు చేసినా దాన్ని దిద్దుకోవడానికి సిద్ధపడుతున్నారు. మన పార్టీపై మన పోరాటంపై ప్రజల్లో పెరిగిన విశ్వాసానికి సూచిక ఇది. మరి ఇటువంటి ప్రజలను మనం కలుపుకోవాలా దూరం చేసుకోవాలా? మనం కలుపుకు రావల్సిన వాళ్లను దూరం చేసుకోవడం ఉద్యమానికి నష్టమా? కాదా? అయితే జుడుంలో చేరి మరీ విచ్చలవిడిగా హత్యలూ, అత్యాచారాలూ చేసిన వారిని క్రూరంగా ప్రవర్తించిన వారినీ క్షమించాలని మనం అనుకోవడం లేదు. బోక్లు, మంగాల్‌లు ఎస్పీవోల్లో చేరారు. నిజమే! మూడు నెలలు పనిచేశారు. జుడుం మూకను మన గ్రామాల్లోకి తీసుకువచ్చారు. ఆ సమయాల్లో జుడుం మూక ఇక్కడ హత్యలూ, అత్యాచారాలు చేశారు. కానీ స్వయంగా వీళ్లయితే చేయలేదు. శిబిరంలో కూడా ప్రజల్ని కొట్టారు గానీ మరీ క్రూరంగా ప్రవర్తించినట్టు, హత్యలూ, అత్యాచారాలు చేసినట్టు మనకు రిపోర్టు లేదు. మన పిలుపుకు స్పందించి వచ్చారు. పైగా వీళ్లు చేరారే గానీ వీళ్ల కుటుంబాలు ఇక్కడే మనతోనే వున్నాయి. సంఘంలో పనిచేసినపుడు కూడా వీళ్ల నడవడిక మంచిగా వుండింది. వీళ్ల మీద ఎవరికీ ఏ వ్యతిరేకత లేదు కదా. వాళ్లు చేసిన తప్పును ఒప్పుకుంటున్నారు. కనుక వాళ్లను క్షమించి వదిలేస్తే మంచిదని పార్టీ అభిప్రాయం, జనతన సర్కార్ అభిప్రాయం కూడా అదే. మన పిలుపుకు స్పందించి వచ్చిన వారిని మనం చంపితే ఇంకెవరైనా శిబిరాలను వదిలి రావడానికి సిద్ధపడుతారా అనేది కూడా ఆలోచించండి. మా అభిప్రాయాన్ని దృష్టిలో వుంచుకొని మరోసారి మీరు సరిగా ఆలోచించి మీ నిర్ణయం తెలియజేయండి" అంటూ అందరినీ పరిశీలనగా చూస్తూ నిలబడ్డాడు.

మంగ్తు మాటలు కొందరికి సబబుగానే అన్పించాయి. వారిలో ఆవేశం స్థానంలో ఆలోచన మొదలైంది. కానీ కొందరు మాత్రం ఆమోదించలేక పోతున్నారు. గులారీకి కూడా మంగ్తు మాటలు నచ్చలేదు.

"మీకేం మంగ్తు దాదా మీరలాగే చెప్తారు. వీళ్లు మిమ్మల్నేం చేయలేదు కదా. వాళ్లు కొట్టింది మమ్మల్ని, చంపింది మమ్మల్ని, కరాబ్ చేసింది మమ్మల్ని" నిష్టూరమూ కోపమూ దుఃఖమూ కలగలసి జీరపోయిందామె గొంతు.

సమాధానంగా మంగ్తుకు నోట మాట రాలేదు. గాయపడ్డట్టుగా ఆమె వైపు చూశాడు.

"మరీ అంత అన్యాయంగా మాట్లాడకు గులారీ. మన బాధ, పార్టీది కాదా? మన కోసం కాకపోతే పార్టీ ఎందుకున్నట్టు?" అడమాల్.

గులారీ ఆ మాటలందే కానీ అనేసిన మరు క్షణమే "అయ్యో అలా అనకుండా వుండాల్సింది. మంగ్తు దాద ఎంత బాధపడుతాడో" అనుకుంది.

అలా మాట్లాడినందుకు మనసులో పశ్చాత్తాప పడింది గానీ వాళ్లను చంపాలనే ఆమె నిర్ణయం కించిత్తు కూడా మారలేదు. రెండు నెలల క్రితం బోక్లు, మంగాల్‌లు తీసుకువచ్చిన జుడుం మూక తన చేతిలోని నెలల పసివాన్ని లాగిపారేసి తనను అత్యాచారం చెయ్యడాన్ని ఆమె ఎలా మరిచిపోగలదు? ఆ రోజు పక్కనే తన బిడ్డ కేరు కేరుమని గొంతు చిట్లేలా ఏడ్వడం, తన పెనుగులాట... అదంతా ఆమెకింకా పచ్చిపుండు లాగే వుంది.

"ఎస్పీవోల్లో చేరినా గానీ మామూలుగా ఉంటే విడిచిపెట్టినా ఏం కాదు గానీ, వీళ్లు క్రూరె ఉంగాల్ గాడితో రాసుకుపూసుకు తిరిగారుగా. వాడెంత పాపిష్టోడు. వాడితో అంత మంచిగా ఉన్నారంటే ఇక వీళ్లు ఎన్ని పాపిష్టి పనులు చేసి వుంటారో మనం ఆలోచించాలి..." గంగాల్.

క్రూరె ఉంగాల్ పేరు వినగానే పుండు మీద కారం చల్లినట్టయింది గులారీతో సహా చాలా మందికి. వాడు తనతో పశువులా ప్రవర్తించడం, మిగతా వారిని కూడా పశువుల్లా పురిగొల్పడం... మరో సారి జుగుప్స పాకింది గులారీకి.

క్రూరె ఉంగాల్ ఇక్కడ ఉద్యమం బలపడేంత వరకూ భూస్వామిగా వున్నాడు. పరమ క్రూరుడు. ఉద్యమం ఆతని కోరలు పీకేసింది. అప్పటి నుండీ అదను కోసం ఎదురు చూస్తూ అణగిమణగి వున్నాడు. ఇప్పుడు మళ్లీ జుడుంలో పడగ విప్పాడు. పోట్టెంకు నాలుగు కిలోమీటర్ల దూరంలో వుండే జాంగ్లా రాహత్ శిబిరంలో వుంటూ గ్రామాల మీద దాడుల్లో చురుగ్గా పాల్గొంటూ పరమ క్రూరుడైన సల్వాజుడుం నేతగా పేరు గాంచాడు.

"నువ్వేమయినా చెప్పు మంగ్తు దాదా. వాళ్లను ఉంచేదిలేదు" గులారీ గొంతు స్థిరంగా వుంది. మరికొందరు ఆమె మాటను వక్కాణించారు.

మంగ్తు మాటలు విని అందరూ వాళ్లను వదిలేద్దామంటారేమోనని భయపడుతున్న జైని, వాళ్ల మాటలు విని "హమ్మయ్య" అనుకుంది. సంతోషాన్ని ఆమె మొహం దాచలేక పోతోంది.

"కామ్రేడ్స్ మీ కసిని నేనర్థం చేసుకోగలను. మీరు పొందిన బాధ నుంచి మీకా కసి పుట్టడం సహజమే. కానీ ఈ విషయాన్ని మనం వ్యక్తిగతంగా తీసుకోవద్దు. పార్టీ వైఖరిని ముందుకు తీసుకు పోవాలని ఆలోచిస్తే మంచిది. జుడుం నాయకులను చంపాలనేది, జుడుం శిబిరాల్లో చేరిన సాధారణ జనం తిరిగి వస్తే క్షమించాలనేది, అలాగే ఎస్పీవోలు, గూండాలుగా పనిచేసినప్పటికీ క్రూరంగా ప్రవర్తించని వాళ్లు వాళ్లంతట వాళ్లే లొంగిపోతే వాళ్లను క్షమించాలనేది మన పార్టీ వైఖరి కదా. వీళ్లు కూడా గైడ్స్‌గా పని చేశారు. ఇండ్లను తగులబెట్టారు... ప్రజలను కొట్టారు... కానీ ఎవర్నీ చంపలేదు. అత్యాచారం చెయ్యలేదు. క్రూరె ఉంగాల్‌కు సన్నిహితంగా వున్నారు అది వాళ్లు కూడా ఒప్పుకున్నారు కదా. వీళ్లు సంఘంలో పనిచేశారు కాబట్టి చంపుతారేమోనని భయపడి వాడిని కొంచెం మంచి చేసుకున్నామని. ఇప్పుడు వీళ్లను చంపితే మనం మన పార్టీ వైఖరికి వ్యతిరేకంగా ప్రవర్తించినట్టు అవుతుంది..." మంగ్తు.

"ఏమో వీళ్లు నిజంగా మారే వచ్చారో లేదంటే ఆ క్రూరె ఉంగాల్ గాడు ఏమన్న ప్లాను ప్రకారం వీళ్లను పంపాడో..." కమ్లి.

"లొంగిపోతే ఏం చేయమని మనం ప్రకటించేప్పటికి ఇలా కూడా నాటకం ఆడుతున్నారేమో..." ఐతే

"అలా ఏమన్నా మోసం చేసే ఉద్దేశం వుంటే మనం పరిశీలించుకుందాం. ఇక్కడ కమిటీ వుంది... మిలీషియా వుంది... ప్రజలున్నారు... వీళ్ల ప్రతి చర్యను గమనిస్తూ ఉండాలి. వాళ్లను పూర్తి స్వేచ్ఛగా వదిలెయ్యం కదా. కొన్ని షరతులు పెడుతాం. ఏ వూరికి వెళ్లొద్దనీ... కొత్తవాళ్లెవరితో మాట్లాడొద్దనీ..."

"అవును అలా షరతులు పెడితే బాగానే వుంటుంది..." అని ఒకరంటే మరి కొందరు " అవునవును..." అన్నారు.

"సరే చంపలేదు... కానీ ప్రజల్నైతే కొట్టారుగా... ఇండ్లనైతే తగుల బెట్టారుగా... మరీ ఏ శిక్ష వుండొద్దా?" అని ఒకరనేప్పటికి " అవునవును ఉత్తిగనే ఎలా వదిలేస్తాం?" అన్నారు మరి కొందరు.

కొద్ది సేపట్లో అక్కడంతా గోలగోలగా తయారైంది. మాటలన్నీ కలగాపులగంగా కలిసి పోతున్నాయి. ఎవరేం అంటున్నారో అర్థం కావడంలేదు.

జైనికి తన బాధ్యత గుర్తొచ్చింది. " కామ్రేడ్స్ గోల గోల చెయ్యొద్దు ఒకరి తర్వాత ఒకరు మాట్లాడండి " అని రెండు మూడు సార్లు అరిచేప్పటికి గొడవ కాస్త సద్దుమణిగింది.

"చంపకున్నా గాని ఏమన్న శిక్ష అయితే వుండాల్సిందే ..." అని ఒకరంటే "అవును ఉండాల్సిందే" అన్నారు మరికొందరు కోరస్‌గా.

అరే మంగ్తు దాద మాటలు వీళ్ల మీద బాగానే పనిచేశాయి. ఇప్పటిదాక చంపాల్సిందే అన్న వాళ్లు ఇప్పుడు ఒక మెట్టుదిగి చంపకున్నా గనీ ... అంటున్నారు విచారంగా అనుకుంది జైని.

"ఏం శిక్ష వేద్దామో చెప్పండి" అంది నీర్సంగా.

"బాగా కొట్టి వదిలేద్దాం..."

"అవునవును కొట్టి వదిలేద్దాం..."

"కొట్టి వదిలెయ్యడమా... వీల్లేదు చంపాల్సిందే..." అన్న గులారీ మాటలకు మరి కొన్ని గొంతులు గట్టిగా మద్దతునిచ్చాయి.

జైనికి నీరసం ఎగిరిపోయింది. మళ్లీ వాతావరణం గోల గోలగా తయారయింది.

మళ్లీ జైని, రెండు మూడుసార్లు అరిచి పరిస్థితిని అదుపులోకి తెచ్చింది. ఇక పంచాయితీని ముందుకు తీసుకుపోదల్చిందామె. కొంచెం పక్కకు వెళ్లి మిగతా కమిటీ సభ్యులను దగ్గరికి పిల్చి గుస గుసలాడిరది. మళ్లీ అందరి ఎదుటకు వచ్చింది.

బోక్లు, మంగాల్‌లు పంచాయితీ మొదలైనప్పటి నుంచీ తల నేలకేసే కూర్చున్నారు. ఒక రకమైన నిర్లిప్తత ఆవరించింది వాళ్లను. వాళ్ల కుటుంబ సభ్యుల మొహాలు మాత్రం దీనంగా వున్నాయి.

చంపాలని వాదిస్తున్న వాళ్లకేసి "అయ్యో కొంచెం కనికరించండి" అన్నట్టు చూస్తున్నారు. బోక్లు, మంగాల్‌ల కేసి "అయ్యో వీళ్లేమయిపోతారో..." అన్నట్టు చూస్తున్నారు.

"సరే కామ్రేడ్స్. విషయమైతే అందరికీ స్పష్టంగనే అర్థమైంది. అందరూ అన్ని రకాల వాదనలు విన్నారు. ఇకిప్పుడు మెజారిటీ నిర్ణయం ప్రకారం చర్య తీసుకుందాం. కొందరు చంపాలంటున్నారు... మరి కొందరు కొట్టి వదిలెయ్యాలంటున్నారు. కాబట్టి చంపాలనే వాళ్లు చేతులెత్తండి..." అందామె అన్ని వైపులా చూపుల్ని తిప్పుతూ ప్రజల్ని పరిశీలనగా చూస్తూ.

బోక్లు, మంగాల్‌ల మొహాల్లో ఏ భావమూ వ్యక్తం కావడంలేదు. ఇప్పుడు పైకి లేచే చేతులు తమ చావు బతుకులను నిర్ణయిస్తాయని తెల్సినప్పటికీ నిర్లిప్తంగా వుండి పోయారు. నిండా మునిగాక... అన్నట్టుంది వాళ్ల పరిస్థితి. వాళ్ల కుటుంబ సభ్యుల ముఖాల్లో మాత్రం భయం స్పష్టంగా తొంగిచూసింది. ఊపిరి బిగబట్టారు వాళ్లు.

దిగ్గున పైకి లేచాయి అనేక చేతులు. జైని లెక్క పెట్టడం మొదలు పెట్టింది. అప్పటికీ బోక్లు, మంగాల్‌లు తలెత్తి చూడలేదు. వాళ్ల కుటుంబ సభ్యులు మాత్రం నెమ్మదిగా తలలెత్తి లేచిన ఆ చేతులవైపు ఆందోళనగా చూశారు. అవి చేతుల్లా కన్పించలేదు వాళ్లకి. బోక్లు, మంగాల్‌ల మెడల మీదికి ఉరకబోతున్న కత్తుల్లాగా కనబడ్డాయి.

జైని లెక్క పెట్టడం ముగించి "ఇప్పుడు కొట్టి వదిలెయ్యాలనే వాళ్లు ఎంత మందో చేతులెత్తండి" అంది. చంపాలన్న చేతులు సగం కంటే తక్కువే ఉన్నాయని అర్థమై అసహనంగా ఉందామెకు.

మిగిలిన అన్ని చేతులూ పైకి లేచాయి. ముందు ఎత్తిన చేతుల కంటే ఇవి ఎక్కువ కనబడ్డంతో దోషుల కుటుంబసభ్యులు ఊపిరి పీల్చుకున్నారు.

తప్పదు కాబట్టి జైనిఅయిష్టంగా లెక్క పెట్టింది.

"ఇప్పుడు కొట్టకుండా, చంపకుండా వదిలెయ్యాలి అనే వాళ్లు చేతులెత్తండి" అంది ఇంకెవ్వరూ మిగిలి లేనట్టున్నారు అనుకుంటూ.

ఒక్క చేయి కూడా లేవలేదు.

జైని యాంత్రికంగా తన కమిటీ సభ్యులదిక్కు అడుగులేసింది. మంగ్తు, అడమాల్, జాగ్రు తదితరులు కూడా వాళ్లతో చేరారు. అందరూ కాసేపు తర్జన భర్జన పడ్డారు. తర్వాత జైని చెప్పడంతో మిలీషియా సభ్యులు వెళ్లి ఓ రెండు వెదురు కర్రలను నరికి తెచ్చి ఇద్దర్నీ కొట్టడం మొదలు పెట్టారు.

జనాన్ని కొట్టనిస్తే చంపుతారని మంగ్తు హెచ్చరించడం వల్ల కొట్టే పనిని మిలీషియా వాళ్లకు అప్పజెప్పిందామె. ఆ మిలీషియా వాళ్లకు మంగ్తు ముందే జాగ్రత్తలు చెప్పాడు. మరీ ఎక్కువగా కొట్టవద్దని. మంగ్తుకసలు వాళ్లను కొట్టడం ఇష్టం లేదు. అలా కొడితే వాళ్లలో వ్యతిరేకత వస్తుందని అతని ఉద్దేశం. కానీ ప్రజా కోర్టు నిర్ణయానికి అతనూ తల వంచాడు. వాళ్లను చంప కూడదనే పార్టీ వైఖరిని మెజారిటీ ప్రజల చేత ఆమోదింప జేయడమే ఒక విజయంగా అతను భావించాడు.

మిలీషియా వాళ్లు కొట్టడం మొదలు పెట్టగానే ఆవేశం ఆగని జనంలోంచి కొందరు పరిగెత్తుకుంటూ వెళ్లి వాళ్ల చేతుల్లోని కర్రలు లాక్కొని కొట్టడం మొదలు పెట్టారు. మరి కొందరు మరిన్ని కర్రలను తీసుకు వచ్చి కొట్ట సాగారు. కొందరు పిడికిళ్లతో గుద్దసాగారు. మరి కొందరు కాళ్లతో తన్న సాగారు. అలా అక్కడ ఒక గుంపు తయారైంది. దోషుల కుటుంబ సభ్యుల్లో కొంత మందిలేచి ఆ గుంపు చుట్టూ తిరుగుతూ "ఇంక చాలు కొట్టకండి... చచ్చిపోతారు" అని వేడుకోసాగారు. మరి కొందరు కుటుంబ సభ్యులు మాత్రం కదలకుండా అలాగే కూర్చుండిపోయారు విచారంగా. ఆ మాత్రం శిక్ష వాళ్లకు ఇక ఎలాగూ తప్పదన్నట్టుగా.

మంగ్తు చెప్పిన జాగ్రత్తలేవీ జైనికి గుర్తు రావడంలేదు. అలాగే చూస్తూ నిలుచుంది. మంగ్తు పురమాయింపుతో అడమాల్ వచ్చి ఆ దెబ్బలను ఆపాడు.

❖ ❖ ❖

చిన్నబోయిన మనసుతోనే వంట పూర్తి చేసింది కన్ని. చీకటి పడుతూనే పొయ్యి వెలుతురులో అందరూ భోజనాలు చేశారు.

అన్యమనస్కంగానే తిన్నట్టు చేసి కడుక్కున్న చేతుల్ని భుజం మీది తువ్వాలకు తుడుచుకుంటూ ఇంటి ముందటి పాకలోకి వెళ్తున్న బోక్లుకు మంగాల్ వస్తూ కనిపించాడు.

"ఏరా పొద్దు పోయాక వచ్చావు? " అన్నాడు మంచంలో కూర్చుంటూ.

బోక్లు పక్కనే కూర్చుంటూ "ఊరికనే ఏం తోచక వచ్చానులే..." అని కాసేపు నిశ్శబ్దంగా వుండి "పొద్దుండగా వద్దామంటే... ఆ చివరి నుండి ఈ చివరి వరకూ రావాలి గదా... వస్తూంటే ఎంతో మంది ఎదురు పడుతారు... ఎవరూ పలకరించరు... చూసి మొఖం తిప్పుకుంటారు. లేకుంటే ఈసడిరపుగా చూస్తారు... కొందరైతే తిట్లు మొదలు పెడుతారు... అందుకే పగలు వీధిలోకి రావాలంటే భయమైతుందిరా... అటునుండి అటే చేన్లోకి వెళ్లి వస్తున్నా అంతే ..." నిట్టూర్చుతూ అన్నాడు మంగాల్.

"ఏం చేస్తాంరా ఊరంతా వెలివేసినట్టు చూస్తుంది మనల్ని అలాగైపోయింది మన బతుకు..." భారమైన మనసులోంచి వస్తున్న బోక్లు మాటలు మరింత భారంగా వున్నాయి.

మీరనవసరంగా బాధ పడకండి నాయనా. నాలుగు రోజులు ఎలాగో భరించండి అన్నీ సర్దుకుంటాయి..." ఓదార్పుగా అంటూ పక్కనే వున్న మంచంలో ఓ చింపిరి గుడ్డ పరుచుకొని ఒరిగింది అడిమే.

" ఏం నాలుగు రోజులు! పంచాయితీ జరిగిపోయి నెల రోజులైంది. అయినా పరిస్థితి ఏం మారలేదు..." బోక్లు.

ఈ బాధలేమీ పట్టనట్టుగా ముగ్గురు పిల్లలూ వచ్చి మంచంలో పడుకుండిపోయారు.

"ఆ ఉంగాల్ గాడి మాయమాటలు విని మనం జుడుంలో చేరితిమి. లేకుంటే మంచో చెడో కష్టమో నష్టమో ఊరందరితో పాటు మనం వుండే వాళ్లం కదా.." మంగాల్.

"ఇప్పుడనుకొని ఏం లాభమన్నా. వాడు మిమ్మల్ని కల్పాడని తెలియగానే నేను చెప్పలేదా? వాని మాటలు మీరు వినొద్దని. చావైనా బతుకైనా ఊరందరితో పాటు మనం ఉందామని. మీరు విన్నారా? ఊరంతా ఏట్లో కొట్టుకుపోనీ మీరు మాత్రం మంచిగా వుందామనుకున్నారు. ఇప్పుడేమయ్యిందీ..." ఉక్రోశంగా అంది కన్ని పిల్లల మీద దుప్పటి కప్పుతూ.

ఆమె మాటల్ని అంగీకరిస్తున్నట్టు ఇద్దరూ కాసేపు మౌనం వహించారు.

"బుద్ధి లేక వాని మాట విన్నాం. జుడుంలో కల్సి అటే వుండి పోవాలని మేం అనుకోలేదు. అట్లా అనుకుంటే మిమ్మల్ని కూడా

రమ్మనే వాళ్లం. కానీ ఒకసారి లొంగిపోయి శిబిరంలో పేరు రాయించుకుంటే ఇక ఆ తర్వాత ఇంటికి వచ్చినా జుడుం వాళ్లు ఏమీ అనరని మాకా ఉంగాల్ గాడు చెప్పాడు. కానీ తీరా వెళ్లి పేరు రాయించుకున్నాక లొంగిపోయారు కనుక ఇప్పుడు తిరిగి వెళ్తే నక్సలైట్లు చంపుతారని చెప్పి అక్కడే వుంచేశాడు... ఇక వాడు ఆడించినట్టల్లా ఆడాం..." మెల్లగా చెప్పుకుపోతున్నాడు మంగాల్.

ఇవేవీ కన్నికి కొత్త విషయాలు కావు. భర్త ఆమెకు ఎన్నోసార్లు చెప్పిన విషయాలే. కాసేపు మౌనంగా నిలబడి మంచంలో పడుకున్న చిన్నపిల్లను భుజానేసుకొని ఇంట్లోకి నడిచింది.

కాసేపటికే అందరూ నిద్రలోకి జారిపోయారు. బోక్లు, మంగాల్‌లు మాత్రం మాట్లాడుకుంటూనే వున్నారు.

"నాకు ఒక్కోసారి మంచో చెడో అక్కడే వుండిపోయినా బాగుండు అన్పిస్తోంది. ఈ వెలి బతుకు భరించలేనట్టుగా వుందిరా..." బోక్లు.

"ఛ ఏదో ఒకసారి దారి తప్పినం. అంత మాత్రాన తప్పుడు దారిలోనే వుండిపోతామా?"

"కానీ అందరూ మనల్ని ఎలా చూస్తున్నార్రా? పురుగుల కంటే హీనంగా చూస్తున్నారు..."

"అవుననుకో..."

అర్ధరాత్రి దాటిపోయినా ఇద్దరూ అలా మాట్లాడుకుంటూనే వున్నారు. తాము అనుభవిస్తున్న బాధను వెళ్లగక్కుకుంటూ వున్నారు.

❖ ❖ ❖

"అప్పుడే చంపి పారేస్తే పీడాబోయేది. మేం ఎంత మొత్తుకున్నా విన్నారా మీరు?" అడమాల్‌ని ఉద్దేశించి అంటోన్న గులారీ మొహంలో ఆవేశమూ, అసహనం, అసహాయత కలగలసి వున్నాయి.

మంచంలో కూర్చొని వున్న అడమాల్ బదులివ్వలేదు, తలా ఎత్తలేదు.

"వాళ్లు మారిపోయినం అని కల్లబొల్లి మాటలు చెప్పేస్తే వీళ్లు అమాయకంగా నమ్మారు..." కుమ్లి.

"ఏదో ఎత్తు వేసుకుని వచ్చుంటారు కానీ మనం వాళ్లను పూర్తిగా నమ్మలేదుగా, ఓ కన్ను వేసి ఉంచామాయే. అందుకనే ఇక లాభం లేదనుకొని చెక్కేశారు..." సోమాల్.

"ఇప్పుడు మళ్లెన్ని దుర్మార్గాలు చేస్తారో..."

"మనం వాళ్లను గట్టిగా వ్యతిరేకించినం. చంపాలని కూడా గట్టిగా మాట్లాడినం... అందుకని మన మీద పగ బట్టినా పడుతారు..." కుమ్లి.

"ఛ చేతికి దొరికిన వాళ్లను వదిలేస్తిమి. ఇంక మళ్లా దొరకమంటే దొరుకుతారా.." గులారీ.

"నాక్కూడా అప్పుడు వాళ్లను చంపేస్తే మంచిదని వుండే కానీ ఏం చేస్తాం అందరి మాటలు విని వదిలేస్తిమి..." అనకుండా వుండలేక పోయింది జైని.

అలా ఆ యింటి ముందు గుమి కూడిన దాదాపు వంద మంది తలో మాట అనసాగారు. ఇంతలో జుగ్రు వచ్చాడు. పక్క వూరికి పని మీద వెళ్లి వస్తున్న అతనికి దారిలోనే విషయం తెల్సింది. అందరూ బోక్లు ఇంటి వద్దే ఉన్నారని తెల్సి సరాసరి అక్కడికే వచ్చాడు. వస్తూనే మంచంలో అడమాల్ పక్కనే కూలబడుతూ మిట్ట మధ్యాహ్నపు ఎండకు పట్టిన చెమటను టవల్‌తో తుడుచుకుంటూ "ఎప్పుడు పారిపోయారు?" అనడిగాడు. అప్పటికే అతనికి దాదాపు విషయం తెల్సినప్పటికీ వివరంగా మళ్లీ తెల్సుకోవాలని.

"వాళ్లనే అడుగు" అన్నాడు ఇంటి ముందటి చెట్టు కింద బిక్కు బిక్కు మంటూ కూలబడి వున్న కన్ని, అడిమేల వైపు కళ్లతోనే చూపిస్తూ అడమాల్.

"పారిపోతారని మీకేం అనుమానం రాలేదా కన్నీ..." ఆమె మొహంలోకి పరిశీలనగా చూస్తూ జుగ్రు.

నెమ్మదిగా తలెత్తి జుగ్రు కేసి క్షణం పాటు చూసిందామె. మళ్లీ తలదించుకుంది. ఆమెసలు ఏమీ మాట్లాడలేని స్థితిలో వుంది. దగాపడిన ఆమె హృదయం బండబారినట్టయింది. ఆమెకెవరికీ మొఖం చూపించాలని కూడా లేదు. కానీ మాట్లాడక తప్పని స్థితి.

"రాత్రి అన్నం తిన్నాక మంగాల్ వచ్చాడు. ఇద్దరూ మాట్లాడుకుంటూ ఇక్కడ్నే ఈ మంచంలో కూర్చుండి పోయారు. అత్త ఆ మంచంలో పడుకుంది. ఇద్దరు పిల్లలు ఈ మంచంలో పడుకున్నారు. నేను, చిన్నపిల్ల లోపల పడుకుండిపోయాం. నడిజాము దాటిపోయాక మూత్రానికని లేచి వస్తే బయట మంచం ఖాళీగా వుంది. నాకేం అనుమానం రాలేదు..." అంటూ కన్నీళ్లు బొట బొటా రాల్చింది. అతని మీదుంచిన విశ్వాసం దెబ్బ తిన్న వేదన ఆమె మొహాన్ని కమ్మేసింది. కొంగుతో కళ్లూ, మొహమూ తుడుచుకుంటూ జీరపోయిన గొంతును స్వాధీనంలోకి తెచ్చుకుంటూ "దొడ్డికేమన్నా వెళ్లాడేమో అనుకున్నా... మళ్లా వెళ్లి పడుకుండిపోయాను. తెల్లారి లేచి చూస్తే కూడా కనబడలేదు. అత్తను అడిగిన తను తెలియదంది. ఎక్కడికి వెళ్లాడబ్బా అనుకున్నం ఇద్దరం. వస్తడేమో చూద్దాం అనుకున్నాం. జావ తాగే వేళకు కూడా రాకపోయేసరికి అడమాల్ అన్న దగ్గరికి అత్తను పొమ్మని చెప్పిన..." ఇంక చెప్పే శక్తి లేనట్టు ఆగిపోయిందామె.

"రాత్రి అప్పుడప్పుడు మెలుకువ వచ్చినప్పుడు మాటలు వినబడుతూనే వున్నాయి. మళ్లెప్పుడో మెలుకువ వచ్చేప్పటికి మాటలు వినబడలేదు. వీడు లోపలికి పోయి పడుకున్నడేమో అనుకున్న... ఇంత పని చేస్తాడని అనుకోలేదు..." దుఃఖం ముంచుకొచ్చి అడిమే మాటలు ఆగిపోయాయి.

తమ ఇంటి ముందు అంత మంది ఎందుకు గుమికూడారో, తల్లీ, నాయనమ్మ ఎందుకలా వున్నారో, కొంచెం కొంచెం అర్థమయినట్టే వుంది ఆరేడేళ్ల కన్ని కొడుకులిద్దరికీ. తల్లి పక్కనే బిత్తర చూపులు చూస్తూ కూర్చున్నారిద్దరూ. ఏడాదిన్నర్థమున్న చిన్న పిల్లకు అంతా గోలగోలగా వున్న ఆ వాతావరణం నచ్చకనేమో మాటి మాటికీ ఏడవసాగింది. ఆ పాప ఏడ్చినప్పుడల్లా నాయనమ్మ ఒడిలోకి తీసుకొని జోకొట్టసాగింది. కొన్ని నెలల క్రితం వరకూ అందరూ ఎంతో ముద్దు చేసే ఆ పాపాయిని ఇప్పుడెవరూ ముట్టుకోవడం లేదు.

"మీకేం అర్థం కాలేదా? ఈ రెండు మూడు రోజుల నుండీ ఏమన్నా తేడా కనబడిందా తనలో?" జుగ్రు.

"లేదన్నా మాకేమీ అర్థం కాలేదు. మంచిగానే వున్నాడు..."

"మంగాల్ వచ్చినప్పుడు ఏం మాట్లాడుకున్నారు? మీరు విన్నారా?"

"ఊళ్లో ఎవరూ మనల్ని నమ్మడంలేదని బాధపడుతూ మాట్లాడుకోవడం మాత్రం విన్నామన్నా... తర్వాత ఏం మాట్లాడుకున్నారో తెలియదు... ఈయనకైతే నిన్నటిదాకా ఇటువంటి ఆలోచన ఉన్నట్టే లేదు..." చెప్పి మళ్లీ తలదించుకుంది కన్ని.

నవల సీరియల్

# గుమ్మెటమోత

(6)

- పాణి

(గత సంచిక తరువాయి...)

ఊరు నుంచి వచ్చాడేగాని మననంతా అక్కడే తచ్చాడుతోంది.

ఎన్నడూ కలగని విషాద దిగ్భ్రమలు ఉలిగవ్వను వెన్నాడుతున్నాయి. ఊరు ఎప్పుడూ అంతే. నిలువునా కుదిపేస్తుంది. బిజనవేముల తన ఊరన్న మాటేగాని అక్కడ మాత్రమే తానుండలేడు. ప్రతిసారీ జేజిని జేజినాయన్ను వెతుక్కుంటూ చుట్టుపక్కల పల్లెలన్నీ తిరగాలి. ఎప్పుడు ఏ ఊళ్లో ఉంటారో!

అట్లా తిరగడం ఒక దినచర్యగా, అలవాటుగానేకాక అదే ఒక ఉనికిగా ఉంటుంది వాళ్లకు. తండ్రితో, జేజినాయినతో మాట్లాడాలనుకున్నవేవీ మాట్లాడలేడు. మాటలకు పొంతన కుదరదు. మాధ్యమం ఉండదు. తాను చెప్తాడో, వాళ్లు చెప్పింది వింటాడోగాని శూన్యావరణానికి అటుఇటూ నిలిచినట్టనిపిస్తుంది. ఎప్పుడూ ఉండే వ్యథే ఇది. కానీ ఈసారి మరీ ఎక్కువ. చిన్నాయిన బిచ్చావతి గురించి వినడమేగాని చూచింది లేదు. ఈసారి తారసపడ్డాడు. అదొక దిగ్భ్రాంతికరమైన అనుభవం. భయసందేహాలెంత గానో ముప్పిరిగొన్నాయి.

ఆయనేం మనిషి? ఇది ఆశ్చర్యమా? విషాదమా? అంత దుర్బల మానవుడు తనను రెండు చేతులా ఎత్తికుదేసి వెళ్ళిపోయాడు. జేజినాయన్నపై ఆయన అంత భీకరంగా తలపడి కొట్టబోయాడంటే - చిన్నాయిన కోసం ఎవరి మీద? దేనిమీద? కల్లుతాగిన ఉన్మత్త స్థితిలో కమరబడటం కాదది. తాగి ఉండవచ్చేమోగానీ, అంతకంటే ఎక్కువగా ఆయన్ను ఉసిగొల్పి, ఆగ్రహింపచేసిన శక్తి యేదో దాగి ఉన్నది. ఎంత కాలంగానో పేరుకపోయిన కసితో ఒక్కసారిగా ముదుసలి తండ్రి మీదికి లంఘించాడు.

ఇప్పుడాయన తనకు ప్రశ్నా? జవాబా ?

ఉలిగవ్వ చలచ్చంచల మనఃస్థితిలో కొట్టుమిట్టాడుతున్నాడు. జేజినాయినతో అప్పటిదాకా మాటలతో, మౌనంతో, చర్యలతో సాగిన వాదనంతా బిచ్చావతి రంగప్రవేశంతో చెల్లాచెదరైపోయింది. తాను జేజినాయన్ను అర్థం చేసుకోవడానికి వెతుక్కుంటున్న మార్గం నుంచి చిన్నాయిన తనకు తెలిసీ, తెలియని పలు మార్గాల్లోకి విసిరేశాడు. వాటిలో తాను ప్రయాణించగలనా? నడచీ నడచీ ఏమైనా కనుక్కోగలనా? ప్రయాస మాత్రమే మిగులుతుందా? జేజినాయిన కూడా తానింతవరకు ఎరిగిన మనిషి కాదు. లో మనిషి కనిపించాడు. జేజి, జేజినాయన్ల భుజాల మీది నుండి గుమ్మెట తాంబురలు దించడం తనవల్లగాని పని అని తేలిపోయింది. ఎండిపోయి, ఎక్కడికక్కడ నెర్రెలు వారిన బీడునేలలా కనిపించిన చిన్నాయిన ముఖంలో నుండి అవహేళనగా, తీస్కారంగా, నిశ్చయ ప్రకటనలా ఆ మాట వచ్చింది.

తాను కులానికి ఏవి ఒరువని, భారమని, ముందుకాళ్ళ బంధాలనీ అనుకుంటున్నాడో అవే వాళ్ళ ఉనికికి హేతువని అర్థమైపోయింది.

తానిక అర్థం చేసుకోక తప్పదని చిన్నాయిన బిచ్చావతి తన పద్ధతిలో తాను చెప్పి వెళ్ళాడు.

ఇట్లా తేలాక, తేలికవడదామని ఉలిగవ్వ ఎంత ప్రయత్నించాడో ! కానీ అది వీలుకావడం లేదు.

చిన్నాయిన కూడా పాత మనిషే కదా. ఆయన ఆగ్రహం జేజినాయిన నమ్మకం వలె ప్రాచీనమైంది. ఇవి రెండూ కలిసే నడుస్తున్నాయేమో. కాకపోతే జేజినాయినకు కులంలో, పల్లెల్లో, పల్లెల్లోని

---

ఆ మంగాలే ఏమేమో చెప్పి వుంటాడు... కొడుకు పైన చిరు నమ్మకం రెప రెప లాడుతోంది అడిమేలో.

"ఏదో నమ్మిద్దామని వచ్చాం గానీ ఎవరూ నమ్మేట్టు లేరనే విషయం పూర్తిగా అర్థమయి వుంటుంది. ఇక ఇక్కడ వున్నా లాభం లేదు అనుకొని వుంటారు..." సోంవారి.

"మీకేం విషయం తెల్సినా దాచకండి నిజం చెప్పండి..." సోమాల్.

మరి కొందరు కూడా "అవును చెప్పండి... మీకసలు తెలియకుండా ఎలా వుంటుంది? " అన్నారు.

"ఇంత కంటే మాకే విషయం తెలియదన్నా మమ్మల్ని నమ్మండి..." భోరుమంది కన్ని. అంత వరకూ నొక్కి పడుతూ వున్న దుఃఖం కట్టలు తెంచుకుంది. అడిమే కూడా గట్టిగా ఏడవడం మొదలు పెట్టింది. తల్లీ, నాయనమ్మ అంతలా ఏడవడం చూసి పిల్లలూ తల్లి మీద పడిపోయి బెదిరిపోయినట్టు ఏడవసాగారు.

"ఛ! ఊరుకో అక్కా నిన్ను మేం నమ్ముతున్నాం. ఊరుకో..." చటుక్కున తన చంకలో వున్న పిల్లాడిని నేల మీద దింపేసి కన్ని ఎదురుగా కూలబడి ఆమెను దగ్గరకి తీసుకుని సముదాయిస్తూ అంది గులారీ. కన్నినలా దైన్యంగా చూస్తుంటే గులారికెలాగో వుంది. "వాడిని పెళ్లి చేసుకున్న ఖర్మానికి ఇలా అందరి ముందు తలదించుకోవాల్సి వచ్చింది" అనుకుంది. ముందు కన్ని, గులారీలిద్దరూ మంచి నేస్తాలే. బోక్లు జాడుంలో చేరినప్పటి నుంచి గులారీ కన్నితో ముభావంగా వుంటోంది. పంచాయితీ తర్వాత ఇద్దరి మధ్య మాటలే లేకుండా పోయాయి. గులారీ ఓదార్చడం చూసి మరికొందరు కూడా ఓదార్పుగా మాట్లాడసాగారు. మరి కొందరు పిల్లల్ని దగ్గరికి తీసుకొని ఊరడించసాగారు.

ఇంకొందరు మాత్రం అపనమ్మకంగా చూడ సాగారు. "నిజంగా వీళ్లకేం తెలియదా? తెలియకుండానే వుంటుందా?" అనుకోసాగారు.

కన్ని బాధతో తన బాధను పోల్చుకుంది గులారీ. తను అత్యాచారానికి గురైయింది. కానీ తన భర్త తనను అక్కున చేర్చుకున్నాడు. ఊరి ప్రజలు తనకు అండగా నిలిచారు. తనెవ్వరి ముందూ తలవంచుకోలేదు. కానీ కన్ని పరిస్థితి... కష్టసుఖాల్లో తోడుగా వుండాల్సిన భర్త ఆమెను నట్టేట్లో ముంచి వెళ్లాడు. అతను చేసిన నేరానికి ఆమె తలవంచుకుంది. అన్నింటికంటే ఇబ్బందికరమైంది... కొందరిలోనైనా ఆమె పట్ల అపనమ్మకం వుంటుంది. ఆనాడు ఆ చేదు సంఘటనను ఎదుర్కొన్నప్పుడు తానెంత దురదృష్టవంతురాలు అనుకుంది. కానీ కన్నితో పోల్చితే తానెంత అదృష్టవంతురాలు... ఇక్కడ కన్ని ఏడుస్తున్నట్టే అక్కడ మంగాల్ భార్య కూడా ఏడుస్తుందేమో...అనుకుంది గులారీ.

❖ ❖ ❖ అ

పెద్దమనుషుల్లో పలుకుబడి ఉన్నది. ఆయన పలుకు, పాట, కత సమ్మతి పొందినవి. చిన్నాయిన తిరుగుబోతు, దారితప్పినవాడు. భ్రష్టుడు. ఆ మాట ఊర్లోవాళ్లు ఎంతనుకుంటారో జేజినాయినా అంతే అనుకుంటాడు. కులమంతా అనుకున్నట్టే కన్నతండ్రీ అనుకుంటాడు.

తానింతకంటే భిన్నంగా ఏమనుకోవాలి ?

ఈ ప్రశ్న ఎందుకు వేసుకున్నాడోగాని ఉలిగప్పకది శాపమైంది. అదే సంక్షోభమైంది.

తాను వెతుక్కుంటున్న మార్గానికి జేజినాయిన అడ్డంబడి, 'యాడికి పోతావురా? తిక్కనాయాల. కులాచారం కాదనిపోతే కూటికి నీల్లకు కొదువ ఉండదేమోగాని నిలబన్నీక తావు దొరుకుతదా? కాల్ల కింది నేలపోయినాక యాడుంటావు ? ఏంజేస్తావు?' అని రెక్క పట్టుకొని వెనక్కిలాగినట్లనిపించేది.

దుసబీక్కొని పోదామనిపించినా పదే పదే తన చేయి జేజినాయిన బిరుసు చేతిలో చిక్కుకపోయినట్లు చెమటలు పట్టేవి. ఆయన బలమైన పట్టు నుండి గింజుకుంటూ ఆ తెల్లవారుజామున నగరంలోని హాస్టల్‌గదిలో దిగ్గున మేల్కొన్నాడు.

'ఇరవై ఏళ్ల కింద చిన్నాయిన కూడా అట్లా తప్పించుకొని వెళ్లిపోయి ఉంటాడు!' మేల్కొని పరిసరాలను, నిద్రావస్థలోని సన్నివేశాలను తడిమి చూసుకుంటూ ఉలిగప్ప అనుకున్నాడు. కానీ చిన్నాయిన తనలా వ్యథ చెంది ఉండకపోవచ్చు. తనలా తర్కానికి లోనై ఉండకపోవచ్చు.

కలో, భ్రమోగాని చెదిరిపోయిన వాటిని కూడుగట్టుకుంటుంటే - సరిగ్గా అలాగే - ముసలోడు విజయోన్మత్తంగా గాల్లో ఎండంచేతి కజ్జెలు గలగలలాడిస్తూ అలాపన ఎత్తుకున్నట్టనిపించింది.

ఇక ఆయన తనకు నిత్య ప్రత్యర్థా?

తానిక ఆయనకు లొంగిపోవడమేనా ?

కట్లు తెంచుకొని సాగిపోవడమా ?

జేజినాయిన తననొక్కడినే పరిహిస్తున్నట్టులేదు.

కన్నకొడుకు... బిచ్చావతిని కూడా 'యాడికి పోతార్రా! తిక్కనాయల్లారా?' అని నిలదీస్తున్నట్లుంది. చిన్నాయిన తనకేమైనా ఆలంబన అవుతాడేమో అనే కించితే అనుమానం ముసలోడికి కలిగినట్లు - అత్యంత కళాత్మకంగా నొసలు ఎగేసి, ఏంది నీ కత? వాడ్ని చూసి నేర్చుకుండవా? అని కనుచూపుతోనే సూటిగా ప్రశ్నించినట్టనిపించింది..

అబ్బ ముసలోడికి ఎంత కళ !

ఒకేసారి నిలదీత, హేళన... పిల్లనాయాల్లు, మీకేం తెలుసురా? అనే పరిహాసం ఉట్టిపడతాయి.

ఉలిగప్పకళ్ళ ముందు రూపుగట్టిన దృశ్యమది.

ఎప్పటివరెనే సంభ్రమానికి లోనయ్యాడు.

మంచం మీది నుండి లేచేసరికి వొళ్లంతా నిస్సత్తువ అనిపించింది. కాళ్లు నేల మీద ఆనుతున్నట్లులేదు. జేజినాయిన మాట మళ్లీ గుర్తుకొచ్చింది. 'నిలబన్నీక తావు దొరుకతదా?' ఉలిగప్పకు నవ్వు వచ్చింది. మెల్లగా గదిలో అటు ఇటూ తిరిగాడు. కిటికీలోంచి బైటికి తొంగి చూశాడు. అవతల దట్టమైన మంచు, చెట్ల సిగల నిండా ఆవరించి ఉంది. గదిలో తానొక్కడే, గిరి యింకో రెండు రోజులకుగాని రాడు.

ఆలోచనలు గిరి మీదికి వెళ్ళాయి.

అప్రయత్నంగా చూపు టేబుల్ మీద, అరల్లో ఉన్న పుస్తకాలమీదికి వెళ్లింది. ఏవేవో ఒక రకం పుస్తకాలు కాదు. ఒక కులానికి కాదు. తాను ఎప్పుడైనా చేతిలోకి తీసుకోవడమేగాని కొన్నయితే పేజీలు తిరగవు. వాటి గొడవేమిటో ఎక్కదు. మిరియాల గిరప్ప పాలమూరు పిలగాడు. అకారం దగ్గరి నుండి అన్నిట్లో ఉలిగప్పకు భిన్నం. కానీ యూనివర్శిటీలో భయం భయంగా అడుగుపెట్టిన తొలిరోజుల్లో ఉలిగప్పకు అతనే గొప్ప ధైర్యం. ఎత్తుగ, లావుగ నేరేడు రంగులో, బుగ్గనవ్వుతో ఉండే గిరి తన బలమైన చేయి ఉలిగప్ప భుజం మీద వేసి హాస్టల్ రూంకు తీసుకొచ్చాడు. ఒక సంవత్సరం సీనియర్. పాలమూరు ఆశ్రితకులాల కళా సంస్కృతుల మీద పరిశోధన చేస్తున్నాడు. ఉలిగప్ప వైనం చూచి మనదే కులం? అని అడిగాడు.

గిరితో కలిసి తిరుగుతూ ఉంటే - బుద్దెరిగినప్పటి నుంచి కులమోల్లతో ఒక ఊరు నుంచి మరో ఊరు గుడారాలు ఎత్తుకొని తిరిగినట్టే అనిపించింది. అట్లా తిరుగుతూ ఈ ఊరికి ఇక్కడికి వచ్చానా? అనే ఊహ రాగానే నవ్వొస్తుంది.

నువ్వెన్నైనా చెప్పు... మనోల్లు దాండ్ల నుంచి బైటికి రాలేరు... వస్తే అన్యాయంగా సచ్చిపోతారు. వాల్లనట్లే బతకనియ్యాల. ఆ తరంపోతేగాని అవి పోవు... మనం ఆ పొద్దుకోసం ఎదురు చూడాల్సిందే... ఏం చేయలేం....! అంటాడు. గిరి నిశ్చయవాది. తటపటాయింపులు ఉండవు. నిర్ధారణకు తాను అతి సులువుగా చేరిపోతాడు.

ఉలిగప్పకది ఆశ్చర్యం, అపురూపం.

గిరిది కదిరిపాడు. బడికిపోయి చదుకోవడానికి నానా ఇబ్బందులు పడ్డాడు. పందికొక్కులు తినేటోల్లకు సదువేందిరా? అని ఎక్కిరించేవాళ్లు. గిరికి మండేది. బళ్లో అందరూ దూరంపెట్టేవాళ్లు. గిరి కచ్చకొద్దీ వెళ్ళి తగిలేవాడు. అక్కడికి ఆగకుండా బడిపక్కన పొలాల్లో ఉండే గుడారాలకు పోయి పిల్లలను తోలుకొని వచ్చి బడి చుట్టూ తుప్పల్లో ఎలుకలు, పందికొక్కులు పట్టేవాడు. వాటిని తెచ్చి బడిపిల్లలు ఆడుకుంటుంటే వాళ్ల మధ్యలో వేసి భయపెట్టేవాడు. మర్నాడు స్కూలుకుపోగానే పై కులం పిల్లలు ముక్కుకు చెయ్యి అడ్డం పెట్టుకొనేవాళ్లు.

'రేయ్... లంగనాయాల... నువ్వట్లా దూరం కూచో' అని టీచర్ బెత్తం చూపేవాడు. ఉడుములు, ఎలకలు వొడుపుగపట్టే గిరి బెత్తానికి భయపడి ఓ మూల కూచొనేవాడు. మిగితా పిల్లలు తాము గెలిచినట్టు భుజాలు ఎగరేస్తే ఈ.... అని గిరి పళ్లికిలించి భయపెట్టేవాడు. అయితే బళ్లో గిరిని జంగం కులం జాబితాలో బిసి.ఎ కింద వేశారు. ఆ సంగతి అయిదో తరగతి పూర్తయ్యాక తెలిసింది. యిదేంది సారూ... అని వాళ్ళనాయన అడిగితే, 'జనాభా లెక్కల్లో మీ కులమే లేదురా' అని సమాధానం.

'ఇదేందబ్బా! యింత మందిమి ఉండామే, మేము సర్కారుకు లెక్కలోకి కూడా రాలేదా?' అని తండ్రి తలగోక్కున్నాడు.

'సామీ.... మేము ఈత చావలల్లి, ఈతకల్లు తాగి బతికేటోల్లంగదా. జంగమోల్లు ఈత పొరకే వాడరే. వాల్లు ఒక లెక్కన బాపనోల్లే....! నక్కల్ని తింటామని చీదరించే జంగమోల్లలో మమ్మల్నెట్ల కలిపిరి?' అని అడిగాడు. మాల మాదిగలు కూడా నీళ్లు ఎత్తిపోస్తే తాగిన గిరప్ప లింగాల సాముల్లో చేరిపోయాడు. మా కులం మాకు కావాలనే బుడగజంగాల సంక్షేమ సంఘంతో పరిచయమయ్యాకగాని గిరికి వీటి లోతుపాతులు తెలియలేదు. ఆఫీసుల చుట్టూ తిరిగి తిరిగీ

కొంతమంది ఎస్సీల్లోకి మార్పించుకున్నారు. అప్పుడే గిరిది కూడా మారింది.

యూనివర్శిటీలో కలిశాక యిద్దరి మధ్యా మొదట దీని గురించే మాటలు కలిశాయి. 'నువు దేని కింది ఉండవ్?' అని అడిగాడు గిరి.

'దొరా! మా కులమేందో చెప్పు?' అని కర్నూలు కలెక్టరేట్ దగ్గర పెద్ద జెండా పట్టుకొని ఆందోళన చేయడం ఉలిగప్పకు గుర్తొచ్చింది. దీనికి నంద్యాల, కోడుమూరు, పత్తికొండ ప్రాంతాలన్నిటి నుండి వందల మంది జమయ్యారు. నందికొట్కూరు ప్రాంతమంతా తిరిగి ఉలిగప్ప అందర్నీ బస్సుల్లో ఎక్కించుకొని వచ్చాడు. దానికి హైద్రాబాదు నుండి లీడర్లు వచ్చారు.

'జే నాయినా మనం రేపు కర్నూలు పోవాల్నే....' అని అంటే తంపుగ కల్లు తాగుతూ ఏంటికి? అని మొగం చిట్లించి అడిగాడు జంబులు.

'మనల్ను ఎస్సీల్లో చేర్చాలని కలెక్టర్ను అడగనీక' చెప్పాడు ఉలిగప్ప.

'అంటే ఏంది?'

'ఏం చెప్పాలో తెలియక మాలమాదిగోల్ల పక్కన మనల్ను కూడా పెట్టాని'

'ఆనిగాల్లు ఊకుంటారా? దవడకు పెట్టి నూకరు?. అయినా మీ తిక్కగాని కులాల్ను మార్చేదేందిరా! ఎవని కులం వాడికుంటది. అదేమన్నా దొడ్డి చెంబా? ఆడపెట్టనీక .... ఈడ పెట్టనీక ఒగతూరి మాలగేరికో, మాదిగ్గేరికోపోయి మేం మీ సరసన ఉంటాం అని సూడు. తెలుస్తాది. నిన్ను ఆసగాల తిరగనియ్యరు...' అన్నాడు.

'నియ్యమ్మ... నీకేం తెలీదు. దాంట్ల చేరిస్తే మనకు సుదూకోనక, ఉద్యోగాలు చెయ్యనీక బాగుంటది. యిండ్లు, భూములు కూడా వస్తయి....' అని అసహనంగా అన్నాడు ఉలిగప్ప.

'అట్లనా... బాగనే ఉంటది. ఒగతూరి పోయి అడుగుదాం' అంది జేజి పెండ్లాం దిక్కు గుర్రున చూస్తూ చూద్దాంలే... అన్నాడు జంబులు నిర్లక్ష్యంగా.

తెల్లారి లెయ్యగానే అడుక్కోనుపోతాడేమో అని ఉలిగప్ప కాపలా ఉన్నాడు.

రాత్రి మనవడు చెప్పినట్లే జంబులు తంబూర తగిలించుకొని, గజ్జలు పెట్టుకొని, నిలువుగా ఎర్రనామం తయారయ్యాడు. సుంకమ్మ గుమ్మెట తీసుకుంది. ఊర్నుంచి ముప్పై మంది కర్నూలు బయల్దేరారు. ఆపొద్దు చిన్నపార్కు నుండి గుమ్మెట తంబూరలు కొట్టుకుంటూ ఊరేగింపు తీశారు. కలెక్టరేటు దగ్గర జంబులు కాటమరా రాజు కథలో, బొబ్బిలి యుద్ధంలో యుద్ధఘట్టాలను కొంచెం కొంచెం చెప్పాడు.

'ముసలోన్ని ఎక్కించాలేగాని దించడం మనవల్లగాదు....' అని చాలా మంది అనుకున్నారు.

'గుమ్మెట తాంబూర్రలతో బతికేవాళ్ళం, ఈతచాపలు అల్లుకొని అమ్ముకొనేవాళ్లం, ఎలుకలు - ఉడుములు తినేవాళ్లం మేమెట్లా బుడగజంగాలం కాకుండా పోయినాం' అని కలెక్టర్‌ను అడిగారు.

ఉలిగప్పకు అదే లోకం తెలియడం.

అంతకముందు జేజినాయిన కత చెప్పడానికి శృతి చేసుకుంటుంటే గొంతుకాళ్ళ మీద కూచొని శ్రద్ధగా గమనించడమే తెలుసు. బాగా చిన్నప్పుడు ఎట్లా ఆసక్తిగా జేజినాయన్ను గమనించేవాడో ఇప్పటికీ అదే వైనం. ఈ ఆందోళన ఉలిగప్పలో మానవ ప్రపంచానికి కిటికీలు తెరిచింది. కిటికీలే ఏమిటి? తలుపులు బార్లా తెరిచి లోకం యావత్తూ అత్యంత సంభ్రమోత్సాహాలతో, పోటెత్తే ప్రశ్నలతో, అంతులేని సందిగ్ధాల జడివానతో, సమ్మోహనంతో తనలో సంలీనం చేసుకున్నది. ఉలిగప్పపై మీది నుండి మరోసారి పురిటి వాసన కొట్టింది.

'ఒక కులంలో పుట్టి, కులం బతుకు బతుకుతూ గుర్తింపు కాగితం కోసం ఏందీ తిరకాసు?' అనే దగ్గర ఉలిగప్ప ప్రయాణం మొదలైంది.

అందుకే గిరి 'దేనికింద వచ్చినవ్' అని అడగ్గానే లోపల జరజరా పాకింది.

'ఊర్లలో మనల్ని మన కులంతోనే చూస్తరుగదా. సర్టిఫికెట్ ఇయ్యనీక ఏం కష్టంనా?' అని అడిగాడు.

కొత్తల్లో అన్నా అని పిలిచేవాడు.

'ఏంలా' మనం కులం పేరుతో కొన్ని లాభాలు పొందనీక చూస్తున్నా? అదే అసలు సమస్య. స్ట్రగుల్ చెయ్యకుండా లాభాలు పొందే వాళ్ల జాబితాలోకి చేరుతామంటే సమాజం, ప్రభుత్వం ఎట్లా చేరనిస్తది చెప్పు? .... అందుకే మనమూ మొదలు పెట్టినం... సోషల్‌గా నిన్ను దినాం ఊర్లో ఇన్‌సల్ట్ చేయొచ్చు, అది వేరేకత...' అన్నాడు గిరి.

ఆ క్షణమే... గిరి తనకు చాలా అవసరం అనిపించింది. కొత్త ప్రపంచంలో అన్నీ కొత్తగా కనిపిస్తున్నాయి. అన్నిటిపట్ల ఆశ్చర్యమూ, సందేహమూ, ఇక్కడ తచ్చాడాలన్నా తనకు ఓ చేయి ఆసరా కావాలి. ఉలిగప్పకు తను పరిష్కరించుకోవాల్సినవీ, స్వీకరించవలసినవీ చాలా ఉన్నాయని తెలిసింది గిరి వల్లనే.

"పెద్దోల్లతోనే అన్నీ పోతాయంటవా? అట్లయితే ఎన్ని తరాలుపోలా...! యింకా గుమ్మెటతంబూరలు పోలేదే? ఎత్తకు తినడం పోలేదే?" అని అడిగాడు.

"పోతాయి... కొంచెం ముందో ఎనకో పొయ్యేవే. అవి యింకా ఉండనీక కారణాలున్నాయిగాని పోవడానిక్కూడా కారణాలున్నాయి".

గిరితో వాదన చేయడం చేతగాదు. కొద్ది దూరం పోయాక ఆగిపోతాడు.

"నీ లెక్క నేనేదీ తేల్చుకోలేకపోతుండా గిరీ! నువు చెప్పేది నిజమే అనిపిస్తుంది. కానీ అట్లెట్లయితదనే అనుమానం".

"ఎందుకు అనుమానం?"

ఉలిగప్ప చెప్పలేడు

ఒకరోజు చల్లని సాయంకాలంలో, నీరెండలో ఆహ్లాదంగా నడచిపోతున్నప్పుడు తన చిన్నప్పటి సంగతులు చెప్తూ చెప్తూ... ఒక చోట.... మాటలు ఆగిపోయి నిలబడిపోయాడు. తమాయించుకోవడానికి ప్రయత్నించి విఫలమై పసివాడివలె వెక్కి వెక్కి ఏడ్చాడు గిరి.

ఉలిగప్పకు దిక్కుతోచలేదు.

అలాంటప్పుడు భుజం మీద చెయివేసి ఓదార్చాలని తెలిసినంత సహజంగా ఉలిగప్పకు నోటెంట మాటలు రాలేదు.

".... ఈ పొద్దుకూ నాకదే మతికొస్తది. దీనెమ్మ.... ఇదేం కులంరా...." అన్నాడు గిరి మాటల్లోకి వస్తూ. అతని మనసులోని, శరీరంలోని ప్రకంపనలు ఉలిగప్ప స్పర్శకు తెలిశాయి.

ఉలిగప్పకది వెంటాడే దృశ్యం.

గిరి చదువుతూ టేబుల్ మీద పడేసిపోయిన పుస్తకాన్ని

స్పృశించాడు. ఈ మనిషి ఎప్పుడొస్తాడు ?

ఏవేవో మీటింగులని, ధర్నాలని, సర్వేలని ఒకచోటి నుండి మరో చోటికి తిరుగుతూ ఉంటాడు.

నువ్వూ మనోల్ల లెక్క సంచార జీవివే... వాళ్లు ఒకందుకు తిరిగితే, నీవు యింకో అందుకు తిరుగుతావు అంటాడు ఉలిగప్ప.

గదిలోంచి బైటికి వచ్చాడు.

హాస్టలు నిబిడీకృతమైన మౌనంలా ఉన్నది.

అటు ఇటూ తిరిగాడు. చెట్ల మీది మంచు పలుచనైపోతోంది.

గిరి వచ్చేలోగా తనేం చేయాలి?

ప్రభుత్వానికి ఒక విజ్ఞాపనా పత్రం రాసిపెట్టాలి, తనకు పరిచయస్తులున్న అయిదారు జిల్లా కమిటీలకు వర్తమానం పంపించాలి. మీటింగుకు వస్తూ గుమ్మెటతంబూరలు తీసుకొని రమ్మని ప్రత్యేకంగా చెప్పాలి... ఈ రెండ్రోజుల్లో ఇవన్నీ పూర్తవ్వాలి. లేకపోతే చిటపటలాడిపోతాడు. పని రాక్షసుడు. ఈ వర్తమానాల గురించి చెప్తూ వద్దంటే మనోల్లు వినరుగదా. గుమ్మెట తంబూరలతో ర్యాలీ పెట్టినారు. అందరు తప్పక తీసకరావాలని చెప్పాలట....' అని మండిపడ్డాడు.

సరిగ్గా ఇవే ఉలిగప్పకు సందిగ్ధ సందర్భాలు.

జేజినాయిన భుజమ్మీది నుండి తంబూర దించాలని శతవిధాల ప్రయత్నిస్తూ మరోపక్క ఇలాంటివి....

గిరి ఏదో ఒకటి ఛర్రన అంటాడనుకుంటూనే - 'మరి మన ఐడెంటిటీ తెలిసేదెట్లా?' అన్నాడు. సందిగ్ధాలకు గుమ్మెట తంబూరలంత ప్రబలమైన సంకేతాలేముంటాయి? అందుకే అనేశాడు.

'నాకదే మండేది....' అని యింకా ఏమో అనబోయి తన ఆగ్రహానికి ఉలిగప్ప పాత్రుడు కాదనుకొని వెనక్కి తగ్గాడు.

"సర్లే... ఇది ఈ పొద్దుకు తెగేదికాదు... పనులైతే ఉండయి.... కావాలిగదా" అని పురమాయించాడు.

గుమ్మెట తంబూరలతో ర్యాలీలో అనే గతం నుండి గిరి తెంచుకొని వచ్చాడు. గుర్తింపు పేరుతో వల్లించేవన్నీ వినడానికి బాగుంటాయి. గుర్తింపు చాటుకోవడానికి, ఆ పేరుతో సమీకరించడానికి, బలంగా వాదనలు పెట్టడానికి బాగుంటాయి. అవసరం అవుతాయి కూడా. కానీ ముందుకు పోవడానికి పెద్ద అడ్డంకి అని గిరి అంటాడు.

ఈ మాటలు కొందరితోనే. ఐడెంటిటీలో తదాత్మ్యమైపోయిన వారితో అసలు మాట్లాడడు. అలాంటి వాళ్లతో ఎంత మాట్లాడినా వాదన కూడా ముందుకు పోదని అనుభవం. ఐడెంటిటీ సెంటిమెంట్‌గా మారిపోయిన వాళ్ళతో కూడా తన అభిప్రాయాలు చెప్పడు. వాళ్లు నొచ్చుకుంటారు. ఏదైనా నమ్మకంగా మారిపోయాక విమర్శిస్తే బాధపడతారు. బాధించే హక్కు తనకెవరిచ్చారు? ఉలిగప్ప ఈ రెంటికీ కాకుండా అటు ఇటూ ఆలోచిస్తూ ఎటూ తేల్చుకోలేని స్థితిలో ఉన్నాడని గిరి అంచనా. ఆ సంగతి ఊరికి పోయి వచ్చినప్పుడల్లా తెలుస్తుంటుంది. ఆ స్థితిలో చాలా నొప్పి ఉంటుంది. ఏదో వెతుకులాట కూడా ఉంటుంది. నొప్పి భరిస్తూ తీరం చేరుకోవాలి. ఈదుతున్నాడు.... ఈదనీ. కులానికంతా కలిసి ఒక సామాజిక అనుభవం ఉన్నా కులంలో చరిస్తూ కులంతో - కట్టుబాట్లతో - విశ్వాసంతో వ్యవహరించే ప్రతివాడికి సొంత అనుభవ పార్శ్వం ఉంటుంది. ప్రతివాడికీ అదే రణస్థలి అనుకుంటాడు. అందుకే ఉలిగప్ప ఊరికిపోయి వచ్చిన ప్రతిసారీ దాదాపు జ్వరపడిపోతాడు. ఊరి నుండి, దుఃఖావరణం నుండి బైటికి రావడానికి యాతనపడతాడు. అలాంటప్పుడల్లా గిరి దగ్గరికి తీసుకుంటాడు. అతనే స్థితిలో ఉండేది గిరికి ఎంత బాగా తెలిసిపోయిందంటే - తాను ఒకటి మాట్లాడుతుంటే ఉలిగప్ప అసంబద్ధంగా మరొకటి మాట్లాడతాడు. అప్పుడతని స్వరం ఊళ్ళోనించి, గుడారాల్లోనించి వినిపిస్తూంటుంది. చేయి అందించి వర్తమానంలోకి తేవడం నిజంగా పెద్ద ప్రయాసే. కానీ గిరి అప్పుడట్లా సానునయంగా వ్యవహరిస్తాడు.

"గుర్తింపు అనేదాన్ని ఒప్పుకోకపోతే మనమెవరమో, మనకేం కావాలో, ఎందుకు కావాలో ఎట్లా చెప్పుకుంటాం?" అని కూడా ఉలిగప్ప అన్నాడు.

"నిజమే.... ఆ ఐడెంటిటీని క్రిటికల్‌గా చూడకపోతే ప్రయోజనంలేదు..." అప్పటికి ముగింపుగా అని వెళ్లిపోయాడు గిరి.

జేజినాయిన గుమ్మెట తంబూరలను గుర్తింపు అనుకుంటాడా? అనే సందేహం వచ్చింది. అవి ఆయనకు తెలియకుండా ఆయన జీవిత సర్వసర్వమే అయిపోయాయిగాని ప్రత్యేకంగా గుర్తింపు కాలేదు. కాని విచిత్రం! నాయనకు అది జీవితమూ కాలేదు. గుర్తింపు అవసరమూ కాలేదు. చాలా సునాయసంగా ఏ కెరటమో వచ్చి ఆయన్ను బిందెల వ్యాపారంలోకి లాక్కెళ్లింది. తంబూరమోసిన భుజం బిందెలకాడి మోస్తోంది.

తండ్రి కతలు చెప్పడం కూడా ఉలిగప్ప విన్నాడు. తనకే నచ్చలా. ఎవరన్నా చావు యింటికి పిల్వంపితే మా పెద్దోడు వస్తడ్లే' అని జేజినాయిన అనడం, అవతలివాళ్లు 'నువు రారాదురా జంబులా?' అనడం తనకు గుర్తే.

జేజినాయిన ప్రభ ముందు తండ్రి వెలవెలబోయాడు.

ఆయన వెలుగు ముందు చిరుదీపమయ్యాడు.

ఈ మధ్య ఎప్పుడు ఊరికిపోయినా తనకళ్లెదుట తండ్రి బిందెలకాడి ఎత్తుకొని ఊర్లమీదికి పోతుంటే కృతజ్ఞతపూర్వకంగా చూస్తాడు. ఆయన ఆ కాలానికి తెగబడి ఈ పనికి మళ్లకుంటే తను బడిలోకి వెళ్ళేవాడేకాదు.... గుమ్మెట తంబూరల నుండి, తందాన కతల నుండి బైటికి వచ్చాక బిందెలోల్లు అనే పేరుతో కులం గుర్తింపు మారిపోయింది. తుప్పల్లో ఆ తర్వాత ఊరి బైట కాలనీలోనే ఉండొచ్చు, కానీ ఇతరులు ఆయన్ను గుర్తించడంలో ఈ తేడా వచ్చింది. దాని గురించి ఆయనకు ఏ దిగులూ లేదు. ఎస్సీల్లో చేర్చాలనే ఆందోళన మొదలైనప్పుడు గుమ్మెట తంబూరల గుర్తింపు అవసరమైంది....

అప్పటి నుండి ఉలిగప్ప సుడిబడుతూనే ఉన్నాడు.

అయినా గిరి అప్పగించిన పనులన్నీ సవ్యంగా చేసేశాడు. ఊరేగింపుకు పదివేల మంది వచ్చారు. గుమ్మెట తాంబురల జాతరలాగా జరిగింది. బాలసంతుల వేషాలు, వడ్డెర వేషాలు, కాటిపాపల వేషాలు వేశారు. ఒక అత్యాధునిక నగరంలో ప్రాచీనకళా ప్రవాహంలా ఊరేగింపు సాగింది. ఉలిగప్ప ఆద్యంతం తన్మయీ భావంలో మునిగి తేలాడు. ఊరేగింపులో భాగమై కాసేపు, పక్కకు వచ్చి రోడ్డు మీద నిలబడి కాసేపు. ఇది అతని జీవితంలో అతి పెద్ద సంరంభం. ఒక వేడుకగా, తిరగబడ్డంగా, 'మేం... మేమే' అని చాటి చెప్పకోడంగా కనిపించింది. ఊరి నుంచి చాలా ముందే కదిలారు. కర్నూలు నుండి రైల్లో వచ్చారు. జేజినాయిన రాలేదు. పెద్దతమ్ముడు, నాయిన వచ్చారు. గిరి అప్పగించిన పనులు చేస్తూ అటు ఇటూ హడావిడిగా తండ్రికి ఆనందం కలిగింది. అప్పుడే ఎవరో అన్నారు - 'ఈడికొచ్చినాక మీ ఉలిగప్ప లీడరైనట్టుందే...!' అని.

ఉలిగప్ప సంతోషం కొన్ని గంటలకే చల్లారిపోయింది. ఊరేగింపు పూర్తయి సభ మొదలయ్యాక ఊరి నుండి వచ్చిన జానయ్య "ఒరే! నీతో పనుండాది. మల్లా టైముందో లేదో...." అన్నాడు.

"అదేందినా! మాట్లాడుకుందాంపా" అని ఉలిగప్ప బైటికి దారితీశాడు. జానయ్య కులమోడే. లాయర్. ఆ చుట్టుపట్ల మొట్టమొదట చదువుకున్నది ఆయనే. ఉలిగప్పకంటే ఏడెనిమిదేళ్ల పెద్ద. నందికొట్కూర్లో కాపురం ఉంటున్నాడు. అమ్మనాయిన్లు నెహ్రూనగర్ కాలనీలో ఉంటారు.

..... జానయ్య అంటే కులంలో చదువుకున్న వాళ్లందరికీ ఇష్టం. ఆయన ఆ చుట్టు పట్ల సంఘానికి పెద్ద మనిషి

ఇద్దరూ చెట్లకిందికి వెళ్లారు.

చెప్పు.... అన్నట్లు చూశారు.

జానయ్య వికలమైన చూపు చూశాడు.

"అది కాదురా! నేనెట్టాటోన్నో నీకెరికే గా. చిన్నపిల్లోనివైనా కులమోల్లకోసం పనిచేస్తుండావు.... నేను కూడ అదే చేసినా. మంచీ చెడు ఒక మాటంటే పెద్ద మంచులు పంచాయితీ పెడతారా? కూటికి నీల్లకు కలవకూడదని తీర్పు చెప్తరా?... అందరిలెక్క కులమోల్లు కూడా బాగుపడాలని చూస్తే.... కడాకు..." యింక మాట్లాడలేకపోయాడు.

ఉలిగప్పకు అర్థమైంది

భీరువైపోయాడు.

"అట్లనా? ఎంతపనాయె... ఏం మనసులబ్బా!" అన్నాడు. జానయ్య పూర్వీకులు ఎర్రమఠం దిక్కు తిరుగుతుండే వాళ్లు.

ముంపు వచ్చాక నెహ్రూనగర్ కాలనీలోకి వచ్చారు. మూడు నెల్లకింద యింట్లో కోర్టు కాయిదాలు రాసుకుంటుంటే ఎల్లమ్మ వచ్చింది. పాతికేళ్లుంటాయి. ఊరామెనే. ఏనాడూ రాలేదు.

"ఏందక్కా! ఇట్లొచ్చినవ్! వారానికోతూరి సంతకు వస్తారు... ఏ పొద్దేగాని ఇట్లొచ్చినోల్లుగాదు..." అన్నాడు జానయ్య నిష్ఠూరంగా.

దానికి ఆమె వలవల ఏడ్చింది.

జానయ్య కాగితాలు మడిచి "అయ్యో" ఏమైందక్కా? అట్ల కూచో ముందు అని ఓదార్చాడు.

"ఆ లంగనాకొడుక్కి పదేళ్లు సంసారం చేసినాక నా మీద అనుమానం పుట్టింది. నేనెవల కిందికో పోతున్ననంట.... పైటచెంగుకు రూపాయి బిల్లకట్టి బైటికి పో... అంటున్నాడు...' అంది

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తాంటే లోపల్నుండి జానయ్య భార్య వచ్చింది.

ఎల్లమ్మ యింకా నిలబడే ఉన్నది. జానయ్య భార్య ఆమెను దగ్గరికి తీసుకొని వచ్చి తనతోపాటు గోడెంబటి కూచోపెట్టింది. ఎల్లమ్మ యింకా ఏడుస్తూనే ఉంటే - ఊకో.... ఊకో.... అని సముదాయించింది. లోపలికెళ్లి మంచినీళ్లు తెచ్చిచ్చింది.

"మరి... మనోల్లు ఏమన్నరు?" అడిగాడు జానయ్య.

"ఏమంటరు! పంచాతి పెట్టినారు. వానికి నచ్చ చెప్పినారు. పెడసరం లంజాకొడుకు.... ఒకలమాట వినే రకమా? మల్లా మొదటికొచ్చినాడు. రెండు మూడు తూర్లు చెప్పి వదిలేసినారు... ఏం జేస్తారు?" అన్నది.

"అంతలావు పెద్ద మంచులు.... వాడు పంచాతికి అడ్డం తిరిగితే చూస్తా ఊకున్నారా?" అన్నాడు.

ఆడమనిషి అన్యాయమైపోతోందే... అనుకొని "నేను రేపు ఊరికొచ్చి మనోల్లతో మాట్లాడతా" అన్నాడు. ఆమెకు పుట్టింటివాళ్లు కూడా ఎవరూ లేరు. రెండు చేతులు, ఇద్దరు పసిపిల్లలు తప్ప ఆధారంలేదు. యిట్లయితే ఎట్లా? మంచి మాటకు దారికి రాకపోతే బెదిరించాలి.... అనుకొని ఊరికెళ్లాడు.

'ఆ లంగనాయాలు ఎదురు తిరిగితే ఏం చేస్తం చెప్పు? పంచాతీలు ఒగ గీత గీస్తే దాటేటోల్లుగాదు. దొంగనాకొడుకులు.... ఇప్పుడు విన్నోల్లు వింటుండారు... అడ్డం తిరిగేటోల్లు అడ్డం తిరుగుతుండారు... నిస్సహాయంగా అన్నారు పెద్ద మనుషులు.

జానయ్యకు మండింది.

"ఎవరిదోవన వాళ్లు పొయ్యేటట్లయితే యింక కులమేంది? కట్టుబాట్లేంది. టేషన్లో కేసుపెడితే పోలీసులు పట్టకపోయి ఇరగదీస్తరు. ఎట్ల దార్లోకి రాడో చూస్తా..." అన్నాడు.

దానికి పెద్ద మనుషులు ఉగ్రావతారం దాల్చారు.

"వాడు పెండ్లాన్ని యిడిసిపెట్టిందానికన్నా ఇది పెద్ద నేరం ! కులాన్ని కాదని ఒకతూరి టేషన్‌కు పోయినావంటే పంచాతి ఎలేస్తది సూది..." అన్నారు.

"సదుకున్నోనని తలబిరుసు ఎవ్వారాలు చెయ్యగాకు...." అని హెచ్చరించారు.

"ఆ నాకొడుకును ఏంపీక్కోలేకపోయినరుగాని, నా మీద పంచాతి పెడతారా?" అన్నాడు జానయ్య.

మాటా మాటా పెరిగింది.

కీకరబ్యాకరగ అరుచుకున్నారు.

జానయ్య బస్సెక్కి వచ్చేశాడు. వచ్చేటప్పుడు ఎల్లమ్మకు మాటయినా చెప్పలేదు. కొట్కూరులో బస్సు దిగి యింటికి పోతూ దార్లోనే స్టేషన్‌కు వెళ్ళి పోలీసులతో మాట్లాడారు. ఆ రోజు సాయంకాలమే ఇద్దరు కానిస్టేబుళ్లు వెళ్లి ఎల్లమ్మ మొగుడు లింగమయ్యను పట్టుకొచ్చి నాలుగు తగిలించారు.

ఈ దెబ్బతో ఎల్లమ్మ పక్కకుపో జానయ్య ముందుకొచ్చాడు. పెద్దమనుషులు పంచాతి పెట్టారు. ఆయనా చేసిదానికి ఊర్లో వాళ్లందరికి తల తిరిగి పోయింది. పెద్ద మనుషులు దిగ్భ్రాంతి చెందారు. యా పొద్దయినా ఇట్ల జరిగిందా? అని భేదపడ్డారు... కులమన్నాక పెద్ద మంచుల మాట వినేటోల్లుంటారు. అడ్డం తిరిగే నా కొడుకులుంటారు. కట్టడి ఉండేది ఎందుకు? కులాన్నికాదని పోలీసులకాడికి పోతే చూస్తూ ఊకుంటామా?' అనుకున్నారు.

'మనోల్ని పోలీసుల్తో కొట్టిస్తడా?' అని మరికొందరు ఆగ్రహించారు.

'మొగుడూ పెల్లాల పంచాతికి టేషన్‌కుపోతే ఇంగ దినాం కోరుట్లకు తిరగాల్సిందే...' అని కోప్పడ్డారు.

'మనన్ని కాదని ఒగతూరి బైటిపోయినాడ యింగ కులంలో వాడికి చోటు లేదు. ఈ పొద్దట్నుంచి వాడితో మనకు మాటల్లేవు. కూటికి నీల్లకు పిలిచేదిలేదు' అని తీర్మానించారు.

జానయ్య బెంబేలెత్తిపోయాడు.

"మనోల్లు.... మనోల్లు అని ఊర్లుబట్టుకొని తిరిగి ఎంత చేస్తివి. కడాకు ఎలేసిరి" అని భార్య దుఃఖపడ్డది.

ఆ రోజు నుండి జానయ్యకు అదే ఎదారుపట్టుకుంది. పాతాళానికి పడిపోయినట్టయింది. చుట్టుపక్కల ఊర్లలో అందరికీ తెలిసిపోయింది. తనకింక కులంతో మాటల్లేవు. మంచికి చెడుకు ఆదరువు లేదు. ఎట్ల చేయాల్రా భగవంతుడా ? అని వగచాడు.

కులంలో చోటు లేకుండా బతకడమంటే ఏమిటో తెలియదు. ఎన్నడూ అట్లాంటి ఊహ రాలేదు. న్యాయశాస్త్రం చదివిన జానయ్యకిది

అంతులేని సమస్య అయింది. లాయర్లలో తను బుడగజంగమోడే. రెడ్లు, బావనోల్లు... కడాకు మాలమాదిగ లాయర్లు కూడా జానయ్యగాడు అనే అంటారు. ఇప్పుడా కులం వెలిచేసినందుకు తననింకా అవమానిస్తారా? లేక ఆ కులానికి దూరమైనందుకు చేరదీస్తారా? అని పరిపరివిధాల ఆలోచనలు చుట్టుముట్టాయి.

'జానయ్యగాడు.... ఈడ జడ్జిమెంట్ల కోసరం ఎదురుచూస్తా ఉంటే కులమోల్లు వాడిమీదనే జడ్జిమెంట్ యిచ్చినారు...' అని లాయర్లు ఎకసక్కాలాడారు.

ఒక ఆడమనిషికి అన్యాయం జరుగుతూ ఉంటే చూస్తూ ఊరుకోలేనందుకు, పెద్ద మనుషుల వల్లగాని పని తను చేద్దామనుకున్నందుకు ఇంత శిక్షవేస్తారా? జానయ్య తల్లడిల్లిపోయాడు.

ఈ దెబ్బతో లింగమయ్య జడుసుకొని పెండ్లాంతో సక్రమంగా ఉంటున్నాడు. భార్యను ఏలుకుంటానని చెప్పాడు. ఒకనాడు పెద్ద మనుషులకు కల్లుపోయించాడు

.... ఇదంతా విని ఉలిగప్పకు కాళ్లలో వీణులకు మొదలైంది. జానయ్య ఎట్లాంటి వాడు! కొట్కూరు పల్లెల్లో అందరు ఆయన్ను నెత్తిన పెట్టుకొనేవారు. నలుగురికి గొప్పగా చెప్పుకొనేవారు.

'జానయ్య... లాయరు ఉన్నా.... మా వాడే' అని చాటుకొనేవారు. రాతకోతల పని పడితే 'జానయ్యకాడిపొయ్యి....' అనుకుంటారు. ఆ మనిషి లేకపోతే తనకు చదుకోడానికి దారి దొరికేదా?

ఏ కాలేజీలో చేరాలో... ఏం చదవాలో ఎట్ల తెలిసేది? కులం కోసం, సంగం కోసం ఎంత చేశాడు?

ఎదురుగా నిలబడి ఉన్న జానయ్య ముఖంలోకి చూడాలంటే భయమైంది. కళ్లు దించుకొని, చెట్టు ఆకులు వేళ్లతో ఒక్కొక్కటే తుంచేస్తున్నాడు.

జానయ్య చెప్పాల్సినంత చెప్పాడు.

ఉలిగప్ప సాయం కోసం చెప్పాడు... అసలు ఎవరైనా సాయం చేయగలిగేది ఉన్నదో లేదో... జారిపోతున్న ధైర్యాన్ని యిట్లా చెప్పి కూడగట్టుకోవాలనుకున్నాడో...

హాల్లో రసవత్తరంగా పాటలు సాగుతున్నాయి.

పాత కతల వరుసలోనే కులం వాళ్ల కష్టాలను, సంఘం చేస్తున్న పోరాటాలను, ప్రభుత్వ వివక్షను అల్లిపాడుతున్నారు. దయనీయమైన కష్టాలను, అవమానాలను... అక్కడ అందరూ అనుభవించినవాళ్లే అయినా... కన్నీళ్లు రాలేలా వరుసలు కట్టి పాడుతున్నారు. అప్పటికప్పుడు ధారాపాతంగా పాటలు, కతలు వేదిక మీది, వెల్లువెత్తుతున్నాయి. ఒక్కోసారి ఇరవైమంది, ముప్పై మంది తలపాగాలు కట్టి, గజ్జెలు తగిలించుకొని గుమ్మెట తాంబురలతో పాడుతుంటే, అడుగులు వేస్తోంటే ప్రాచీన కళావైభవమంతా అక్కడే పునర్జన్మించినట్లుంది. వందల ఏళ్లుగా గుమ్మెట తంబూరలు కొట్టి కళా వినోదం పంచిన వాళ్లకే ఇప్పుడట్లా గుంపుగా వాయిస్తోంటే - కొత్త అనుభూతిగా ఉన్నది. యిదంతా మనదేనా? అనిపించింది.

ఉలిగప్ప వికల మనస్సుతో అంతా చూస్తున్నాడు. వింటున్నాడు. ఒక్కసారిగా గుమ్మెటమోత హోరెత్తిపోయింది.

పరిసరాలను సమూలంగా పెళ్లగించే శక్తి ఆ మోతలో ఉన్నది.

యిద్దరి మధ్యా మాటలు పూర్తయ్యాయి.

అదంతా చెప్పడం వల్ల వినడం వల్ల వాళ్లిద్దరి మనసుల్లో ఎంత చెలరేగుతున్నదో అంత హోరు సభలో ఉన్నది.

ఉలిగప్ప మనో ప్రపంచంలోని లోతుకు, విస్తృతికి, శక్తికి మితిమీరి పోయిన సంక్షోభమిది. ఏ పక్క నుండి ఎట్లా ఆలోచించి అర్థం చేసుకోవాలో పాలుపోవడం లేదు. అసలు ఆలోచనలే గడ్డగట్టిపోయాయా? అనిపిస్తోంది.

యింతా విన్నాక జానయ్యతో ఒకమాటయినా మాట్లాడాలిగదా? పెదాల మది నుండి కాకపోయినా కనుచూపులతోనైనా పంచుకోవాలి గదా? కానీ తన దగ్గర ఏమీ లేదు. అన్నీ అడుగంటిపోయాయి. ఒకసారి పంచాయితీ అయ్యాక మాట్లాడటానికి ఉండదు. కదిలించే కొద్దీ ఊబిలోకి జారిపోయినట్లే. మళ్ళీ ఎప్పటికో... ఎన్నేళ్లకో... అనుకోని మార్పులేమైనా జరిగితే తప్ప....! యింత మహాద్భుతమైన కళాకులంలో....

అనుకోవడానికి భాష సరిపోవడం లేదు.

లోపల ప్రసంగాలు మొదలయ్యాయి.

గిరి ప్రారంభించాడు.

అతని పలుకులో ప్రవాహగుణం ఉన్నది. ఉలిగప్ప సంఘంలో పని చేసే చాలా మంది ప్రసంగాలు విన్నాడు. అదే వొరవడి... అదే ఊపు... మాటలు వెతుక్కోవడం తడబడటం, నాలుక మీది నుండి గొంతులోకి జారిపోవడం ఉండదు. అచ్చం జేజినాయన కత చెప్పేటప్పుడు పాట పాటకు మధ్య చెప్పే మాటల వెల్లువలాగా సాగిపోతుంది. ఎంత ఊహ, ఎంత కఠోర వాస్తవం....! గిరి కొంచెం పాలమూరు యాసలో, కుల నుడికారంతో సుబోధకంగా, లయాత్మకంగా మాట్లాడుతున్నాడు. అక్కడక్కడ తన మేథాస్థాయిని స్పృశిస్తూ మాట్లాడుతున్నాడు. మామూలుగా ఉండే తన విసుర్లు, విరుపులూ, నిలదీతలూ అక్కడికి మచ్చుకయినా తీసుకరాలేదు.

మనం ఈ భూమి మీద ఉన్నామా లేదా? ఈ దేశంలో పౌరులంకాదా? మనల్ని జనాభా కింద కూడా లెక్కేయడం లేదు. మన కులాన్ని గుర్తించడం లేదు....

గిరి మాట్లాడుతుంటే ఉలిగప్ప సందిగ్ధంలో పడిపోయాడు.

ప్రభుత్వం గుర్తించకపోవచ్చుగాని ఎంత లోతయిన కులం తమది? తలచుకుంటే దానికి అంతులేని శక్తి ప్రాప్తిస్తుంది. ఒక్కసారి చూచి చూడనట్టు పోయే కులం దిగ్గున మేల్కొని తన కట్టుబాట్లకు ఎదురైన విపత్తును ఎదుర్కోవడానికి మేరునగధీరురాలివలె నిలబడుతుంది. అక్కడ అది పునర్జీవితాన్ని పొందుతుంది. అందరినీ ఒకసారి అప్రమత్తం చేస్తుంది. దారితప్పిన వాళ్లను తన దారిలోకి తెచ్చుకుంటుంది. లేకపోతే జానయ్యను వెలివేయడంతో లింగమయ్య బెదిరిపోవడం ఏమిటి? ఎలకలు తినేనాయాళ్లని నిత్యం తూస్కారానికి గురయ్యే వాళ్లందర్నీ స్వకులమే కట్టడి కింద కలిసి ఉండేలా చేస్తుంది... కాదంటే వెలివేతే...

ఎవరో వచ్చి జానయ్యను పలకరించారు.

ఆయన తన మనఃస్థితిని ఛేదించుకుంటూ మాటలు కలిపాడు. వాళ్లిద్దరూ రెండడుగులు అవతలికి వేశారు. వాళ్లేదే మాటల్లో పడిపోయారని అర్థమై ఉలిగప్ప హాల్లోకి వెళ్ళి చిట్టచివర కూచున్నాడు. జానయ్య గురించి ఆలోచిస్తోంటే చిన్నాయన బిచ్చావతి గుర్తుకొచ్చాడు. యిద్దరూ కట్టడిని ఎదిరించిన వాళ్లే. కాని తీరువేరు; ఇద్దరూ వెలివేతకు గురైనవారే... అనిపించింది. సభ ఉత్తేజంగా సాగుతోంది.

(ఇంకా ఉంది)

అ

పాటలు

# ఆదివాసుల పోరు కేక

- తంగెళ్ల సుదర్శనం

పల్లవి : దండకారణ్యంలో దండులు కదిలె
ఆదివాసీ గుండెల్లో ధైర్యం పెరిగె ॥దండ॥

చరణం 1 :
ఈ దేశముకొచ్చిన స్వాతంత్ర్య ఫలాలంట
అరవై ఏండ్లు దాటిన ఆదివాసుల జేరలేదు
ఎవసాయం విద్యలేదు ఆరోగ్యం అసలె లేదు
దళారి పాలకులు దగాజేసుడేందంటు ॥దండ॥

రాజ్యాంగంలోన వాళ్ల హక్కులెన్ని రాసివున్న
ఆదరించెటోళ్లు లేక అండనిచ్చెటోళ్లు లేక
అంధకారం నిండుకొన్న అడవీ బతుకులనంట
రక్షించెడి రాజ్యమే రాకాసి ఏషమేస్తే ॥దండ॥

ఆదివాసి మహిళల గోడెవరికిజెప్పాలే
బేస్ క్యాంపులల్లోబెట్టి అరిగోసబెట్టబట్టె
అక్కా చెల్లెల తల్లుల మరచిన పోలీసోల్లు
అడవిబిడ్డెల మాన ప్రాణాలను చెరుస్తుంటే ॥దండ॥

అడవితల్లి స్తాత్తిల్లో ఆదివాసి కాళ్ల కింద
ఖనిజాలు దాగెనని కన్నేసిన సర్కారు
ఇండ్లు తగులబెట్టింది ఊళ్లూ కొల్లగొట్టింది
ఆదివాసీలనట్ల హత్యజేసుడేందంటు ॥దండ॥

పొద్దుపొడుపు వెలుగులో జనతన సర్కారునడిపి
సదువుజెప్పి బడులుబెట్టి బతుకూ పాఠాలుజెప్పి
స్వావలంబనతోని అభివృద్ధిని సాధించితె
మావోయిస్టు సాకుతో మారణహోమంజేస్తే ॥దండ॥

బహుళజాతి కంపెనీల మోచేతి నీళ్లుతాగి
వేలా ఎకరాల భూమి వేదాంత కంపెనీకి
అమ్మేసిన పాలకులె గ్రీన్‌హంట్ పేరుతోని
ప్రజలపైన యుద్ధమంటు ఉసురుదీసేస్తుంటే ॥దండ॥

కనిపెంచిన తల్లి అడవి కన్నతల్లి లాంటి అడవి
నీడనిచ్చిన తల్లి అడవి గూడునిచ్చిన తల్లి అడవి
భూమినిచ్చిన తల్లి అడవి భుక్తినిచ్చిన తల్లి అడవి
అడవినొదిలి పొమ్మంటే పిల్లలు విల్లంబులెత్తి

దండకారణ్యంలో దండులు కదిలె
ఆదివాసీ గుండెల్లో ధైర్యం పెరిగె
మా అడవి మాదేనని కేకలు బెట్టె
పోరు కేకలు బెట్టె

# బూటకపు ఎన్నికలు

- దీపక్

మాయదారి ఎన్నికలు మళ్లీ వచ్చెరా...
బూటకపు ఎన్నికలకు బలైపోకురా... ॥మాయ॥

1

ఓటు హక్కంటూ మోసపోకురా
జిందగి అంత బంది గాకురా ॥జిం॥

కలిగినోళ్లకు ఓటు బ్యాంకువై
కలకాలం నీవు కష్టపడకురా ॥క॥

కులము మతము పార్టీల పేరుతో
కుళ్లపొడిసి నిన్ను చంపుతారురా ॥కు॥

రాజకీయ వ్యాపారములోనా
సరుకువు గాకు సమిధవుగాకు ॥స॥

కళ్లు తెరిచి దోపిడోళ్ల మాయ చూడరా...
ఓటు కన్న తిరగబడే హక్కు మిన్నరా... ॥మాయ॥

2

ఖద్దరు కాంగ్రెస్ మంత్రుల చూడు
పటేలు, నెహ్రూ పాలన చూడు ॥ప॥

వీర తెలంగాణ విప్లవపోరును
నెత్తుటేరుల్లో ముంచేసింద్రూ ॥నె॥

భూపోరాటం అణిచేసింద్రూ
భూస్వాములకే భూములిచ్చింద్రూ ॥భూ॥

ఖాశీం రజ్వీ, నిజాం దొరను
కావలించుకొని సేవలు చేసిరి ॥కా॥

తెలంగాణ కాశ్మీరము గుండెమీదరా...
రావణా కాష్టాలను రగలించిరిరా ... ॥మాయ॥

3

ఇందిర శాస్త్రి వెంగళరావు
చెన్నారెడ్డి నేదురుమల్లి ॥చె॥

ప్రజల రక్తములో జలకమాడిన
పాపిష్టి నరహంతకులు వీళ్లు ॥పా॥

భూసంస్కరణ చట్టము దెచ్చి
భూమి పోరును ఉరిదీయించిరి ॥భూ॥

గరీబీ హటావో అని ఊదరగొట్టి
పేదల బతుకులో చీకటి నింపిరి ॥పే॥

ప్రజా పోరును పాతర వేయ
ఎమర్జెన్సీని ఎత్తిపట్టిరి ॥ఎ॥

శ్రామిక జన ఆకాంక్షల గొంతునులిమిరీ..
సామ్రాజ్యవాదానికి శంఖమూదిరీ... ॥మాయ॥

4
రాయలసీమ పాలెగాడురా
రక్తం తాగే జలగ వీడురా ॥రా॥

పాదయాత్రలో పల్లె ప్రజలను
నమ్మించిన నయవంచకుడు ॥న॥

అందలమెక్కి సిఎం అయ్యి
హామీలన్ని పాతరేసే ॥హా॥

చర్చల పేరుతో నాటకమాడి
ఉద్యమాలపై గన్నులు పేల్చే ॥ఉ॥

చరిత్ర సాక్షిగా తెలంగాణకు
ద్రోహం చేసిన బడా ద్రోహిరా ॥ద్రో॥

రైతు భూములు సెజ్ దొంగలకు
అప్పజెప్పి అభివృద్ధి అంటుండు ॥అ॥

ప్రాజెక్టులంటు దోచుకుంటుండు
పల్లెలను వల్లకాడు చేస్తుండు ॥ప॥

అందిన కాడికి ప్రజలాస్తి దోచేరా...
ఓట్ల లీడరు కోట్లధిపతాయెరా... ॥మాయ॥

5
దళారీ బూర్జువా లొక్కటయ్యిండ్రు
మహాకూటమని మురిసిపోతుండ్రు ॥మ॥

సిగ్గు విడిచి బాబు వెంట వెళ్లిండ్రు
తెలంగాణకు ద్రోహమెంతో చేసిండ్రు ॥తె॥

ఉమ్మడి శత్రువు కాంగిరేసనీ
ఊకదంపుడుపన్యాసమిస్తుండ్రు ॥ఊ॥

మారినమంటు నమ్మమంటుండ్రు
మల్లొక్క సారధికారమంటుండ్రు ॥మ॥

మనలో దళారోల్లే మనకు చేటురా
బాబు, వైఎస్‌ల కన్న బడాచోర్‌లురా ॥మాయ॥

6
అన్నను మించిన హీరోనంటు
అందరివాడి పోజు చూడరా ॥అం॥

సుత్తి సుత్తి డైలాగుల తోటి
కొత్త కొత్తగా లెక్చరులిస్తుండు ॥కొ॥

సినీ కార్మికుల చీకటి బతుకులో
ఏనాడైనా వెలుగైయిండా ॥ఏ॥

రాష్ట్రంలోని రాజ్యహింసను
ఏనాడైనా ఎత్తి సూపిండా ॥ఏ॥

సమాజమంటే ఎరుగనోడురా
సామాజిక న్యాయ మంటున్నాడురా ॥సా॥

యువతను పెడద్రోవన నడిపినోడురా...
ఉద్యమ సూర్యున్నంటు ఉరుముతుండురా.. ॥మాయ॥

7
ఎన్‌డిఎ లు, యుపిఎ లు
ప్రజలకు చేసేందమిలేదు ॥ప్ర॥

యుద్ధాలకు కాలు దువ్విండ్రు
దేశభక్తని పోజుగొట్టిండ్రు ॥దే॥

అణు ఒప్పందం సెజ్‌ల చట్టం
దేశ ప్రజలకు తీరని ద్రోహం ॥దే॥

ఆకలి చావులు నిరుద్యోగము
ఎక్కడ చూసిన పోలీస్ జులుం ॥ఎ॥

అమ్మ సోనియా అడుగుజాడల్లో
దేశం దొంగల పాలవుతుందిరా ॥దే॥

రూపాలు వేరైనా సారమొకటెరా...
రాజకీయ దళారుల లక్ష్యమొకటేరా... ॥మాయ॥

8
అన్నలారా ఓ తమ్ములారా
అక్కలారా ఓ చెల్లెల్లారా ॥అ॥

ఎందరికో మీరు ఓట్లు వేసినా
ఎక్కడి గొంగలి అక్కడే వుండె ॥ఎ॥

బతుకు మారలె భవితమారలె
భారతదేశం స్థితులు మారలె ॥భా॥

రైతు బతుకులో వెలుగే లేదు
కష్టజీవులకు కొలువే లేదు ॥క॥

ఆకలి చావులు ఆగనెలేదు
కట్నపు కొలిమి ఆరనెలేదు ॥క॥

పెట్టుబడిదారీ రాజ్య మాయెరా
ప్రజల బతుకులు సరుకులాయెరా ॥ప్ర॥

పార్లమెంటులో, అసెంబ్లీలో
ప్రజలకు ఒరిగిందేమి లేదురా ॥ప్ర॥

మారదు ఓటుతో నీ బతుకు భవితరా...
శ్రామిక రాజ్యంకై పోరు చెయ్యరా... ॥మారదు॥ ॥శ్రా॥

బాణీ : "రాచకొండ పోరుకేమొ రక్తమిచ్చినా..."

# అప్పుడిస్తనన్నారు

- ఎర్రమల్లె

అపుడిస్తనన్నారు ఇప్పుడిస్తనన్నారు
ఒక్కడొక్కడొచ్చినారు చెప్పిందెసెప్పినారు
వొడ్డుదాటినంక తెప్పతేలేసినారు
సూడరో... సూడరో..
సూడరో మాయదారి లీడర్లనూ
మా తెలంగాణనంత దోచె దోపిడోల్లను ॥అ॥

1
అన్నదమ్ములం అంటె కాదన్నమా
మీరు హైద్రాబాదులొచ్చిపంటె వొద్దన్నమా
ఈ పట్నముల పరాయోల్లు ఎట్లైనరూ
ఈడ ఈడ్సి ఈడ్సి తన్నుడైతె ఎట్లుంటరూ
వద్దురో.. వద్దురో...
వద్దురో ఏర్పాటు వాదమంటరు
అడ్డ గొడవెటినట్టు గోల చేస్తరు ॥అ॥

2
మెం తెలంగాణ అంటె మీరు ద్రోహమంటిరి
ఓపందాలన్నిమిరు తొక్కిపెడితిరి
మా ప్రాంతపోల్లమీ పంచనుంచుకొంటిరి
కావలీ కంచొలె మీకు జెసుకొంటిరి
ఎందిరో... ఎందిరో...
ఎందిరో అందురొల్లు దొంగలుకాద
మా వనరులన్ని దోచుకొనె ద్రోహులు కాద ॥అ॥

ఆత్మర్పణాలు ఎవ్వరాపరెందుకూ
మా అంతిమ యాత్రలడ్డుకుంటరెందుకూ
ఇనుప కంచె పాటకెంత కాలమెల్లరూ
మా ప్రాంత మొదిలి పోకపోతే పతనమైతరూ
లేవరో... లేవరో...
లేవరో లేచిపోరు బాటసాగరో
ఆత్మహత్యలాపి దోపిడోన్నితరుమరో ॥అ॥

# ఏండ్ల కిందటి

ఏండ్ల కిందటి నుండి వేదనా ఈ బతుకు
ఇంకెంత కాలముంటుందో తెలంగాణ
బతుకెంత భారమైందో ॥ఏండ్ల॥

1
రాజులా కాలనా నైజాము ఏలిన
బతుకంత రంపపు కోతా
అయ్యో రజాకారు గూండాల చేతా

పాటేలు పట్వారు పల్లె గుప్పెట వట్టె
ఎట్టి మనుషుల చేసినారో
మమ్ములను బానిసలుగ చూసినారో ॥ఏండ్ల॥

2
ఎట్టి వోతాదాని మట్టి మనుషులమంత
ఎర్రజెండెత్తుకున్నామో తెలంగాణ
ఎదనిండ నింపుకున్నామో
రంగు పార్టీలొచ్చి రాజకీయం చేస్తే
బజార్ల బంగపడ్డాదో తెలంగాణ
అగచాట్ల పాలైనాదా ॥ఏండ్ల॥

3
సదులాపు చేసి సత్తు బడ్డబతుకు
ఎల్లలోకం చాటు తుంద్రో
విద్యార్థి వీరులయ్యి ఎగుసుతుంద్రో
ఉద్యమ పురిటిల్లు చరితల్లో కీర్తిల్లు
సాహసాల దారులెరా తెలంగాణ
పొడుగుత పోరుబాటెరా ॥ఏండ్ల॥

4
మీసాలు మెలితిప్పి కండ్లెర్రజేసేటి
దొరల తరిమిన ధైర్యమంటు
మహిళలు కదనానికి కదిలినారు
ఓడిసెలా రాళ్లిసిరి కారం నీళ్లు సల్లి
యుద్ధమె చేసిన శౌర్యం
పల్లెలు రణరంగమై సాగె పయనం ॥ఏండ్ల॥

# ఆదివాసీల హెచ్చరిక

- డప్పు రమేష్

పల్లవి : మీది ఆపరేషను గ్రీనుహంటు
మాది విప్లవ బలగాల ఫ్రంటు

అభివృద్ధి పేరుతో నువ్వణిచి వేస్తుంటే
విముక్తి పోరుతో నిన్నెదురకుంటాము ॥మీది॥

చరణం 1 :
మాకు కూడుంటె గూడు లేనోళ్లం
మాకు గూడుంటె గుడ్డ లేనోళ్లం
మాకు తెలివుంటె చదువు లేనోళ్లం
మాకు చదువుంటే కొలువు లేనోళ్లం

మా తాత ముత్తాతలా నుండీ
అడవులల్లో నె బతుకుతున్నోళ్లం
జరుగుబాటు కొరకు తిరుగుబాట్లూ చేసె
పాములను చంపేటి చీమలా దండులం ॥మీది॥

చరణం 2 :
కాయ దుంపల్ని కోసుకుని తింటూ
పారె ఏటి నీళ్లను తాగుకుంటూ
అడవి జెంతువుల నేటాడుకుంటూ
కాలె కడుపు మంటను తీర్చుకుంటూ

చెట్లు గుట్టల్ని మొక్కుతూ ఉంటూ
పోడు వ్యవసాయము జేసుకుంటూ
ఏ పూటా కాపూట ఎల్లదీస్తుంటాము.
ఏలెటోళ్లను మేము ఎంటాడుతుంటాము ॥మీది॥

చరణం 3 :
మా అడవుల్లో ఇనుమెంతో వుంది
మా అడవుల్లో బాక్సైటు వుంది
మా అడవుల్లో బంగారముంది
మా అడవుల్లో కలపెంత వుంది

మాకు కోట్ల కోట్లా సంపదున్నా
చిన్న వసతి కూడా లేదురన్నా
మమ్ములను చంపేసి దోచుకెళ్లా జూస్తే
మిమ్ములను చంపేసి కాపాడుకుంటాము ॥మీది॥

చరణం 4 :
నీవు అభివృద్ధి అభివృద్ధి అంటూ
నీవు అడవుల్లో రోడ్లేసుకుంటూ
నీవు కంపెనీలను బెట్టుకుంటూ
నీవు తూపాకులను పేల్చుకుంటూ

గీడ నక్సలైటులున్నరంటూ
మమ్ములడవుల్ని కాలి జెయ్‌మంటూ
అడ్డురావద్దంటు మము సంపివేస్తుంటె
అడివంటుకున్నట్టు మేమంటుకుంటాము ॥మీది॥

చరణం 5 :
మా అడవుల్ని తవ్వెయ్య జూస్తే
మేము బాకులయ్యీ మొలుస్తాము
మా కొండల్ని కాజెయ్య జూస్తే
మేము బండలయ్యీ పేలుతాము

మీ మిలిటరీ సైన్యాలు వస్తే
మేము ఆదివాసీ సేనలౌతం
సంబర పడిపోకు చిదంబరం నువ్వు
హిట్లరు కంటె నువ్ గొప్పోని వేంగాదు ॥మీది॥

చరణం 6 :
మీరు నగరాలనూ అమ్ముతుంటే
మేము గరమయ్యి పోలేదు ఎపుడూ
మీరు పల్లెలను వల్లకాడు జేస్తే
మేము కలవరా పడలేదు ఎపుడూ

మీరు సెజ్‌లూ కారిడార్లంటే
మేము గాబరై పోలేదు ఎపుడూ
అన్నిటిని మింగేస్తు అడవి దాకా వస్తే...
అడవిలో మీ పప్పులుడకనీయం మేము... ॥మీది॥

చరణం 7 :
నీకు బుస్సులూ ఓబామాలుంటె
మాకు అల్లూరి ఆజాదులుంద్రు
నీకు సోనియా మన్మోహనుంటే
మాకు స్వర్ణక్క జ్యోతక్కలుంద్రు

నీకు బూటకపు రాజ్యాంగముంటే
మాకు బుద్ధిజీవులు మద్దతుంద్రు
అవినీతి బాగోతమాడనియ్యం గీడ
అంతిమంగ మమ్ము రక్షించుకుంటాము ॥మీది॥

చరణం 8 :
నీకు అమెరికా షైటులూ ఉంటే
మాకు నక్సలూ బరిలైటులున్నయ్
నీకు అణచివేతనుభవాలుంటే
మాకు తిరుగుబాట్లనుభవాలున్నయ్

నీవు కలలు గంటూ మురిసిపోకు
నీవు కాగితప్పులి వేర బిడ్డా
కూడ బెట్టిందంత కరిగిస్తముర కొడక
నీడ నిస్తం మేము భారత ప్రజలాకు ॥మీది॥

అ

కవిత్వం

# నెత్తుటి నివాళి

- చలసాని ప్రసాద్

నా ఓరుగల్లు కన్నతల్లీ!
నా పోరుగల్లు పోరుబిడ్డా!

కనీ, పెంచి పాలు తాపిన తల్లీ!
కలిసి, కరిగి కడుపున పుట్టిన బిడ్డా!

జనతా 'జనార్దను'ని నెచ్చెలీ!
'వికాసా'నికి వెలుగులద్దిన వెన్నెల వరదా!

'శాఖమూరి' అంతిమయాత్రలో
కలిసిమెలిసి కవాతు చేశాం

అలుపులేని అన్వేషణ మనది
అలసటెరగని పరుగు మనది

మహాకవిని మననం చేసుకుంటూ
విశాఖ సాగరంలో ఓలలాడాం

కవిత్వాన్ని నినదిస్తూ
వీథుల్లో ఊరేగాం

చెన్నపట్నపు సముద్ర తీరాన
పిచ్చిక గూళ్లు కడదామని కలలుగన్నాం

ఇంతలో ఏమిటీ నైశాచర నాటకం?
ఎందుకీ పైశాచిక తాండవం?

నీకోసం ఎక్కడని గాలించను?
నువ్వెక్కడున్నావని ఏ చుక్కనడగను?

నిత్యం నీ మననమే నా జీవనయానం
మరో ప్రపంచంలో మనం కలవక మానం.

(జూన్ 6వ హత్యకు గురైన తనూజ సంస్మరణలో)

# మెదక్ మల్లియ

- ఎన్.డి.

నగరానికైన గాయాల్ని
కడుక్కుందామని మంజీర ఒడ్డుకు చేరినప్పుడు
మొదటిసారి చూశాను
పట్టుమంటే పిడికిట్లో ఇమిడిపోయే
పాలమీగడలాంటి ఆ మెదక్ మల్లియను

ఏటిమీది వెన్నెల్లా తుళ్లుతూ
కానరాని దారులెమ్మట పైలెట్‌గా చరచరా చాకచక్యంగా పాకుతూ
పనిలో పనిగా అన్నట్లు
నా హృదయంలోకీ ఒక్క గెంతు గెంతింది లేడిపిల్లలా

నేను ముచ్చటపడ్డం చూసి
పద్నాలుగు, పదిహేనేళ్లకే సైన్యంలో చేరతామని జిద్దు చేస్తున్న
రైతుబిడ్డలుంటున్న నేపథ్యంలోనే కావొచ్చు
'మరీ అంత చిన్నదేం కాదు' అని సహచరులన్నప్పుడు
ఉంటుందామె వయసు పంతొమ్మిదో, మరో ఏడు అటో ఇటో

అలా గాయాలపాలై కలిసినప్పుడల్లా
మంజీరతో పాటే గలగలా పారుతూ
నా గాయాల గుర్తుల్ని ఆర్తిగా తడిమేవారు తనూ, తన సహచరులూ...

మొక్కజొన్నచేలో కంకులూ, పూరీలతో పాటు
ఆప్యాయతనూ కొసరి కొసరి వడ్డించాక
రాధక్క * నా బుగ్గల్ని ముద్దాడి
నగర ఖాకీరణ్యంలో జాగ్రత్తల్ని వాగ్దానంగా తీసుకొని వీడ్కోలిస్తే
ఈ చిన్నారి 'కమలవ్వ' కూడా
దిగులు కళ్లేసుకుని వెనకాల వెనకాలే తిరుగుతూ
అదే తన చివరి చూపు అని ఊహించని నాతో
'మళ్లీ కలవాలె, ఏం కావద్దు' అంటూ

వాళ్లందరి ఆకాంక్షలే ఆశీర్వాదాలైనట్లు
నేనింకా ఈ కవితను రాస్తూ సజీవంగా ఉంటే
వాళ్లంతా అందనంత ఎత్తుకి అమరులై వెళ్లిపోవటం ఎంత దుర్భరంగా ఉందీ!

ఇకాతర్వాత
దశాబ్దానికి పైగా
ఎన్నెన్ని ఒడిదుడుకుల దారుల్లోనో ఆమె పయనం
కానీ
దారి తప్పని పైలెట్‌గానే చివరివరకూ...

ఒకవైపు సహచరునితో సహా ఎందరో ఆత్మీయుల అమరత్వాలు
మరోవైపు కొవర్టులూ, పలాయనాలూ, పితృస్వామ్యపు కోరలూ...
రిట్రీట్‌లూ, అడ్వాన్సులూ...
మైదానాలూ, అడవులూ, పట్టణాలూ...

అదంతా
తనను తాను నిలబెట్టుకుంటూ
ఉద్యమాన్ని నిలబెట్టుకోడానికి
కష్టాలకొలిమిలో
శరీరాన్ని మనసునూ ఉక్కుగా రాటుదేల్చుకుంటూ సాగిన
ఒక విప్లవ పరిణామ క్రమం

ఒక లేతమొక్క
దృఢమైన వృక్షంగా శాఖలేసిన
ఒక జీవ పరిణామ క్రమం

వరస దెబ్బలకు తల్లడిల్లుతూ
ఎక్కడుందో, ఎలా ఉందో అన్న ప్రశ్నలకు
కుశలమే అన్న జవాబు మనసును చల్లబరచేంతలోనే

తెలతెల్లని మల్లియ ఎర్రెర్రని మందారంలా
నేలకొరిగిన దృశ్యం
మంజీరనీటి తీయదనాన్నే కాదు
మెదక్ నేల దృఢత్వాన్నీ పుక్కిట పట్టిందేమో అన్నట్లుగా...

ఇప్పుడిక
కంటినిండా నీళ్లతో
గాయాలపాలై నా ఒడ్డుకు చేరింది మంజీర

ఏమని ఓదార్చను?
తెలంగాణ మైదానాల్లోకి మరోసారి పిఎల్‌జిఏ ప్రవహించేవరకూ
అనన్యమైన ఆ వీరయోధులగాథల్ని పాడుతూ కవాతు
చేయమని తప్ప?

(27.10.2008న బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించిన జిల్లా కమిటీ సభ్యురాలు కా. సరిత (కమల, అరుణ) స్మృతిలో.
* రాధక్క అంటే 2003లో అమరురాలైన కా. సుగుణ. అప్పుడు రాధక్క పేరుతో మెదక్ జిల్లా కమిటీ సభ్యురాలుగా పని చేస్తుండింది.)

# శ్యాము! ఈ విప్లవం నీ కోసమే కదూ...

'గొర్రెపిల్లల గుంపు వాడి కళ్లల్లో'
శివారెడ్డి రాసింది పసివాడి గురించే అయినా
నీ కళ్లను చూసినప్పుడల్లా ఈ వాక్యమూ
ఈ వాక్యాన్ని చూసినప్పుడల్లా నీ కళ్లూ

నగరం నుండి నల్లమలకు వలసొచ్చినవాళ్లంతా
నీ కళ్లలోని స్వచ్ఛమైన అమాయకత్వానికి దాసోహమైనా
అది కూడా గుర్తించలేని నువ్వు
సదా నిజాయితీగా
నీ విప్లవకర డ్యూటీల్లో తలమునకలుగా

డ్యూటీలన్నిటినీ వంక లేకుండా ముగించుకుని
బడి సమయానికి ఠంచనుగా పలకా, పుస్తకం పట్టుకుని నువ్వు వస్తుంటే
'రాముడు కాదు శ్యాముడు మంచి బాలుడు' అని నిర్వచనం మార్చుకోవాలని
ఎన్నోసార్ల ముచ్చటపడ్డ విషయమూ నీకు తెలిస్తేనా

నలుగురు కూడి నవ్వేవేళ
విప్లవానంతరం నువ్వేం చేస్తావంటే నువ్వే చేస్తావంటూ
'టీచర్నవుతా' 'రోడ్లేస్తా' 'చెట్లు నాటుతా' అనుకుంటూ
ఏవో ఊహల ఊయలలూగినపుడు
'మా శ్యాం మాత్రం విశ్వవిద్యాలయానికి వెళ్తాడు' అనుకునేదాన్ని నేను

సాంస్కృతిక విప్లవ కాలంనాటి చైనాలో వలే
ప్రజల ప్రయోజనాలే సర్టిఫికెట్లుగా
కాయలు కాచిన చేతులే దరఖాస్తుఫారాలుగా
జ్ఞానానికై దాహంతో చాచే చూపులే అర్హతగా
'మా శ్యాం నంబర్‌వన్ విద్యార్థిగా తనివితీరా చదువుకుంటాడు'
అని కలలు కనేదాన్ని

'ఎందుకు శ్యామూ చదువంటే నీకీ తపన' అని
కుతూహలంగా ప్రశ్నించినపుడు
'రేపు బాధ్యతలు పెరిగితే చదువు రాకుంటే ఎలా' అని
ముద్దు ముద్దు మాటలతో నీవు వివరించినపుడు
ఆ కారణంతో కొందరు విప్లవాన్ని విడిచిపెడతామనడం
నీ జ్ఞాపకాల్లో కలుక్కుమనే ఉంటుందనుకున్నా

చిన్నప్పుడు పుస్తకాలకు కాళ్లు తగిలితే
సరస్వతికి కోపం వస్తుంది, కళ్లు పోతాయంటూ లెంపలేసుకునేవాళ్లం
నిన్ను చూశాక
నీలాంటి వాళ్లన అరమైలు దూరంలో ఉంచేసిన ఆ చదువుల తల్లి
ఎంత పాపిష్టిదో
ఎంత అగ్రవర్ణ దురహంకారో
ఎంత అగ్రవర్గ పక్షపాతో
మరింతగా... మరింతగా...

నీ కాళ్లు కడిగి
ఎర్రతివాచీ పరచి నిన్ను విద్యాలయంలోకి ఆహ్వానిస్తేగానీ
శాపవిమోచనం కలగదని ఆనాడే ఆమెని శపించాను
అప్పటినుండి ఆమె
మన బడి చుట్టూ నీ కరుణా కటాక్షాలకై అశ్రులు చాస్తూ
తిరుగుతూనే ఉంది

ఇంతలోనే
విప్లవానంతర విశ్వవిద్యాలయాల్లో
నీలాంటి వాళ్లందరికీ
గ్యారంటీగా సీటు ఇప్పించడం కోసం
విప్లవ జీవితపు పరీక్షలో నువ్వు డిస్టింక్షన్‌తో పాసైపోయావనే వార్త

'శ్యామూ! ఈ విప్లవం నీ కోసమే కదూ' అని
అనుకున్న సందర్భాలన్నీ గుర్తుకొచ్చి
జనతన సర్కార్ల కింద బడికి వెళ్తున్న పిల్లల కళ్లల్లోకి చూశాను
ఎప్పట్లాగే నువ్వు అక్కడే

(గునుకురాయి ఆంబుష్‌లో అమరుడైన కా. శ్యాం (అంజన్న, సంతోష్) స్మృతిలో...)

# ఆవిష్కరణం

- ఎం. రాఘవాచారి

ఒక చంద్రిమ
వెలుతురు వానైకురిసి
వెన్నెలలు పూయించి పూయించి
తనలోకి తానే ముడుచుకున్నట్టు
అంధకారానికి అంధకారమద్ది
తమస్సును ఆవిష్కరించింది

ఒక జలధి
ఆడినట్టే ఆడి
పాడినట్టే పాడి
అలలు అలలుగా సంఘర్షించి
ఒడ్డున బీభత్స దృశ్యాలు పరిచింది,
పక్షి మీద లేదు
ప్రాణి మీద లేదు
నిర్మమకారంగా
సునామీలు పరిచి
శ్మశానాలు ఆవిష్కరించింది

ఒక సూర్యతేజం
పుట్టుకకు ప్రాణం పోసింది
గండశిలల్ని కరిగించి
హిమానీ నదాలు పారించింది
కిరణ కరస్పర్శనిచ్చి
జలధిని కౌగిలించి
భూమండలానికి
జలచక్రపు కంకణం తొడిగింది
తనమీద తానే పగబూనినట్టు
నిప్పుల వానై కురిసి
దగ్ధగీతాలు పాడుకుంటోంది

ఒక మానవి
ప్రకృతి ఆగ్రహానికి అనుగ్రహానికి
పాలనా దౌష్ట్యానికి పడిపోని
ఆలోచనలు తొడిగి
చెలిమికి చెలిమిని జతచేసి
చుట్టుకునే వైరుధ్యాల్ని విప్పేకలల్ని
చలన శీలం చేసి
వేనవేల అంధకార సముద్రాల మీద
శ్మశానాల మీద
దగ్ధగీతాల మీద
యుద్ధం ప్రకటిస్తోంది
మానవ మస్తిష్కంలో
ఇంద్రధనస్సులు పూయించి
వినూత్న గీతాలందుకుని
కొత్తలోకాలు ఆవిష్కరిస్తుంది.

# నమ్మకం గురితప్పలేదు

ఆదేశాలు జారీ చేస్తాం
అమలు చేసే మనుషులు కావాలి
సుఖంగా ప్రయాణం చేస్తాం
మోసే బోయీలు కావాలి
గొప్ప చరిత్ర సాధించిన దేశంలో
ఈ మాత్రం సౌకర్యం ఉండాలి

మేం అసెంబ్లీలు పార్లమెంటు ఏర్పరుస్తాం
సంభావించి సంవిధానాలు చేసే నాయకులు కావాలి
మేం కోర్టులు ఏర్పరుస్తాం
కోరిన తీర్పులు చెప్పే న్యాయమూర్తులు కావాలి
మేం పాలనా వ్యవస్థను అల్లుతాం
మట్టికి వాసన ఉంటుందని
మట్టికి స్పర్శ ఉంటుందని
మట్టి మనిషిని కంటుందని
ఊహించే తలలు లేని మనుషులు కావాలి

మేం ఏది చెబుతామో అది ఊహించాలి
మేం ఏది చెప్పమో అదీ ఊహించాలి
ఊహల దగ్గర ముడుచుకుపోకుండా
దివారాత్రులు కష్టపడే మనుషులు కావాలి

కష్టపడే మనుషులుంటే మాకు చచ్చే ప్రేమ
మీ ప్రేమలో పడి చస్తాం మేం
'కష్టేఫలీ' అనికదా మన పెద్దలన్నారు
కష్టపడే మనుషుల శ్రమకు
ఇష్టపడి వన్నెతెచ్చే మమ్మల్ని
అర్థం చేసుకునే మనుషులే మాకు కావాలి

మీరు పండిస్తే సరిపోయిందా?
మీరు యంత్రాలై అద్భుతాలు సృష్టిస్తే సరిపోయిందా?
అనుభవంలో కదా ఉత్పత్తుల వైభోగం బైటపడేది
ఉత్పత్తులు పంచుకుంటూంటే సరిపోయేదా
సరుకును చేసినందుకే గదా
దేశాలు దేశాలుగా
ప్రభుత్వాలు పెట్టి పాలనాపెట్టి
నడిపిస్తున్నందుకే గదా
ఈ మాత్రమైనా చలనమున్నది
ఈ చలన్నాన్ని ఇట్లాగే
పట్టాలు జారకుండా నడిపించే మనుషులు
మాకు కావాలి

ఎంత ప్రమాదం
కింద పడిపోతే మిగులుతామా?
ఇది మామూలు ప్రయాణమా?
మనుషులతో వ్యవహారం
జాగ్రత్తలు అవసరం

ఇక్కడో మనిషి అక్కడో మనిషి
అక్కడో అడవి ఇక్కడో అడవి
కదులుతున్నట్టు కనిపిస్తోంది
ఏ మాత్రమైనా ముందు చూపు అవసరం కదా

నీళ్లమీద కదలికలు
డేంజర్
జలసైన్యాన్ని సిద్ధం చేశాం
గాలిలో కదలికలు
మహాప్రమాదం
వాయుసేనల్ని సిద్ధంగా ఉంచాం
నేలమీదా కదలికలు
మొగ్గలోనే తుంచాలి
అనేకానేక ఆయుధాలతో పదాతిదళాలు సిద్ధం

కొత్తగా నిర్ణయించాల్సినవి లేవు
నిర్వచించాల్సినవి లేనే లేవు
అన్నీ నిర్ణయమైనవే
గుమాస్తా మీది
అధికారి మీది
అధికారిమీద
దాని అబ్బున్నర పార్లమెంటు మీద
అధికారం మాది
అది నిర్ణయమైపోయింది

ఆయుధం మీది
ఆయుధం మీది
ఆయుధం మీద
అధికారం ఎవరిదో
అది ఎక్కుపెట్టవలసింది ఎవరి మీదో
ఎపుడో నిర్ణయమైపోయింది

నీరు భూమి పరిశ్రమ
ఎవరెవరి ఆధీనంలో ఉండాలో
పత్రిక టివి
ఎట్లా నడవాలో ఎవరెవరు నడపాలో
ఏనాడో నిర్ణయమైంది

అందమైన పదబంధాలు కూర్చి
అందమైన భావజాలాన్ని గుప్పించి
ఎవరెవర్ని ఎట్లా వశపరచుకోవాలో
మేధావులు ఎవరివైపు నుంచి మొరగాలో
మరింత స్పష్టంగా నిర్ణయమైపోయింది

ఏరోటి ముందర ఆరోటి పాట
ఏ దేశపు నోట ఆ దేశపు మాట
పెట్టుబడికి మతానికి
మతానికి వర్ణధర్మానికి
పీట ముడివేసి

సంస్కృతీ నిర్మాణం చేస్తున్నవాళ్లం
సత్యాన్ని వశపరుచుకున్నవాళ్లం
అహింసను అనశనవ్రతాన్ని పాటిస్తున్న వాళ్లం
ప్రబోధిస్తున్నవాళ్లం
వ్యవస్థను చట్టపరిధిలో నడుపుతున్నవాళ్లం
(మాఫియాలకి మినహాయింపులున్నాయి)

మాకోసం సుందర భవనాలు నిర్మించిన మీచే మీతోనే
మీకోసం గుళ్లు గోపురాలు కట్టించినాం కదా
ఎన్నెన్ని లాంఛనాలు నడుపుతున్నాం
మా చేతిలోని విద్యకు వైద్యానికి చిల్లర వితరణకు
దాసోహం కాని వాడెవడైనా ఉన్నాడా?

విశ్వాన్ని విపణి చేసి మోయిస్తున్న పాటకు
కోరస్ పలుకని వాడెవడైనా ఉన్నాడా?
అసలు ఊగిసలాట లేనివాడెవడున్నాడు?
చిన్నో చితకో యజమాని అవతారమెత్తని వాడెవడున్నాడు?
ఇలా మమ్మల్ని అర్థం చేసుకుని
కదిలే మనుషులే మాకిప్పుడు కావాలి

ఆడింది ఆడే మనుషులు
పాడిందే పాడే మనుషులు
పొగడ్తలకు 'బుంగ'లయ్యే మనుషులు
తలాతోకా శంకించని మనుషులు
వట్టి సరుకులైన మనుషులు
కాల సూచిక ముల్లు చూడక నెత్తురు పిండుకునే మనుషులు
కష్టించే మనుషుల్లాంటి మరలు మాకు కావాలి

ఎవడైనా కాదు కూడదు అంటే
అడ్డంగా దాడికొస్తే
అడ్డుకునే వ్యవస్థలున్నాయి
బలమైన నిర్మాణాలున్నాయి
బయళ్లను జైళ్లను ఒంటి చేత్తో నడిపే
అనుశాసనాలున్నాయి
ప్రపంచమిప్పుడు శాంతిని కాంక్షిస్తున్నది
మాకు శాంతి సాధకులు కావాలి

దిక్కరించే మనుషులున్నారంటావా?
అదుపును సాధించిన అనుభవాలున్నాయి
ఎదిరించే వాడి ప్రాణం
దాడిచేసే వాడి ప్రాణం
ఉంటే ఎంత? పోతే ఎంత?
వ్యవస్థకు వచ్చిన ముప్పేమీలేదని మాకు తెలుసు
అయినా నిర్మించిన విశ్వాసాల కోసమే
వాణ్ణి ముగించి తీరాలి
చట్టప్రకారమే ఈ పని జరగాలి
ఎవరి ప్రాణాల విలువ ఏపాటిదో చట్టానికి తెలుసు

నమ్మదగ్గ విషయం ఒకటుంది
సంతోషించదగ్గ విషయం ఒకటుంది
చట్టం నిర్ణయిస్తే చాలు
ఉరితీసే పనికైనా పోటీ పడే దేశభక్తులకు
కొదవలేని దేశం కదా ఇది

ఈ దేశభక్తి
ఈ చట్టాలు ఈ మనుషులు
కొండంత ఆసరా మాకు

(ఈ కవిత ప్రేరణ : 1) అధికారం ఆయుధం ఎవరి చేతిలో ఉండాలో నిర్ణయమైపోయిందని వై.ఎస్.ఆర్. ప్రకటన. 2) ఆదివారం ఆంధ్రజ్యోతిలో సంవేదనలో కె. శ్రీనివాస్ సందర్భం. 3) ఉరితీసే పనికి మేం సిద్ధమని ఇద్దరు రాజకీయ కార్యకర్తలు, ఒక కారు డ్రైవరు ముందుకొచ్చినట్లు ఆంధ్రజ్యోతిలో ఈ రోజు (17.5.2010న) వార్త. 4) ప్రభుత్వమంటే 'మనమే' అనే 'మధ్యతరగతి' భ్రమ.)

# వేసవి పరీక్ష గది

ఠంగ్‌మని గంట
పక్షులు చెట్టు మీదికి చేరినట్టు
బిలబిలా పిల్లలు తరగతి గదిలోకి
ఎక్కడి వారక్కడ సర్దుకునే ప్రయత్నం
ఒకరికొకరు సర్ది చెప్పుకునే ప్రయత్నం
శబ్దాన్ని మింగాలని
నిశ్శబ్దానికి నిశ్శబ్దం నేర్పాలని ప్రయత్నం

శబ్దానికి ఊపిరులూదే పిల్లలు
ఉచ్ఛ్వాసకు నిశ్వాసకు
నిశ్శబ్దాన్నే నేర్పుతున్న ప్రయత్నం

బయట తీవ్రమైన ఎండ
గదిలోపల పరీక్షలాగే
పరీక్ష మీద పరీక్ష అది
గాలికి నిప్పులద్ది గదిలోకి తరుముతున్నది

నడక మరచిపోయిన గాలి
నిప్పుల గుండంలో తిరిగినట్టుగా
తరగతి గదిని అగ్నితప్తం చేస్తున్నది

ఇప్పుడు తరగతి గది అగ్నిగర్భంగా ఉన్నది
దేహమ్మీది చెమటను గుమ్మరిస్తున్నట్లుగా ఉంది
గాలికోసం తనువంతా చేతులై కదుపుతున్నట్టుగా ఉంది
ఒక్కసారిగా కదులుతున్నట్టుగా ఉంది
అలిసి నిశ్చలంగా కూర్చున్నట్టుగా ఉంది
ఉత్త ఊపిరినే శబ్దంగా పలికిస్తున్నట్టుగా ఉంది
నిశ్శబ్దంగా ఉంది

నిశ్శబ్దాన్ని జయిస్తున్నట్టుగా ఉంది
గీతలు గీస్తున్న శబ్దం
స్కేళ్లు కదులుతున్న శబ్దం
పెన్నో పెన్సిలో రాస్తున్న శబ్దం
కాయితం కదులుతున్న శబ్దం
శబ్దానికి ప్రాణం పోస్తున్నట్టుగా ఉంది

శుద్ధ నిశ్శబ్దంగా
పెదవుల కదలికలతో
ఉచ్చారణ సంకేతాలతో
శబ్దాల్ని పంచుతున్నట్టుగా ఉంది

ముఖయంత్రాన్ని విద్యుత్తు చలనంలో ఉంచి
కంఠం నించి గుమ్మరించినట్టు
పెదవుల దరులొరుసుకునివచ్చి
గాలిలో ప్రవేశించి
ఊరు ఊరంతటికీ ఒక మోతలా వినిపించే శబ్దం
దేహంలోకి ముడుచుకుపోతున్నట్టుగా ఉంది
రెండు కళ్లూమూసి
తెలియని విషయాల్ని
మనో నేత్రంతో దర్శిస్తున్నట్టుగా ఉంది
ప్రశ్నకు సమాధానమేమిటని ప్రశ్నిస్తున్నట్టుగా ఉంది

చూడకుండా రాయమని చేసే హెచ్చరికలకు
నవ్వుకుంటున్నట్టుగా ఉంది
అక్షరం
మనఃఫలకం మీద ప్రాణం పోసుకోకుండా
శ్రవణ పేయం కాకుండా
సమస్త ఇంద్రియాలకు అనుభూతం కాకుండా
అసలు దర్శించకుండా
రాయటం ఎట్లా సాధ్యం అని ప్రశ్నిస్తున్నట్టుగా ఉంది అ

# ఏప్రిల్ 29న విశాఖలో విరసం సర్వ సభ్య సమావేశం చేసిన తీర్మానాలు

## శ్రీశ్రీ సాహిత్యాన్ని ముఖ్యమంత్రి రోశయ్య ఆవిష్కరించడాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది

మళ్లీ అదే చరిత్ర పునరావృతమైంది. శ్రీశ్రీని కైవసం చేసుకోడానికి పాలకవర్గ శక్తులు ప్రయత్నించాయి. నక్సల్బరీ శ్రీకాకుళ పోరాట ప్రజ్వలన దేశమంత నూతన వెలుగులకు స్వాగతం పలుకుతున్న తరుణంలో ఆనాటి బూర్జువా శక్తులు శ్రీశ్రీ అటువైపు వెళ్లకుండా అడ్డుకోడానికి చేసిన విఫలయత్నం వంటిదే ఒక ప్రహసనంగా ఆయన శతజయంతి సందర్భంలో పునరావృతమైంది.

1970లో నక్షత్ర సప్తకం ఆధ్వర్యంలో పాలకశక్తులు, సినీ శక్తులు శ్రీశ్రీకి సన్మానం, పర్స్ బహుమానం పేరుతో పెద్ద కుట్రపన్నాయి. కానీ శ్రీశ్రీ ఈ కుట్రకు బలికాలేదు. ఆయనలో నిశితమైన విప్లవ చైతన్యం వల్ల ఆయన శ్రీకాకుళ పోరాటం పక్షాన నిలబడ్డాడు. విశాఖ విద్యార్థుల పేరుతో ఆయన్ను తాకిన విప్లవ కెరటంలో ఆయన సంచీనమై చివరిదాకా విప్లవ సాహిత్యోద్యమ సేనానిగా నిలబడ్డాడు.

అప్పటికీ ఇప్పటికీ సందర్భం మారిపోయి ఉండవచ్చు. శతజయంతి వేళ శ్రీశ్రీని తమలో కలుపుకోడానికి బూర్జువా శక్తులు, శ్రీశ్రీ భక్తులు, కేవలం ఆయన పేరును, కవితలన్నీ పలవరించే వీరారాధకులు ఒక్కటయ్యారు. నక్షత్ర సప్తకం స్థానంలోకి మనసు ఫౌండేషన్ వచ్చింది. కాసు బ్రహ్మానందరెడ్డి స్థానంలోకి కొణిజేటి రోశయ్య వచ్చాడు. అక్కినేని నాగేశ్వరరావు బదులు సినీ, రాజకీయ నాయకులు చిరంజీవి వచ్చాడు. సందర్భాలు, పేర్లు, తీర్లు మారినా 1970 నాటి ప్రజావ్యతిరేక వర్గకలయిక ఇది. శ్రీశ్రీ సాహిత్య సంపుటాలను మనసు ఫౌండేషన్ అచ్చేసి రోశయ్య చేతుల మీదుగా ఆవిష్కరించాలని, క్యాసెట్లను చిరంజీవి విడుదల చేయాలని తలపెట్టిన కార్యక్రమాన్ని శ్రీశ్రీ విషయంలో ఇవ్వాల్టి కుట్రగా భావించవచ్చు. 1970 నాటి ఉదాహరణతో పోల్చవచ్చు.

ఈ ఏడాదిపాటు సాహిత్యరంగంలో శ్రీశ్రీ సంత నడిచింది. ఈ మొత్తంలో శ్రీశ్రీలోని విప్లవాంశ పట్ల అపారమైన గౌరవంతో, మమేకతతో, ఆయన కవిత్వాన్ని సమకాలీనంగా ప్రజల పరం చేయాలనే ఉద్దేశ్యంతో కృషి చేసిన బృందాలు ఉన్నాయి. మనసు ఫౌండేషన్ ఈ సందర్భంగా శ్రీశ్రీ సాహిత్యాన్ని మరోసారి పునర్ముద్రించింది. ఇలాంటి ప్రయత్నాలు శ్రీశ్రీలాంటి వాళ్ల విషయంలో చాలా జరుగుతూ ఉంటాయి. వాటిని తప్పుపట్టనవసరం లేదు. ఈ సంస్థ గతంలో రావిశాస్త్రి సాహిత్యాన్ని కూడా అచ్చేసింది. కానీ శ్రీశ్రీ సంపుటాలను ముఖ్యమంత్రి రోశయ్యచే ఆవిష్కరింప చేయాలనుకోవడమే తీవ్ర అభ్యంతరం.

1970 నాటికీ ఇప్పటికీ మారిన సందర్భంలో ఒక గుణాత్మకమైన సానుకూల అంశం ఉన్నది. తన మహాప్రస్థాన గేయాలతో అంతర్జాతీయ సోషలిస్టు విప్లవం గురించి, ఫాసిస్టు యుద్ధ వ్యతిరేకంగా ప్రజాస్వామ్యం గురించి రాసిన శ్రీశ్రీ అనేక కల్లోలాను, శ్రామిక ప్రజల గెలుపు ఓటములను, ఆశా నిరాశలను అధిగమించి 1970లో నక్షత్రసప్తకం తలపెట్టిన కుట్రను ఛేదించుకుంటూ శ్రీకాకుళ ఆదివాసుల సాయుధ పోరాటం పక్షాన వచ్చి చేరాడు. ఆయన అప్పటికి నలభై ఏళ్లుగా కలగంటూ, గానం చేస్తూ, ఎత్తిపడుతున్న విప్లవాన్ని ఆయన అత్యంత నిర్దిష్టంగా ఈదిన ప్రజల విముక్తి పోరాటంలో, ఆదివాసీ సాయుధ పోరాటంలో దర్శించాడు. అంటే తాను అంతవరకు నమ్ముతూ, రాస్తూ, అన్వేషిస్తూ వచ్చిన తన సాహిత్యాన్ని తనే నక్సల్బరీ పరం చేశాడు. అచ్చమైన నక్సల్బరీ తీరం విప్లవ కవిగా పునర్జన్మించాడు. తెలుగు నేల మీద విప్లవం కోసం పనిచేసిన, రాసిన, ఆలోచించిన, అభిమానించిన మూడు తరాల్లో శ్రీశ్రీ ప్రేరణ శక్తిగా మారి పదే పదే సజీవమవుతూ వచ్చాడు. సమకాలీనమవుతూ వచ్చాడు. ఈ నలభై ఏళ్లలో ప్రజాపోరాటాల గురించి, ప్రజాసాహిత్య, సాంస్కృతిక కళారంగాల గురించి కృషి చేసిన వాళ్లలో చాలా మంది తాము శ్రీశ్రీ సాహిత్యంతో ఈలోకంలో కళ్లు తెరిచామని చెప్పడం గమనించవచ్చు.

1970లో శ్రీశ్రీని దారి మళ్లించాలని బూర్జువా శక్తులు పన్నిన కుట్ర విఫలమయ్యాక శ్రీశ్రీ కవిగా, పౌరహక్కుల నాయకుడిగా, వ్యక్తిగా కూడ విప్లవంలో విడదీయలేని భాగమయ్యాడు. అందువల్ల శతజయంతి చివరిరోజు జరిగినది ఒక బూర్జువా ప్రహసనం మాత్రమే. అయితే సాహిత్యరంగంలో వర్గాతీత భావజాలం పేరుకపోయిందనే సంకేతం ఇది తెలియజేస్తోంది. వర్గ సంఘర్షణ ఒక స్పష్టమైన రూపం తీసుకుని అటో ఇటో తేల్చుకోమన్న కాలంలో తటపటాయింపులు లేకుండా పోరాడే ప్రజల పక్షాన నిలిచిన శ్రీశ్రీ సాహిత్యాన్ని పాలకవర్గ ప్రతినిధి అయిన ముఖ్యమంత్రి చేతుల మీదుగా ఆవిష్కరింపచేయాలని సాహిత్య ప్రచురణకర్తలు అనుకోవడం అతి ప్రమాదకరమైన సంకేతం. తీవ్ర అభ్యంతకరమైన పోకడ. ఏప్రిల్ 30న హైదరాబాద్‌లో జరిగిన ఈ కార్యక్రమం పట్ల శ్రీశ్రీ అభిమాన బృందాలకు తమను తాము శ్రీశ్రీ వారసులమని ప్రకటించుకునే వ్యక్తులకు అభ్యంతరం లేకపోవడమే దీనికి ఉదాహరణ.

శ్రీశ్రీ ఏ ఆదివాసీ సాయుధ పోరాటానికి ఉత్తేజితుడై విప్లవం పక్షానికి వచ్చి చేరాడో, ఆ ఆదివాసులపై ఇవాళ భారత ప్రభుత్వం ఒక యుద్ధమే చేస్తోంది. శ్రీకాకుళంలో బూటకపు ఎన్‌కౌంటర్లకు, కుట్ర కేసులకు, ఉరిశిక్షలకు వ్యతిరేకంగా పనిచేసిన శ్రీశ్రీ ఈ యుద్ధాన్ని మరింత తీవ్ర స్వరంతో, అభినివేశంతో వ్యతిరేకించే వాడు. శ్రీశ్రీ శతజయంతి - గ్రీన్‌హంట్ యుద్ధం కాకతాళీయంగా ఒక సందర్భంలో కలిసి ఉండవచ్చుగాని, ఇవాళ శ్రీశ్రీ స్ఫూర్తి అంటే ఆదివాసులపై, విప్లవోద్యమంపై సామ్రాజ్యవాద అండదండలతో భారత ప్రభుత్వం చేస్తున్న యుద్ధాన్ని వ్యతిరేకించడమే.

కానీ తెలుగు కవులు, రచయితలు శ్రీశ్రీలోని ఈ స్ఫూర్తిని స్వీకరించలేదని, వర్గాతీత పరమ సాహిత్యకారులుగా తయారై పోయారని శ్రీశ్రీ శతజయంతి వేడుకలు - అందునా ఈ ముగింపు నాడు హైదరాబాదులో రోశయ్య చేతుల మీదుగా పుస్తకావిష్కరణ, విజయవాడలో శ్రీశ్రీ విగ్రహావిష్కరణల సందర్భంగా స్పష్టమవుతోంది.

ఈ పోకడల పట్ల విరసం తన అభ్యంతరాన్ని తెలియజేస్తూ శ్రీశ్రీలో పునర్జీవించడమంటే రాజ్యానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజాపోరాటాల పక్షాన నిలబడ్డమేనని, ముఖ్యంగా, తక్షణంగా గ్రీన్‌హంట్ యుద్ధాన్ని నిరసించడమేనని సాహిత్యలోకానికి విజ్ఞప్తి చేస్తోంది.

### భిక్షాటనపై నిషేధాన్ని ఎత్తివేయాలి :

రాష్ట్ర ప్రభుత్వం భిక్షాటనను నిషేధిస్తూ నిర్ణయం తీసుకుంది. ఈ నిర్ణయాన్ని విరసం వ్యతిరేకిస్తోంది. సమాజంలో ఆర్థిక అసమానతలు కారణంగా, ఉపాధిలేనితనంగా బిచ్చవాళ్లు పెరిగారు. అంతే కాకుండా సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాల రీత్యా కూడా బిచ్చగాళ్లు పెరిగారు. కూడు, గూడు, గుడ్డలేని ఎందరో భిక్షాటన చేసి జీవిస్తున్నారు. కుటుంబ భారం కారణంగా కూడా కొంతమంది పిల్లలు, వృద్ధులు, మహిళలు కూడా భిక్షాటన చేస్తున్నారు. ఈ సమస్యను సామాజిక సమస్యగా ప్రభుత్వం చూడకుండా, పరిష్కరించకుండా నిషేధాన్ని విధించడాన్ని విరసం తప్పు పడుతోంది. భిక్షగాళ్లపై చట్టరీత్యా చర్యలు తీసుకోవాలని ప్రభుత్వం పోలీసులను ఆదేశించడాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది. నిషేధాన్ని ఎత్తి వేయాలని కోరుతోంది.

### విదేశీ విశ్వవిద్యాలయాల్ని వ్యతిరేకిస్తూ తీర్మానం :

విదేశీ విశ్వవిద్యాలయాల (నిర్వహణ - నియంత్రణ) బిల్లు 2009ని గత మార్చ్ 15న కాబినెట్ ఆమోదించింది. ఇక పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి భారత ప్రజలపై రుద్దనున్నది కేంద్ర ప్రభుత్వం. ఈ విశ్వవిద్యాలయాల ద్వారా నాణ్యత కలిగిన ఉన్నత విద్య అందుబాటులోకి వస్తుంది, ఉపాధి అవకాశాలు మెరుగు పడతాయని కేంద్ర మానవ వనరుల శాఖా మంత్రి కపిల్ సిబాల్ మాట్లాడుతున్నాడు. కానీ ఇది వాస్తవ దూరమైన, మోసపూరిత ప్రకటన మాత్రమే. విదేశీ ప్రైవేట్ విశ్వవిద్యాలయాల మూలంగా స్వదేశీ విశ్వవిద్యాలయాలు కునారిల్లే స్థితి ఏర్పడుతుంది. ఫీజులపై నియంత్రణ ఉండని కారణంగా విచ్చలవిడి దోపిడీ పెరుగుతుంది. ఇంకా రిజర్వేషన్లు వర్తించవనేది కూడా గమనించాలి. నిజానికి విద్య అనేది ఒక సామాజిక అంశం. దాన్ని వ్యాపారం చేయడం అప్రజాస్వామికం. ప్రైవేట్ రంగానికి పట్టం గట్టి, విద్యను కొద్దిమంది సంపన్న వర్గాల గుత్తసొత్తుగా మార్చే కుట్రలో భాగంగా వస్తున్న ఈ విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లును విరసం తీవ్రంగా వ్యతిరేకిస్తోంది. ఈ బిల్లును ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తోంది.

### బి.టి. విత్తనాలను నిషేధించాలి :

అధిక దిగుబడి, వ్యవసాయ రంగ అభివృద్ధి పేరుతో 1960లో అమలైన హరిత విప్లవం సంపన్న రైతులను మరింత సంపన్నులుగా మార్చి, సన్నకారు, చిన్నకారు రైతులను మరింత సంక్షోభంలోకి నెట్టింది. అలాగే ప్రపంచీకరణ అన్ని రంగాలను విచ్ఛిన్నం చేసింది. అలాగే వ్యవసాయ రంగాన్ని బలహీనపరిచే విధానంలో భాగంగా పత్తిలో టెర్మినేటర్ విత్తనాలను, వంకాయిలో బి.టి. వంగడాలను ప్రవేశపెట్టారు.

బి.టి. విత్తనాలు అనగా 'బాసిల్లస్ థురెంజెనిసిస్' బాక్టీరియా కలిగిన విత్తనాలు. వంకాయలో సహజంగా ఏర్పడే నల్లపురుగును చంపడానికి ప్రవేశపెట్టినదే ఈ బాక్టీరియా. అయితే ఈ బాక్టీరియా క్రమంగా వంకాయను, వంగ మొక్కను విషతుల్యం చేసి వీటిని తినే మనుషులను, వంగ మొక్కను మేసే పశువులను తీవ్ర అనారోగ్యానికి గురిచేస్తుంది. ఈ విత్తనాలు వాడినప్పటికి తిరిగి క్రిమి సంహారక మందులు అధిక మొత్తంలో పిచికారి చేయాల్సి ఉంటుంది. ఈ పరిస్థితుల వల్ల క్రమంగా భూసారం తగ్గిపోయి వ్యవసాయ భూములు బీడు భూములుగా మారిపోతాయి. ఈ విత్తనాలు పునర్ వినియోగానికి, వాడానికి పనికి రావు. క్రమంగా బహుళజాతి విత్తన సంస్థలపై ఆధారపడాల్సి వస్తుంది.

దేశీయ వంగ పంటను, వ్యవసాయ రంగాన్ని విషతుల్యం చేసి, బలహీనం చేసి దీర్ఘకాలికంగా దేశాన్ని పేదరికంలో నెట్టే సామ్రాజ్యవాద దేశాల కుట్రలో భాగమే ఈ బి.టి. విత్తనాలు. సహజంగానే సామ్రాజ్యవాద దేశాల విధానాలకు వత్తాసు పలికి, వారిచ్చే అప్పులకు దేబిరించే మనదేశ పాలక వర్గాలు బి.టి. విత్తనాలపై మాట్లాడే మేధావులను, ప్రజా సంఘాలను అణచి వేసేందుకు కొత్త చట్టాలను ప్రయోగించాలని చూస్తున్నాయి. ఇలాంటి అప్రజాస్వామిక విధానాలను విరసం తీవ్రంగా వ్యతిరేకిస్తోంది.

### కాలయాపనకే శ్రీకృష్ణ కమిటీ :

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఉధృతమవుతున్న ప్రతిసారీ పాలకవర్గం ఏదో ఒక కమిటీని వేసి తెలంగాణ ప్రజలను మోసగిస్తూ వస్తోంది. 1969 తర్వాత మరలా అంతటి తీవ్రస్థాయిలో వెల్లువెత్తిన ఉద్యమంపై 'హింస'ను ప్రయోగించి అణచివేయజూసింది రాజ్యం. ఉద్యమాన్ని చల్లబర్చడం కోసం ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటును కాలయాపన చేయడం కోసం 'శ్రీ కృష్ణ కమిటీ' వేసి మరో మోసం చేస్తోంది కేంద్రం. ఈ వాస్తవాన్ని పసిగట్టిన తెలంగాణ ప్రజలు శ్రీకృష్ణ కమిటీని వ్యతిరేకిస్తున్నారు. తెలంగాణ ప్రజల ఆకాంక్షను ఎత్తిపడుతూ విరసం మొదటి నుండి తెలంగాణ ఉద్యమ పక్షాన దృఢంగా నిలబడి ఉంది. తెలంగాణ రాష్ట్రం కమిటీలతో కాక, ప్రజా ఉద్యమం ద్వారానే సాధ్యమని విరసం నమ్ముతోంది. ఆ దిశలో తెలంగాణ ప్రజల పోరాటాన్ని మరింత ముందుకు తీసుకెళ్లాలని కాంక్షిస్తూ, తెలంగాణ ఉద్యమానికి విరసం తన సాహిత్య, సాంస్కృతిక కృషి అందిస్తుందని తీర్మానిస్తోంది.

### యజమానుల లాభాపేక్షకు గ్రానైట్ కార్మికులు బలి :

చీమకుర్తి మండలంలోని రామతీర్థంలో గ్రానైట్ క్వారీలో బండల కింద పడి 13 మంది కార్మికులు చనిపోయారు. చలువ రాళ్లపై ఉన్న ప్రేమ, లోయల నుండి గెలాక్సీ రాళ్లను వెలికితీసిన కార్మికులపై లేకపోవడం చాలా దారుణం. నిబంధనలకు విరుద్ధంగా తవ్వకాలు తొవ్వి నిత్యం ఎంతోమంది కార్మికుల చావులకు కారణమైన ప్రభుత్వ, యజమానుల నిర్లక్ష్య వైఖరిని విరసం తీవ్రంగా ఖండిస్తోంది. ఒకవైపు అడ్డమైన గడ్డికి అలవాటు పడిన అధికారుల అవినీతి, మరో వైపు యజమానుల లాభాపేక్ష విరసం గర్హిస్తుంది. ప్రభుత్వం, యజమానులు వెంటనే స్పందించి మృతి చెందిన కార్మికుల కుటుంబాలకు నష్ట పరిహారం ఇవ్వాలని, ఇటువంటి సంఘటనలు పునరావృతం కాకుండా చర్యలు తీసుకోవాలని విరసం ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

### ఓపెన్ కాస్ట్ విధానాన్ని వ్యతిరేకిద్దాం :

ప్రపంచీకరణ, సామ్రాజ్యవాద దళారీ దోపిడీ విధానాలను

అవలంబిస్తున్న ప్రభుత్వం, సింగరేణి గనుల్లో ఓపెన్‌కాస్ట్ విధానాన్ని ప్రవేశపెట్టి లక్షలాది ప్రజలను నిర్వాసితుల్ని చేసింది. గతంలో కార్మికులు ఇంక్లైను మార్గాల్లో భూమి లోపలికి వెళ్లి తవ్వి, తట్టలతో బొగ్గు తీయడం వల్ల ఎందరికో ఉపాధి లభించి భూమి, పర్యావరణం నివాస, ఆవాస, వ్యవసాయ యోగ్యంగా ఉంటూ వస్తున్నది. ఓపెన్ కాస్ట్ విధానంలో యంత్రాలతో ఒక్కసారిగా పెద్దమొత్తంలో గనుల్ని తవ్వడం వల్ల ఉపాధి, పర్యావరణం దెబ్బ తింటున్నది. ఓపెన్‌కాస్ట్ విధానం వల్ల సింగరేణి కార్మికుల సంఖ్య లక్షా ఇరవై వేల నుంచి యాభై వేలకు కుదించబడింది. కొత్తగా గనులు తవ్వుతున్న ప్రాంతాల్లోని గ్రామాలను బలవంతంగా ఖాళీ చేయాలని ప్రజల్ని నిర్వాసితుల్ని చేస్తున్నారు. దీని వలన భూములు సాగుకు, నివాసానికి యోగ్యం కాకుండా బొందల గడ్డగా మారిపోతున్నాయి.

తెలంగాణను బొందలగడ్డగా మార్చే సింగరేణి ఓపెన్‌కాస్ట్ విధానాన్ని వ్యతిరేకిద్దాం. ఆ ప్రజలు చేసే పోరాటాలకు అండగా నిలబడదాం.

## ఆదివాసులపై గ్రీన్‌హంట్ దుర్మార్గాన్ని ఆపాలని ముక్తకంఠంతో నినదిద్దాం :

ఈ నేలపై ఆదివాసీ పోరాటాలు ఈనాటివి కావు. మనిషి చరిత్ర పరిణామంలో విడదీయలేని ఆ చరిత్రకు, పోరాటాల చరిత్రకు ఆదివాసుల భూమిక ఈనాటికీ కొనసాగుతోంది. 'ప్రజలే చరిత్ర నిర్మాతలు' అన్న సత్యాన్ని మళ్లీ మళ్లీ నిరూపిస్తూ అన్ని రకాల దోపిడీ నుంచి మొత్తం మానవాళి విముక్తికి దారులు వేస్తున్నారు. కళ్ల ముందు కొనసాగుతున్న రక్తసిక్త చరిత్రను, ఆదివాసులపై అమలవుతున్న దుర్మార్గాన్ని మనమంతా ఆపమని నినదిద్దాం.

మొత్తంగా సమాజ విముక్తి కోసం వాళ్లు లేపుతున్న మౌలిక ప్రశ్నలను మనమంతా అర్థం చేసుకుందాం. వారితో కలిసి నడుద్దాం. ప్రజల మౌలిక అవసరాలు తీర్చడంలో విఫలమైన పాలకవర్గాలపై మన దేశ ప్రజలు నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలతో ప్రశ్నలు సంధించారు. జవాబు చెప్పలేని పాలకులు అణచివేతకు, దుర్మార్గమైన రక్తపాతానికి ఒడిగడుతున్నారు. మనమంతా ప్రజాస్వామిక స్ఫూర్తితో, విప్లవోద్యమం, మట్టి మనుషులూ వేస్తున్న ప్రశ్నలను ఎత్తిపడదాం. రాజ్య దుర్మార్గాన్ని బయటపెడదాం! పోరాడే ప్రజలపై నిర్బంధాన్ని ఆపమని ప్రతిఘటిద్దాం!

ఆదివాసుల కాళ్లకింద నేలలోని ఖనిజాలను తవ్వుకుపోవడానికి చేస్తున్న గ్రీన్‌హంట్‌ను ఆపమని నినదిద్దాం! సామ్రాజ్యవాద కంపెనీలతో భారత ప్రభుత్వం చేసుకున్న ఒప్పంద పత్రాలను రద్దు చేయాలని డిమాండ్ చేద్దాం. పోరాడే ప్రజలను, మనందరి ప్రకృతిని మనమే కాపాడుకుందాం. కొద్దిమంది ప్రయోజనాల కోసం అమలవుతున్న యుద్ధాన్ని విశాల ప్రజారాశుల ప్రయోజనాల కోసం కలసికట్టుగా ఎదుర్కొందాం!

## అణు థర్మల్ విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకంగా :

పచ్చని పంట పొలాలతో, కొబ్బరి, జీడి మామిడి తోటలతో నిత్యం పచ్చగా ఉండే ఉద్దానంలో ఏడు థర్మల్ విద్యుత్ కేంద్రాలకు ప్రభుత్వం అనుమతినిచ్చింది. సోంపేట, కాకరాపల్లి మండలాల్లో పనులు ప్రారంభమయ్యాయి. ప్రజలను నిర్వాసితులను చేసే, పర్యావరణానికి హాని కలిగించే ఈ థర్మల్ విద్యుత్ కేంద్రాలకు అనుమతినివ్వడాన్ని విరసం వ్యతిరేకిస్తోంది.

శ్రీకాకుళం జిల్లా రణస్థలం మండలం కొవ్వాడ మత్స్య తీరం గ్రామాల్లో అణువిద్యుత్ కేంద్రం ఏర్పాటుకు కేంద్ర ప్రభుత్వం అనుమతి నిచ్చింది. జీవరాశి వినాశకారియైన అణు విద్యుత్ కేంద్రం అనుమతిని విరసం వ్యతిరేకిస్తోంది.

30 ఏప్రిల్ 2010 వేకువజామున సోంపేట థర్మల్ విద్యుత్ కేంద్ర వ్యతిరేక వేదిక నాయకులను 15 మందిని ఇళ్ల దగ్గర అరెస్టు చేశారు. ఆ తర్వాత 200 మంది కూలీలతో పనులు ప్రారంభించడం కోసం యాజమాన్యం తగు ఏర్పాట్లతో వచ్చింది. దీనికి రక్షణ కోసం పోలీసులతో పహారా ఏర్పాటు చేసింది. ఈ విద్యుత్ కేంద్రాన్ని వ్యతిరేకిస్తున్న స్థానిక ప్రజలు దీన్ని అడ్డుకున్నారు. పోలీసుల రక్షణ మధ్య ఏ మాత్రం ప్రజల అభిప్రాయాలకు విలువనివ్వకుండా విద్యుత్ కేంద్రం ప్రారంభానికి రావడాన్ని విరసం ఖండిస్తోంది. అణు, థర్మల్ విద్యుత్ కేంద్రాలకు ఇచ్చిన అనుమతిని తక్షణమే రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ తీర్మానాన్ని ప్రవేశపెడుతోంది.

## ఐపిఎల్ :

రాజకీయాలతో, డబ్బుతో సంబంధం లేకుండా మానసిక, శారీరక వికాసానికి వీలు కల్పించే క్రీడాస్ఫూర్తిని పాలకవర్గాలు కలుషితం చేస్తున్నాయని ప్రస్తుత ఐపిఎల్ కుంభకోణం మరోసారి బహిర్గతం చేసింది. నిజానికి జరిగి ఉండగలిగిన కుంభకోణంలో 10 శాతం కూడా ఇంకా బయటపడలేదు. ఇప్పటికే జాతీయ క్రీడాసంస్థలు, మీడియా సంస్థలు, కేంద్ర మంత్రులతో సహా రాజకీయ నాయకులు, వారి కుటుంబ సభ్యులు ఈ కుంభకోణంలో వేల కోట్ల రూపాయల అక్రమ లావాదేవీలు నడిపారని బయటపడుతోంది.

వివిధ అక్రమ మార్గాల ద్వారా ప్రజల నుంచి దోచుకున్న అక్రమ ధనాన్ని విచ్చలవిడిగా ఐపిఎల్‌లో వినియోగించారు. వీటిలో ఫ్రాంచైజీల ఏర్పాట్లు, ఆటగాళ్ల వేలం మాత్రమే బయటకు కనిపిస్తుండగా, వీటి వెనుక అడ్వర్టైజింగ్, టెలివిజన్ బ్రాడ్‌కాస్టింగ్ లాంటివి అనేకం ఉన్నాయి. క్రీడను ప్రధానం చేసి స్థానిక దేశీయ క్రీడలన్నింటినీ ధ్వంసం చేసి దానికి గుత్తాధిపత్యం ఇవ్వడం వల్ల, ఆ క్రీడకు పెద్ద సంఖ్యలో అభిమానులు ఏర్పడ్డారు. దీని చుట్టూ బహుళజాతి సంస్థలు, ప్రచార సాధనాలు, వేల కోట్ల రూపాయల వ్యాపారం పెరిగిపోయింది. అక్రమ వ్యాపారులకు అక్రమ ధనాన్ని సక్రమ ధనంగా మార్చుకునే దగ్గరి దారిని ఈ ఐపిఎల్ అందించింది.

ఇన్ని అక్రమాలు ఉన్న చోట తప్పకుండా అధికారవర్గాలు, పాలకవర్గాలు భాగస్వామ్యం కావడం సహజం. కనుక ఐపిఎల్ కుంభకోణం పట్ల, దోషులను విచారించడం పట్ల, జరిగిన తప్పులను సరిదిద్దడం పట్ల పాలకవర్గాలు సక్రమంగా వ్యవహరిస్తారనుకోవడం అత్యాశే అవుతుంది.

ఈ దుర్మార్గాలను, మోసాలను గుర్తించాల్సిందిగా, తప్పులను సవరించేలా పాలకవర్గాల మీద ఒత్తిడి తేవాల్సిందిగా విరసం ప్రజలకు విజ్ఞప్తి చేస్తోంది. తమ క్రీడాస్ఫూర్తిని, అభిమానాన్ని పాలకవర్గాలు ఎట్లా వక్రీకరిస్తున్నాయో గుర్తించాలని ప్రజలకు విజ్ఞప్తి చేస్తోంది.

అ

మావోయిస్టు పార్టీ ప్రకటన

# తాడిమెట్ల దాడి - ఆదివాసుల ఊచకోతలకూ, విప్లవోద్యమ నేతల హత్యలకూ జవాబు!

ఏప్రిల్ 6న తెల్లవారుజామున ప్రజా విముక్తి గెరిల్లా సైన్యం (పిఎల్‌జిఎ) కు చెందిన దాదాపు మూడు వందల మంది వీరయోధులు దక్షిణ బస్తర్ డివిజన్‌లోని తాడిమెట్ల, ముకరం గ్రామాల మధ్య ఒక ఆంబుష్ చేసారు. ఇందులో సి.ఆర్.పి.ఎఫ్. కు చెందిన 76 మంది జవాన్లు చనిపోగా, మరో ఆరుగురు గాయపడ్డారు. చనిపోయిన సి.ఆర్.పి.ఎఫ్. జవాన్లలో 15 మంది కోబ్రా కమాండోలున్నారు. దాదాపు మూడు గంటల పాటు కొనసాగిన ఈ పోరాటంలో జప్తు చేసుకున్న ఆయుధాల్లో 21 ఎకె-47 రైఫిళ్లు, 38 ఇన్సాస్ రైఫిళ్లు, 6 ఎల్.ఎం.జి.లు, 7 ఎస్.ఎల్.ఆర్.లు, ఒక స్టెన్‌గన్, ఒక రెండించుల మోర్టార్ ఉన్నాయి. ఈ చారిత్రాత్మక, అపూర్వ దాడిని విజయవంతం చేసే క్రమంలో ఎనిమిది మంది వీరయోధులు నేలరాలారు. కా. రుక్మతి (సెక్షన్ కమాండర్, ముకరం గ్రామం, పశ్చిమ బస్తర్), కా. వాగాల్ (సెక్షన్ కమాండర్, రేగడిగట్ట గ్రామం, దక్షిణ బస్తర్), కా. విజ్జాల్ (సెక్షన్ డిప్యూటీ కమాండర్, పద్మ గ్రామం, పశ్చిమ బస్తర్), కా. ఇంగాల్ (సెక్షన్ డిప్యూటీ కమాండర్, కర్రిగుండం గ్రామం, దక్షిణ బస్తర్), కా. రాజు (సభ్యుడు, కొండపల్లి గ్రామం, దక్షిణ బస్తర్), కా. మంగు (సభ్యుడు, రేంగం గ్రామం, దక్షిణ బస్తర్), కా. రామాల్ (సభ్యుడు, ముర్రుపల్లి గ్రామం, దక్షిణ బస్తర్), కా. రతన్ (సభ్యుడు, జాడ్క గ్రామం, ఇంద్రావతి ఏరియా) - ఈ ఎనిమిది మంది బస్తర్ ముద్దుబిడ్డలు ప్రజల విముక్తి కోసం తమ ప్రాణాల్ని తృణప్రాయంగా ధారపోశారు. మొక్కవోని ధైర్యం, అనుపమాన పరాక్రమం, త్యాగనిరతితో పోరాడిన ఈ వీరులు ఉన్నత ఆదర్శాన్ని నెలకొల్పారు. అమరులైన కామ్రేడ్స్ మృతదేహాలను మా కామ్రేడ్స్ మోసుకొచ్చి విప్లవ సాంప్రదాయాలతో వందలాది ప్రజల మధ్య ఘనంగా అంత్యక్రియలు జరిపారు. మా స్పెషల్ జోనల్ కమిటీ ఈ వీరయోధులకు, నిజమైన ప్రజాసేవకులకు వినమ్రంగా జోహార్లర్పిస్తోంది. వాళ్ల బాటలో నడవాలని దేశ యువతరానికి పిలుపునిస్తోంది. అమరులైన కామ్రేడ్స్ కుటుంబ సభ్యులకూ, మిత్రులకూ కమిటీ ప్రగాఢ సంతాపాన్ని తెలుపుతోంది.

గత కొద్ది మాసాలుగా జరుగుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా ఆదివాసుల ఊచకోతలూ, గ్రామాలను కాలబెట్టడం, మహిళలపై సామూహిక అత్యాచారాలు వరుసగా సాగుతున్నాయి. ఈ క్రమంలో కిరాయి బలగాల, వాళ్ల ఇన్‌ఫార్మర్ నెట్‌వర్క్‌కు సంబంధించిన ప్రతి కదలికపైనా మేం కన్నేసి ఉంచాం. వాటిని లోతుగా అధ్యయనం చేసాం కూడా. దీనిపై ఆధారపడి మా స్పెషల్ జోనల్ కమిటీ సరైన, ధీటైన కౌంటర్ ఎత్తుగడల్ని రూపొందించింది. ఇందులో భాగంగానే ఇప్పుడు మాకు మొదటి పెద్ద విజయం లభించింది. భారత విప్లవోద్యమ చరిత్రలోనే ప్రభుత్వ బలగాల్ని పెద్ద సంఖ్యలో సంహరించిన అతి పెద్ద దాడి ఇది. ఇందుకోసం అతి చాకచక్యంగా పథకం రూపొందించి ఈ దాడికి నాయకత్వం వహించిన వివిధ స్థాయిల పి.ఎల్.జి.ఎ. కమాండర్లకూ, దీని సఫలం చేయడం కోసం ప్రాణాల్ని పణంగా పెట్టి పోరాడిన వీరయోధులకూ, ఇందులో క్రియాశీల పాత్రను పోషించిన దక్షిణ బస్తర్ విప్లవ ప్రజానీకానికీ మా స్పెషల్ జోనల్ కమిటీ తరపున హృదయపూర్వక అరుణాభినందనలు తెలియజేస్తున్నాం. మహా భూంకాల్‌కు వందేళ్లు పూర్తయిన సందర్భంగా విజయవంతమైన ఈ వీరోచిత దాడిని మా స్పెషల్ జోనల్ కమిటీ ఆ మహాసంగ్రామానికి సగౌరవ కొనసాగింపుగా భావిస్తున్నది. ఈ విజయం సందర్భంగా సమస్త బస్తర్ వాసులకూ, ఆదివాసుల హితాభిలాషులకూ, ఆదివాసీ సంఘాలకూ మేం 'భూంకాల్ జోహార్' పలుకుతున్నాం.

బిఎస్ఎఫ్, ఐటిబిపి వంటి బలగాల్ని దండకారణ్యంలో తమ స్వంత దేశ ప్రజలకు వ్యతిరేకంగా మోహరించారు. మొత్తం దండకారణ్యాన్నంతా ఖాకీ వనంగా మార్చారు. బీహార్, జార్ఖండ్, ఒడిశా, పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్‌లోని పోరాట ప్రాంతాలది కూడా ఇదే పరిస్థితి.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో దేశంలోని నిరుపేద ప్రజలకు వ్యతిరేకంగా సోనియా - మన్మోహన్ - చిదంబరం ముఠా మొదలుపెట్టిన ఈ యుద్ధానికి కేంద్ర హోం మంత్రి నాయకత్వం వహిస్తున్నారు. ఈయన ఒకప్పుడు ఎన్‌రాన్ అనే అపఖ్యాతి కలిగిన బహుళజాతి కంపెనీకి వకీలుగా, ఆర్థిక మంత్రి కావడానికి ముందు వేదాంత అనే మరో పేరు మోసిన కంపెనీలో డైరెక్టర్ల బోర్డులో సభ్యుడిగా పనిచేశారు. తన జీవిత కాలంలో సగభాగం ప్రపంచ బ్యాంక్, ఐఎంఎఫ్ తదితర బ్యాంకుల్లో అధికారిగా సేవచేసిన ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ అంతర్జాతీయ ద్రవ్య సంస్థలకు నంబర్ వన్ దళారీ. ప్రధానికి ప్రీతిపాత్రుడూ, కేంద్ర హోంశాఖ కార్యదర్శిగా నియామకమైన జి.కె. పిళ్లై లక్షలాది ప్రజల్ని నిలువనీడ లేకుండా చేయడానికైనా వెనుకాడకుండా దేశంలో 235 ఎస్.ఇ.జెడ్.లకు అనుమతిచ్చిన మొనగాడు. దేశంలో సామ్రాజ్యవాదులు నిర్దేశించే విధానాన్ని సాఫీగా అమలు చేయడంలో మావోయిస్ట్ ఉద్యమమే అతి పెద్ద అడ్డంకి అనే విషయం వీళ్లందరికీ చాలా బాగా తెలుసు. ఈ దుష్ట త్రయం నాయకత్వంలో, రమణ్‌సింగ్, ననకీరాం, విశ్వరంజన్ వంటివాళ్ల భాగస్వామ్యంతో ఈ 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' జరుగుతోంది. ఆగస్ట్ 2009 నుండి ఇప్పటిదాకా ఈ పాశవిక ఆపరేషన్‌లో భాగంగా పోలీసులు, పారా మిలిటరీ బలగాలు, ఎస్.పి.ఓ.లు 110 మందికి పైగా ఆదివాసుల్ని ఊచకోత కోశారు. పదుల సంఖ్యలో మహిళలపై సామూహిక అత్యాచారాలకు పాల్పడ్డారు. ఎందరివో ఇళ్లు బుగ్గి చేశారు. సామాన్లు దోచుకున్నారు.

ఒకవైపు ఆదివాసుల ఊచకోతల్ని వరుసగా కొనసాగిస్తూనే మరోవైపు చిదంబరం ముఠా విప్లవోద్యమ నాయకుల్ని హత్య చేయడంపై, పట్టేసి జైళ్లో కుక్కేయడంపై దృష్టి కేంద్రీకరించింది. గత సంవత్సరం మే 23న మా పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు కామ్రేడ్

పటేల్ సుధాకర్‌నూ, ఈ మధ్యనే మార్చ్ 12న మా పార్టీ మరో సీనియర్ నేత శాఖమూరి అప్పారావుతో పాటు సోలిపేట కొండల్‌రెడ్డిని పేరుమోసిన ఆంధ్ర ఎస్.ఐ.బి. హంతక ముఠా పట్టుకొని దారుణంగా హత్య చేసింది. ఆ తర్వాత ఎన్‌కౌంటర్ కథలల్లింది. ముఖ్యమైన పార్టీ నాయకుల హత్యలకు చిదంబరం ముఠాదే ప్రత్యక్ష బాధ్యత.

కాబట్టి వీటన్నిటికీ వ్యతిరేకంగానే ఈ దాడి జరిగింది. బస్తర్ వాసుల అనివార్యమైన, సహజమైన ప్రతిస్పందన ఇది. మహా భూంకాల్‌కు వందేళ్ల పూర్తయిన సందర్భంలో ఈ చారిత్రక దాడి జరగడం కేవలం యాదృచ్ఛికం కాదు. దానికి కొనసాగింపులో భాగమే ఈ దాడి. వందేళ్ల క్రితం బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా తిరుగుబాటు శంఖాన్ని పూరించిన బస్తర్‌వాసులు ఇప్పుడు దేశంలోని అపార సహజ సంపదలన్నిటినీ సామ్రాజ్యవాదులకు కట్టబెట్టాలని చూస్తున్న దోపిడీదార్ల ఆశల్ని అడియాసలుగా మార్చడానికి కంకణబద్ధులయ్యారు.

ఈ సంఘటన జరగ్గానే తన దిగ్భ్రాంతిని వ్యక్తం చేస్తూ చిదంబరం దీన్ని మా 'బర్బరత్వానికి' నిదర్శనమని వ్యాఖ్యానించాడు. అధికారంలోని పెద్దలతో పాటు బిజెపి తదితర దోపిడీవర్గ పార్టీలు తమ వర్గ స్వభావానికి అనుగుణంగానే బిగ్గరగా గగ్గోలు పెడుతున్నాయి. మరి వీళ్లు మేం ఈ కింద పేర్కొంటున్న సంఘటనల పట్ల ఏం వివరణ ఇవ్వగలరు? ఇవి 'బర్బరత్వం' శ్రేణిలోకి వస్తాయా రావా చెప్పగలరా వీళ్లు?

- జనవరి 8, 2009న సింగారంలో జరిగిన సామూహిక ఊచకోతలో 17 మంది ఆదివాసుల మృతి. వీళ్లలో ఐదుగురు మహిళలు. చంపడానికి ముందు వీళ్లపై దారుణంగా అత్యాచారానికి పాల్పడ్డారు. అందరినీ శరీర అవయవాల్ని ముక్కలు ముక్కలుగా చేసి చంపేసారు.
- జూన్ 20, 2009న కోకవాడ వద్ద ఆరుగురు నిరపరాధులైన ఆదివాసుల్ని హత్య చేశారు. వీళ్లు వారపు సంత నుండి తిరిగి వస్తుండగా పట్టుకొని అక్కడికక్కడే చంపేశారు.
- ఆగస్ట్ 10, 2009న బీజాపూర్ జిల్లాలోని వెచ్చపాడు గ్రామం వద్ద ఆరుగురి హత్య. వీళ్లలో ఒక మహిళ మాత్రమే మా పార్టీ కార్యకర్త. మిగతా వాళ్లంతా సాధారణ ప్రజలు.
- సెప్టెంబర్ 10, 2009న సింగనమడుగు, దాని చుట్టుపక్కల గ్రామాల్లో మొత్తం 12 మంది ప్రజల హత్య. ఇందులో ముగ్గురైతే 60-70 ఏళ్ల వయసున్న వృద్ధులు.
- అక్టోబర్ 1, 2009న గోంపాడు గ్రామంలో 12 మంది హత్య. వీరిలో 10 ఏళ్ల వయసున్న ఒకమ్మాయి ఉంది. ఈ సంఘటనలో ఏడాదిన్నర వయస్సున్న పసిబాలుడి రెండు చేతివేళ్లను కూడా నరికేశారు.
- నవంబర్ 10, 2009న టెట్టెమడుగు దాని పరిసర గ్రామాల నుండి ఏడుగురిని హత్య చేశారు.
- డిసెంబర్ 11, 2009న గుమియాపాల్ గ్రామంలో ఏడుగురిని చంపేశారు.
- జనవరి 23, 2010న కుట్రెం దగ్గర నలుగురు యువకుల్ని చంపారు.
- ఫిబ్రవరి 3, 2010న తాకిలోడ్ గ్రామంపై దాడి చేసి ఏడుగురు ఆదివాసీ యువకుల్ని దారుణంగా చంపేశారు.
- ఫిబ్రవరి 7, 2010న నారాయణపూర్ దగ్గర్లోని ఓంగ్‌నార్ గ్రామంలో ఇద్దరు యువతులతో పాటు ఐదుగురిని హత్య చేశారు.
- ఫిబ్రవరి 10, 2010న మాడ్ డివిజన్‌లోని దుంనార్ అనే గ్రామంలో వ్యవసాయశాఖకు చెందిన విప్లవ కార్యకర్త కామ్రేడ్ కుమిలిని ఎస్.పి.ఒ.లు పట్టుకొని సామూహిక అత్యాచారం జరిపి దారుణంగా తల నరికి చంపారు.
- మార్చ్ 19న ఆంధ్ర గ్రేహౌండ్స్ తడ్‌పాల్ అనే గ్రామంపై దాడి చేసి కామ్రేడ్స్ పుల్లయ్య, లక్ష్మి దంపతులను పట్టుకొని కాల్చి చంపారు. తర్వాత ఎప్పటిలాగే ఎన్‌కౌంటర్ కథ అల్లారు.
- ఏప్రిల్ 3, 2010న జరిగిన ఒక తాజా సంఘటనలో నారాయణపూర్ జిల్లాలోని చినారీ (గోండీ భాషలో 'ఇన్నర్') అనే గ్రామంలో సి.ఆర్.పి.ఎఫ్., జిల్లా పోలీసు బలగాలు 300కు పైగా సంఖ్యతో దాడి చేశారు. సోన్‌ధర్ సలాం అనే ఆదివాసీది, నేంగీ యాదవ్ అనే మరో రైతుది రెండు ఇళ్లను కాల్చేశారు. దాని పక్కనే ఉన్న ఫరస్‌గాం అనే గ్రామంపై కూడా ఇదే మూక దాడి చేసి చైత్‌రాం సలాం అనే ఆదివాసీ ఇంటిని కాల్చేశారు. ఈ మూడిళ్లలో మొత్తం సామానంతా కాలి బూడిదైంది. చినారీ గ్రామంలో సంతాయి సలాం అనే పదిహేనేళ్ల అమ్మాయిని పట్టుకొని స్పృహ కోల్పోయే దాకా కర్రలతో బాదారు.
- ఏప్రిల్ 5, 2010న కొండగాం తహసీల్‌లోని చేమా గ్రామం నుండి గంగ కొర్రాం (30) అనే ఆదివాసీ యువకుణ్ని మర్దాపాల్ పోలీసులు పట్టుకెళ్లి తర్వాత స్టేషన్‌లోనే కొట్టి చంపేసి శవాన్ని గ్రామంలో వదిలేశారు.
- ఏప్రిల్ 5నే తోంగ్‌పాల్, దాని చుట్టుపక్కల గ్రామాల్లో కోబ్రా బలగాలు, ఇతర బలగాలు బీభత్సం సృష్టిస్తూ ఎంతో మందిని కొట్టాయి. చాలా మందిని అరెస్ట్ చేసి తీసుకెళ్లాయి.

పైన పేర్కొన్న హత్యలకూ, హింసా దౌర్జన్యాలకూ పాల్పడ్డది పోలీసులూ, పారా మిలిటరీ వాళ్లూ, ఎస్.పి.ఒ.లేననేది తేటతెల్లం. వీటి నిజానిజాలపై ఎవరికైనా ఏ మాత్రం అనుమానం ఉన్నా మా ప్రాంతాల్లోకి వచ్చి స్వయంగా పరిశీలించవచ్చు. తాడిమెట్ల అడవిలో ఏప్రిల్ 6న ఉదయం జరిగింది ఏమైనప్పటికీ వెనుక వందల, వేల బస్తర్ ఆదివాసుల బాధ ఉంది. కన్నీళ్లున్నాయి, అవమానం ఉంది. దోపిడీ ఉంది. దమనకాండ ఉంది. మాటిమాటికీ నక్సలైట్లు 'హింసను వదిలెయ్యాల'ని వల్లె వేస్తున్న రెండు నాల్కల వాళ్లకూ, దగుల్బాజీలకూ ఇది అర్థం కావడం అసాధ్యం.

ఈ సంఘటన దరిమిలా ఏప్రిల్ 7న జగ్దల్‌పూర్‌కు వచ్చిన కేంద్ర హోంమంత్రి చిదంబరం 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' అనేది లేనే లేదని మరోసారి వక్కాణించారు. పైగా తాడిమెట్లలో సి.ఆర్.పి.ఎఫ్. జవాన్లు దాడికి వెళ్లలేదనీ, కేవలం ఆ ప్రాంతంతో పరిచయం కోసం వెళ్లారని కూడా అన్నారు. సైన్యం సహాయాన్ని తీసుకునే అవకాశాన్ని నిరాకరిస్తూ అవసరమైతే వాయుసైన్యాన్ని ఉపయోగించడం గురించి మళ్లీ ఆలోచిస్తామని అన్నారు. చిదంబరం గారూ! దేశ ప్రజలందరూ మూర్ఖులని నమ్మే స్వేచ్ఛ మీకుంది! కానీ మీరు మీరు మెచ్చే కంపెనీయైన 'వేదాంత'తో పాటు, మరెన్నో దళారీ పెట్టుబడిదారీ, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు కాపాడడం కోసమే, మరీ ముఖ్యంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల దిశానిర్దేశనంతోనే ఈ గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను మొదలుపెట్టారనే విషయం ప్రజలందరికీ

**విరసం 22వ మహాసభల కరపత్రం**

# నా తొలి యవ్వనాన్ని పునర్జీవిస్తాను

## నలభై ఏళ్ల విరసం, నూరేళ్ల శ్రీశ్రీ మహాసభలు

## 30 ఏప్రిల్, 1మే 2010, విశాఖపట్నం

శ్రీశ్రీ తెలుగు ప్రజల ఉద్వేగ శక్తి. కవిత్వమనగానే సాధారణ ప్రజలకు సైతం శ్రీశ్రీ గుర్తుకు వస్తాడు. కవి అంటే శ్రీశ్రీ మూర్తిమత్వం రూపుగడుతుంది. సమాజ సాహిత్యాల గురించి, జీవితం గురించి ఆయన చెప్పిన ప్రతి మాటా కవితా చరణంగా నిలిచిపోయింది. ప్రతి కవితా పంక్తి తెలుగువారి నుడికారంలో భాగమైపోయింది. తెలుగు ప్రజల భావోద్వేగాల్లో, ఆలోచనల్లో మూడు తరాలుగా శ్రీశ్రీ సంలీనమైపోయాడు. సమాజపు గడ్డు వాస్తవాన్ని చెప్పడానికి శ్రీశ్రీ కవితా చరణాలు ప్రజల నిత్య వ్యవహారంలో ఉంటాయి. వ్యవస్థ పట్ల ఆగ్రహాన్ని, అసమ్మతిని చెప్పడానికి శ్రీశ్రీ కవిత్వమే ఆలంబన. ధిక్కార ప్రకటనకు శ్రీశ్రీ కవిత్వమే ప్రతీక. ప్రజలు జయిస్తారనీ, నిన్నటి కంటే రేపు ఉజ్వలమైనదనీ, చరిత్రను ప్రజలు రచిస్తారనీ చెప్పడానికి ఇవ్వాల్టికీ శ్రీశ్రీని మించిన జనరంజక కవితా శక్తి రూపొందలేదు. అందుకే ప్రజా పోరాట రంగాలన్నింటిలో అర్ధ శతాబ్దంగా తెలుగుజాతి శ్రీశ్రీని పునర్దర్శించుకుంటోంది.

శతజయంతి ఒక ఉద్వేగ సందర్భంగానేగాక శ్రీశ్రీని పునర్నిర్మించే ప్రయత్నంగా కూడా సాగుతున్నది. ఇది అత్యవసరం. ఈ కాలంలో, ఇవ్వాల్టి చైతన్యాలతో శ్రీశ్రీని ఎలా అర్థం చేసుకోవాలి? అనే ప్రశ్న రావడంలోనే ఆయన ప్రాసంగికత ఉన్నది. ఈ పని ఈయన వారసులు, అభిమానులు, వ్యతిరేకులు అనేక వైపుల నుండి సాగిస్తున్నారు. నిజానికి శ్రీశ్రీ తన జీవితకాల మంతా తనను తాను పునర్నిర్మించుకుంటూ వచ్చాడు. లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మేనిఫెస్టోతో ప్రభావితమై బోల్షివిక్ విప్లవోత్తేజంతో కవిత్వంలో శ్రీశ్రీగా ఆవిర్భవించాడు. బోల్షివిక్ విప్లవం ఇవ్వాల్టికీ మానవ చరిత్రలో ఒక మహోద్భుత విజయం. నిజమైన మానవ చరిత్రకు ప్రారంభ బిందువు. మనిషి చేరుకోవలసిన మార్గాన్ని బోల్షివిక్ విప్లవం ఎలుగెత్తి చాటింది. శ్రీశ్రీ అక్కడ పుట్టాడు.... కవిత్వమయ్యాడు. రెండు ప్రపంచ యుద్ధాల సంక్షోభాన్నేగాక రష్యా, చైనా మహత్తర విప్లవాలను ఆవాహన చేసుకున్నాడు. అంతటితో ఆగిపోయిన తెలుగు మేధావులు, రచయితలు చాలా మంది ఉన్నారు.

శ్రీశ్రీ 1955 మధ్యంతర ఎన్నికల వర్గపోరాటంలో పాల్గొని ఖడ్గసృష్టికి సిద్ధమయ్యాడు. పొద్దువాలిపోతున్న తరుణంలో నవయవ్వనంతో దిగంబర కవులను ఆహ్వానించాడు. డెబ్బై ఏళ్ల వయసులో చైనా సాంస్కృతిక విప్లవంలో తిరిగి జన్మించి నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాల సాంస్కృతిక సేనాని అయ్యాడు. విరసం వ్యవస్థాపకుడిగా వదేళ్లకు పైగా తన చైతన్యాన్ని విప్లవ సాహిత్యోద్యమంలో సజీవం చేసుకున్నాడు. పునర్జీవనం , పునర్నిర్మాణం అనే లక్షణాల వల్ల శ్రీశ్రీ తన చివరి రోజుల దాకా సమకాలీనంగా ఉన్నాడు. యిది వ్యక్తి సుగుణం కాదు. చారిత్రక దృక్పథం. శ్రీశ్రీ ఎంతటి ఉద్వేగ కల్పనా శక్తో అంతటి ఆలోచనాపరుడు. చారిత్రక, తాత్విక దృక్పథం ఉన్న బుద్ధిజీవి. జీవితపు అన్ని దశల్లో ఆయన తీసుకున్న రాజకీయ వైఖరుల వెనుక దృక్పథ స్పష్టత ఉన్నది. భావోద్వేగ పూరితమైన నిమగ్నత ఉన్నది. అందుకే కవి బుద్ధిజీవి , ఉద్యమ జీవి కావాలనే జీవన విలువలను ఆయన నిరూపించాడు. ఇది ఆయననెల్ల వేళలా స్వీయ పునర్నిర్మాణం దిశగా నడిపించింది. ఉద్యమ నిర్మాణాల్లోకి, సంఘాల్లోకి తీసికెళ్లింది.

చరిత్ర పట్ల అచంచల విశ్వాసం వల్లనే ఆయనకు ఈ మహాప్రస్థానం, మరో ప్రపంచ ప్రయాణం సాధ్యమయ్యాయి. చరిత్ర పురోగమిస్తుందని, అది దాని సహజనియమమని శ్రీశ్రీ వలె ఆ తరంలో మరో యిద్దరు, ముగ్గురు సాహిత్యకారులే తెలుసుకున్నారు. ఆ తరాన్ని ఎన్ని మహోజ్వల చారిత్రక విజయాలు దాటుకొని వెళ్లాయో అన్నే ఓటములూ, నైరాశ్యాలూ ఆవరించాయి. కానీ మార్క్సిస్టు దృక్పథం

---

బాగా తెలిసిపోయింది. ఇక సైన్యం 'సహాయం' గురించి చెప్పాల్సి వస్తే, వాస్తవానికి సైన్యం పరోక్ష జోక్యం నాలుగేళ్ల ముందే ప్రారంభమైంది. సైనికాధికారులు స్వయంగా ఇక్కడి పోలీసు బలగాలకూ, పారా మిలిటరీ బలగాలకూ జంగిల్ వార్‌ఫేర్ శిక్షణ ఇస్తున్నారు. చిదంబరం వెయ్యి అబద్ధాలు చెప్పినా సోనియా - మన్మోహన్ - చిదంబరం ముఠానే దేశ ప్రజలకు వ్యతిరేకంగా యుద్ధాన్ని మొదలుపెట్టిందనే వాస్తవం తేటతెల్లం. ఈ యుద్ధం నుండి ప్రజలకు తమను తాము కాపాడుకునే హక్కు తప్పక ఉంటుంది.

దేశంలోని సమస్త ప్రజాస్వామ్య మేధావులకూ, రచయితలకూ, జర్నలిస్టులకూ, వివిధ వృత్తుల వాళ్లకూ, కార్మికులకూ, కర్షకులకూ మేం సవినయంగా మనవి చేస్తున్నాం - బడా, విదేశీ పెట్టుబడిదార్ల లాభాల కోసం దేశ ప్రజలకు వ్యతిరేకంగా సాగిస్తున్న యుద్ధాన్ని వెంటనే ఆపెయ్యండనీ, ప్రజలనూ విప్లవోద్యమ నేతలనూ బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపడాన్ని ఆపెయ్యండనీ, ఆదివాసీ మహిళలపై అత్యాచారాలకు పాల్పడ్డ వాళ్లను కఠినంగా శిక్షించాలనీ, ఆదివాసుల ఇండ్లను కాల్చడాన్నీ సంపద విధ్వంసాన్నీ ఆపెయ్యండనీ ప్రభుత్వాలను డిమాండ్ చేయండి. ఈ సందర్భంగా మేం ఈ సంఘటనలో చనిపోయిన పోలీసు ఉద్యోగుల కుటుంబాల పట్ల సానుభూతి ప్రకటిస్తూ, ఏ పరిస్థితుల్లో మేం ఈ చర్యకు పాల్పడవల్సి వచ్చిందో అర్థం చేసుకోవల్సిందిగా వాళ్లను కోరుతున్నాం. పోలీసు, పారా మిలిటరీ బలగాల జవాన్లకూ, కింది స్థాయి అధికార్లకూ మా విజ్ఞప్తి - ప్రజలకు వ్యతిరేకంగా యుద్ధం చేయకండి... పాశవికంగా వ్యవహరించకండి.

*(తాడిమెట్ల ఘటన పూర్వాపరాల గురించి ప్రధాన స్రవంతి మీడియా, కొందరు మేధావులు అసత్య ప్రచారాలకు, అర్థరహిత విశ్లేషణలకు పూనుకున్నందు వల్ల వాస్తవాలను వివరిస్తున్న ఈ ప్రకటన పూర్తి పాఠం ప్రచురించడం అవసరమని భావిస్తున్నాం. గ్రీన్‌హంట్ దుర్మార్గాన్ని అర్థం చేసుకోవడానికి ఇది ఉపకరిస్తుందని ప్రచురిస్తున్నాం. - సం.)*

అ

## కార్యక్రమం

**ఏప్రిల్ 30, మే 1 (శుక్ర, శనివారాలు) 2010**
కా. వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం హాల్
(అంబేద్కర్ భవన్), విశాఖపట్నం

**30 ఏప్రిల్**
ఉ. 10 గం. - కా. శ్రీశ్రీ ప్రాంగణంలో పతాకావిష్కరణ
10.30 గం. - కా. పాణిగ్రాహి వేదికపై

**ప్రారంభోపన్యాసం :**
ప్రొ. జి. హరగోపాల్
సౌహార్థ ప్రతినిధుల సందేశాలు, కార్యదర్శి నివేదిక,
పుస్తకావిష్కరణలు ఉంటాయి
మ.1.30 గం.కు భోజన విరామం
2.00 గం. - శ్రీశ్రీ : మహాప్రస్థానం - చలసాని ప్రసాద్
4.00 గం. - శ్రీశ్రీ మరో ప్రస్థానం - వి చెంచయ్య
సా.6.00 గంటలకు - శ్రీశ్రీ కవితా పఠనం, సాంస్కృతిక
కార్యక్రమాలు

**1 మే**
ఉ. 9. గం.లకు : శ్రీశ్రీ : అనువాద సాహిత్యం - కె శివారెడ్డి
11.30 గం. - శ్రీశ్రీ వచన సాహిత్యం - జి కళ్యాణరావు
మ 1.30 గం.కు భోజన విరామం
2.00 గం.లకు - శ్రీశ్రీ: సమకాలీనత - సి. కాశీం
4.00గం. లకు - శ్రీశ్రీ ఉద్యమ జీవితం - వరవరరావు
సా. 6.00 గంటలకు - శ్రీశ్రీ కవితా ప్రస్థానం ఊరేగింపు
రాత్రి 7.00 గం. - బహిరంగ సభ

**ఆంధ్ర - ఒరిస్సా పరిహద్దు అమరుల వేదిక :**

**వక్తలు :** ఉజ్వల్, నల్లూరి రుక్మిణి
చలసాని ప్రసాద్
**అధ్యక్షత :** కొత్త కార్యదర్శి
వివిధ విప్లవ, ప్రజా సాంస్కృతిక బృందాల
ప్రదర్శనలుంటాయి

వల్ల శ్రీశ్రీ చరిత్ర గమనానికి భిన్నంగా ఒక్క వెనకడుగు కూడా వేయలేదు. కాకపోతే కొన్ని సందిగ్ధ సమయాల్లో నిలిచిపోయే వాడు. బైటి నుండి ఏ కొంచెం అగ్గి తగిలినా మళ్లీ ముందడుగే. తానే ముందుండి నడిపించేవాడు.

అయిదు దశాబ్దాలపాటు పోరాట ప్రజల వెనువెంట సాగిన శ్రీశ్రీ కవితా జైత్రయాత్రను ఇవ్వాళ పునరంచనాలు చేయడం ద్వారా ఆయన సమకాలీనతను పరీక్షించవచ్చు. కానీ చరిత్ర వెంట నడిచి, చారిత్రక శక్తుల ప్రతి మేలుకొలుపు సన్నివేశాన్నీ కవిత్వం చేసి చరిత్రలో భాగమైపోయిన కవిని సైతం చారిత్రక దృక్పథంతోనే తూచవలసి ఉన్నది. శ్రీశ్రీ తన గురించి తానే చెప్పుకున్నట్లు ఆయనలో ఒక విదూషకుడు సైతం ఉండవచ్చుగాని పాల్లునెల్లు వేరు చేయగల మార్క్సిస్టు దృష్టిని ఆయనే అపారంగా మనకు అందించాడు. ఆయనను అంచనా వేయడానికి అదే సాధనం కావాలి.

ఆధునిక సాహిత్యంలోకి శ్రీశ్రీ తొలిసారిగా శ్రమను, శ్రమ రూపాలను, మానవ కర్తృత్వాన్ని తీసుకొని వచ్చాడు. సహస్ర వృత్తుల గురించి చెప్పడంలో ప్రజల సాంఘిక అస్థిత్వ స్పృహ ఆయనకున్నది. మార్క్సిజంలోని కీలకమైన శ్రమ సంబంధాలు ఆయన సాహిత్య చైతన్యానికి మార్గదర్శి.

తెలంగాణ సాయుధపోరాట కాలంలో పోలీసు చర్య పేరుతో యూనియన్ సైన్యాలు విప్లవకారులను, ప్రజలను, ముస్లింలను చంపినప్పుడు తెలంగాణను తనలో ఆవాహన చేసుకున్న హరీంద్రనాథ్ ఇంగ్లీషులో దీర్ఘ కవిత రాశాడు. మైకొవిస్కీ రాసిన లెనిన్ కవితను తనదైన శైలిలో అనువదించినట్టే హరీంద్రనాథ్ కవితనూ శ్రీశ్రీ మొట్టమొదట అనువదించాడు. తెలంగాణపై ఆరుద్ర త్వమేవాహం చదివి శ్రీశ్రీ ఎంత పులకించి పోయాడంటే .. నేనిక కవిత్వమే రాయక్కర్లేదన్నాడు. ఆంధ్రమహాసభ, ఆంధోద్యమ కాలం నుంచి అలంపురంలో తెలంగాణ రచయితల సంఘంగా మారడం దాకా ( ఈ సభల్లోనే కాళోజీ నాగొడవను శ్రీశ్రీ ఆవిష్కరించాడు) అప్పటి తెలుగు రచయితలందరికీ ఉన్నట్టే విశాలాంధ్ర ఆకాంక్ష శ్రీశ్రీకీ ఒక సెంటిమెంటుగా ఉండేది. 1972లో విరసం ప్రత్యేక తెలంగాణను, ప్రత్యేక ఆంధ్రను బలపరుస్తూ తీర్మానం చేసినప్పుడు తనకు ఆమోదం లేకపోయినా శ్రీశ్రీ, జ్వాలాముఖి తదితరులు కట్టుబడి ఉన్నారు. మూడు తరాలుగా తెలంగాణలో విప్లవ, ప్రజా పోరాటాలకూ, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలకూ వెనుక ఉద్వేగ పూరితమైన తిరుగుబాటు తత్వంలో శ్రీశ్రీ ప్రేరణ ఉన్నది.

శతజయంతి వేడుకలు ఎంత లాంఛనమో మనకు తెలుసు. శ్రీశ్రీ శతజయంతి ఒక వేడుకలా కాకుండా ప్రజల పట్ల, ఉద్యమాల పట్ల, చరిత్ర పట్ల, నిర్మాణాల పట్ల మన విశ్వాసాన్ని నింపుకొనే సందర్భం అని గుర్తిస్తే చాలు. ఓటమిలో, పడిపోవడంలో, నైరాశ్యంలో.... యిక రేపన్నది కనిపించదనే అంధకారంలో సైతం శ్రీశ్రీ కవిత్వం మనలను వేలుపట్టి భవిష్యత్తులోకి నడిపిస్తుంది . మనిషి మారుతాడా? సమాజం మారుతుందా? అనే సందేహ జీవులకు యిప్పటికీ శ్రీశ్రీ కవిత్వమే సమాధానం. శ్రీశ్రీయే జీవించి ఉంటే ఈ కాలాన్ని, ఈ కాల స్వభావాన్ని ఏమని వివరించేవాడు? ఎంత పదునైన కవిత్వం చెప్పేవాడు? ఎంత అచంచల విశ్వాసంలో విప్లవ శక్తుల వెన్నంటి ఉండేవాడు? యుద్ధాల మధ్య పుట్టి, యుద్ధ సంక్షోభాన్ని కవిత్వం చేసి, ప్రజల అజేయ యుద్ధాన్ని గానం చేసిన ప్రజాకవి యివ్వాళ దేశంలో ప్రజలపై, ఆదివాసులపై రాజ్యం చేస్తున్న యుద్ధాన్ని మనందరికన్నా ముందుండి వ్యతిరేకించేవాడు.

శ్రీశ్రీ శతజయంతి ఆయన నూరేళ్ల సందర్భం కాదు. మన చుట్టూ మనలను ఆవరించిన సంక్షోభాల్లో, ఉద్యమాల్లో మనలను మనం వెతుక్కొనే పలు సందర్భాలుగా విస్తరించాలి. అదే శ్రీశ్రీ స్ఫూర్తి. ఆ కాగడాను అందుకోవడానికి విశాఖ సభలకు సాహిత్య ప్రేమికులను, విప్లవాభిమానులను విరసం సాదరంగా ఆహ్వానిస్తోంది. అ

# విరసం సభలో పుస్తకావిష్కరణలు

| పుస్తకం | రచయిత / ప్రచురణ | ఆవిష్కరించినవారు |
|---|---|---|
| ◆ దండకారణ్య మహిళా చరిత్ర | కూర్పు : శబరి | పద్మకుమారి |
| అంటరాని వసంతం నవల అనువాదాలు | జి. కళ్యాణరావు | |
| ◆ అస్పృశ్య వసంత - కన్నడం | నగరగెరె రమేష్ | |
| ◆ తీన్‌దాదా వసందం - తమిళం | ఎ.జి. యతిరాజులు | టి. కృష్ణాబాయి |
| ◆ అన్‌టచబల్ స్ప్రింగ్- ఆంగ్లం | అల్లాడి ఉమ, ఎం. శ్రీధర్ | |
| ◆ భావ విప్లవకారుడు కొడవటిగంటి | విరసం | చలసాని ప్రసాద్ |
| ◆ కొకు సమకాలీనత | " | |
| ◆ గొంతెత్తిన పాలమూరు | పాలమూరు అధ్యయన వేదిక | సి.ఎస్.ఆర్. ప్రసాద్ |
| ◆ కారడివిలో కామ్రేడ్స్‌తో | అరుంధతీరాయ్ | రాంకి |
| ◆ అవ్వజెప్పిన తొవ్వ | శాఖమూరి రవి | సి. కాశీం |
| ఛత్తీస్‌ఘడ్ విప్లవోద్యమం మీదవచ్చిన పుస్తకాలు | | |
| ◆ పచ్చని బతుకులపై నిప్పుయి కురుస్తున్న రాజ్యం | విరసం | |
| ◆ మండుతున్న గాయాలు | " | |
| ◆ దండకారణ్యంలో మహిళలపై రాజ్యహింస - ప్రతిఘటన | " | నల్లూరి రుక్మిణి |
| ◆ వార్ ఇన్‌ది నేమ్ ఆఫ్ గ్రీన్‌హంట్ ఆన్ ఇన్నోసెంట్ ఆదివాసీస్ | " | |
| ◆ చలసాని ప్రసాద్ రచనలు | " | |
| ◆ మహా ప్రస్థానం నుండి మరో ప్రస్థానం దాకా | వి. చెంచయ్య | ఉదయ్‌భాను |
| ◆ పాట సంద్రమై... | ఉదయమిత్ర | వరవరరావు |
| ◆ భూమి కోసం | సంగ్రామ్ | ఆర్. శశికళ |
| ◆ ఉత్తర తెలంగాణ మహిళా అమరుల జీవిత చరిత్రలు | విరసం | భారతి |
| ◆ ఉత్తరాంధ్ర ప్రజా సమస్యలు - పోరాటాలు | వంశధార | కత్తిపద్మ |
| ◆ పాకాల నుంచి నల్లమల్ల దాకా | అప్పారావు మిత్రులు | ఆలూరి భుజంగరావు |
| శాఖమూరి, కొండల్ రెడ్డిల పై బ్రోచర్ | | |
| ◆ తెలుగు సాహిత్యంలో భక్తి ఉద్యమం | వి. చెంచయ్య | ఉజ్వల్ |
| ◆ యుద్ధం అనివార్యమైన చోట | కె. బాల్జీ | సుదర్శన్ |
| ◆ నెగడు | నల్లూరి రుక్మిణి | జి. కళ్యాణరావు |
| ◆ శారద స్మృతి శకలాలు | ఆలూరి భుజంగరావు | వి. చెంచయ్య |
| ◆ శ్రీశ్రీ అన్వేషణ | ఎన్. వేణుగోపాల్ | |
| ◆ మా మట్టి కోసం | | అరసవెల్లి కృష్ణ |
| ◆ దుఃఖాగ్నుల తెలంగాణ | పాలమూరు అధ్యయన వేదిక | ఎం.ఎ. బాసిత్ |
| ◆ శిబిరం | " | ఎం. శ్రీనివాస్ |
| ◆ జై తెలంగాణ విప్లవ ఢంకా | " | క్రాంతి |
| ◆ పట్నమొచ్చిన పల్లె | భూపాల్ | రవిచందర్ |
| ◆ ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల చరిత్ర (నాల్గవ ముద్రణ) | శోభా గాంధీ | రత్నమాల |
| ◆ సలాం హైదరాబాద్ (మూడవ ముద్రణ) | పి. లోకేశ్వర్ | |

# -: స్వీకారం :-

**ఉత్తరాంధ్ర ప్రజా సమస్యలు - పోరాటాలు**
ఆరు వ్యాసాలు
ప్రచురణ : వంశధార
వెల : 10

**భూమి కోసం**
కథలు
రచయిత : సంగ్రామ్
ప్రచురణ : విరసం, గుంటూరు
వెల : 20

**పాట సంద్రమై...**
రచయిత : ఉదయమిత్ర
ప్రచురణ : పాలమూరు ప్రచురణలు పాలమూరు అధ్యయన వేదిక
వెల : 60

**పట్నమొచ్చిన పల్లె**
రచయిత : భూపాల్
ప్రచురణ : వెన్నెల
వెల : 70

**శ్రీశ్రీ అన్వేషణ**
రచయిత : ఎన్. వేణుగోపాల్
ప్రచురణ : శ్రీశ్రీ సాహిత్య నిధి
వెల : 20

**మానవ పరిణామం**
రచయిత : కొడవటిగంటి రోహిణీప్రసాద్
ప్రచురణ : స్వేచ్ఛాసాహితి
వెల : 75

**జీవకణాలూ నాడీకణాలూ**
రచయిత : కొడవటిగంటి రోహిణీప్రసాద్
ప్రచురణ : స్వేచ్ఛాసాహితి
వెల : 80

**కొడవటిగంటి కుటుంబరావు**
రచనా ప్రపంచం 5
గొలుసు కథలు, గల్పికలు, నాటికలు
కూర్పు : కృష్ణాబాయి, చలసాని ప్రసాద్
ప్రచురణ : విరసం
వెల : 200

**కొడవటిగంటి కుటుంబరావు**
రచనా ప్రపంచం 6
నవలలు
కూర్పు : కృష్ణాబాయి, చలసాని ప్రసాద్
ప్రచురణ : విరసం
వెల : 200

**ఆత్మ నుంచి అక్షరానికి**
సాహిత్య వ్యాసాలు
రచయిత : డా. దేవరాజు మహారాజు
ప్రచురణ : జీవన
వెల : 60

**కొ.కు. సమకాలీనత**
ప్రచురణ : విరసం
వెల : 50

**24 గంటలు**
కె.జి. కన్నబిరాన్ ఆత్మకథాత్మక సామాజిక చిత్రం
అక్షరీకరణ : ఎన్. వేణుగోపాల్
ప్రచురణ : దేవులపల్లి
వెల : 200

**గొంతెత్తిన పాలమూరు**
కరువు వ్యతిరేక పోరాట కమిటీ ఉద్యమ కరపత్రాలు 1995-2005
ప్రచురణ : పాలమూరు ప్రచురణలు పాలమూరు అధ్యయన వేదిక
వెల : -

**వార్ ఇన్ ది నేమ్ ఆఫ్ గ్రీన్‌హంట్ ఆన్ ఇన్నోసెంట్ ఆదివాసీస్**
రచయిత : దమయంతి
ప్రచురణ : విరసం
వెల : 10

**ఈ యుద్ధానికి కారణమెవరు? మావోయిస్టులా? ప్రభుత్వమా?**
రచయిత : హిమాంశు కుమార్
అనువాదం : ఆర్. శశికళ
ప్రచురణ : విరసం, విశాఖ
వెల : 5



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M149 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | naema |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |